# దళిత కథలు - 4

(ఆర్థిక, రాజకీయ కథలు)

(౧౯౧౦-౧౯౯౮)



సంపాదకత్వం

డా॥ కె. లక్ష్మీనారాయణ

రమా పబ్లికేషన్స్

19-437/ఎ-47-ఇ, వినాయక్‌నగర్, పాతూరు,

అనంతపురం - 515 005.

# DALITHA KATHALU - 4

(ARDHIKA, RAJAKEEYA KATHALU)

COMPILED & EDITED BY

Dr. K. LAKSHMI NARAYANA



ప్రచురణలు - 4

ప్రథమ ముద్రణ - 1998

ప్రతులు - 1000

కవర్ డిజైన్ - శీలా వీర్రాజు

వెల - లైబ్రరీ ప్రతి 75/-

సాదా ప్రతి 50/-

టైప్‌సెట్టింగ్ : కృతి క్రియేషన్స్

12-11-428, వారాసిగూడ, సికిందరాబాద్ - 500 061.

ప్రింటర్స్ : ఉషా లేజర్ గ్రాఫిక్స్

జి-18, సావరిన్ షెల్టర్స్, లక్డీకాపూల్, హైదరాబాద్ - 500 004.

ప్రతులకు :

1. శ్రీమతి కె. రమాదేవి, 19-437 ఎ-47-ఇ1, వినాయకనగర్, పాతూరు, అనంతపురం - 515 005.
2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ (అన్ని బ్రాంచీలు)
3. నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్.
4. దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్
5. మణి బుక్‌స్టాల్, సండే మార్కెట్, నెల్లూరు.

# అంకితం

ఈ దేశంలో దళిత సాహిత్యాన్ని సృష్టించే మేధావులకూ, తాత్త్వికులకూ, కవులకూ, రచయితలకూ, విమర్శకులకూ, సామాజిక కార్యకర్తలకూ...

డా॥ కె. లక్ష్మీనారాయణ

# దళితుడి పోరుబాటలో...

ఈ దేశంలో సంపదలున్నాయి. అంతకన్నా సమృద్ధిగా కులాలున్నాయి. ఉపకుల కులాల అంతరాలను చూసిన ఆంగ్లేయులు ఈ దేశాన్ని కొల్లగొట్టారు. భారతీయులను బానిసలుగా చేశారు. అనంతర కాలంలో భారతీయులు స్వేచ్ఛ, సమానత్వం, మానవత్వం అహింస వంటి మానవ హక్కుల్ని భూమికగా పోరాటాన్ని సాగించారు. స్వాతంత్ర్యాన్ని పొందారు. అధికారం పాశ్చాత్యులనుండి భారతీయ అగ్రవర్ణ మేధావుల చేతుల్లోకి వచ్చింది. వీరు అంతవరకూ వల్లించిన మానవహక్కులు మటుమాయమయ్యాయి. ఆర్థిక, రాజకీయపరంగా సమాజంలో ఆధిపత్యం, అణచివేత, దోపిడి వంటివి కొన్ని కులాల అసంతృప్తికి దారితీశాయి. శ్రమ ఒకరిది, సంపద మరొకరిది, వీటికి రాజకీయం తోడయింది. దళితుల జీవనం దుర్భరమయింది. బానిస జీవనం సహజమయింది. కాలగమనంలో సమాజంలో చైతన్యం, అభివృద్ధి వంటి విషయాల పట్ల మౌలిక మార్పులు సంభవించాయి.

సామాజిక న్యాయానికి కేంద్ర బిందువులయిన సమానత్వం, మానవత్వం కోసం ఆరాట, పోరాటాలు ప్రారంభమయ్యాయి. సవర్ణుల కులపరమైన అసహనాన్ని ఆర్థిక రాజకీయ నియంతృత్వాన్ని దళితులు ప్రతిఘటించారు. పీడన నుండి విముక్తి చట్టం ముందు సమానం, సంపదలు సమానం వంటి అంశాల భూమికగా దళితుల పోరాటం ఆరంభమైంది. మనిషి స్వేచ్ఛాయుత జీవనం, ఆర్థిక రాజకీయరంగాలలో బలపడటం ఆరంభమైంది. ఈ పరిణామమే ఈ సంకలన సమీకరణానికి దారితీసింది. ఈ సంకలనంలో ఆర్థిక రాజకీయ కథలున్నాయి.

మార్క్సిజం మానవ సంబంధాలు ఆర్థిక సంబంధాలు అంటుంది. కాని ఈ దేశంలో ఆర్థిక సంబంధాలకు కుల సంబంధాలు తోడవుతాయి. వ్యక్తి ఉనికిని అతని ఆర్థిక స్థితితో పాటు సాంఘిక స్థితి కూడా నిర్ణయింపబడుతుంది. ఈ సంకలనంలో మొదటి కథ 'కొత్తజోడు' సంస్కరణ దృక్పథంతో వచ్చిన కథ. దళితులు ఆర్థికంగా సవర్ణుల చేతుల్లో మోసానికి

గురికావడం తథ్యం అని నిరూపించిన కథ. తరాల బానిసత్వానికి తెర వేయడం 'యజ్ఞం' ఉద్దేశం. ఆర్థికంగా చితికిపోయిన దళితుని మనస్తత్వం 'ఆకలి', 'ఆర్తి', 'ఇరుకుమాను' లో స్ఫురిస్తుంది. దళితుడు ఆర్థికపరమైన సాంఘిక దురాచారాలపై దండెత్తడం 'ఎర్నీళ్లు' కథేతివృత్తం. 'పాపం కుంటేలుగాడు' కథలో దళితులు ఆర్థిక సమానత్వం కోసం అర్రులు చాచడం దళితులు సవర్ణుల చేతిలో ధన, మాన, ప్రాణాలు పోగొట్టుకోవడం 'ధనదాహం ఫలితం', 'వెల్లువ' కథల్లో కన్పిస్తుంది.

ప్రభుత్వం భూసంస్కరణల ద్వారా భూమిలేని దళితులకు భూమి పంచింది. అంతవరకూ కూలీలుగా ఉంటున్న దళితులు వ్యవసాయదారులుగా మారారు. ఇది సహించని సవర్ణులు దళితుల భూములను ఆక్రమించుకొనే తీరు 'ఉచ్చు'లో ధ్వనిస్తుంది. భూమిని వదిలి సంపదలను మాత్రం లాక్కోవడం 'పురుగు'లో స్ఫురిస్తుంది. ఆర్థికంగా ముందు చూపులేని దళితుడు ప్రమాదంలో పడక తప్పదనే హెచ్చరిక 'పొద్దుకుంకింది'. ఆర్థిక అసమానతలు ఉన్న దళితుల సాంఘిక అసమానతలను 'అంటు' కథ స్పష్టపరుస్తుంది.

ఈ సంకలనం చివరి భాగంలో రాజకీయ కథలు ఉన్నాయి. దళితుడు రాజకీయంగా ఎదగడం అధికారాన్ని చేపట్టడం సమర్థవంతంగా పాలించడం వంటి వాటికోసం ఈ దేశం కొన్ని సౌకర్యాలు కల్పించింది. కాని ఆ సౌకర్యాలు నేతిబీరకాయలో నేయి ఉన్న చందమేనని వివరించిన కథలున్నాయి. దళితుని రాజకీయ సాంఘిక చైతన్యాన్ని 'శ్రీరామచంద్రమూర్తి' కథలో చూడవచ్చు. పీడితుల జన్మవృత్తాంతాన్ని విశ్లేషించిన కథ 'త్రికాలవాంఛ' దళితులకు ఉన్న రిజర్వేషన్లు నామమాత్రమేనని, ఆచరణలో అవి సాధ్యం కావటం లేదనేది 'ఊడలమర్రి' అంతరార్థం. దళితుని రాజకీయ పీడన 'సెగమంటలు' 'వేట' 'వేకువ' కథల్లో ధ్వనిస్తుంది. ఉక్కుపాదం ఒక వినూత్నమైన కథ. దళితుడు రాజకీయంగా ఉన్నతస్థాయిని సాధించినా అతనిలోని కులం తొంగి చూస్తూనే ఉంటుందనేది ఈ కథెతివృత్తం. ఈ కథలు చదివిన సమాజం స్వేచ్ఛ, సమానత్వం, మానవత్వం వంటి పదాల అర్థాల కోసం నిఘంటువులను ఆశ్రయిస్తుంది., పరిశీలిస్తుంది. అర్థాలను జీర్ణం చేసుకుంటుంది. మనిషిలో అంతర్లీనంగా ఉన్న అసమానతలు అంతరిస్తాయి. హక్కులను గుర్తిస్తాడు. సంపదను పంచి ఇస్తాడు. మానవత్వం పునాదిగా చేసుకుంటాడు. విశ్వమానవత కోసం పరితపిస్తాడు. దగాపడిన దళితుడు ఆర్థికంగా, రాజకీయంగా పరిణామం చెందుతాడు. ఇలాంటి కథాసంకలనానికి పలువురు సహాయ సహకారాలు అందించారు.

ఈ సంకలనానికి రాష్ట్రవ్యాప్తంగా తమ కథలు పంపి, ప్రచురణకు అనుమతినిచ్చిన రచయితలకు, నా పరిశోధనకు, ఈ సంకలనాలకు మార్గదర్శకులు, గురువులు, పితృసమానులు ఆచార్య కొలకలూరి ఇనాక్ గారికి, ఈ ప్రయత్నాన్ని ప్రోత్సహించిన

గురుపత్ని శ్రీమతి కొలకలూరి భాగీరథమ్మగారికి, ఈ ప్రయత్నానికి స్ఫూర్తినిచ్చిన శ్రీ కె.సదాశివరావు ఐ.పి.ఎస్. గారికి, ఈ సంకలనాలు ప్రచురించడంలో తమ వంతు సహకారాన్ని అందించిన ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి గారికి, నేను ఎప్పుడు కనిపించినా ఆప్యాయతతో పలకరించే శ్రీమతి ఓల్గా గారికి కృతజ్ఞుడను.

గత ఇరవై సంవత్సరాలుగా పెనుగొండ కేంద్రంగా 'యంగ్ ఇండియా ప్రాజెక్టు' గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను సాగిస్తోంది. ఈ సంస్థ మార్క్సిస్టు దృక్పథంతో పని చేస్తోంది. నేడు ఆరుజిల్లాలకు విస్తరించింది. ఈ సంస్థ, ఈ సంకలన ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని (రూ.15000) అందించింది. గ్రామీణాభివృద్ధి కోసం 'కృషి' సంస్థ (మదనపల్లి) స్థాపించబడింది. ఈ సంస్థ ఆర్థిక సహాయాన్ని (రూ.5000) అందించింది. ఈ సంస్థలకు హృదయ పూర్వక కృతజ్ఞతలు. అలాగే నా ఉన్నతి కోరే పెద్దలు శ్రీ నరేంద్రసింగ్‌బేడి (యంగ్ ఇండియా ప్రాజెక్టు) గారికి, శ్రీ నందగోపాల్ (మదనపల్లి) గారికి, కుటుంబ జీవితానికే పరిమితం చేయకుండా నా పాటికి నన్ను వదిలేసి రచనావృత్తికే పరిమితం చేసిన నా శ్రీమతి రమాదేవికి, కుమారులు కె. హేమంత్, కె.యశ్వంత్‌లకు, అందంగా ముఖచిత్రం వేయించిన శీలావీర్రాజు గారికి, డి.టి.పి. చేయించిన కృతి క్రియేషన్స్ వారికి, చక్కగా ముద్రించిన ఉషశ్రీ ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

అనంతపురం
13-12-98

డా. కె.లక్ష్మీనారాయణ

# కథాక్రమం

# కొత్తజోడు

చ. రా.

మా నాన్న భౌతిక ప్రపంచంలో మాకు దూరమై అప్పటికి నాలుగురోజులైంది. చిత్తడి జల్లులాగ గాలికి అశ్రువులు కురుస్తున్నాయి. వాతావరణమే తేమగావుంది.

ఇంటిముందు వరండాలో పడకకుర్చీలో కూర్చొనివున్నాను. అఖిల ప్రపంచాన్ని ఆవరించి వున్న కాఱుచీకటి కంటికెదురుగా కనపడుతూ వుంది. అంతకంటే గాఢంగా కమ్ముకుంది హృదయంలో చీకటి. వీనిక్యైక్యం కలిగించడానికి కళ్లు మూసుకున్నా. అవ్యక్తమైన ఆలోచనలెన్నో బుఱ్ఱలో గిఱ్ఱున తిరుగుతున్నాయి. దగ్గరగా మంచం మీద మా పెద్దమ్మాయి రాజ్యలక్ష్మి కూర్చుని వుంది కుమారునితో. ఆ కృష్ణుడు గోడకు తగిల్చిన దీపాన్ని చూస్తూ, నవ్వులు వెదజల్లుతూ వున్నాడు. చిన్నపిల్లలేవో పుస్తకాలు ముందు వేసుకుని చాపమీద చదవడంకంటె ఆర్భాటం ఎక్కువ చేస్తున్నారు. మా అమ్మ ముసుగుతో తలవంచుకుని గోడవార కూర్చునివుంది. పనిపాట్లల్లో మునిగివున్నారు లోపల మిగిలిన వారంతా. మేము నిశ్శబ్దంగా వుండటంచూచి పిల్లలు కూడా క్రమక్రమంగా తమ చదువును కాగితాలు తిప్పడం క్రిందకు మాత్రమే మార్చారు. ఆలోచనలేమీ లేకున్నా ఆలోచిస్తున్న వారిలాగ అదోరకంగా నెమ్మదిగా వున్నాం.

'అమ్మా! చిన్నబాబుగారున్నారా?' అనే ప్రశ్న చెవుల్లో దూరింది. కళ్ల తలుపులు తెరచుకున్నవి.

'అదో కుర్చీలో పడుకొని' అంది నెమ్మదిగా మా అమ్మ.

'ఏమిరా వెంకన్నా?' అన్నాను.

మెడ మీద వున్న దుప్పటిదీసి క్రిందపడవేస్తూ వరండా మెట్ల మీద నిల్చున్నాడు మాదిగ వెంకన్న.

'బాబూ! ఇలా దయచేయండి ఓ మారు' అన్నాడు చేతులు కట్టుకొని.

'ఏమిటో చెప్పు. ఇక్కడే వున్నానుగా. నాకు లేవడానికి బద్ధకం.'

'ఒక్కఅడుగు ఇక్కడికిదయచేయండి' అన్నాడు వెంకన్న చేతులు వెనక్కి పెట్టుకుంటూ.

మాటలను విని లోపల నుండి వచ్చి తలుపుకానుకొని నిల్చున్న మారెండో అమ్మాయి సుమతి అంది. 'నాకు తెలుసులేరా. ఈవేళ ఆదివారమన్నయ్యా. సంతదినం.'

---

చ. రా. *

అమ్మాయికి తెలుసునేమో కాని నాకు తెలిసినట్టెక్కడా సాక్ష్యం లేదు

'వెళ్లన్నయ్యా! కానుకలిస్తాడు' అంది మరీ సుమతి

'ఏమీ లేదండీ బాబూ! ఇదో ఇక్కడికి ఓమారు' అన్నాడు వెంకన్న.

'సరే'నంటూ లేచి మెట్లవద్దకు వెళ్లాను.

రెండుచేతుల్లో వున్న తెల్లని కాగితాల పొట్లాలు ముందుంచి నమస్కారం చేసి 'తీసుకోండి' అన్నాడు వెంకన్న.

'ఏమిటివి' ఆశ్చర్యపడ్డాను.

'నేం చెప్పలేదా? ప్రతి ఆదివారమూ వెంకన్న యీ వేళకు సరిగా పంచదారా పటికబెల్లమూ పొట్లాన నాన్నగారికి తెచ్చి యిచ్చి నమస్కారం చేసేవాడు. నాన్నగారు వాని భక్తికి ఎంతో పొంగిపోయేవారు. ఆ తరువాత వారు అర్ధరాత్రి వఱకు మాట్లాడేవారు. నాన్నగారికి బదులు యీ వేళ మీకయింది. ముందే అన్నాను గదూ?' అంది అంతా ముందే చెప్పినట్టుగా సుమతి.

'అతను అలా చేయడం మామూలే' అని మా అమ్మ కూడా అదం. పొట్లాలు తీసుకున్నాను.

తరువాత వెంకన్న అన్నాడు. 'బాబూగారూ! నాన్నగారి జోడు - నేను స్వయంగా కుట్టి యిచ్చినది - ఎక్కడో ఇంట్లో వుంటది. అది మాత్రం నాకిప్పించండి. నా గుడిసెలో వేలాడకట్టుకుంటాను పెద్దబాబుగారిని తలచుకుంటూ.'

'ఇదేమిట్రా జోడు కావాలంటున్నావు. ఇంతకంటే వేరే యేమీ నీకు తోచలేదా? పటమా, భాగ్యమా, ఇంకొకటా?' అన్నాను.

'అదే నా కిష్టమైనది. వేరే ఏమీ వద్దండి. నా కింక కావలసింది ఏమీ లేదు.' బాబు గారు పోయారు. నా బదుకు పాడయింది; ఇంకా అవుతుంది. నేంగూడా బతకను. బతకనివ్వరు కూడా' అంటూ కాళ్ల మీద పడి భోరున ఏడవడం మొదలుపెట్టాడు వెంకన్న.

నాకూ దుఃఖం వచ్చింది. నాలుగుదినాల క్రిందట ఏ బా యెఱుగని మా నాన్న హటాత్తుగా 'ఇదిగో, ఇంక నేనులే'నంటూ అనంతవిశ్వంలో లీనమైనది మరల ఒకమారు మనోవీధిలో మెరిసిపోయింది. మరల గాలి వీచింది. అశ్రువులు వర్షించాయి.

దుఃఖమాపుకున్నాను. వెంకన్నను లేవనెత్తాను. శాంతపరచాను.

మా నాన్నగారికి మావూరి మాలమాదిగలంటే ఎంతో దయా సానుభూతీ. వారి కుర్రాళ్లకు వూరివాళ్లందరిని ధిక్కరించి చదువు చెప్పారు. వారి వ్యవహారాలు తన చేతి మీదుగా నడిచేవి. వారికేమైనా రోగాలు వస్తే రాత్రింబవళ్లూ మేలుకొని వారికి సేవ చేసేవారు. వారికేం కావలసి వచ్చినా అచ్యుతరావుగారి సలహా గావాలి. వారు చేయగలిగినన్నివిధాలా వారికి సాయం చేసేవారు. వారందరిలో వెంకన్నకు మా నాన్నగారిపైన భక్తిప్రేమలెక్కువ.

ఇదంతా నాకు తెలుసును. అయినా ఎపుడో గాని నాలుగురోజులు ఇంట్లో వుండనందున నాకా జోడు మాహాత్మ్యం తెలిసింది కాదు. వెంకన్న అలా మాట్లాడడానికి కారణం

అవగాహం అయింది కాదు.

'వెంకన్నా! ఏమిటి విశేషం. నాన్నగారి మృతి మాకే కాకుండా మీ అందరికీ కూడా నష్టకారణమయింది దానికి నా హృదయవేదన మితిమీరుతూ వుంది '

'జోడు సంగతి జెప్పవలెనంటే ఓ పెద్ద కథవుతుంది బాబూ! అది అమ్మగారికే తెలుసు ఇంట్లో అందరికి తెలుసు' అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

'ఔనురా నాయనా! నాకిపుడు జ్ఞాపకం వచ్చింది, జోడు సంగతి మీనాన్న వుండగా నీకది తెలిసివుంటే నీవు నిజంగా సంతోషపడేవాడివి. ఇపుడు వింటే నీకది మరింత వేదన కలిగిస్తుంది' అంది మా అమ్మ నెమ్మదిగా

'నేను ముందొకమారు వచ్చాను. అపుడు అబ్బాయి నెత్తుకొని నాన్న 'నీకు కూడా జోడు కావాలా, వెంకన్న కుట్టిస్తాడు' అంటూ ఆడించేవారు. అపుడు నేనడిగితే దాని సంగతంతా నాకు చెప్పి 'అన్నయ్యకిది తెలియనీయవద్దు. వాడు కోపపడతాడు' అన్నారు నిన్ను డబ్బు అడగలేక నీకు కష్టం అవుతుందేమో అని ఇలాంటి బాధలు పడ్డ తండ్రి - తరువాత మాట్లాడలేకపోయింది రాజ్యలక్ష్మి.

సుమతి కథంతా చెప్పింది. మధ్యమధ్య మా అమ్మా రాజ్యలక్ష్మి కొన్ని విషయాలు చేరుస్తూ వచ్చారు

* * *

వెంకన్నది పెద్ద కుటుంబము. 'పిల్లాజెల్లా కలసి పదిమందుంటారు. వ్యవసాయంలో తోడ్పడే తమ్ములిద్దరున్నా గృహభారమంతా తనమీదనే వుంది. భూమిపుట్రలు కొద్దిగా వుండేవి. అవయినా మెరకభూములు. అప్పుడప్పుడూ వానదేవుడు 'శీతకన్ను' వేస్తూ వచ్చాడు. ఇంతలో ఆర్థికమాంద్యం బరువెక్కువైంది. అందుచేత సంసారానికయ్యే బడ్జెటు తీర్మానాలు తల్లకిందు లౌతువచ్చాయి. కాబట్టి అప్పులైనవి. రాగలిగినంతా లాగి తుదకు భూములు లాగేశారు ఋణదాతలు. చాలినన్ని భూములు లేనందుచేత ఇంకా కొన్ని అప్పులాలాగే నిల్చిపోయినవి. అలాంటిదే పిండు భీమయ్యగారి అప్పుకూడా.

ఆ నిరుడు వెంకన్నకు పొలాల్లో తినడానికి సరిపోయ్యే గింజలు కూడా రాలేదు. మళ్లీ పొలాలు విత్తవలసిన కాలం వచ్చింది. దాని పైకంతో అవసరం వచ్చింది. అప్పటికే కావలసినన్ని అప్పులున్నై. అయినా భీమయ్య వద్దకు వెళ్లాడు వెంకన్న. నూరు రూపాయలు అడిగాడు. ఆ యేడే తప్పకుండా పంటకాలంలో వున్న ధరకే తాను పండింపబోయే వేరుసెనగ అసలుకు వడ్డీకి తనకే యిస్తానన్నాడు. పదింటికి పావలా వడ్డీకంగీకరించాడు. భీమయ్య డబ్బు యిచ్చాడు. ఆ యేడు వున్న భూమినంతా వేరుసెనగ వేస్తే కొంత అప్పు తీర్చుకొని నాలుగు డబ్బులు చేతిలో వుంచుకోవచ్చుననుకున్నాడు వెంకన్న. అయితే ఆ యేడు వానదేవుడు యిష్టం వచ్చిన చోటనే వర్షానికి ఆర్డరిచ్చాడు. వెంకన్న పైరు పాడయిపోయింది. ఆతనికేమీ దిక్కుతోచిందికాదు. ఆ తరువాత అప్పులవాళ్లందరు భూములు లాక్కోవటం; సంసారం చీలిపోవటం; తనపాలికివచ్చిన భీమయ్య అప్పు పెరిగిపోవడం; కూలినాలి చేత జీవనం జరపడం వెంకన్న సంసారంలో జరిగిన మార్పులు.

'అప్పులు వసూలు చేయడంలో ఇంటి పేరు సార్థకం చేసే పిండుభీమయ్య అప్పు తీర్చడమెలాగ?' ఈ సమస్య వెంకన్నను బాధపెట్టడం ఎక్కువయింది ఎక్కడో ఒక లేగదూడను సంపాదించాడు వెంకన్న. సంవత్సరమున్నర కంటవత్తిడుకొని పెంచాడు. ఆఖరుకది నూరురూపాయలు చేసేకోడెగా తయారైంది. వెంకన్నకు ధైర్యం వచ్చింది

ఒకనాడు వెంకన్న కోడెను తీసుకొని భీమయ్య వద్దకు వెళ్లాడు 'కోడెకు నూరు రూపాయలు ధర కట్టారు. దాన్ని తీసుకొని వడ్డీని లెక్కించకుండా పత్రాన్ని యిచ్చి రక్షించండి. ఆ కోడె తప్ప వేరుమార్గం లేదు. అప్పు తీర్చడానికి' అని ఎంతో దీనంగా చెప్పుకున్నాడు.

అప్పటికి భీమయ్యకు యివ్వవలసిన మొత్తం మూడేళ్లకు 190 రూ. అసలు తనకు వేరుసెనగ యివ్వలేదు. ఆఖరుకు తన అప్పుకు భూమి కూడా మిగల్లేదు. ఆ కోపం వుంది భీమయ్యకు. అందుచేత వడ్డీకి కోడెను జమకట్టుకుంటాను గాని పత్రాన్ని యివ్వనన్నాడు భీమయ్య. మా నాన్నగారు కూడా పత్రాన్ని యిచ్చి బీదవాణ్ణి రక్షించమని చెప్పి చూశారు భీమయ్యకు. వుపయోగం లేకపోయింది. పైగా మాదిగకుంకని వెనక వేసుకొనవస్తున్నారని మా నాన్నగారిపైన దురభిప్రాయం కలిగింది.

ఏమైందో యేమో వారంరోజుల్లో ఆ కోడె హటాత్తుగా చనిపోయింది. దాంతో వెంకన్నకి మతిపోయింది.

అదివఱకే పత్రానికి ఆయువుదగ్గరించింది. అందుచేత భీమయ్య చెప్పి పంపాడు. వెంకన్న కోడెను తీసుకోనివస్తే యేదో విధంగా పరిష్కారం చేసుకుందామని. వెంకన్న మాచెర్లవైపే తిరిగిచూడలేదు. భీమన్న నయాభయాలు రెండూ వెంకన్నను కదలించలేదు. అతడు షాహుకారికి ముఖం చూపలేదు.

పత్రానికి మేర మీరింది. గత్యంతరం లేక ఎవరిచేతనో పత్రానికి చెల్లువ్రాయించుకున్నాడు భీమయ్య. పత్రానికి ప్రాణం వచ్చిందనుకున్నాడు. వెంకన్నకి ఆ సంగతి తెలియదు.

ఉన్నట్టుండి వెంకన్నకు గుంటూరు డిస్ట్రిక్టు మునిసిఫ్ కోర్టు నుండి సమను వచ్చింది. భీమయ్య పత్రము దాఖలు చేశాడు.

ఎప్పటిలాగే భీమయ్య తన కేసుకు నారాయణాచారిని తన వకీలుగా నియమించాడు. ఆచార్లు ధనవంతుడు; పలుకుబడి గలవాడు; మావూళ్లో అదిమరింత. అయినా మా నాన్నకు శిష్యుడు. ఆయనయెడ గురుభావం గలవాడు. డబ్బుగడించేదాల్లో మాత్రం ఆచార్లు తొక్కని త్రోవే లేదు.

వాది వకీలు 'ఫలానా'ఏ అని తెలిసిన తరువాత మా నాన్నకొకవిధమైన ధైర్యం కలిగింది. మొదట నుంచీ జరిగిన సంగతీ, అసలు పత్రంలోని దొంగచెల్లు, వెంకన్న దీనదశా ఆచార్లగారికి తెలియచేస్తే తనపైన వుండే గురుభావంతో భీమయ్యకు చెప్పి వెంకన్నను రక్షిస్తాడని మా నాన్న ఆశయం. అయితే స్నేహితానికి, గురుత్వానికి, సాయానికి వచ్చే డబ్బు పోగొట్టుకొని తన క్లయింట్‌కు అసంతృప్తి కలిగింపడు వకీలు. అది మాత్రం మరచారు మా నాన్న.

కష్టపడి నాలుగురూపాయలు సంపాదించుకొన్నాడు వెంకన్న. మా నాన్న వెంకన్నను

తీసుకొని గుంటూరు వెళ్లారు. ఆచార్లను దర్శించారు. వెంకన్న కనపడుతూనే వకీలు 'ఏమిరా! మాదిగ వెదవవు ఇచ్చిన డబ్బు ఎగవేయడమే కాకుండా పిలిపిస్తే కూడా కనపడకుండా తిరుగుతావు?' అని నాంది మొదలుపెట్టినారు

సావధానంగా వకీలుకు అన్ని విషయాలు చెప్పారు మా నాన్న వెంకన్న దుర్భర పరిస్థితుల్లో వున్నా అప్పు తీర్చడానికి ప్రయత్నించాడనీ, భీమయ్య గర్వంతో, ఆశతో అవకాశం పోగొట్టుకున్నాడనీ, పత్రానికి మేరమీరింది గనుక దిక్కు లేని వెంకన్నను బాధించడం వల్ల ఉపయోగం లేదనీ మా నాన్న వాదన.

దానికాచార్ల వారి బదులిది ' ఈ వెధవకింత పొగరా? వీన్ని జైలుకు పంపిస్తాను. లేకపోతే జీవితమంతా భీమయ్య వద్ద జీతానికుండి అప్పు తీర్చేటట్టు చేస్తాను అంతేగాని వీరి విషయంలో మీరు జోక్యం చేసుకుంటే నాకు చాలా నొప్పి గలుగుతుంది. నన్నైనా చూచి వీనికి మీరు సాయపడగూడదు.'

ఆచార్లు ఏవేవో చెప్పి వెంకన్న చేతి బొటనవ్రేలి గుర్తు వేయించుకో చూచేడు. మా నాన్న అది కానీయకుండా కళ్లతోనే సైగ చేశారు. మా నాన్న పట్టుదల ఆచార్ల అమితాగ్రహానికి కారణమైంది.

పత్రానికి వ్రాసిన చెల్లు అసలు తప్పని కోర్టులో నిరూపించాలని మా నాన్న పట్టుపట్టారు. మిగిలిన మార్గమదొక్కటే. ఈ విధంగా న్యాయానికై పోరాడ్డానికి కాలమూ, డబ్బూ, సహాయమూ కావాలి. దరిద్రులకు మొదటిది పుష్కలంగా వుంటుంది. తక్కినవి రెండూ దొరకవు.

వారు తిరిగి యింటికి వచ్చారు. ఈసారి వాయిదాకు వెళ్లాలి. కర్చులకు డబ్బూ . వాయిదా వారంరోజులుంది. మా నాన్న ఆస్తీ, ఆదాయమూ కుటుంబం పొట్టకు సరిపోతుంది కాని ముడికిరాదు. ఏదో విధంగా కొంత డబ్బు సముదాయించుకున్నారు కోర్టు కర్చులకు. అయితే రాకపోకలకు?

డబ్బు కొరకు బాధపడ్డంకంటె నడిచి వెళ్లేదే మంచిదనుకున్నారు. గుంటూరికి మా వూరు పాతికమైళ్లకు పైగా వుంటుంది. నడిచే ఓపిక కొంచమైనా లేకున్నా అంగీకరించారు మా నాన్న నడవడానికి. వెంకన్నకు కొత్త జోడుపైన తన మిత్రున్ని, సహాయుణ్ణి తీసికొని వెళ్లాలని మోజు పుట్టింది. వెంటనే పని ప్రారంభించాడు. రెండు దినాలు నిద్రాహారాలు మానేసి ముగించాడు క్రొత్తజోడును. ప్రయాణానికి రెండు విమానాలని సిద్ధపరచినంత సంతోషించాడు వెంకన్న. వాని ఉత్సాహమూ కృతజ్ఞతా చూచి మురిసిపోయాడు మా నాన్న. దరిద్రులకు కష్టజీవులకు పరస్పర బహుమానాలటువంటివే. ఆ చెప్పులే మా నాన్నను గుంటూరికి తీసికొనివెళ్లి తీసికొనివచ్చినవి. కోర్టులో 'ఆన్సరు' పెట్టుకుంటామని చెప్పించారు. వారికి సరియైన వకీలును కుదుర్చుకున్నారు. తిరిగివచ్చారు.

అప్పటి నుండీ ఆచార్లు , భీమయ్యవారి తాలుకూ మనుష్యులకు మా నాన్న అన్నా, వెంకన్నన్నా అతిచేదై పోయింది. బలవంతులకు ప్రాపకం జాస్తి కాబట్టి బీదవాళ్ల మీద కష్టాలు కురిశాయి; కురిపింపబడ్డాయి. ఏమైనా సరే యీ కేసులో న్యాయం కలగడానికి వేనితోనైనా పోరాడాలనుకున్నారు స్నేహితులిద్దరూ. కాని స్వల్పకాలంలోనే ఒక్క మరణం

తోటి ఒక్కదినమైనా పోరాడలేకపోయారు మా నాన్న.

వెంకన్న మొదలుపెట్టాడు. 'విన్నారా బాబూ! ఎన్నో కష్టాల్లో అడుగామడగా నడుస్తున్నా అన్యాయం జరుగుతూ వుంటే చూళ్లేక వృద్ధాప్యంలో గుంటూరు వఅకూ వచ్చారు న కోసరవు. నా జోడును ఎన్నో వూర్లు మెచ్చుకున్నారు అంచేత దాన్ని బాబుగా జ్ఞాపకార్థంగా వుంచుకంటూనన్నాను నాకింకేమీ వద్దు.'

సత్యంగా ఆ జోడు గొప్పత్యాగాన్ని చూచింది. గొప్పపనికి తోడ్పడింది. అటువంటిది తప్పకుండ జ్ఞాపకచిహ్నమే. వెంకన్నా నీ హృదయం ఎంత ఉత్తమమైంది?

*గృహలక్ష్మి, 1938 మార్చి*

# యజ్ఞం

కాళీపట్నం రామారావు

మూడేళ్లకిందట పుట్టి, మూడు నెల్లుగా ముడిపడి, మూడు రోజుల్నించి నలుగుతున్న తగువు, ఆవేళ యిటో అటో తేలిపోతుంది - ఆ భావన ఆ వూరి గాలిలో అలా అలా తేలుతోంది

కొమ్ములు మందలకు పోయేవేళ అంటే తెలియదు, పదిగంటల వేళ.

ఆ గ్రామం పేరు సుందరపాలెం. మదరాసు నుండి కలకత్తాకు - విశాఖపట్నం మీదుగా విజయనగరం కెడంగా పోయే గ్రాండ్ ట్రంక్ రోడ్డునుంచి ఆరుమైళ్లు కుడిగా సముద్రానికి ఐదుమైళ్లు ఎడంగా - కాకి మార్గాన పోతే శ్రీకాకుళానికి పదిహేను మైళ్లలో ఉందా గ్రామం.

ఆ వూరికి ఈశాన్యానా, తూర్పునా, సముద్రం కేసి దక్షిణంగానూ, మెరక భూములు; తక్కిన దిక్కులకేసి పల్లం.

నడి వర్షాకాలం ఎండవేళ ఆ పొలిమేర తాటి తోపుల్లో కనిపించే దృశ్యం సుందరమైనదే ముఖ్యంగా చిక్కని కొబ్బరిచెట్లూ, చిల్లర చెట్ల నీడన ఆ చిన్న గ్రామం. ఆ మీద పచ్చ పచ్చిగా, ఎర్ర ఎర్రగా, నల్లగా, తెల్లగా, బూడిద రంగులో మెరక భూములు, తాటి పెండెలూ, మొగలి డొంకలూ సరిహద్దు రేఖగా వుంటాయి కింద పచ్చని వరిచేలు. మధ్య అక్కడక్కడా వెండిలా, ఎండలు నిండుగా మెరిసే నిండు నిండు చెరువులు.

అయితే -

సుందరపాలెం ఏటా వెళ్లే వాళ్లక్కూడా ఎప్పుడోగాని ఇలాంటి అందమైన దృశ్యాలు కనిపించవు. ఆ గ్రామం అంతా కలిసి నాలుగు వందల ఇళ్లు - ఒక చిన్న దేవాలయాన్ని చుట్టి వుంటాయి. మిగిలినవి కొత్తగా వచ్చిన హైస్కూలు చుట్టూ లేచిన ఇళ్లు.

కొత్త ఇళ్లల్లో ఒక భాగం షాపులు, హోటేళ్లు మొదలైనవి. మిగిలినవి పెరిగే జనాభా కోసం పెరిగినవీ, పెరుగుతున్నవీ.

ఆ కోస్తాలో సుందరపాలెం పలువురు అనాధల నడుమ పచ్చగా బతికే సనాధలా కన్పిస్తుంది. దాన్ని గ్రాండ్ ట్రంక్ రోడ్డుతో కలిపే ఆరు మైళ్ల పక్కా రోడ్డూ, దేశమంతటా చిక్కంలా పరుచుకొంటున్న విద్యుద్వలయంలో భాగంగా ఒక్క వరుసను ఆరున్నొక్క మైళ్ల విద్యుద్వాహకాలూ - ఆ వూరి సౌభాగ్యాలూ.

ఇంకా గొల్లవీధి నానుకొని ఓ పోస్టాఫీసు తెరిచారు. తెలికలి వీధిలో విలేజీ లెవెల్

వర్కరుగారి ఆఫీసూ, యిల్లూ, హైస్కూలు వీధిలో ఆసుపత్రీ, మెటర్నిటీ సెంటరు పెట్టేరు. మాలపేటకూ వూరికి మధ్య కోపరేటివ్ వారి గోడౌన్లు పుట్టేయి. మునసబుగారి వీధిలో గ్రంథాలయం, కరణంగారి వీధిలో ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటువారి ''ఆఫీసు''

పగలు పదిగంటలంటే పల్లెటూళ్లలో తీరిక సమయం - ఆరంభం. ఆ వేళప్పుడు సాటి గ్రామాల్లో వాళ్లు సుష్టుపూర్తిగా చల్లందులు భోంచేసి బాగా గాలి సేసే చోట్లు చూసుకొని పడకలు వేస్తుంటారు. కొందరు అరుగుల మీదా అక్కడా చేరి కబుర్లు చెపుతూనో, ఆ వూరం, ఆ చుట్టుపట్ల గ్రామాలనుండి పనిమీద వచ్చే జనాలను పట్టుకొని ''ఇగటా''లాడుతూనే కాలక్షేపం చేస్తుంటారు. సుందరపాలెంలో జనం ఎవ్వరోగాని ఆ వేళప్పుడు పడకలు వేయరు. వాళ్లు కాలక్షేపం చేసే స్థలాలూ, పద్ధతులూ వేరే ఉన్నాయి.

కొందరు కిళ్లీకొట్ల ముందుండే సరుగుడు కొయ్య బెంచీలమీదా, హోటళ్లలో బొక్కి కుర్చీలలోనూ చేరుతారు. మరికొందరు ఆఫీసులుండే ఇళ్లముందు అరుగులమీదా, గ్రంథాలయంలోనూ, మందిరంచుట్టూ, మండపం పైనా చేరుతారు.

వాళ్లలో కొందరు ఎలక్ట్రిసిటీ గురించీ, ఎసీ - డిసీల తేడా గురించి చర్చిస్తుంటే, మరికొందరు పంపింగ్ సెట్ల రిపేర్ల గురించి మాట్లాడారు. ఆ వూరు ఆ చుట్టుపట్ల గ్రామ రాజకీయాలు కొందరు తడుపుతుంటే, మరికొందరు ఆంధ్ర రాజధాని మీదుగా అమెరికా, రష్యాలు పర్యటించి వస్తారు. సినిమా, రేడియో, సాహిత్యం, మీటింగులు, ఎగ్జిబిషన్లు, విజ్ఞానశాస్త్రం, పురోగతి, మొదలైన సమస్త విషయాల గురించి చెప్పగలవాళ్లూ, చెప్పించుకొనేవాళ్లూ, విమర్శించి విశదపరచేవాళ్లూ - సంఖ్య రోజురోజుకూ పెరుగుతోంది. పాత మంచిదనుకునేవాళ్లూ, పాత పాతర్లు తవ్వుకునేవాళ్లూ లేకపోలేదు. కాని వాళ్ల సంఖ్య తక్కువ.

అవకాశం గల జనం ఇలా తేలిగ్గా కాలక్షేపం చేసే సమయంలో కూడా, కొందరు తీరిక లెరుగని జనం, తెరిపి లేకుండా పనిచేస్తూనే వుంటారు. ఆ సన్నని ఇరుకు వీధుల్లో నెత్తిన నిలువెత్తు గడ్డిమోపులతో, బుట్టలూ, బుంగలూ చేతబూని, భుజాలమీద నాగళ్లతో ఎదర్న ఏరెద్దులు కదుల్తుండగా, పక్కన నల్లని చిన్న చిన్న పిల్లల చేతుల్లో జిడ్డుపట్టిన తాళ్లకు వేలాడే చిన్నా పెద్దా సీసాలతో, పరుగులు పెట్టే బళ్ల మొకర్లలో, ఎద్దులను ఓహోలతో అదలిస్తూ, వాకిళ్లలో పశువులకి కుడుతులు కలుపుతూ, కళ్లాలలో మిరపలో మినుములో ఎండపోస్తూ, సొమ్ములను మందలలోకి మళ్లిస్తూ, నిన్నో మొన్నో ఆర్నెల్ల కిందటో పోయిన భర్తలూ బంధువులూ కోసం శోకాలు పెడుతూ, నెత్తిన బట్టలమోపూ చేత అంబలి కుండలతో ''కూరోయమ్మ, చుక్కకూర'' అంటూ, భుజాన కట్టెల కావిళ్లు దించి, మూపున బస్తాలెత్తుకుని, చెమటలు తుడుచుకుంటూ, ఒగరుస్తూ పరుగులెడ్తూ, ఎండవేళ నెత్తిన నీళ్లకుండలతో, నడివాకిటి ఆ పూటకు గింజలు దంచుతూ వుంటారు.

పదిన్నరకు పంచాయతీ అంటే పనిలేని జనం పదిగంటలకే మండపం కేసి నడుస్తున్నారు. ఆవూరు స్వస్థలం కాని అయ్యవార్లూ, చిన్న ఉద్యోగులూ కూడా వారిలో కొందరున్నారు. ఆనాడు ఆదివారం కావడం ఆ తగువును గూర్చి రెండు రోజులుగా ఊరంతా ఒకటే మాటాడుకోవడం వారిలో కూడా కుతూహలాన్ని కలిగించాయి. అప్పలావున్ణ్ణి ఎరగకపోయినా అతడి తగువును గూర్చిన వివరాలు వాళ్లక్కూడా చాలా తెలుసు.

అప్ప్రలానుడంటే ఆవూరి పంచాయితీలో హరిజన మెంబరు. మాలలకు, కులపెద్దే కాక, మాలలందరిలో వయసు మళ్లినవాడు. అతడంటే వూరి జనంలో మూడొంతుల ముప్పాతిక మందికి సదభిప్రాయం వుంది. మాటకు నిలబడేవాడూ, మర్యాదగా బతకాలను కునేవాడూ మాలల్లో అతనొక్కడేనని అందరూ చెప్తారు తగువుల్లో పేదా రోదా అంటే సానుభూతి కలవాడని కొందరికభిమానం.

ఆ వూరివాడే, ఒక మాజీ షావుకారికి అతను రెండువేలు బాకీ పడ్డాడు. వడ్డీతో సహా వ్వతేలింది రెండువేల ఐదొందలు కాబోలు.

గోపన్న పట్ల జనానికి ఉండే సానుభూతి అంతకు తక్కువ కాదు. ఆయన పరమ సాత్వికుడు. గొప్ప ఓర్పు గలవాడు. ఒకప్పుడు ఘనంగా బతికి, యిపుడు చితికి పోయిన పెద్దమనిషి.

వాళ్లిద్దరూ తుమ్మ కొయ్యల్లా వుండేవారట పూర్వం. ఈనాటికి పేదతనం వాళ్లను నచ్చుకెక్కించింది అని నొచ్చుకొంటున్నారు తెలిసినవాళ్లంతా.

ఈ తగువు మూడేళ్ల కిందటే పంచాయితీ ముందుకు రావలసింది. ప్రెసిడెంటు శ్రీరాములు నాయుడు మాధ్యస్థం చాలునన్నాడు. ఆయునా, ఇంకో ఇద్దరు పెద్దలూ, మధ్యస్థులయ్యారు.

మాధ్యస్థులు ముగ్గురూ చితా ఆవర్జాలు ముందేసుకొని చెక్ చేసేరు. శ్రీరాములు నాయుడికి ఎక్కడా తబావతు కనిపించలేదు. వడ్డీలు అన్యాయమన్నాడు. తక్కినవాళ్లు - ఆ ప్రాంతాలలో చెల్లుతున్న వడ్డీ అదే అన్నారు. కాదు ప్రభుత్వంవారు ప్రకటించిన రేటున వడ్డీలు కట్టాలన్నాడు. వాళ్లు మాట్లాడలేకపోయారు. ఇంత ఇవ్వవలసింది ఉంటుందని క్కతేల్చాడు.

కష్టమో, నష్టమో దానికే దోసిలొగ్గాడు గోపన్న. అప్ప్రలాముడి దగ్గర అది మాత్రం దాచున్నది గనుకా! అతడికి వున్నదల్లా రెండెకరాల ముప్పై సెంట్ల మడి చెక్క. ఆ వూరి రల్లో ఉన్నదంతా అమ్మితేగాని ఆ అప్పు తీర్చడం పడదు.

అప్పుడు అప్ప్రలాముడన్నాడు.

''బాబూ - గోపన్నబాబు! నా మొహం సూసి కాకపోతే నా పెద్దల మొహం సూసన్నా ప్పేది సెవినుంచు. నన్నూ, నా పిల్లల్ని కూలోళ్లను సేసేయకు. తరతరాల బట్టి మాది తు కుటుంబం. ఇయాలా, రేపు నా మనవలు కూడా ఎదిగొస్తున్నారు. నానూ, నా డుకులూ కాకపోయినా నా మనవలైనా నీ ఋణం తీర్చేసుకొంటారుకానీ వుంచేసుకోరు. ఋణం సానాకాలం బట్టి ఉండిపోనాది. కానీ యింకొక్క మూడేళ్లు గడువియ్''

మూడేళ్లనాడు మాత్రం ఎలా తీర్చగలడన్నారు పెద్దలు. శ్రీరాములు నాయుడు టైమిచ్చి దాలన్నాడు.

మూడేళ్ల గడువూ రేపటితో తీరిపోతుంది. మూడు నెలలై గోపన్న పెద్దల వెంట మగుతుంటే ''యిదిగో'', ''అదిగో'', ''వూరెళ్లొచ్చి'', ''మధ్యాహ్నము'', ''పొద్దున్న'' ని తిప్పేసారు నోటు ఇంకా వారం రోజులకి కాలదోషం పడుతున్నప్పుడు కూడా రాములు నాయుడు వూర్లో లేడన్నారు.

నాయుడు విశాఖపట్నం వెళ్లాడు. వాళ్ల పెద్ద మేనమామను ఆసుపత్రిలో చేర్చారు చేర్చి పదిహేను రోజుల పైనే అయింది. పాపం పుణ్యం భగవంతుడికి తెలియాలి. రెండు కబుర్లు వెళ్లినా నాయుడు ''యిదిగో'', ''అదిగో'' అంటాడు గాని రాడు.

అప్పుడు గోపన్న లక్షుం నాయుడుని పట్టుకుని అన్నాడు.

''బాబూ లక్షుం నాయుడూ! నేను శ్రీరాములు నాయుడ్ని నెస పెడుతున్నా ననుకోకు. ఆయన ధర్మరాజు. ధర్మరాజులాగానే ఆయన అజాత శత్రువ. ఒకవంక న్యాయంకోసం ఎవ్వరూ వూరు విడిచి పోకూడదని కట్టడి చేస్తాడు. ఇంకో వంక న్యాయం చెప్పవలసే వేళకు దాటిపోతాడు. లేకపోతే ఆయనకుగానీ, ఆయన మేనమామలకుగానీ, మంది లేరనా, మార్బలం లేదనా - ఒక్క పూటంటే ఒక్క పూట వచ్చి వెళ్లడానికి ఆయనకు తీరిక చిక్కడం లేదంట'' అంటూ అప్పలాయుడి మనుషులేమను కుంటున్నారో చెప్పి ఆఖర్న యిలా అన్నాడు.

''నాకు అంగబలం మొదటే లేదు. అర్ధబలం ఉండేదిగాని పోయింది. ఎటొచ్చీ ధర్మబలం ఉంది కదా, అనుకున్నాను. కానీ అదీ సందేహంలో పడింది.

నువ్వే చెప్పు, నేనేం చెయ్యాలో.

వూరు కట్టడి తప్పి కోర్టుకు వెళ్లదునా, వూరంతా కలిసి ముఖంమీద వూస్తారు.

వెళ్లక మమ్మల్ని నమ్ముకు కూర్చుంటే, మీరెటూ తేలనివ్వరు''

నాయుడు తలగట్టిన ఈ తగువుతో వెనకా ముందూ - మెత్తమెత్తగానే అయినా, నోళ్లు పారేసుకుంటున్నారు.

దానా దీనా లక్షుం నాయుడికి కదలక తప్పింది కాదు.

ఒక్క శ్రీరాములు నాయుడు తప్ప తక్కిన పెద్దలంతా చేరారు. రెండు రోజులు ఉదయం మధ్యాహ్నం నలిగారు. కాని తగువు తెగలేదు.

తెగలేదంటే అభిప్రాయ భేదాలతో చిక్కు వచ్చిందని కాదు. అసలు అభిప్రాయాలే తేలలేదు.

అప్పలాయుడెందుచేతో ఎంత పలికించినా మాటాడడు. అతని కొడుకులైనా అందరూ మాటాడరు. వాళ్లలో నాల్గవవాడు సీతారాముడు మాటాడతాడు. వాళ్ల బంధువులు ఒకరిద్దరు మాటాడతారు. అప్పలాముడి రెండవ కొడుకు అందరికీ వంత పాడతాడు.

వాళ్లు పది ప్రశ్నలు వేస్తే ఒక జవాబిస్తాడు పది మాటలంటే ఒక్కటే తిరిగి అంటాడు.

వాళ్ల వ్యవహారమూ ధోరణి ఎలాగున్నదంటే, కొంచెం నీరున్న గుమ్మిలో తారసపడ్డ బురద మట్టల చందం - అని చేతికి చిక్కవు, బడితె కందవు. విడిచిపోవడానికి వంటికి బురదయ్యింది

అప్పు వున్నదా లేదా అంటే తవరంతా వున్నదన్నాక లేకెటు బోర్దంటారు. తీరుస్తారా, తీర్చరా అంటే తీర్చకపోతే ఊరుకుంటారా అంటారు. అయితే తీర్చమంటే మా దగ్గరేఉందంటారు. ఉన్నదానిని గురించి ఎత్తితే మా బతుకేం గావాలంటారు. ఆ తెలివి

అప్పు పుచ్చుకున్నప్పుడు లేదా అంటే అప్పుడు తాము చిన్నవాళ్లట, గ్యానం లేకపోయిందంటారు అయితే వున్నవాళ్లే తీరుస్తారు అంటే తీర్పించుకొండంటారు.

విసిగించినకొద్దీ పెద్దలకు కోపాలూ, పట్టుదలలూ బలిసిపోతున్నాయి. అయినా వాళ్లు దానిని తమాయించుకున్నారు.

''నిజమేనర్రా మీ బతుకులెలాగ అన్న భయం మీకుండటం సహజం కాని కాలం ధర్మం కలిసి వచ్చినప్పుడు ఎవ్వరు చేయగలిగేదీ ఏమీ వుండదు. హరిశ్చంద్రుడంతటివాడు మీబోటివాడి దగ్గర కాటికాపరయ్యాడు. ఎందుకు? ఋణం తీర్చడానికే కదా!

మీరు చెయ్యడం చిన్నతనమైతే మీ పిల్లలున్నారు. వాళ్లు ఇంకా చిన్నవాళ్లు. నలుగురూ నలుగురు పెద్దనాయుళ్ల యిళ్లలో కంబార్లుగా కుదురుకుంటే ఏదోవిధంగా గడవకపోదు. మా పెద్ద నాయుళ్లం అందరం, ఒక కూలికైనా గొప్పుకైనా ముందు మీ సొంతానికి కబురెట్టాకే యింకోచోటికి కబురెడతావు. ఎందుకింత చెప్తున్నామో ఆలోచించి గ్రహించు కోండి. నలుగుర్లో అవుననిపించుకునే మనుషులకి కూడు పుట్టకపోదు. ఛీ అనిపించుకుంటే బతకడం కష్టం'' అన్నారు.

కరణం నాయుళ్లు కూడా చెప్పగలిగిందంతా చెప్పి చూశారు.

''ఒరే అబ్బాయిలూ! పరపతి చెడినవాళ్లు బతకడం కష్టం. నాయుళ్లు నలుగురూ గౌరవంగా చెబుతున్నప్పుడే మర్యాదగా వినుకోవడం అన్నివిధాల మంచిది. కాదూ కూడదూ అని వెలితిపడ్డారా - కాగల కార్యాలు కాకుండా పోవు. ఈ భృగువు మీద దీన్నిలా పోనిస్తే మీకో సుళువు చెప్తాం.

నూతుల చెరువుల ఎగువను, పోతినాయుడు అయిదెకరాలు బంజరు వరకట్టాడు. దానికి పైని ఇంకో అయిదెకరాలు వరకట్టనిది ఉంది. అది కూడా తన పేరనే ఉందని అతను దబాయిస్తూ ఉంటాడు. అతను అప్లికేషను పెట్టడం అది శాంక్షను కాకపోవడం ఆ కథంతా వేరే వుంది. ఏమైనా అతన్ని ఒప్పించే పూచీ పెద్దలది. మీరది వరకట్టేయండి. మీపేర పట్టా అయేటట్టు చూచే పూచీ నాది. నాయుడు ఒంటిగాడవటం వల్ల సాగలేక పోతున్నాడు. కానీ మీ కుటుంబమైతే దానిలో బంగారమే పండిస్తారు. సందేహం లేదు'' అన్నారు.

అయినా రాముడి కొడుకుల కివేవీ రుచించినట్లు లేదు.

''మావోళ్ల నోళ్లే నాలుక్కొట్టి మా పిల్లలు నోళ్లు మూస్తావంటారు. దానిమీద ఆళ్ల వుసురు మాకైనా తగుల్తాది; మాది ఆళ్లకైనా తగుల్తాది. కాకపోతే మావూ మావూ పిలకలట్టుకుని యిడిపించమని మీ పాదాలమీదే పడాల'' అన్నాడు బోడిగాడు

''బాబయ్యా, ఆ బంజరు బంగారవే పండుతాదో యెండే పండుతాదో ఆ సంగతటుంచండి దాని మదుపులకి డబ్బు లేదు. ఆ మదుపులకి మళ్లా అప్పు సెయ్యాల. అది బంగారం పండేనాటికి ఆ అప్పు వడ్డీలతో పెరిగి దానికి సరిపడా నిండుకుంటాది. కష్టపడ్డం మా వొంతు. అనుభవించడం అప్పిచ్చినోడొంతు. నానొక మాట సెపతాను. ఆ బంజరేదో గోపన్న బాబుకే ఇప్పించండి. ఆ అప్పు తీరిందాక మాం అక్కడే కూలీ కుంటాం'' అన్నాడు సీతారాముడు.

అక్కడికి తగువు తీర్చవచ్చిన పెద్దలకది తమచేత తీరే తగువు కాదని తేలిపోయింది. పదిహేనేళ్ల క్రితమైతే ఆ తగువు తీర్చడానికింతసేపా! ఈ శ్రీరాములునాయుడు వచ్చి అంతా మార్చేశాడు. ఈయన అన్నింటికీ శాంతమే నంటాడు అవతల వాళ్లకి నచ్చచెప్పడం చేతకాక, నీమీద నీకొచ్చిన కోపాన్ని, వాళ్లమీద కోపంగా భావించి, దానిని ప్రదర్శించడంవల్ల కార్యాలు సానుకూలపడవంటాడు. జనం చేసిన తప్పులు మనం కూడదీసుకోవచ్చు. కానీ మనమే తప్పులు చేస్తే - మనం కూడదీసుకోలేమంటాడు. వాళ్లకి ఎటూ తోచలేదు.

తగువు వాయిదా పడి పెద్దలు లేచిపోయాక దారిలో లక్షుం నాయుడు పట్టలేని తన కోపం వెళ్లగక్కేశాడు.

''ఈ తప్పంతా మా బావది. ఆయనకి నోరు పెట్టుకు బతకడం చాతనౌను. కాబట్టి అందరూ నోరు పెట్టుకునే బతకాలంటాడు. లేకపోతే యిన్ని కబుర్లు చెప్పడానికి ఆ యదవల్ది గుండా చెరువా'' అన్నాడు మండే కళ్లతో.

పక్కల్నీ ముందూ నడుస్తున్నవాళ్లు. నాయుడి వంక తిరిగి చూశాడు. షావుకారు సూర్యం అతని భుజంమీద చెయ్యేసి కొంతదూరం నడిచాడు. ఆ తరువాత చెయ్యి తీసేశాడు. దాని అర్థం అంత తొందర పడవద్దని కాదు. అది స్థలం కాదని.

ఇదంతా ఆ ముందురోజు జరిగింది. ఆ మధ్యాహ్నం సూర్యంగారు విశాఖపట్నం వెళ్లేరు.

పదిన్నర గంటలకి పంచాయతీ మండపం జనంతో నిండిపోయింది.

ఆ మండపం వూరికి నడిబొడ్డున ఖాళీ జాగా కుత్తరంగా అక్కడున్న దేవాలయాని కెదురుగా తలుపులన్నీ తెరిస్తే దేవుడు కనిపించేటట్టు కట్టారు. ఉత్తర దిశని గోడ చుట్టూ తెరపిగా ఉంటుంది.

పెద్దలు మండపం నడిమి భాగంలో కూర్చున్నారు. వారిచుట్టూ మండపం మెట్లమీదా, మండపం నీడలో, మండపం ముందూ, దగ్గరగా దూరంగా వున్న అరుగులపై, చూరు పంచల నీడల్లో, ఈ ప్రాంతాలవున్న రెండు టీకొట్లలో, కిళ్లీ కొట్టు ముందు పందిట్లో తక్కినవారంతా కూర్చునీ, నిలుచునీ, చేరబడీ సభా ప్రారంభానికెదురు చూస్తున్నారు.

శ్రీరాములు నాయుడూ, సూర్యంగారూ ఉదయం బస్సులో వచ్చిన వార్త వూరల్లా తెలిసింది. అందుచేత ఆనాడు ఎన్నడూ రానంత మంది వచ్చారు.

నాయుడు అనుకున్న వేళ కొక్క నిమిషమైనా ఆలస్యం చేయలేదు. జనం కొందరు అరుగులమీంచి దిగి నమస్కారాలు చేస్తున్నారు. మరికొందరు చుట్టలు పట్టుకున్న చేతులు వెనక్కి ముడుస్తున్నారు. మండపంలో పెద్దలు అతడి రాకను గ్రహించే లోగానే చిరునవ్వుతో నమస్కరించి, నమస్కారాలు అందుకుంటూ, నాయుడు చరచరా మండపంలో ప్రవేశించాడు.

నాయుడు పేరు మాత్రమే విని నాయుడ్ని ఎరగని వారు అతనెంత భారీ మనిషో అనుకుంటారు. సన్నగా వింటి కొయ్యల్లాగ ఆరడగుల పొడవున, ఎప్పుడూ తెల్లని మల్లెపూల వంటి పల్చని కంటిమెడ లాల్చీల్లో, దట్టమైన వంకీల జుట్టూ, చెదరని నిండైన

చిరునవ్వులతో, చామన ఛాయగా వుంటాడతను.

పేరు పేరు వరసల నమస్కారాలు చెప్పి నాయుడు తనకు నిర్దిష్టమైన స్థలంలో కూర్చున్నాడు. చుట్టూ వున్నవాళ్లు చెప్పే మాటలు వింటూనే, జవాబులిస్తూనే, సభనంతట్నీ కలియజూస్తున్నాడు.

ఉండవలసిన పెద్దలంతా ఉన్నారక్కడ.

లక్షుంనాయుడూ, సూర్యంగారూ, అతనికి కుడివైపునా, ఎడమవైపునా వున్నారు. పంచాయితీ సభ్యుల్లో మిగిలినవారు కొందరటూ, కొందరిటూగా కూర్చున్నారు. మునసబు కరణాలు, నాయుడు రాక ముందావూరు నేలిన రాఘవయ్య పంతులుగారి పెద్దబ్బాయీ హాజరుగా వున్నారు. విన్నా మొన్నా తలెత్తుతున్న మహేశం, పాపయ్యలూ, చాలాకాలం క్రితమే పెద్దల పంక్తిన ముసలయ్యా వచ్చేరు

వీది వీధి నుంచి, కులం కులం నుంచీ, అన్ని వృత్తులకూ, తరగతులకూ చెందిన వాళ్లను పెద్ద పెద్ద తగువులలో ప్రత్యేకంగా పిలుస్తుంటారు. వాళ్లంతా వచ్చినట్టే.

నాయుడు చూపులు అప్పల్రాయుడి మీద నిలిచేయి.

అతను మండపం మెట్లముందు, ఎప్పుడూ కూర్చునే చోటుకు కాస్త ఎడంగా కూర్చున్నాడు. అతనికి డెబ్బై ఏళ్లు పైనుంటాయి. కాని మట్టిని చీల్చుకు బతికే మనిషవడంవల్ల, ముసిలితనం అధికారం తలమీది వెంట్రుకలపైనే గాని, శరీరంమీద చెల్లుబడి కావడం లేదు. శరీరం కొంచెం ముడుతలు పడ్డ ఈనాటికీ అది ఎండలో తళ తళ మెరుస్తుంది అతడొక పెద్ద గాసపంచా కట్టుకొని ఒక మాసిన చింకి గుడ్డ భుజాన వేసుకున్నాడు.

అతనికి దగ్గర్లోనూ, ఎడంగానూ, ఏభై ఇరవైఏళ్ల మధ్య వయస్కులు - కొడుకులూ, మనవల్లో పెద్దవాళ్లూ, వాళ్ల చుట్టపక్కాలు, పేటవాళ్లూ గుంపుగానూ చెదురు వాటుగానూ కూర్చున్నారు.

సీతారావుడు వాళ్లందరికీ వెనగ్గా కూర్చున్నాడు. వాడికోవంక వాళ్ల పెద్దన్న పెద్దకొడుకు, చిన్నప్పల్రాయుడు దగ్గరగా కూర్చున్నాడు. రెండో వంక రెండో అన్న బోడిగాడు కూర్చున్నాడు.

ఆ ముగ్గుర్నీ అంటిపెట్టుకొని వాళ్లింటి ఆడంగులున్నారు. వాళ్లంతా తమ మధ్య చిన్న చిన్న పిల్లల్ని పెట్టుకొని ఆ ఎండలో నుంచున్నారు. తెల్లని ఎండ నీడలు నల్లని మూర్తులపై మెరుస్తుండగా, వారు ఆరుబయట పూజలందుకునే గ్రామ దేవతల విగ్రహాల్లా వున్నారు.

మండపంలో కూర్చున్న గోపన్న వెంట మంది ఎవ్వరూ లేరు. ఆయనకీ నలుగురు కొడుకులున్నా, వాళ్లంతా పొట్ట చేత పట్టుకుని తలా ఓ దేశం పోయేరు. దిక్కులేని ఓ విధవ కూతుర్నీ, ఆమె ఐదుగురు పిల్లల్నీ పెట్టుకొని గోపన్న ఒక్కడే ఆ వూళ్లో వున్నాడు.

శ్రీరాములు నాయుడు, పక్కలనున్నవారిచేత అవుననిపించుకుని గొంతు పెంచి -

''సభ వారంతా ఒక్క క్షణం నిశ్శబ్దంగా వుండాలి ప్రారంభించే ముందు మీకందరికీ రెండు విషయాలు మనవి చేసుకోవాలి'' అన్నాడు

నాయుడు సభలు నిర్వహించే పద్ధతి కొత్తవాళ్లకి కొంత చిత్రంగా కనిపిస్తుంది. అతను సంకోచిస్తున్న ధోరణిలో కొంచెంసేపు కిందికి చూసి తలెత్తి నవ్వుతూ అన్నాడు

''నన్ను నేను 'మ్లాణ' పరుచుకొని మిమ్మల్ని 'మ్లాణ' పరుస్తున్నానేమో - తెలీదు. నేను పొరబడి వుండవచ్చు. లేక నాకు భోగట్టా చెప్పిన వ్యక్తులు అపార్థం చేసుకొని వుండొచ్చు. ఏమైనా నేను విన్నదేమంటే ఈ సభకు ఇవాళటి వరకూ నేను రాలేకపోవడం గురించి కొన్ని అపోహలు బయలుదేరాయి.

అందుకు తగిన ఆధారం వున్నదా, లేదా అన్న విషయం అటుంచి నేనా విషయమై మీకందరికీ క్షమాపణ చెప్పుకుంటున్నాను''

నాయుడు నవ్వుతూనే చేతులు జోడించేడు; నవ్వుతూనే ఆ మాటలన్నాడు. కాని జనాల హృదయాలు తుళ్లిపడ్డాయి. దానిని కప్పిపుచ్చుకోవడానికి వారు ''ఛా ఛా, అదేంమాట'' అనీ ''ఎవరో బుద్ధితక్కువ వాళ్లు ఏదైనా అన్నారేమో''నని ''అబ్బే, అలాంటివన్నీ పట్టించుకోకం''డని తలకో విధంగానూ చెప్పేరు. నాయుడు ఆ మాటలు వినీ, వినిపించుకోకుండా చెప్పుకపోతున్నాడు.

''నిజానికి తగిన కారణం వుంది. అది నా వ్యక్తిగత జీవితానికి - అంటే నా సొంతానికి సంబంధించిన విషయం. అది ఈ సభలో చెప్పడానికి కుదరదు -'' నాయుడు. తన ప్రైవేటు జీవితాన్ని సభలలో ప్రచారం చేసుకునే రకం కాదు.

''- ప్రతి మనిషికీ సంఘంలో బాధ్యతలతోపాటు సొంత జీవితం కూడా కొంత వుంటుంది. ఈ రెంటికి సంబంధించిన పనులూ ఏకకాలంలో తగుల్తాయి. ఏది ముందు, ఏది వెనుకన్నది తేల్చడం కష్టమైపోతుంది.

ఇలాంటి సంఘర్షణల్లో - అంటే లడాయిల్లో - దేనికి ప్రాధాన్యత యివ్వడమనేది మన పూర్వులు ఏనాడో తేల్చేశారు. ''ప్రజాభిమానమూ, సీతాదేవా! ఎవరు నీకు ముఖ్యం?'' అంటే ఆ శ్రీరామచంద్రుడు తడవుకోకుండా జవాబిచ్చేడు. కాని ఈ శ్రీరాములు నాయుడు శుద్ధ మానవమాత్రుడు. అతణ్ణి మీరు క్షమించాలి'' అన్నాడు గొంతు తగ్గించి.

జనాల హృదయాల్లో వారి తొందరపాటుకి పశ్చాత్తాపాలు ప్రారంభమయ్యేయి.

నాయుడి కుటుంబ జీవితాన్ని ఎరుగని వాళ్లు ఆ వూరివాళ్లల్లో ఎవ్వరూ వుండరు.

అతడు అతి సామాన్యమైన కుటుంబంలో పుట్టేడు. వాళ్లకన్నా వాళ్ల మేనమామలు కొంచెం కలిగినవారు. అతనికి ఎనిమిదో ఏట పెద్ద మేనమామ - యిప్పుడు జబ్బులో వున్నాయన - కూతుర్ని రెండేళ్ల పిల్లను, ఇచ్చి పెండ్లి చేశాడు. ఆ తరువాత వాళ్లల్లో మేనమామలకు సిరి బాగా అందుకుంది.

ప్రాథమిక విద్యైనా సరిగా ముగించని నాయుణ్ణి వారు పట్నం పట్టుకెళ్లారు. హైస్కూలు చదువు ముగిసేక నాయుడు కాలేజీలో చేరేడు. బి.యల్ చదువుతూ దేశసేవ పేరు చెప్పి చదవనన్నాడు.

అప్పట్లో వాళ్లకూ నీళ్లకూ సంబంధాలు కూడా తెగిపోతాయనుకున్నారు కాని ఆడవాళ్ల అభిమానాలు గట్టివి అవి నిలిచిపోయేయి

ఇప్పటికీ ఆ రెండు కుటుంబాల మధ్యా కొంత రభస వుంది. నాయుణ్ని ఓ ఎమ్.పి కనీసం ఎమ్మెల్యేనైనా చేయాలని మేనమామల ఉద్దేశం. నాకు పదవులు వద్దు. నా గ్రామానికి నేనేమైనా చేయగలిగితే నాకతే పదివేలు - అంటాడు నాయుడు.

ఈ కొత్త ఘర్షణతో మళ్లా కొంతకాలం ఎడమొహాలూ, పెడమొహాలూ అయేయి.

తరువాత మళ్లా కలుస్తున్నారు. ఇంతలో ఈ జబ్బు, నాయుడు రాలేకపోయేడంటే అది అర్థం చేసుకోలేని జనంది తప్పు.

నాయుడు చెపుతున్నాడు.

''అయితే ఈ సందర్భంలో ఇంకొక్క విషయం బయటపడింది. అది మనమంతా గమనించతగ్గది ముఖ్యంగా గుర్తుపెట్టుకుని ముందు ముందు పరిష్కరించవలసింది.

ఒక వ్యక్తి తక్కువైనంత మాత్రాన మన సంస్థ నిర్వహించవలసిన కార్యాలు స్తంభించిపోయేయంటే అది చాలా చిక్కు విషయం. ఈనాడు యిక్కడ మనం యీ కార్యక్రమమంతా ఒక్క శ్రీరాములు నాయుడుమీదే ఆధారపడినట్లు మీరు వ్యవహరించినా, లోకం అర్థం చేసుకున్నా, నాకు చాలా కష్టం వేస్తుంది. ఈ పది పదిహేనేళ్లుగా ఏ పనీ, ఏనాడూ నేనొక్కణ్ణే చెయ్యలేదు. ఇంకా మీరు మీ బాధ్యతలను ఆసక్తితో నిర్వహించలేక పోతున్నారంటే నేనెవరిని నెపపెట్టాలో తెలియడం లేదు. బహుశ అది నా లోపమే అయ్యుండాలి.

ఇందుకు నా మనస్సు నిజంగా విలవిలలాడి పోతోంది''

నాయుడి మొహంమీద ఆ విలవిలలు నిజంగానే కనిపిస్తున్నాయి. నాయకత్వం విషయంలో నాయుడి ఆదర్శాలు వున్నతమైనవి. ఈ విషయంలో మహాత్ముని బోధలు అతనికి చిన్ననాటే వంటపట్టాయి.

హైస్కూలు తరగతులు చదువుతూ ఒకసారి ''ఉన్నవూరూ - కన్నతల్లి'' అన్న శీర్షిక మీద వ్యాసం రాసి బంగారు పతకం పొందేడు నాయుడు. అతడి హృదయంలో మొట్టమొదటి వెలుగురేఖ ఆనాడు కనిపించింది.

కాలేజీలో చేరాక దానినతను ఒక జ్యోతిగా సంతరించుకున్నాడు. ఆ తరువాత లా కాలేజీ.

అది పందొమ్మిది వందల నలభైయ్యేడు. లా కాలేజీ మేగజైన్‌లో ''భారతదేశం - పందొమ్మిది వందల అరవై'' అన్న శీర్షికతో నాయుడు రాసిన వ్యాసం వెలువడింది. పాఠకులపైన దాని ప్రభావం రచయితను పొగడ్డంతో అంతమయినా, క్రియాశీలియైన రచయితపై దాని ప్రభావం, అతనిని స్వగ్రామానికి చేర్చింది. ఆ రోజుల్లో అతనిలానే దేశభక్తితో ఉర్రూతలూగిపోతూ వచ్చిన తోటి యువకులు తీరిగ్గా 'లా'లో పాసై ఈనాడు శాసనసభలూ, మంత్రిమండలులూ అలంకరిస్తున్నారు.

నాయకత్వాన్ని గూర్చి మహాత్ముడేమన్నాడో విశదీకరించి నాయుడు ప్రస్తుతాంశానికి

వస్తూ అన్నాడు.

'' - ఈ తగువు యీనాటిదీ నిన్నటిదీ కాదు కాని ఈనాడు దీనికి ప్రత్యేకమైన ప్రాధాన్యత ఏర్పడింది. యేనాడూ యే తగువుకూ రానంతమంది ఈ తగువుకి రావడమే అందుకు నిదర్శనం.

ఈ తగువును గూర్చిన భోగట్టా చుట్టుపక్కల గ్రామాలకు కూడా పాకింది. అంటే మనం న్యాయ విచారణ విషయంలో ఇంతకుముందుకన్నా శ్రద్ధగా వుండాలి. పూర్వం లేమని కాదు - విమర్శలకు అవకాశం ఉండరాదని నా వుద్దేశం.

ఆ తరవాత -

మనచుట్టూ వున్న ఆ చిన్న చిన్న పిల్లల్ని చూడండి! (అని వాళ్లవంక చూపుతూ) - ఈ తగువు మనం ఎలా తీరుస్తామో అన్న ఆసక్తితో తెలుసుకోవడానికి వచ్చేరు. వారికి బోధపడదనుకోండి. వాళ్లే ముందు తరాలలో కాబోయే తీర్పరులు. మనం ఈనాడు ఇచ్చే తీర్పులే వాళ్లకు పరవళ్లవుతాయి. కాబట్టి ఆ విషయం కూడా గుర్తుంచుకోండి''

- అని - చివరిదైనా చిన్నది మాత్రం కాదంటూ ఇంకో సంగతి చెప్పేడు.

''మనం పన్నెండేళ్ల క్రితం పవిత్రమైన ఈ దేవాలయంముందు అంతకన్నా పవిత్రమైన ఈ మండపం తెరిచే సందర్భంలో ఒక ప్రతిజ్ఞ తీసుకున్నాం!

ఇకనుండి ఈ మండపమే మన న్యాయ మండపం. ఈ మండపమున్నంత కాలం, న్యాయం కోసం మనం పరాయి వూళ్లకి పోరాదు. ఏనాడైతే యీ మండపంలో న్యాయం దొరక్క, దానికోసం యీవూరివాడు పైవూరు పోతాడో, ఆనాడే - దీన్ని కట్టిన మనం యీ చేతులతో దీన్ని కూల్చివేతాం అనుకున్నాం.

ఈ ప్రతిజ్ఞ బాగా గుర్తుంచుకోండి. ఈనాడు సుందరపాలెం సాటి గ్రామాల్లో బోర విరుచుకొని తిరుగుతోందంటే అందుకు మన ఐకమత్యమే కారణం. నిన్నా మొన్నా మంత్రులు, ముఖ్యమంత్రులూ మిమ్మల్ని దర్శించడానికి వచ్చేరంటే మాటల్లో, చేతల్లో, ఆదర్శాలలో మీ పవిత్రతే దానికి కారణం. పోటీలలో పాల్గొని దానికవసరమైన ఆశ్రయింపులూ, ఆవేశాలూ ఎత్తుగడల్లో పడటం మనకిష్టం లేకగాని, లేదంటే ఆదర్శ పంచాయితీ బహుమతి మనం అందుకోలేనిది కాదు.

ఆదర్శం క్రియల్లో కనిపించాలి. బహుమతులందుకోవడానికీ, అందుకోకపోడానికీ కారణాలు అనేకం వుంటాయి. ఈ విధంగా మన యీ ప్రతిష్టను కూడా గుర్తుచేసి, యింక విచారణ ప్రారంభించవలసిందిగా మిమ్ము ప్రార్థిస్తున్నాను''

- అంటూ నాయుడు ముగించాడు.

శ్రీరాములు నాయుడు ఎప్పుడు ఉపన్యసించి విడిచినా అందరి వూపిరి తిత్తులనుండి ఒక దీర్ఘ నిశ్వాసం బయపడుతుంది. అంతవరకూ చెక్కిన చిత్తరువుల్లా వుండే జనం అప్పుడే ప్రాణం పోసుకుంటున్న బొమ్మల్లా కదులాడుతారు.

ఆ తరువాత గోపన్న నిలబడి సభకు తను చెప్పుకోవలసేది చెపుతున్నాడు.

సన్నగా ఆరంభించి జనం తమలో తాము వూసులేసుకొంటున్నారు.

ఈ తగువుని గురించి యిరుగు పొరుగు గ్రామాల్లో కూడా వాద వివాదాలు జరుగుతుండటం నిజమే. అసలక్కణ్నుండే యీ తగువుకు వత్తాసూ, నాయుడు మీద లేనిపోని అనుమానాలూ దిగుమతి అవుతున్నాయి.

అప్పలరాముడు పంచాయితీ పెద్దల్లో ఒకడవడం, ఆదినుండీ నాయుడికీ, అతడికీ వుండే దోస్తీ ఎత్తిచూపి, నాయుడు తగువు తీర్పుడమైతే గోపన్నకు న్యాయం దొరకదంటున్నారు. లక్షుంనాయుడు 'లా' చదవకపోయినా, సంప్రదాయాలెరిగిన నాయుడు బిడ్డ వాళ్ల తాత తండ్రుల కాలంనుంచి ఆ వూరిలో వాళ్లు న్యాయం చెపుతూ వచ్చిన మనుషులు. ఈ తగువుతో వాళ్లిద్దరికీ చీలిక రావడం తప్పదంటున్నారు.

ఆ వూరును ఊస్తే కన్నెర్ర ఇరుగుపొరుగు గ్రామాలకి చాలాకాలం బట్టే వుంది. వాళ్లంటారు -

''ఒకప్పుడా వూళ్లో దెయ్యాలు తారట్లాడేవి. పట్టపగలు హత్యలు చేసి పట్టుబడకుండా కట్టుగా వుండే జనమని ఉద్యోగులు ఆ మారుమూల గ్రామానికి ఒంటరిగా వెళ్లడానికి జంకేవారు. నేడా వూరు ప్రభుత్వోద్యోగుల ముద్దబిడ్డయి కూర్చుంది. ఉద్యోగులు రాత్రింబవళ్లు జీపులమీదా, కార్లమీదా ఆ గ్రామానికి వచ్చిపోతూ అభివృద్ధి పథకాలలో ఏదైనా ఆ గ్రామానికిచ్చాకే తక్కినవాటి సంగతి ఆలోచిస్తారు''

అలా అని ఏడుస్తారేగాని అందుకెంత యజ్ఞం జరిగిందో, జరుగుతుందో చూడరు.

పదిహేనేళ్ల క్రితం నాయుడు ఆ వూరు వచ్చిన్నాటికి చుట్టుపక్క అన్ని గ్రామాల్లానే అదీ నిస్తేజంగా నిర్వీర్యంగా వుండేది.

వూరు వూరంతటికీ రెండంటే రెండు గాబోలుండేవి. చిన్న చిన్న కిరాణా కొట్లు. రాత్రుళ్లు ఇళ్లల్లో చమురు దీపాలుండేవి. పేదతనంతో ప్రజలు అల్లల్లాడిపోతుండేవారు. మురికి మురికి గుడ్డలూ, మరమ్మతులు కోరే యిళ్లతో, బరువు నిండిన బతుకులు వెళ్లమార్చుకుంటూ నాగరికతకి దూరంగా ఆ మూల పడివుండేవారు.

అలాంటి పరిస్థితిలో నాయుడావూరు వచ్చాడు. అప్పటికతనికి నిండా పాతికేళ్లు లేవు. నాటికావూళ్లో ఐక్యత వుండేది - అనైక్యత చాలా వుండేది. ఆపదల్లో కలిసిపోయినట్టు అవసరాలను సాధించుకోవడానికి మనుషులు కలిసి వచ్చేవారు కాదు. ఎవడి బతుకు వాడిదన్నది ఆనాటి ప్రజల సిద్ధాంతం.

అప్పట్లో నాయుడి మాటలూ యత్నాలూ, వినీ, చూసీ వెనకా ముందూ నవ్వనివారూ, యద్దేవా చేయనివారూ లేరు. సూర్యంగారి వద్దనుండి ఒక్కసారి ఇరవైవేలు విరాళం సంపాదించేడని వినగానే జనం వులిక్కిపడ్డారు. అదీ హైస్కూలు కోసరం.

సూర్యంగారు ఆ రోజుల్లో గొప్ప డబ్బు నిక్కచ్చి మనిషి. దాచిపెట్టిన గాబుల్లో ధనమెంత నిలవవున్నా అందులోంచి దమ్మిడీ కదపడమంటే అతనికి ప్రాణం పోయేది. అలాంటి వాడికి ఏం చెప్పి ఎలా బోధపరచాడో! - అతని మాటల్లో మహాత్మ్యమున్నదనుకొన్నారు జనం.

తరువాత అందరూ అతని మాటలు వినడం ఆరంభించేరు.

సర్వానర్థాల కూ [illegible] హైస్కూళ్ళు రావాలన్నాడు నాయుడు.

జనంకిది సరిగా [illegible] చెప్పినట్లు విన్నారు

హైస్కూలుండీ [illegible] ప్రభుత్వం వారితో.

ప్రభుత్వం వారికిది [illegible]

ఒక విజయాన్ని [illegible] వెంట చేసుకుంటూ అతను అభివృద్ధి కార్యక్రమాలన్నీ [illegible]. [illegible] ఆ గ్రామం తోడి గ్రామాల ఈర్ష్యకు గురవుతున్న[illegible] ఆఫీసులు, నగైరాలకు తోడు అక్కడ మూడు కో-ఆపరేటివ్ [illegible], [illegible] బట్టలకొట్లు వున్నాయి. పూరా అరడజను మంది టైలర్లకక్కడే [illegible] పని వుంటుంది.

గోపన్న యింకా చెప్పు[illegible].

''- ఆ దెబ్బతో నా [illegible] దెబ్బ తినేసింది. నాచే అన్న మాటేవిటి - చాలామందిది దెబ్బతినేసింది. నాది మరీ అధ్వాన్నం!''

అని కొంచెంసేపు ఆగి, చెప్పిన అప్పుడున్నట్లు చూస్తూ -

''కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంటుంది. నా కొడుకులే - నా సొంత బిడ్డలు కూడా నన్ను దగా చేశారు. వ్యాపారం దెబ్బతింటుందన్న సంగతి తెలియగానే గుప్‌చిప్పుగా ఎవరికి చేజిక్కింది వాళ్ళు సొమ్ము చేశారు. దానివల్ల వున్న ఆబోరు కసింత ముందే బయటపడి వేగం వీధిని పడిపోయాం.

ఆ తరువాత వేరులన్నారు. పంచుకోటానికేం వుంది? అయినా - అందులోనూ కుతంత్రమే. సులువుగా వసూలయ్యే బాకీలన్నీ వాళ్ళవి. ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించేవి - నావీ, నా పెద్ద కొడుకువీ! వాయిదాలనికి వీలయ్యేవి, వడ్డీలు మాఫీలకు ఒప్పుకునేవీ అప్పుల వాళ్ళు చెల్లిస్తారట. ఇల్లెక్కి కూచునే అప్పులు మమ్మల్నీ చెల్లించమన్నారు!

వాళ్ళింత చేసినా, నోటి మంచివాళ్ళం కాబట్టి - ఏదో నలుగురి దయా మామీద ఉన్నది కాబట్టి అలాగే కిందబడీ మీదబడీ ఐదారేళ్ళలో రావలసింది రాబట్టుకొని, ఇవ్వవలసిన వాళ్ళకు ఇచ్చుకొని అప్పులు లేవనిపించుకున్నాను.

తరవాత 'నాయనా! ఇక్కడుండలేనురా! పడవటెల్లిపోతా' నన్నాడు కొడుకు. పువ్వు లమ్మిన వూళ్ళో కట్టెలమ్మడం కష్టం. ఎళ్ళిరా' అన్నాను. బాబూ! ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, నేను తీర్చిన్నాడు ప్రతి అప్పూ అణా పైసలతో వడ్డీలోంచి ఒక్క ఎర్రని ఏగాని మాఫీ అడక్కుండా ఇచ్చాను. నాకు వచ్చిన్నాటికి నా వడ్డీ అధర్మ వడ్డీ అయిపోయింది. సరే నాకంతే ప్రాప్తమనుకున్నాను; దానిక్కూడా గడువు కావాలన్నారు. తమ దయ అన్నాను; ఇప్పుడా గడువు కూడా పూర్తయింది. ఏలినవారు ఏమిస్తారో, భగవంతు డేమి తమ బుద్ధి తోస్తాడో ఇప్పించండి. అదే మహా ప్రసాదమనుకొని పట్టుకుపోతాను'' అంటూ కూర్చోబోయాడు. మళ్ళా ఒక విషయం జ్ఞాపకం రాగా నించున్నాడు.

''ఒక్కమాట! ఇందాక తమరోమాట శలవిచ్చారు. న్యాయం దొరకలేదని యీ మండపం లోంచి అడుగు. బయటపడ్డనాడు యీ మండపం కూల్చేస్తాం అన్నారు. నానుంచి మాత్రం ఎన్నడూ ఆ పని జరగదు.

నిజమే! నిన్న మొన్నటివరకూ - అరగంట క్రితం తమరా మాట అనేవరకూ కూడా - తప్పేదారీ వస్తే కోర్టుకు వెళ్లాలనే ఉద్దేశం నాకు లోపల ఉండేది. కాని ఎప్పుడైతే తమరా మాట శలవిచ్చారో అప్పుడు వుద్దేశం పూర్తిగా విడిచిపెట్టుకున్నాను.

తిండికి లేకపోతే - నేనూ, నా మనవలూ, నా కూతురూ పస్తులుండి మా చావనైనా చస్తాము కాని యిక్కడ న్యాయం దొరకలేదని మిమ్ము నెపపెట్టం. పది కాలాలపాటు యీ న్యాయ మండపం వర్ధిల్లీ నాకూ నా మనవలకూ కాకపోయినా, తక్కిన వారికైనా యిక్కడ న్యాయమన్నది దొరకడమే నా కోరిక''

అంటూ గోపన్న కూర్చుండిపోయాడు.

చివరిలో గోపన్న వూపిన వూపు సభవారి గుండెలు కదిపింది భగవంతుడు చేసే పరీక్షలు యిలాగున్నాయి. అతడి ఓరిమీ, మంచితనంమీద అతడికుండే విశ్వాసం గమనించిన కొత్తవాళ్లు కొందరు - 'ఇందుకా జనం కీయనమీద యింత అభిమానం' అనుకున్నారు.

కొంతసేపు పోయాక ఒక్కొక్కళ్లే అప్పల్రాముడి వంక చూడసాగారు. తలవంచుకొని కూర్చున్న అప్పల్రాముడు కదలడు, మెదలడు. సభలోని జనం అటు చూసి ఇటు చూసి శ్రీరాములుకేసి తిరుగుతున్నారు. నాయుడిది గ్రహించి అడిగాడు.

''ఏమయ్యా అప్పల్రాముడూ! నువ్వేమంటావ్?'' అన్నాడు.

డెబ్భై ఏళ్ల వయసు మించినా, అప్పల్రాముణ్ణి అందరూ ఒరేయ్ అనే అంటారు. ఒక్క నాయుడే యేమయ్యా అంటాడు.

అప్పల్రాముడు మాటాడలేదు.

''అదికాదు రాముడూ; నువు సెప్పవలసిందేదో నువ్వూ సెప్పేసుకోవాల?'' అన్నాడు తల వణికించుకుంటూ. అసిరినాయుడు ఎనభై ఏళ్ల ముదుసలి. ఎన్నడూ సభల వెంట తిరిగినవాడు కాడు. అప్పల్రాముడి పొలం, అతడి పొలం, ప్రక్క ప్రక్క నుంటాయి.

అప్పటికి రాముడు కదల్లేదు. ఇంకా కొంతసేపు వూరుకుని వాకిట నుంచున్న జనం లోంచి ఒకాయన అడిగాడు.

''అవున్రా, మమ్మల్నెంత సేపు ఇలా నిలబెడతారు? అనువులనో, మినువులనో, అప్పు ఉన్నదనో లేదనో ఏదో ఒకటి అనాలిగాని అలాగా మన్నుదిన్న పాముల్లాగా కూకోవడం బాగులేదు. ఇవ్వగలిగితే బాబూ ఇది ఇస్తాననాల. లేకపోతే అంతిచ్చుకోలేదనాల. అదీ ఇదీ కాకపోతే మరి మేమివ్వం, మీ యిష్టమొచ్చింది చేసుకోండనాల. అంతేగాని, ఏమాటా అనకుండా కూచోవడం, నీకూ శోబస్కరం కాదు. ఈ తగువు తీర్చవచ్చిన పెద్దలకీ, ఇంకా ఇది చూడ్డానికొచ్చిన మాకూ, గౌరవం కాదు'' అన్నాడు సానుభూతీ, నిష్ఠూరం జోడిస్తూ.

రాముడు గాని అతని కొడుకులు గాని అప్పటికి పలక్కపోగా - లక్షుంనాయుడికి బావమరిదీ, శ్రీరాములు నాయుడికి దూరపు బంధువూ అయిన అన్నమయ్య ''చెచ్చెస్'' అనుకుంటూ జనంలోంచి యివతలకి వచ్చి పైమీది తుండుగుడ్డ ఝణాయిస్తూ, అది ఝణాయించినట్లే సభనూ, సభలోని పెద్దలనూ ఝణాయించడం ఆరంభించేడు.

అతడు మాట్లాడుతోంటే సర్వాంగాలతోనూ అభినయం చేస్తాడు. ముఖంలోని ఆరున్నొక్క రంధ్రాలలో నుండి వుద్రేకం బుసలు కొడుతుంది.

''గతిలేని మనుషులు తగువు కెడితే, మతిలేని పెద్దలు తీర్చేవారా - అని సామెత చెపుతాడు మా తాత. యీ యువ్వారం చూడబోతే ఆ చందం తయారయ్యింది. మూడ్రోజులై తగువు నలుగుతోంది. కాని మాల నా కొడుకు ఒక్కడూ మాటాడడు. ఆల్లని పట్టుకుని యీ పెద్దలంతా అమ్మా బాబూ అని పిసకరిస్తారేగాని ''ఏం ఎదవ నా కొడుకుల్లారా మీకొచ్చిన పోయేకాలం! మీ బాబుగారి సొమ్మా? మీ తాతగారి సొమ్మా? ఇవ్వకెక్కడికి పోతారు. తంతాం!' అని ఒక్కరూ అడగరు, మాకు చేతగాదు పోవయ్యా అని ఆ ముసలోడితో చెప్పనయినా చెప్పరు. పైగా యీ పెద్దలు కోర్టుకెవ్వరెల్లకండి, మాదే పెద్ద కోర్టంటారు...''

అంటూ తెరిచిన నోరు ముయ్యకుండా దబాయిస్తుంటే అప్పలరాముడు చుట్టమొకడు లేచి దానికి జవాబు ఆరంభించాడు.

''బాబూ, అన్నమయ్య బాబు! అంత కోపం తెచ్చుకోకు. ఎంత తవరు నాయులైనా అంత దురితం తగదు. సదురులోని బాబులెవరూ తవకన్నా తక్కువ సదువుకోలేదు. ఆ పత్రం కోర్టుకెల్తే ఏవౌద్దో తవకు తెలియకపోవచ్చుగానీ ఆరికి బాగా తెలుసు. అందుకే ఆరి రాకట యీ పద్ధతి నెల్తాంది. తవరు తొందరపడకండి'' అన్నాడు గట్టిగానే.

దాంతో రభస ఆరంభమయ్యింది.

'రాకటంటే - నీ వుద్దేశం' వేవిటన్నా డొకాయన.

'తంతావంటే తవరుద్దేశ' వేటన్నాడు జవాబుదారు.

'కోర్టుకెళ్తే డొక్కచించి డోలు కట్టించి మరీ యిప్పిస్తా'రన్నారు కొందరు.

'ఆ... ఆ పప్పులిప్పు డుడకవ'న్నారు కొందరు.

ఎంత సొరాజ్జాలొచ్చినా బరిదిగి పొయ్యేందేటి - అంటే; కాదయ్యా! నిలువునా గొంతుకోసి - అంటున్నాడు వెనకవాడు.

రభస ఈ విధంగా పెరిగిపోతోంది. ఇందులో ఆడా మగతేడా లేదు. సవర్ణులూ అవర్ణులూ తగువు కాదు. అప్పులిచ్చేవారూ అప్పులున్నవాళ్ల తగువది. అప్పలరాముడూ, గోపన్నల మీద పెట్టి అనేక ధోరణులలో సాగిపోతోంది.

శ్రీరాములు నాయుడు సాధారణంగా ఎట్టి అరాచకాన్నీ సహించడు. ఒక్కొక్కప్పుడు జనం అతని చెయ్యి దాటిపోక తప్పని పరిస్థితి వస్తుంది. అలాంటప్పుడు వాళ్లను కొంతసేపటికి వరకు ఉద్రేకపడనిచ్చి అప్పుడదుపులోకి తెస్తాడు.

ఈనాడు అప్పలరాముడాపని చేశాడు. నిశ్శబ్దమైన సభ నడుమ సభవారి ఎదట నిలుచుని

చెపుతున్నాడు

''బాబయ్యా! మొన్నా, నిన్నా, యీయేలా, నలిగిన నలుగుల్లను బట్టి సబవోరి వుద్దేశమని నాకనిపించేదేటంటే 'నాయాన్నాయాల మాట ఎలాగున్నా, మూడేల్ల కిందట ముగ్గురు పెద్దమనుషులవుందు ఆరిమాట కాదనలేకో, అన్నాయానికి బయంపడో, అప్పుల్రావుడు అప్పంటూ ఒప్పుకున్నాడు; ఆ ఒప్పుకున్న అప్పు, యీయాలటికి తీరుస్తానని ఆ పెద్దలముందు మాటిచ్చినాడు; కాబట్టి యీనాడు ఆడికున్నా లేకపోయినా, ఆడమ్మెడుబోయో ఆడి బూవులమ్మెడుబోయే సావుకారి రుణం ఆడుతీర్చేయాలా! అన్నట్టుంది.

సబవోరి కంటిక్కనిపించేదేటంటే - గోపన్నబాబు కష్టం. ఆ బాబుకీ నలుగురు కొడుకులున్నా ఆయన కొడుకులాయన కాడలేరు. అప్పుల్రావుడి కొడుకులందరూ ఆడికాడే ఉన్నారు. ఆల్లంతా ఏన్నుగ్గున్నలా వున్నారు. ఆల్లకి సెక్కా ముక్కా లేకపోయినా ఆల్ల రెక్కల కష్టం సేసుకు బతగ్గలరు. ఒకపూట దప్పిక లేకపోయినా ఆల పేనాలు పోవు. అందుచేత ఆల్లను యేదో ఓ పద్ధతిని ఒప్పించి ఆల్లకున్న ఆ ఒక్క వండి సెక్కా అమ్మించేసైనా, గోపన్నబాబు అప్పు తీరువానం సేసేటట్టు సూడాల - అన్నట్టుంది సబవోరి మనసులో మాట.

బాబయ్యా! సబవోరికదే నాయంవనిపించిన్నాడుం ఆ నాయంవే యిప్పించండి. నెత్తిమీదెట్టుకుంటాను'' అన్నాడు కూర్చుంటూ.

చాలామందికి అంత గొడవ తరువాత అప్పుల్రావుడేం చెపుతున్నాడో అర్థం కాలేదు. అందులో మొదటివాడు లక్షుంనాయుడు.

''అంటే - అది అప్పే అయినా తీర్చమనడం తప్పంటావు'' అన్నాడు లక్షుంనాయుడు.

రావుడీ సవాలుకు జవాబివ్వలేదు. రెండవసారి రెట్టించగా ఇక తప్పక జవాబిచ్చాడు.

''బాబయ్యా! అది అప్పో, అప్పుకాదో, అయితే యేనాటి అప్పో, ఎలా దేలిన అప్పో, అదంతా సదువుకోని మొద్దులం మాకు తెలీదు. పెద్దలు తవరున్నారు. ఆపైన శ్రీరావులు బాబున్నారు. తవరాలోసించి సెప్పాల'' అన్నాడు శాంతంగా.

ఈ మూడురోజులకూ యీనాడు తేలిన రాముని యీ రాకడ కొందర్ని ఆశ్చర్య పరిచింది. శ్రీరాములునాయుడికి సందేహ నివృత్తి అయింది. కొంతసేపు ఆలోచనలో పడి ఒక నిశ్చయానికి వచ్చినట్టు లేచి నించున్నాడు.

''రావుడూ! యీ తగువు నేను తీరుస్తున్నాను'' అన్నాడు శ్రీరాములునాయుడు. అతడి ముఖంమీద ఏ ఉద్రేకమూ కనబడలేదు. ''నువ్వు యీనాటినుండి గోపన్నగారికి ఒక్క నయాపైసా కూడా బాకీలేవు. నువ్వు హాయిగా యింటికి పోవచ్చు'' అంటూ గోపన్న వంక తిరిగి ''గోపన్నగారూ, మీరు ఎల్లుండి కనబడండి - మీ నోటు చెల్లుబెడతాను'' అన్నాడు శాంతంగా.

''లేవండి పోదాం'' అంటూ తక్కినవారిని లేపడం ఆరంభించాడు.

ఈ తీర్పేమిటో జనానికి అర్థం కాలేదు. అర్థమయ్యేలోగా అప్పుల్రావుడు లేచి

సించున్నాడు

''బాబూ శ్రీరావులు బాబు! నువ్వంత అలగవలసిన మాట, నానేవన్నానో నాకు తెల్లం లేదు. నాన్న దాంట్లో తప్పేటుందో సెప్పి ఎల్లిపో'' అన్నాడు నిబ్బరంగా.

''నేనలిగి వెళ్లడం లేదు. ఈ తగువు నువ్వే తీర్చవలసి వస్తే దానిని నువ్వే విధంగా తీర్చి వుందువో ఆ విధంగా దీనిని నేను తీర్చాను అది నా నోటంట విని నువ్వు అలక అనుకొంటున్నావు. అంటే దానిలోని అసంతగతత్వం నువ్వు గ్రహించావన్నమాట''

రాముడికీ మాటలు అర్థం చేసుకోడానికి కొంతసేపు పట్టింది. అప్పటికైనా అతడికా మాటలు పూర్తిగా అర్థం కాలేదు. నాయుడి కళ్లల్లోనూ చూపుల్లోనూ అతడి భావం అవగతమయింది.

నాయుడు లోతుగుండెల్లో లోతులు చూస్తూ అప్పుల్రాముడు 'నిజమే!' అన్నట్టు విస్తుపోతున్నాడు.

విస్తుపోతూ ''సరే! నా తప్పు నాకు తెలిసిందనే ఒప్పుకుంటున్నాను. నీ ఒప్పైన తీర్పేమిటో సెప్పు'' అన్నాడు చివరికి.

''అక్కర్లేదు. ఈ తీర్పు నీకు అసంగతమని నీకు తోచినప్పుడు సబబైన తీర్పేదో నువ్వెరిగే ఉంటావు నువ్విప్పుడు దానిని సెపితే, దానినే మనం అమలు చేదాం''

నాయుడి ధోరణి అవగతమైనఅప్పుల్రాముడి కీసారి ఆశ్చర్యం కలగలేదు. అతడిమీద ఆనాటికి మొట్టమొదటిసారి కోపం పుడుతుండగా అతడి ముఖంలోకి అట్టే చూస్తూ అన్నాడు.

''బాబయ్యా! నువ్వెంతకైనా సాహివంటాను'' అన్నాడు నెమ్మదిగా. నాయుడికి బోధపడలేదు.

''ఎందుచేతట?''

''ఎంచేతో నీకే తెలుసు -'' అని నాయుడి ముఖంలోని మార్పులు గమనిస్తూ ''నీ దెబ్బన్నది తగిలినసోట కనపడదు. నువ్వేంజేసినా సాపకింద నీరులాగ సల్లగ ముంచుతావు''

రాముడంత మాటకు సాహసిస్తాడని నాయుడెన్నడూ అనుకోలేదు. కనులెఱ్ఱ పడనీకుండా. అన్నాడు.

''చాపకింద నీరులా చల్లగ ముంచేది నువ్వా నేనా?''

''తవరే'' అని -

''బాబయ్యా! నువ్వు నాయం సెపుతావని వచ్చిన పెద్దవు. నువ్వు నీ నాయమేదో సెప్పాల. అంతేగాని నీ ఏలుతో నీకన్నే పొడుస్తాను సూడన్నట్టు వాయపడ గొచ్చినోరినే నాయం సెప్పమనడం తమ వొంటివోరికి దరమం కాదు'' అన్నాడు నిష్కర్షగా.

అప్పుల్రాముడి చేత న్యాయం పలికించడం శ్రీరాములునాయుడి అభిమతం గాని అతనిచేత ధర్మాలు చెప్పించుకోవడం అతని అభిమతం కాదు. అందుచేత అందుకు తగ్గ జవాబిచ్చాడు.

''నేనెందుకలాగ చేయవలసి వచ్చిందో నీక్కూడా తెలుసును. కాని నువ్వున్న దుఃఖంలో నీకున్న బాధలో నేనిప్పుడు చెప్పినా నువ్వు అంగీకరించవు. అందుచేతనే నా తీర్పలా ఇచ్చాను''

రాముడు అంగీకరించలేదు.

''నువ్వు మళ్లా మొదటికే వస్తున్నావ్. తగువు సెప్పవొలిసే దొర తన తగువు సెల్లుద్దా సెల్లదా - ఎదర మనసు నెలాగా తిప్పడమన్నది కాదు సూడవొలిసింది. తను సెప్పే తగువులో నాయమెంత, అన్నాయమెంత - అన్నది ఆ దొర సూపు కావాల. అలాగ సెప్పిన తగువు తీరిన నాడు తగువే వుండదు. తీరనివాడు ఆ తప్పు దాన్ని ఇసుకోని జనం దొౌతాది - తనది కాదు''

దానిపై లక్షుంనాయుడు చప్పన ముందుకు వస్తూ అన్నాడు.

''ఆ మాట ముమ్మాటికీ ఖాయమేనా?''

అతడి మందలింపుతో అనవసరంగా రెచ్చిపోతూ అప్పల్రాముడు గొంత పెంచి అన్నాడు.

''అహ్ ముమ్మాటికీ!'' అని - అంతకన్నా గొంతు పెంచుతూ అన్నాడు.

''బాబూ లచ్చుంనాయుడు! యీ ముండకొడుకు ఇంతకాలానికి చిక్కేడన్నట్టు నువ్వా మాటలన్నావ్! నిజానికి నానెన్నడూ తప్పించుకుపోయింది నేదు. నానా బాబు మాటలకు నాడూ నేడూ కట్టుబడే వున్నాను. ఆ బాబు నోటిమీదగా యిది నాయమైన అప్పేనని ఒకసారి సెప్పించు; అణా పైసలతో ఒక్క ఎర్రని ఏగానీ మాఫీ అడక్కుండా నానీ అప్పంతా తీరుస్తాను. అలా తీర్చన్నాడు యీ మాల యదవ ఓ అమ్మా అబ్బలకు పుట్టలేదు...''

''ఇది అప్పే! అప్పే! అప్పే!!!''

రాముడి వాక్యం పూర్తికాకముందే శ్రీరాములు నాయుడి గొంతు వినిపించింది. ఆ విధమైన ఉద్రేక ప్రదర్శనవల్ల కలిగిన సిగ్గును దాచుకోవడానికి పడే శ్రమతో అది స్వగతమో, అపవారింపో, ప్రత్యక్షమో తెలియరాని విధంగా ఆ తరువాత అన్నాడు.

'' - వాళ్లయినా నేనైనా ఇంకొకరైనా దీనిని అప్పు కాదని ఎలా అంటారో - అలా అనగలరని వీళ్లెలా ఆశిస్తున్నారో నాకు బోధపడటం లేదు -''

నాయుడి మాటల్లో, ముఖంలో ప్రదర్శితుడౌతున్న శ్రీరాములు నాయుడు - యిన్నాళ్లుగా అప్పల్రాముడర్థం చేసుకొన్న శ్రీరాములు నాయుడికీ - గత రాత్రి తనవారి మాటల్లో అతడికి కనిపించిన శ్రీరాములు నాయుడికీ - సమన్వయ మేర్పరుస్తుండగా నాయుడు చెప్పుకుపోతున్నాడు.

'' - అప్పన్నదీ, తప్పన్నదీ, పాపమన్నదీ ఒకరంటే అయి ఇంకొకరు కానంటే కాకపోవు. మీరు కోర్టుకు వెళ్లి వాదించి గెల్వవచ్చు. అంతమాత్రాన మీరు ఆ రుణాన్నుండి తప్పించుకోగలరనుకోవడం కల్ల. ఈ జన్మలో కాకపోతే యింకొక జన్మలోనైనా మీరు దాన్ని తీర్చడం తప్పదు'' అంటూ విసుగు నింపుకున్న ముఖంతో వెళ్లి కూర్చున్నాడు. తక్కినవాళ్లు కూడ తమ స్థలాల్లో కూర్చున్నారు.

క్షణకాలం సభ చీమ చిటుక్కుమంటే వినిపించేటంత నిశ్శబ్దమయింది

కొంతసేపు వూరుకుని శ్రీరాములు నాయుడు ముందుకు వంగి పక్కకు తిరిగి వున్న అప్పలాముణ్ణుద్దేశించి -

''మీరు ప్రస్తుత పరిస్థితిలో తీర్చలేరనే - '' అనబోగా అప్పలావుడు చప్పున ముందుకు తిరిగి -

''బాబ్బాబూ శ్రీరావులు బాబూ! నువ్వింక శ్రమపడకు. నువ్వేం సెపతావో నాకు తెలుసును. ఎందుకు సెపతావో కూడా నాకు తెలుసును. ఒకసారి తీర్పిచ్చేసినాక నీ తీరుపుమీద నువు నిలబడు. నామాట మీద నాన్నిలబడతాను. నువ్వెందుకా తీర్పిచ్చినావని నానడగనేదు''

ఇలా అని వంతిబోయిన, యంత్రదనం నిండిన వుుఖంతో కర్తవ్యాన్ని వెదుక్కుని ముసలయ్య వంక తిరుగుతూ అన్నాడు -

''బాబూ ముసలయ్య బాబు! నా రెండెకరాల ముప్పై సెంట్ల బూవికీ ఏవిస్తావో నీ దయ. యిప్పించు''

అప్పలాముడు దోసిలి పట్టాడు.

మూడు రోజులుగా బయాణా మొలలో పెట్టుక తిరుగతున్న ముసలయ్య అప్పలాముడి మొహంలోకి చూసి తల దించేసుకున్నాడు. అది గ్రహించి అప్పలాముడన్నాడు.

''బాబయ్యా! నువ్వు జంకక్కరనేలేదు. నా బొందిల పేనం వుండగా నీ డబ్బుకి మొప్పం రాదు. నాను పోయినా నీ డబ్బుకి తకరారుండదు''

ఆ మాటతో ముసలయ్య సందేహం నివృత్తి అవాలి. కాని ఐనట్టు కన్పించలేదు.

''నీ అనుమానవేటో సెప్పు. ఒకయేల నా నసురుసురు మంటున్నా నను కుంటున్నావేవో - అదేం లేదు. నాను సంతోషంగ అమ్ముతున్నాను. నువ్వూ సంతోసంగ నీకేం తోస్తే అదిప్పించు''

ఈ ప్రకటనతో ముసలయ్య అడ్డంకులు తీరినట్టు కనపడ్డాడు. అప్పుడు కరణం కేసి తిరిగి అప్పలాముడు పత్రం రాయమన్నాడు.

కరణం కలంలోంచి పురోణి పత్రం పుడుతుండగా, జనం గొంతుల్లేని కొయ్యబొమ్మల్లా కొంతసేపు కూర్చున్నారు. తరువాత ఒకరొకరే గొణుగుడు ఆరంభించారు. కొందరుం కొందరు గంటులు పట్టిన కాళ్లను వూచుకుంటూ బయటికి పోయి మాటాడుతున్నారు.

''అప్పుకి గడువిప్పించమంటే ఇప్పించగలిగాడు గాని అసలప్పే లేదనమంటే అనగలడా ఎంత దరమరాజైనా!'' అన్నాడో పెద్దమనిషి.

అతడు రహస్యంలా మాటాడినా పక్కవాడు జవాబిచ్చాడు.

''పోనీ అలా అంటారనే కట్టు. అసలా గోపన్న ఏం బలిసున్నాడని''

''బలిసుంటే అంటావేటి?''

''అనరయ్యా! బూవీ, పుట్రా, ఇల్లూ, వాకిలీ అన్నీ వొడేసుకుని బికార్నోణ్ణి చేసేయండి.

మీ సావుకోర్లు తీసినప్పుడు మీకప్పులిచ్చినోళ్లు అలాగే చేశారేటి?''

వాదన్లు మళ్లా పుంజుకున్నాయి.

రాముడి చెవి కందుబాటులో జోగెప్పడంటున్నాడు. అతడు జోడెద్దులూ, ఓ బండీ, పెట్టుకొని వాటిని బాడుగలకు తిప్పుతూ కాలక్షేపం చేసేవాడు. అంతకుపూర్వం అతడికి కొంత పొలం వుండేది.

''చూడబోతే పాతిక ముప్పైమందున్న కుటుంబం! ఎంత కూలి సేసుకు బతికే జాత్తైనా ఓ నెల్లాళ్లు పనులు కెటావుటీ ఒచ్చిందంటే ముసిలీ ముతగాతో పిల్లలు కిరకిర మట్టుకుపోతారు. ఆ అనుబగవేటో నేనెరుగుదును. అంతా ఆ నారాయణమూర్తి దయ''

''అంతే మరి'' - ఏండ్లు మీరిన చాకలొకడు ఎలుగు రాసిన గొంతుతో అంటున్నాడు.

''నరుడు తెచ్చి సిక్కి-ప్పొచ్చు. నారాయనుడు తెచ్చింది ఇప్పలేం. లేకపోతే - యెంతటి గోపన్న బాబే గతికొచ్చాడు. ఏలాటి అప్పు(రావుడే కాడికొచ్చాడు. ఆలిద్దరి మద్దే తగువు - దాన్ని తీర్చడానికిందరు జనం''

మరికొందరు -

మాలల 'స్వాసలు' గురించీ, ఏలేవాడు ఇస్తున్న అలుసు గురించీ, నసించి పోతున్న ప్రజల పాపభీతి గురించి వ్యాఖ్యానిస్తున్నారు.

కరణం పురోణిపత్రం పూర్తిచేసి శ్రీరాములు నాయుడు కేసి చూశాడు. నాయుడు మడిగాళ్లపై తలవంచుకుని కూర్చున్నాడు. విడబోయిన కరణం నోరు, సూర్యం చూపులతో చూపులు కలియడంవల్ల అర్ధాంతరంగా మూసుకుపోయింది.

అతడు రాముణ్ని పిలిచి పత్రం చదివి వినిపించాడు. చదవగా విని సరిగా వున్నదనిపించాడు. నిశానీలు పెట్టవలసిన చోట్లు చూపించి కాగితవూ తమ్మార్కు- పెట్టే అతని ముందుంచాడు.

అప్పు(రాముడు ఆ పత్రం చేతిలోకి తీసుకుని మండపం మధ్య కూర్చున్న శ్రీరాములు కేసి చూస్తూ అన్నాడు.

''బాబూ శ్రీరావులు బాబు! నువ్వలా కించపడకు. నిన్నొకమాట తూలాను. కాని, కావాలని అన్నది కాదు. ఆ మైకంలో ఆ మాటలాగొచ్చింది. దాని కింకోలా గనుకోకు.

నువు సదువుకున్న వోడివి. సమస్తం ఎరిగుంటావనే అనుకున్నాను. నీకూ నిజం తెలిసుండదన్న సంగతి నాకు తెలిసింది కాదు. తెలిస్తే నువ్వంత నిబ్బరంగా నువ్వన్నమాటలనవు. నానూ ఆ మాట అలా తూలకపోదును.

బాబూ! నీదేవుంది? ఈ మట్టిలో పుట్టి యీ మట్టిలో పెరిగినోళ్లం - మా బతుకంత యిక్క-డే గడిసింది. మాకే తెలీనేదు. నా మట్టుకు నాకు నిన్న రేత్తిరి దాకా తెలియనేదు.

బాబయ్యా! యీ తగువులో నిజానిజాలెట్టివో, ఇది నాయంవైన అప్పు కాదని నానెందుకనుకున్నానో, అప్పు(రావుడి కప్పు లెగవేతాం అన్న దుర్బుద్ధి ఎప్పుడు బుట్టిందో, ఎందుకు బుట్టిందో, ఎలాగ బుట్టిందో ఆ కథంతా సెప్పి అప్పుడే దీనిమీద ఏలుముద్ర

ఎడతాను అందాక తవరంతా కొంచెంసేపు ఓర్సాల''

అంటూ జనంకేసి తిరిగి -

''బాబయ్యల్లారా! వూాల వూాదిగలకీ, కూలినాలి జనాలకీ, ఒకరి సొవుమ్మ ఒడేసుకుందావన్న సోపేగాని, నాయవాన్నాయవాల ఆలోచన లుండవని తవరంత అంటున్నారు. ఆలకి కూడు బుట్టకపోడానికి - కారనవదే అంటున్నారు తవరు.

నరుడు తెచ్చుకొన్న సిక్కుకి యిరుగుడుంది. కానీ నారాయణుడు తెచ్చిన్దానికి ఎదురు లేదంటున్నారు - ఇందాక ఎవరో. బాబయ్యా! యిది నరుడు తెచ్చిన వుుప్పో నారాయనుడు పెడుతున్న సిక్కో తవరే సిత్తగించండి''

- అంటూ దూరాన అరుగులమీద వున్న వారిక్కూడా వినబడేందుకు వెనక్కి కొంత జరిగాడు. నడినెత్తినున్న పొద్దు పడమటకు వాలుతుండగా ''బాబయ్యా'' అంటూ ఆరంభించాడు అప్పుల్రాముడు.

''ఇది యాభై యేళ్లనాటి మాట. అప్పటికి ఇక్కడున్న జనంలో మీరెవ్వరూ పుట్టనేదు. అదుగో ఆ తంబంకాడ కూకున్న ఆశిర్నాయుడుగారొక్కరే నాకన్న పెద్దోరు. నాను నిజవే సెపుతున్నానో, అబద్దాలే సెపుతున్నానో ఆ బాబుకు తెలుసు, ఆయనే సాచ్చికం.

బాబయ్యా! అప్పుడు మా తండ్రి సచ్చిపోతే నా కారెకరాలు, మా తమ్ముడి కారెకరాలు - వెుుత్తం పదెకరాల పల్లం యేడెకరాల వెంట్ట ఇడిసిపెట్టి ఎల్లిపోనాడు. వూాం ఇద్దరన్నదమ్ములం. మాకు అప్పులు ఐదుగురు.

వూాం అన్నదవుమ్మలిద్దరం ఐదారేళ్లు కలిసే వున్నాం. ఆ తరువాత అందర్లాగే యిడిపోయాం. యిడిపోయిన్నాటికి యీాసెన్నర యీాసెన్నర యెండి, రెండేసి తులాల బంగారం సెరో సిన్న కొంప వచ్చాయి.

బాబూ! అప్పుడీ వూరెలా గుండేదో యిక్కడి బతుకెలా గుండేదో మీవ్వరెరగరు. నాకు తెలిసిన కాడికి అందరికీ ఇంతో అంతో సెక్కా ముక్కా ఉండేవి. కాపోళ్లంతా పొలాలు దున్నుకు బతికేవారు. గొల్లోళ్లు గొర్రెల్నీ, మేకల్నీ కాసుకుంటూ సిన్న సిన్న మెరక ముక్కలు దున్నుకు బతికేవారు. మా మాలోళ్లకి మెరక ముక్కలెక్కువ, పల్లాలు తక్కువ. మావోళ్లలో మరీ లేనోళ్లు కంబార్లు గుండేవోరు. అంతింతోళ్లు కూల్లు సేసుకుంటూ, బూావులు దున్నుకుంటూ బతికేవోరు.

బాబయ్యా! సెప్పకేం, ఒక్క జగ్గారాయుడుగారికి - అంటే యీా సూారెంబాబు తండ్రికి, ఆరి బాగార్లలో కొందరికి తప్ప - అప్పట్లో యిీావూరు సాలోళ్ల కెవ్వరికీ జరుగుబాటుండేది కాదు. సీవ నూలొచ్చాక ఆల్ల మగ్గాలు మూలబడి పోయాయి. ఆల రాట్నాలు అటకలెక్కేసినాయి. ఆల్లు తిండికి సానా కష్టపడేవోరు.

అదిగలాంటి తరి గంగయ్య గోరని - దేశదిమ్మరి! ఆయన పడవటెల్లి పొగాకు వొర్తకం తెచ్చినారు. సూారెంబాబు సిన్నాయినగోరు, ఎంకట నారాయన ఆయనకు తోడయ్యారు.

యేరుశనగ లంతకువుుందే యీా సుట్టుపట్లొచ్చినాయి. కాని జనానికి యేరుశనగ యెయ్యడవంటే మయం. పొగాకు పెంచడవంటే బయ్యం. గోగులు పెంచడం నిన్నగాక

మొన్న పుట్టింది

అంతవరకూ యీ వున్న రైతులంతా వరి, గంటి, చోడి, జొన్న - ఇలాటి తిండిగింజలే పండించేవోరు. అందరికీ తిండుండేది. గుడ్డముక్క లిస్నుండేవి కావు కాని గోసిముక్క లుండేవి. కలిగినోళ్లయినా పది బట్టలు కట్టేవారు కారు. లావో తోలెవో ఏదైనా మిగిలితే బంగారి కొని పిసరూ పిప్పీ సేయించి ఆడోళ్ల మెడకి తగిలించేవోరు దేవుడూ దెయ్యవని దానాలు దరమాలు చేసేవోరు డబ్బు సిక్కన మనుసులయినా ఎండీ బంగారాలు ఇబ్బిల్లో దాసేవోరు.

బాబయ్యా! ఆ రోజుల్లో ఏ పెద్దనాయురాల్ని సూసినా, సిన్న సిన్న రైతుల అడంగుల్ని సూసినా, లచ్చుం దేవుల్లాగుండేవోరు. మెడ తిరక్కుండా బంగారాలు, ఏవీ లేకపోతే నానుపేట పట్టెడన్న మెడనుండేవి.

మా పేదోళ్ల పెల్లాలు గూడ రెండేసి యీపెలు, మూడేసి యీసెలు ఎండి మోసేవారు అందెలు, కడియాలు, సందలు, మురుగులు, పోచీలు, దండ కడియాలు, బమిడి మువ్వలు, పాయల మొలతాళ్లు, బిల్లల మొలతాళ్లు, ఒడ్డానాలు ఒకటేవిటి ఎన్నో వుండేవి

ఈనాడు అలాటివెక్కడా మీకు కాపడ్డం నేదు. ఆటి పేర్లే మీలో కొంతమందికి తెలియదు. ఏవైనయవన్నీ?

వొర్తకం పంట లొచ్చినాయి. అవి నడుసుకొచ్చినాయా - జనం ఆటిని పట్టుకొచ్చినారు.

బాబయ్యా! యిప్పుడీ యెగిరికల్చరోళుల్యవసాయాల గురించి జనంతో సెప్పినట్టే అప్పుడీ సావుకోర్లు ఆ పంటల గురించి పెజకి నచ్చ సెప్పేవోరు. పేదోళ్లు బయపడ్డా పెద్ద రైతులు యేసి సూద్దామన్నారు.

అంతవరకు ఈ వూళ్లో రూపాయల సెలామనీ ఎరగం. ఏదో ఉండేవంటే వుండేవి. పన్నులు సెల్లకట్టడానికని పెద్ద రైతులు దగ్గిరుండేవి. ఇచ్చి పుచ్చుకోడాలన్నీ దినుసుల్లో సాగేవి. డబ్బు మసలడనారంభించినాక అన్నీ ఆటి లెక్కల్లోనే సాగడం మొదలయ్యింది.

బాబయ్యా! ఆ లెక్కలేటో జనానికి తెలిసేవి కావు. ఇప్పుణ్ణయీపైసల తిరకాసు ఉంది కదా - ఇంతకన్నా పెద్ద తిరకాసులుండేవి.

అందుకే బయస్తులం డబ్బుజోలి కెల్లీవోల్లం గావు. దినుసు మార్పులోనే బోలెడు దగా జరిగిపోతుండేది.

బాబయ్యా! యే దినుసైనా మానమ్మబోతే రూపాయి కైదు కుంచాలు. మాం కొనబోతే మూడు కుంచాలు. అదే మాదిరి వేం కొనేటప్పుడు కుంచాలు సిన్నవి గుండేవి. మానమే[illegible]నైపోయేవి.

[illegible]వ్వారం బొగ్గులవ! ఇదేం దరమం? అంటే - వర్తక ధర్మం అనేవాడు

[illegible]క, కుంచాల తకరారుకు తోడు రైతులం రూపాయుల [illegible]కాదు.

[illegible]ి సావుకోర్లయి పోనారు. మిగిలినోరు ఆరికాడ పస్లు

సేసుకుంటూ సిన్న సిన్న దట్టా యాపారాలు సేసుకుంటూ కాలం గడిపేసేవోరు.

ఆరోజుల్లో యీ వూరు యిప్పట్లాగే పది పదిహేనూళ్లకి సెంటరు గుండేది అయితే ఉన్నట్టు కనపడీది కాదు. మంగలాపురం, తంగుడుబిల్లీ, ఎంకన్నపేట, అగ్గరోరం, యిలా యీ యిన్నూళ్ల వొర్తక పంటలూ యీ ఊళ్లో సావుకార్ల దోరానే శెలామణీ అవుతుండేవి.

''బాబయ్యా! పంట ముకాన సావుకారొచ్చీనోడు ఓ రప్ప(రావుడూ, ఓరసిరిగో! పుట్టీ ఏరుశనగల ధర యింతరా అనేవోడు. మాం సిత్తం బాబయ్య అనీవోళ్లం. సరుకు పచ్చిది కాబట్టి తరుగింతరా అనీవోడు సరే బాబయ్యా అనీవోళ్లం. కొలగారం యింతా అనేవాడు. నోరు మూసుకునీవోళ్లం. నీకింతొస్తది. అవసరమైతే పుచ్చుకొనేవోళ్లం. లేప్పోతే నీకాడే వుణ్ణియ్యయ్యా - అనీవోళ్లం.

ఆ రోజుల్లో రైతులు సావుకార్లకు మదుపులెట్టేవోరు; సావుకార్లు రైతులకు వొడ్డీలు సెల్లించేవోరు. ఆ డబ్బు మదుపుల్లో సేర్చి ఎవ్వారాలు సేసేవోరు.

ఇలా సావుకార్లెంత తిన్నా రైతులకు కొంత గిట్టుబాటు ఉండేది; కాబట్టే ఎంత వొద్దనుకున్నా రైతులు ఆ పంటలకు ఎగబడ్డారు.

తరువాత్తరవాత ధరలు పడిపోవడం, పెరిగిపోవడం ఆరంభించాయి. ఏరుసెనగలు ఏసి అవి పండితే ఆటి ధర పడిపోయేది. ఆ యాడాది మిరపకాయల ధర పెరిగిపోయేది. మిరప బాగా పండిన ఏడాది దానికి ధర పలికేది కాదు. పొగాకు జయ్యీమనీది.

ధరలెప్పుడు పడి ఎప్పుడు లెగిసిపోతాయో తెలిస్తే బావున్ననిపించీది. కాని రైతోడి కెప్పుడూ అవి తెలిసి వచ్చీవి కావు

బాబయ్యా! ఆనాటికీ యీనాటికీ నాకు బోధపడని సంగతొక్కటుంది. నా కాలం ముచ్చట సెప్పను. మీకాలంనాడు మీరే ఎరుగుదురు. బస్తా బియ్యం ఏడు రూపాయలూ, బేడా పరక్కి గజం గుడ్డ, ఏడు రూపాయీలెక్కడ. ఏడు పదులెక్కడ; ఏ ధరనం తం(డులెందు గురించి పెంచేస్తున్నారో - ధరలు! లేక ఆటి మానాన అవే సెట్లెదిగిపోయిన ట్టెదిగిపోతున్నాయో - తెలీదు.

బాబయ్యా! యిదిగిలాటి వూపుతాపుల్లోనే కిందనున్న సావుకార్లు పైకి, పైనున్న రైతులు కిందికి తూగిపోనారు. పదేళ్లు గి(రున తిరిగీ తలికి నాయురాళ్ల మెడల్లో నగలు సావుకారమ్మలు ఏసుక తిరగడం మొదలెట్టినారు. సావుకోరు బాబులటు గుంటూరు కొవ్వూళ్లనుండి యి బొరంపురం బస్తర్లదాకా ఏపారాల మీద తిరగడాలు ఎక్కువైనాయి.

బాబూ యిక నా కత సెపుతాను ఇనండి.

అని గుక్క తిప్పుకుని, చుట్టూ వున్న జనమంతా చెవులు విడచి తనకేసే చూస్తుండటం గమనించి పెరిగే ఉత్సాహంతో ఆరంభించాడు.

'' - నాను మొదట్నుంచీ రెక్కలు ముక్కలు సేసుకు బతికినోణ్ణేగాని ఓపాలు మాలినోణ్ణీ, పోకిళ్లుపోయేవోణ్ణీ కాను. కాస్డబ్బు కలిసొస్తాదంటే కాసీకిపోయి వొచ్చీరకం.

మొట్టమొదట, మా సీతారావుడు పుట్టిన ఏడాది, మా మెరక సేన్లో గంటెలుడవడం మాని ఏరుశనగ ఏసినాను - అదీ ఒక పెడగా, ఆ యాడాది అదనూ పదనూ అన్నీ

కుదిర్నాయి

ఓనాడు నేను సేలో కలుపు తీస్తావుంటే యీ గొప్పన్నబాబు ఆ దార్నే పోతా గట్టుమీదికొచ్చినాడు నేనాయన్ని సూడనేదు ఆయన అన్నాడు

''ఏంరోయ్, అప్పల్రావుడు! సేను బాగానే పెరిగిందే!'' అన్నాడు సేనుకేసి సూస్తా.

ఏదో నీ తల్లిదండ్రుల దీవన బాబయ్యా - అన్నాను.

కాయెవరి కమ్ముతావురో - అన్నాడు.

పండనియ్యయ్యా, అప్పుడెవరొచ్చడిగితే ఆరికే యిస్తానన్నాను. అప్పటికి యీ బాబుకి వచ్చీరాని మీసం.

ఒరేయ్, అప్పల్రావుడు! ఉన్నవోడి కందరూ సాయం చేస్తారు. లేనోడికి వూతవివ్వడనే యివ్వంరా! అన్నాడు.

అప్పటికి బాబు బుజంమీద పుగాకు దుట్టా ఏసుకొని అగ్గరోరం, పూడిమడక, తాటిసెట్లపాలెం, నాగోరం - సంతలకీ, సవుద్రపొడ్డు పల్లెలకీ, కమాను తిరుగుతుండీవోడు. ఆ యాడాదే ఓం పెదమంచి - అంటూ మెరక పంటల వొర్తకంలోకి దిగబోతున్నాడు.

బాబయ్యా! అది మొదల, మావిద్దరం నేస్తులవయ్యాంవు. ఆ బాబు రైతుల్లో నానే మొట్టమొదటోణ్ణి, యీనాటికి, సివరోణ్ణీ నానే. యీ మద్దెంతరంలో మా పేదోళ్లు, మా సుట్టపక్కాలు, మా క్కావాలసినోళ్లు - ఎందరొచ్చెళ్లినారో, ఎలాగొచ్చినారో, ఎలా పోనారో నా నోటితో నాను సెప్పుకోను.

ఆ బాబు వొల్ల నానే పైకొచ్చినానో, నావల్ల ఆయనే పైకొచ్చినాడో, మా యిద్దరం ఆ పరమాత్ముడివల్లే పైకొచ్చినావో - అయిదారేళ్లు యిద్దరం కలిసికట్టుగా మీదికి లెగిసినావు. తరువాతేవయ్యిందో తెలీదు. ఆ బాబు మీదికి లెగడం మాన్లేదు. నాను కిందికి దిగజారడ వారంబవయ్యింది.

మొదట నా ఆరెకరాలు తొమ్మిదెకరాలయ్యింది. ఆ తరువాత - అప్పుడెకరం, అప్పుడరా, అప్పుడు పాతికా సొప్పున, ఆరెకరాలు సెల్లిపోనాయి. మా యెండి బంగారాలు ముండమోసేసినాయి.

బాబయ్యా! నానేగాదు, మా పేటలో మూడొంతుల ముప్పాతిక మంది - గొల్లల్లో శానామంది, కాపుల్లో కొందరు యీ సుడిగుండంలో పడి మునిగిపోనారు:

అవున్నా అది సుడిగుండమే అయితే రైతులందర్నీ ముంచీయాల - కొందర్ని ముంచి కొందర్నెలా ఒడ్డెట్టిందను.

కాపులందరినీ సెరువుల కింద పల్లపు యవసాయాలు. ఆళ్లకి మెట్టబూవులు తక్కువ. మాయి అట్నుండిటూ, సావుకోరి సుట్టరికాలకి ఆళ్లు దూరం.

బాబయ్యా! సావుకోరి రుణవెట్టిదో ఎరగని రైతోడుండడు. అయినా, సేజేతుల ఎల్లెల్లి ఆలి వలల్లో సిక్కుకొని రైతులూ వుండరు.

నాను సావుకార్ల నేటో అంటన్నాననుకోకండి. ఎనక్కి శీరావులు బాబన్నట్టు ఆల్లది

తెలియక సేసిన పాపమే కావొచ్చు. కానది పాపమే! అది ఊరంతటన్నీ సుట్టేసింది. ముందు రైతోళ్లు మునిగిపోనారు. తరువాత సావుకోర్లు.

పాతికేళ్లనాడు యిరవైనుండి అరవైవేల దాకా వర్తకంలో తిప్పేవోళ్లు - పది పదిహేను మందుండేవోరు యీవూర్లో. సిన్న సిన్న వొర్తకుల సంగతి సెప్పనక్కర్లేదు. ఇప్పుడా డబ్బంతా ఏవైపోనాది?

పన్నులొచ్చినాక పొగాకు వర్తకాలు దెబ్బ తినీసినాయి. పడవ టవొమ్మోర్లు యీాలను శానావరకు సంచీసుకున్నారు. యేరుశనగ మిరపల వర్తకాల్లో కొందరి జంక్షనుకాడ మిల్లులు, మరికొందర్ని టేశనుకాడ మిల్లులు - పెద్ద వొర్తకులు - యీాలకన్న లోకం మాసినోల్లు - యీాల్లను ముంచీసినారు. అయితే ఆ మిల్లులైన యిప్పుడున్నాయా? ఆట్నన్నింటిని అంతకన్న పెద్ద మిల్లులు అవదాలవొలసని మింగిసినాయి. మరి అవైన వుంటాయా? నాకు తెల్దుగాని, ఆట్నికూడా మింగుతున్నవీ మింగబోయేవీ యెక్కడో యేవో పుట్టి పెరుగుతూనే వుంటాయి.

బాబయ్యా! వొర్తకం జూదం వొకటేనన్నారు - పెద్దలు. నిజమే అదెందుకు పుట్టింది? జనవెందుకు ఆడతన్నారు? నన్ను ముంచి నువ్వెందుకు మునిగిపోతున్నావు? బెమ్మదేవుడు బలివోణ్ణే కొడతన్నాడు; కాబట్టి అనువోణ్ణి బలివోడు కొట్టడవేనా? నువ్వు తినా పెట్టని కాడకి నన్ను పట్టికెల్లి ఆల్లకెందుకు మేపుతావు? ఇదంతా నరుడు తెస్తున్న ముప్పా, నారాయనుడు బెడుతున్న సిక్షా? మీరే సెప్పండి..''

రావుడు ఆగిపోయాడు. ఆ వుద్రేకం తగ్గాక కొత్తగా ఆరంభించాడు.

''తవరు, పదిహేనేళ్ల క్రితం, ఈ ఊళ్లో కాలు పెట్టిన్నాటికి మా యందరి బతుకులివి.

బాబయ్యా! తవరికి గురుతుందో లేదో - ఒకనాడు పొద్దోయి జేసి, బక్కలికి కుడుతు లెడుతున్నాను. మా పేటలోకొచ్చి మా యింటిముందే నిలుసుని 'అప్పన్రాముడెవర'ని - నన్నే అడిగినావు. నానే బాబయ్యా - అన్నాను.

'రావుడూ నీతో ఒకసారి మాటాడాల' - అని సింతమ్మ తల్లి గట్టుకేసి తీసికెల్లినావు. నన్నేటేటో అడిగినావు. నాను సెప్పాను. నువ్వేటేటో సెప్పావు. నా విన్నాను.

ఆ రాత్తిరి, బాబయ్యా! నీకు సెపితే అబద్దం నాకైతే నిజం. తెల్లార్లూ కునుకునేదు.

యింతకాలానికి, పేదోల్ల సీకటి బతుక్కి దారిసూపే దరమరాజొచ్చినాడు. ఆ బాబు సల్లగుండి, ఆయన సెప్పినంత జరిగినా జరక్కపోయినా, మా యప్పుల్దీరిపోయి, మాకింత కూలినాలి దొరికి, జనవంత సల్లకుంటారనుకున్నాను. అలాగుండాలని యెయ్యి దేవతలకి మొక్కుకున్నాను.

బాబయ్యా! తొలీత నువ్వీ వూర్లో అయిస్కూలెట్టించినావు. సదువుల్లేకపోతే మనుసులికి తెలివితేటలుండవురా, మీ పిల్లలు కూడా సదవాల అన్నావు. కాలే కడుపులకు సదువులు ముందా, అనుకున్నా - నిన్ను సూసి నీ మాటమీద గురికొద్దీ మావూ శంవదానం ఇచ్చాం. ఇప్పుడు కాకపోతే యికముందైనా మా పిల్లలు సదవరా అనుకున్నాం. కొంతమదికూల్లా దొరికినాయి.

తరువాత నువ్వీ వూరికి రోడ్డన్నావ్ ఏదో నీ పేరు జెప్పుకొని రెండేళ్లు పేదా రోదా శానామంది కడుపునిండ గంజి తాగినారు.

ఆ తరువాత నువ్వు కోపరేటివ్ గొడౌన్లన్నావ్, నూతులన్నావ్ - కొంత కొంతమంది కొంత కొంతకాలం, రాయి రప్పా మోసుకుని బతికేసినారు. ఆ తరువాత కొత్త కొత్త పన్లు నువ్వీ వూరికి తేలేకపోయినావు మా బతుకులు ''ఎక్కడ వేసిన గొంగలీలు అక్కడే'' అన్నట్టు తయారయినాయి

బాబయ్యా! నువ్వు సూస్తానే వున్నావ్. నీకన్నా ముందునుండీ యీ వూరి జనమందరూ మమ్మెరుగుదురు.

మావొక తాగుబోతులం కాదు; ఒక ముండల ముఠాకోర్లం కాదు. ఒక జూదగోళ్లం కాదు. ఈనాడు మా మనవలంటే ఏసుక తిరుగుతున్నారు కాని, మానా బనీను గుడ్డలు కూడా ఎరగం.

మాక్కావలసింది ముప్పూటల గంజీ మెతుకులు - ఇంతంబలి - గంటి జావ - జొన్నన్నం - ఉంటే కసిన్ని మజ్జిగ నీళ్లు. లేకపోతే పులుసే. దానికి నంజుడు ఉల్లిపాయ ముక్క, ఊరి బిండొడియం; ఏవీ లేకపోతే మిరపకాయ కాల్చుకుతాంటాం.

ఈ కసింత కోసవే ఇంటిల్లపాదిం పాటుపడతాం. మీలో యింటి కొకళ్లో ఇద్దరో తెచ్చీవోళ్లుంటారు. మీరేం తింటారో, మీరెలాగుంటారో మీకే తెలుసు.

మాలో, అప్పుడు పుట్టిన బిడ్డల్నొదిలి, అరవై డెబ్బై యేళ్ళ వుద్దరోళ్లయినా మా ఆడంగులు కూడా మానాగే మా గొడ్లతోపాటు మున్నూటరవై రోజులు, ఎండనక, వోనలనక, సలనక, సంకటాలనక సాకిరీ సేస్తారు.

కొల్లు లేని టైంవులో కూడా మాయాడోళ్లు ఇంటికాడ కూకునుండరు. కంపకని, కర్రకని, గడ్డికని, గాదంకని, యిందంటుందంట తిరుగుతుంటారు. మా బొడ్డూడని బిడ్డ పాపలు పేడతట్టలట్టుకొని గేదెలెంబడే అవి ఎయ్యబోయే పేడ కోసవని తిరుగుతూ, ఆ బంగారం కోసం గుద్దులాడుకుంటారు.

బాబయ్యా! మావిందరవింత సేసినా, మా పొట్టలు గడవటం నేదు, మా బూవులు సెల్లిపోతున్నాయి, మాకు రుణాలే మిగిలిపోతున్నాయి.

ఏవీ లేనోళ్లు ఏడాత్తిరగే సరికి కావందులై పోతన్నారు. పదేళ్లలో పాతిక ముప్పై ఏలు ఎనకేస్తన్నారు.

బాబయ్యా! యెవరి సొమ్మెవరు పడేసుకోవడం వల్ల ఎవరు గొప్పోల్లయిపోతున్నారో, ఎవరి కెందువల్ల కూడు బుట్టకుండా పోతున్నదో మీరే సెప్పండి'' అంటూ ఆగిపోయాడు.

రాముడు వేసిన ప్రశ్న, జవాబు కొరింది కాదు. అది సరే! ఒకవేళ కోరినా, జవాబు చెప్పటానికేమున్నది?

పొద్దు తిరిగిన ఆ మధ్యాహ్నపు టెండను కూడా సరకు చేయకుండా జనం, అప్పల్రాముడి ఆక్రోశం వింటూ ఆకళ్లు మరచిపోయారు.

అతడు మాటమార్చే విధంగా ధోరణి మారుతుండగా అన్నాడు.

''రాత్తిరి మా యింటికాడ సిన్న తగువయింది. మా సీతారావుడు నన్ను నరికేస్తానని కూకున్నాడు. ఆడి కథ నువ్వెరిగే వుంటావు. మా రోజుల్లో మావోళ్లు రంగవెల్లి గండించుకొచ్చేనోరు, యీడు పట్నమెల్లి గడించుకొస్తానన్నాడు. అక్కడే రెండేళ్లు బస్తాలు మోసినాడు. ఏడాది రికసాలు లాగినాడు. ఆడి పెల్లాన్నెవడో లేవదీసుక పోయినాడు. ఆడి ఒక్కగాని ఒక్క కొడుకును ఎంటేసుకొని యింటికి పారొచ్చినాడు.

మాటమీద మాటొచ్చి రాత్తిరి నేనన్నాను.

నాయున్లారా! యీ ముప్పై ముప్పైయ్యేదేళ్ల యిచ్చి పుచ్చి కోడాల్లోను... వడ్డీలు వాసిల్లోనూ, సావుకారి సొమ్ము మనవే తిన్నావో, మన సోమ్ము సావుకారే తిన్నాడో యీనాటికి అప్పంటూ యిది తేలింది.

ఇది మనం ఇచ్చి తీరాలని పెద్దలంతా పట్టుబడతన్నారు. రేపు శీరావులు నాయుణ్ణే రప్పించైనా మనసేత ఆ అప్పు సెల్లబెట్టిస్తారు గాని యిడిసి పెట్టరు. మీరు పట్టుబట్టీ లాబం నేదు. బూవమ్ముకోడానికి వొప్పేసుకోండి అన్నాను.

దానిమీద ఆళ్లు మొదటినుండి పాడిందే మల్లా పాడినారు. నానన్నాను గదా -

ఊరిమీద నాయులంతా మన బరువు మోస్తాం అంటున్నారు. ఆపైన మన పాలిటి దేవుడు శ్రీరావులు బాబున్నాడు మనం బతకలేక పోతాంవట్రా! అన్నాను.

బాబయ్యా! నువ్వు కోపం తెచ్చుకోకు. నీ వూసెత్తేతలికి జనం మనిషిదొక మాటగ లంకించుకున్నారు. నువ్వ్వారి కుపకారంగా సేసినవన్నీ మా కొంపలు ముంచడానికి కొచ్చినట్లు మాటాడ్నారు.

నువ్వు రోడ్డేయించినావు, నువ్వేయించిన రోడ్డుకు మా బళ్లమీదే మా సేతుల తోనే రాళ్లు సేరిసినాం. ఆ సేతులతోనే ఆట్నే పేర్చి మట్టి మోసి నునుపు జేసినాం. దానిమీద జీపులొస్తున్నాయ్, కార్లొస్తున్నాయ్, లారీలు, బస్సులు తిరుగుతున్నాయి. గాని మా బళ్ల బేరాలన్నీ పడిపోయినాయి. యిసక్కీ, రాయికీ - సరుక్కూ, సప్పరకూ, పయనాలకి, అన్నిటికన్నీ నవగ్గ అవురుకొంటున్నాయి. యెనక పాతిక ముప్పై దాకా కుటుంబాలీవూర్లో ఒక్క బళ్ల బేరాలమీదే బతుకుతుండేవి.

నువ్వెలట్రిసిటీ యేయించినావు. పంపింగు మిసెన్లొచ్చేసినాయి. ఏతాలు తోడే మా కూలోళ్ల నోళ్లల్ల బుగ్గడింది.

సూరెంబాబు రైసు మిల్లెట్టినాడు. కలిగినోళ్ల యిల్లల్లో కూలికి దంచే జనం కూల్లు పోవడం మాటటుంచు. కూల్లు సేసుకు బతికే మా యాడ జనం కొడా కూలి తెచ్చుకున్న గింజలు పుట్టెడూ పందుం - కూలిచ్చి మిల్లుకేస్తున్నారు.

అలాగ ఆళ్లంతా అంటా వుంటే - నానూరుకున్నాను, మాటాడనేక. అప్పుడు బారిక యర్రయ్యన్నాడు.

ఓరయ్యా! మీరన్నదాంట్లో కొంత నిజం లేకపోనేదను. కానీ అంతా నిజం కాదు. నాకర్థమయ్యిందేటంటే - ఆ బాబు సదువుల కోసమన్జెప్పి పట్నాలెల్లొచ్చిన మనిషి. అక్కడ

జనంను సూసి అక్కడే టేటున్నాయో అయన్నీ ఇక్కడక్కూడా తెచ్చేస్తే యిదీ పట్నం అయిపోద్ది మనవూ పట్టపోళ్లలాగ సుకాంగుంటాం అనుకున్నాడు అంతేగాని తన్నేసిన దానివొల్ల కొందరి బతుకులు బుగ్గయి, ఆ బుగ్గిలెల్లి మరికొందరికి బువ్వలు పుడతాయని ఆ బాబుకి తెలీదు.

తెలిస్తే ఇంత పని సేసుండడనే నా నమ్మకం అన్నాడు.

అప్పటికీ మానోళ్లు నోళ్లు పారేసుకోవడం ఆపనేదు.

అప్పుడు నానన్నాను

ఒరేయ్! నోటికేదొస్తే అది పేలడం సబబు కాదు. నాయం, అన్నాయం ఆలోసనుండాల.

సూరెంబాబు యిరవైవేలు యిరాలం యిచ్చినాడు - పున్నానికే యిచ్చినాడు. అందుకు మెచ్చే బగమంతుడు రైసుమిల్లెట్టించినాడు. ఇప్పుడు డబ్బొస్తన్నదంటే - ఆ బాబేం సేయగలడు?

అదే మాదిరి లచ్చుంనాయుడు బాబున్నా, పున్నానికే బూవిచ్చినాడు. అయిస్కూలొచ్చినాక ఆ సుట్టూ బూవులు ధరలు పెరిగిపోనాయి. యిళ్ల జాగాల కమ్మితే నష్టం పూడి లాబవొచ్చింది. ఆ జాగాలు కొనుక్కున్నోళ్లకు బలవంతాన గాని అంటగట్టినాడా?

అలాగని కూకలేసినాను.

దానికో గుంట పాపడన్నాడు గదా -

'ఓరి తాతోయ్! మనవూ ఇచ్చినాం శమదానం. మన పున్నేనికి బవుమతే దన్నాడు.

నీక్కూల్లు దొరకనేదా - అన్నాను.

దొరికినాయి. ఆ కూల్లు కాసపడితేనే బతుకు బతుకంతా కూల్లు పుట్టని పనులు జరిగిపోనాయి. అదే మనం జేసిన పున్నానికి నీ భగమంతుడిచ్చిన బవుమతి అన్నాడు.

అయితే లోకవంతా శ్రీరావులు బాబును పొగుడుతున్నారు. అంతమందికి మంచైనోడు మనకి సెడ్డవుతాడ్రా? ... ఎక్కడో తప్పుంది... అన్నాను.

అంటే ఇంకోడన్నాడు గదా - ఓరి దద్దా! శ్రీరావులు బాబును జనం పొగుడుతున్నారంటే దానికి కారనం ఏరు. ఈ వూరికి సెంటర్లు, కాఫీ వోటేల్లు, కిల్లీ బడ్డీలు. ఆయనగారెట్టించిన ఆఫీసుల్లో ఐస్కూల్లో పన్సెయ్యడానికి, సదువుకోడానికే ఊర్యార్లనుండి జనం వొచ్చినారు. ఆల్లకోసవైతేనేం, మనకోసవైతేం, సుట్టుపక్కల ఊరుల్లో జనం కోసవైతేం - అయన్నీ పుట్టినాయి.

ఎనక దినాల తీసిన సావుకార్ల బిడ్డలంతా ఇప్పుడు మల్లా పూటుకుంటున్నారు. ఆళ్లు పొగడ్తకేం సేస్తారన్నాడు.

నానాడికి జవాబు సెప్పేగానే ఎనకటి గుంట పాపడు - అన్నట్టు తాతా! ఆలేం పున్నెం సేసినార్రా- అన్నాడు.

నాక్కోపమొచ్చి -

ఒరే మీ కర్మాలకు శ్రీరావులు బాబు కర్తగాడు ఆయనకు మంచిదన్తోచింది ఆయన సేశాడు. అందువల్ల కొందరికి నష్టం, కొందరికి లాభం ఒస్తే వస్తాదన్నాను.

దానిమీద పెద్ద వోదనయ్యింది.

సివరకోడన్నాడు -

నీలాటి తారుపుగుల్ల నాయాల్లు మారో నలుగురీ వూర్లో వుంటే మరగడగక్కర్లేదన్నాడు.

బాబయ్యా! డెబ్బై ఏళ్లు నెత్తికొచ్చినాయి. యెంత బతుకు బతికినానో తవరంతా ఎరుగుదురు. యీనాటికి నా జనం నన్నేటన్నారో యినండి.

అప్పుడు నా బాధ తెలిసి మా యర్రయ్య ఇంటికి సుట్టపు సూపుగా వచ్చిన పెద్దమనిషి అన్నాడు.

ఒయోయ్ బుల్లోళ్లో ఆయన్నని నాబం లేదు. జరుగుతున్న దగా యెక్కడో మీకు తెల్నట్టే ఆయినికీ తెలవదు. దీనికంతటికీ కీలకం యిక్కడెక్కడా నేదు. పైనెక్కణ్ణుంచో వొచ్చిన ముప్పు మనందర్నీ ముంచుతోంది.

పండిన పంటంతా కాంవందుల గోదాలకెళ్లాల. ఎల్లకుండా కూలోడు అడ్డం తగులుతున్నాడు. ఎనకట్రోజుల్లో అయితే తన్ని సేయించుకునీవోరు. ఇప్పటి రోజుల్లో ఆ పప్పులుడకవు. కూలోడి అడ్డు వొదిలించుకోవాలంటే మిసీన్లు కావాలి. మిసీన్లు తేవాలంటే యెలట్రిసిటీ, రోడ్లూ కావాలి. అంతేకాదు; సదువుకున్న కూలోళ్లు కావాల. అందుకనే యీ యిస్కూళు; అందకనే యీ రోడ్లూ, యీ యలట్రిసిటీ, ఇయన్నీ మన కోసవే అనుకోవడం బుద్ధి తక్కువ. నీల్లు తోడ్డానికటి మిసీన్లొచ్చేసినాయనే గుంజుకు పోతున్నారు. రేప్పొద్దున దున్నడానికి, ఊడుపులకు, గొప్పులకు, కోతలకు కూడా మిసీన్లు రాబోతున్నాయి. అప్పుడు సూసుకోండి తడాఖా - అన్నాడు.

బాబయ్యా! మంచన్నది సెబ్బరైపోవడం నాకూ సిత్రంగానే వుంది కాని జరిగిందీ జరగబోయేదీ సూస్తే, ఆల్ని కాదనడ వెలాగో నాకు తెలకండున్నాది.

నువ్వెవరి కుపకారం చేస్తానని బయలెల్లినావు? - అదెవరి కుపకారం అవుతోంది? మా గుంటపాప లేవన్న అనొచ్చు - నాను సూరెంబాబునీ, లచ్చుంనాయుణ్ణీ కూడా నెపమెట్టను. మనసులో పాపం దాచుకొని ఆల్లు నీ పందిట్లో అడుగెట్టనేదు. పున్నానికొచ్చిన వోరిని నువ్ మొదలెట్టిన యెగ్గెం ఫాపంలో దింపింది. దిగినాక తెలిసీ తెలీకా అందరూరుకున్నారు. మీ సీతారావుడు మాత్రం దిగిరానేదు.

ఆడొక్కటే మాటన్నాడు.

ఓరయ్యా! నువ్వన్నదంత యిన్నాను. నువ్వూ మీ శీరావులూ బాబూ ఆ యెనక తక్కిన పెద్దలు, ఆరెంట జనంవందరు - మీరంత మంచోళ్లో కావచ్చు - చెడ్డ చేసినా మంచుద్దేశాలో కావొచ్చు. నన్నీ వున్న కసింత బూవి అమ్మి కంబార్ని కమ్మనడం కూడా నా మేలుకోరే అయుండొచ్చు. దీన్ని నాను అమ్మదలుసుకోనేదు. అమ్మను.

సావుకోరి అప్పును నాను కాదన్ను. నాక్కలిగితే కలిగినంత తప్పక తీరుస్తాను. సచ్చినంత కాలం శాకిరీ సెయ్యమన్నా సేస్తాను. కానీ - బూవమ్మి తీర్చడమన్నది నా బొందిల పేనం

వుండగ జరుగదు! అన్నాడు

దానికి మా పెద్దయ్య - అవున్రా! ఆ బూవంత నీదే అయినట్టు మాటాడతవేటన్నాడు

అన్నదమ్మిడి దగ్గరకొచ్చేసరికి హక్కులూసు ఎత్తుతున్నావ్. సావుకోరి కప్పగించమన్నప్పుడు నీ హక్కేటుబోనాదిరా ఎదవనాకొడకా! -అంటూ సీతారావుడు లెగిసిపోనాడు.

జనంవందరడ్డుపడితే సివరికన్నాడు.

ఓరయ్యా! నేనిన్ని మాట్లోణ్ణిగాను. ఆ తరువాత సెప్పలేదనకు బూవమ్మావా - నిన్ను నరికి పోగులెట్టి నన్ను నేను నరుక్కు సస్తాను, ఇది నిజం! ముమ్మాటికి నిజం - అన్నాడు.

ఎవరికి తెలిసినా ఎవరికి తెలీకపోయినా నాకాడి బాదేటో తెలుసు, అన్నాను.

నాయినా! తల్లిదండ్రాదులు బిడ్డల్నెందుకు పెంచుతారు? ఏనాటికైనా దినం తీరుస్తారనే కదా; నీ సేతుల్లో సావుకన్న నాను కోరేదుండదు. కాని యీలోగా ఒక్కటి జరగాల.

రేపు శీరావులు బాబొస్తాడు. శతయిదాల ఆ బాబు దరమం తప్పడు. ఒక యేల ఆ బాబుక్కూడా మనం బూవమ్మి సావుకోరి రుణం తీర్చడవే దరమంగ కనపడొచ్చు. ఆ బాబు కలాగ కనిపించిన్నాడు హరిమీద గిరిపడ్డా, గిరిమీద హరిపడ్డా నాను బూవమ్మి రుణం తీర్చడం ఖాయం. ఆ యిదంగా నా రుణం నాను తీర్చుకున్నాక నీ రుణం నువ్వూ తీర్చుకో అన్నాను''

ఇలాగంటూ అప్పల్రాముడు ఆగిపోయాడు. చివరి చివరి వాక్యాలు చెపుతున్నప్పుడు అతని గొంతులో ధ్వనించిన వేదన చాలామంది హృదయాల్లో ప్రతిధ్వనించింది. ఆ తరువాత అతడు కొంతసేపు మతిబోయినవాడిలా కనిపించాడు. చేతిలో వున్న కాగితం గాలికి రెపరెపలాడగా, అతడీ లోకంలోకి వచ్చాడు.

జనం అందరూ అతడికి అలసిపోయిన వారిలా కనిపించారు. ఎవరి మొహాల్లోనూ కళాకాంతులు లేవు. అతడె తలెత్తి శ్రీరాములు నాయుడి వంక చూశాడు. నాయుడు వండగాళ్లపై కూర్చొని, వాల్చిన తలకు కుడి అరచేయి దాపు చేసుకొని, ఏదో దీర్ఘాలోచనలో ఉన్నాడు.

అప్పల్రాముడికి ఒక క్షణమంటే ఒక్క క్షణమే ఆశ కొట్టాడింది. తన కండ్లలోకే సూటిగా చూస్తున్న సూర్యంగారి కండ్లనూ, తన చేతికేసే విడవకుండా చూసే ముసలయ్య చూపులనూ, తననుండి తమ్మార్కు పెట్టె వద్దకూ, తమ్మార్కు పెట్టెనుండి తన వద్దకూ పరుగులు తీసే కరణం చూపులనూ - చూసి గ్రహించి, అర్థం చేసుకొన్న తరువాత రాముడికి తనది అడియాశ అని తేలిపోయింది.

ఒక్క దీర్ఘ విశ్వాస విడిచి రాముడు ముందుకు వెళ్లి ఆ కాగితంపై వేలుముద్ర వేసేడు. అతడు తమ్మార్కు పెట్టె దగ్గరినుంచి లేస్తుంటే, గోపన్న బిగ్గపట్టిన నరాలు సడలగా, ''అమ్మయ్య'' అన్నట్టు దిక్కులు చూశాడు.

తరువాత రాముడు కొడుకుల్నీ, మనవల్నీ ఒక్కొక్కరినే పిలిచి వేలుముద్ర వేయమన్నాడు.

అంతా అయ్యాక జనం సానుభూతి రాముడి వంక ప్రవహిస్తోంది. దేనికా ప్రవాహం? మురుగునీరు దానికన్నా నయం!

తండ్రి వెళ్లి లేపగా సీతారావుడు కూడా లేచేడు వాడికళ్లు చింతనిప్పుల్లా వుంటాయి. వాడు నల్లగా పొడుగ్గా వుంటాడు. వాడు జుట్టు సిగగా ముడి వేసుకొంటాడు.

అతను పత్రం దగ్గరికొచ్చి దానివంక తేరిపార చూశాడు.

తేరిపార దానివంక చూశాక అతడికేమయ్యిందో తెలియదు. గిర్రున వెనుదిరిగి అడ్డం వున్న వాళ్లను తోసుకుంటూ దడదడ నాలుగడుగులేసి ఆ తరువాత వాళ్ల పేట కేసి పరుగుచ్చుకున్నాడు.

''ఒరేయ్ సీతారావుడూ! ఓరయ్యా! ఒరే నాయనా! పారిపోకురా'' అని అరిచాడు అప్పుల్రాముడు.

సీతారాముడు వినిపించుకోలేదు. బాణంలా దూసుకుపోతున్నాడు. అతడు మలుపు తిరిగాక జనం - ''ఏఁవయ్యిందేవయింది'' ''ఎందుకూ?'' ''సీతారావుడు'' ''ఇప్పుడే!'' అంటూ ప్రశ్నోత్తరాలలో పడ్డారు.

ఉండి ఉండి ముసిలిది - అప్పుల్రాముడు భార్య - ''ఓలమ్మ! నేనేం సేదునే?'' అంటూ ఒణికే సన్నని గొంతుతో ఏడవడం ఆరంభించింది.

''ఇప్పుడేటయ్యిందే? నువ్వేడొద్దు!'' కసురుకున్నాడు అప్పుల్రాముడు.

తరవాత -

కొంచెంసేపు నలిగి ''సూసొస్తానుండ నువ్వేడకు'' అంటూ బయలుదేరబోయాడు అప్పుల్రాముడు.

''నువ్వెళ్లొద్దొహె'' తండ్రిని వారించి పెద్ద కొడుకు మొలగుడ్డ విప్పి భుజంమీద వేసుకున్నాడు.

అతని భార్య ''నువ్వూ ఎల్లకు'' అంటూ, అతడు వినకపోగా గుంపులోంచి బయటికి వచ్చి అతడి చేయి పట్టుకుంది.

ఆ కుటుంబం యిలా లజ్జుగుజ్జులు పడుతుండగా, ఇద్దరు ముగ్గురు నాయుళ్లు అటూ ఇటూ పరుగుపెట్టి బలవైన చేపాటి కర్రలతో తిరిగి వచ్చారు. వాళ్ల హడావుడి గమనించిన మాలలు కొందరు లేచి బాబయ్యల్లారా! తొందరపడకండి' అన్నారు.

అప్పటికిగాని శ్రీరాములునాయుడు అక్కడేదో జరుగుతోందని గ్రహించలేక పోయాడు.

గ్రహించాక - ఏ వేళ చూసినా చెరగని చిరునవ్వులు వెల్లివిరిసే శ్రీరాములు నాయుడి నవ్వు మొహంలో చీకట్లు చిక్కనై, గుడ్డికళ్లక్కూడా తెలిసిపోయేయి.

''మీరెవ్వరూ తొందరపడకండి - '' అని ముందుకు వచ్చి, బొంగురుపోయిన కంఠాన్ని సవరించుకుని కీచుదేలిన కంఠంతో ''నా మాట విని మీరెవ్వరూ తొందరపడకండి'' అన్నాడు గట్టిగా.

గజగజ గజ వజవజ వణుకుతున్నాడు శ్రీరాములు. ఆయన ఆపాదమస్తకం

వణికిపోవడం జనం భయం కలిగించింది. భీతావహులైన జనంలో లక్షుంనాయుడి నిబ్బరం మళ్లా ధైర్యం నెలకొల్పుతోంది.

అదిగో వస్తున్నాడన్నారు - మూలపేట కేసి చూస్తున్న జనం.

''చేతిలో ఏం ఉంది?''

''ఏమీలేదు, భుజంమీద గోనెమూటున్నది''

ముందున్న లక్షుం నాయుడు వెనక్కు వెళ్లిపోయాడు. తక్కిన వాళ్లు ముందుకొచ్చి చూస్తున్నారు.

సీతారావుడు అల్లంత దూరం నుండే ఆరంభించాడు.

''ఒరే ఓరె నాయన! అప్ప్రలావుడా! నువ్వా కాయితం మీద ఏలుముద్రెట్టిన్నాడు నీకూ నాకూ తండ్రీ కొడుకుల రుణం సెల్లిపోద్దని సెప్పినాను; సెల్లిపోనాది.

నిన్న రేత్తిరి నీకు వంరీ వంరీ సెప్పినాను. అయినా నువ్వు నావూటిన్నావ్ కావు. ఎందుకిన్నావ్ కావు? - నాస్తండ్రిని, యీాడు నా కొడుకు. నా కొడుకయ్యుండి నా మాటెలా తప్పుతాడు; తప్పడనుకున్నావ్.

కొడుకులు తండ్రుల మాట తప్పరాదు. నిజవే! నాకూ ఒక్కొడుకున్నాడు. ఆడూ తప్పడు.

ఇదిగో నామాట నీ బుద్ధి మానుకో...''

అంటూ పరుగెత్తి ముందుకొచ్చి భుజంమీద గోనెబస్తా ఒక్కుదుటున ఎదరకు లాగి కొసలు బట్టుకొని దులిపాడు.

అప్ప్రలాముడి పాదాల ముందు 'టక్' 'దబ్'మని ఒక తలా, చిన్న దేహం నేలమీద రాలాయి. రక్తసిక్తమైన మట్టిలో పొర్లిందా చిన్న తల. దిగంబరమై, నల్లనిదై, రెండు చేతులా నేలను కరచుకొని రక్తం చిమ్ముతున్నదా - లేత దేహం.

అతి జుగుప్సాకరవములైన ఆ రెండు పదార్థాలను చూచిన జనం, నివ్వెరపోయి, జడిసిపోయి, ఆశ్చర్యపోయి, మతులు పోతుండగా ''ఓరమ్మో! ఓరి నాయన! ఓరి బాబో! అయ్యయ్యో! అమ్మమ్మ ఎంత గోర వెంతగోరం'' అంటూ- ఆ పైన బెదిరిపోయి, ఒణుకులుచ్చుకొని, శతనంలు దప్పుతున్న శరీరాలనం, అవి పూర్తిగా స్వాధీనం తప్పకముందే, భద్రమనుకునే దూరం వరకూ, ఫరవాలేదనిపించే చోటుల వరకూ, జరుపుకొని పోయారు. వెనుకనున్న కొందరు ఆ కలకలం చూసి ఏవిటేమిటంటూ ముందుకొస్తున్నారు.

అప్ప్రలావుడు అక్కడే, అలానే నిల్చున్నకాడ నిల్చున్నట్టే కొయ్యగట్టి పోతున్నాడు. నిప్పుల తూపుల్లా వాలవలసిన కొడుకు చూపులు, పిడుగుల దెబ్బల్లా తాకవలసిన అతడి మాటలు, నిలువు కళ్ళతో నించున్న అప్ప్రలాముడి శరీరాన్నిగాని, ఆత్మనుగాని బాధిస్తున్న దాఖలాలు లేవు.

సీతారావుడు అంటున్నాడు.

''నానెంత సెప్పినా నీ కళ్లపొర తెగనేదు. నయాన సెప్పినాను నిన్ను సంపుతానన్నాను. నన్ను నరుక్కు సస్తానన్నాను. అయినా నువ్వు నా మాటిన్నావ్ కావు

ఎందుచేత?

నీకు జనం మెప్పు కావాల. అప్ప్రలావుడు శానమంచోడు; ఆడి తప్పనోడన్న మాట కావాల అమాయకుడన్న పేరు కావాల. నీ బిడ్డ పాపలెలాగట పనీ. నీకున్న డంబం అంట యేటటా? దరమం తప్పడన్న పేరు. కల్ని ఎవడు సెప్పిన దరమం? ఏటా దరమం?

ఓరయ్యా! నువ్వు నీ బిడ్డలకేం సేస్తన్నవో, నీ కుటుంబానికేటవుతోందో, నేనెంత సెప్పినా నీ కంటిగ్గాని, జనం కంటిగ్గాని కాపడ్డం నేదు. ఏరి కంటిక్కన పడకుండా నువ్వేం సేస్తన్నావో - అదే పని అందరికంటికి కనపడేటట్టు నానూ సేసేను.. సూసుకో'' అంటూ భూమికేసి చూసేడు. అటు వంగిన అప్ప్రలాముడి శిరస్సు అలానే ఉండిపోగా -

''నువు మమ్ముల్ని సచ్చిందాక బానిస బతుకు బతకమన్నావ్. నీకు తెల్నప్పుడు అది సరే. ఇప్పుడు తెలిసినాకా నువ్వు ఆ మాటే అంటే - ఇదిగో నాకిష్టం నేదు.

నా కొడుకుమీద నాకాశెక్కువ. నా కొడుకు బానిస బతుకు బతకడు. నా కొడుకు కంబారి కాడు.

అందుకే పరుగెత్తుకెల్నాను. ఒరేయ్! ఒరె, కొడుకా, నువ్వు బానిస బతుకు బతుకుతావా - లేకపోతే సస్తావా? యీయాల సస్తే రేపటికి రెండు. రా నిన్ను సంపుతానన్నాను. ఆడు పరుగెత్తుకొచ్చినాడు. నాను పటక్కన నరికేసినాను. ఆ కత్తటు బారసి యిటు లగెత్తుకొచ్చినాను.

నువ్వూ తండ్రివే, నానూ తండ్రినే, ఎవరు గొప్పో నువ్వే సెప్పు''

ఇలా అంటూ - సీతారావుడు ఆగిపోయేడు. మనవడి దగ్గర చతికిలబడపోతున్న అప్ప్రలావుడి నుండి చూపులు తిప్పుకోవడానికి సీతారావుడు జనం కేసి చూశాడు. తమకేసి తిరుగుతున్న సీతారావుణ్ణి చూసి జనం కకాపికలవుతున్నారు. వాళ్లను చూసి కడుపులో దేవినట్లు కాగా; సీతారావుడు అరనవ్వుతో అన్నాడు -

''బాబయ్యల్లారా! జడిసిపోకండి, జనంమీద సెయ్యెత్తగల మనిషే అయితే యీ సీతారావుడు కన్నబిడ్డను సంపుకోడు''

అంటూ జనాన్ని ఆపబోయేడు, అయినా జనం బెదిరిపోయారు. అప్పుడు బయటపడ్డ చేపాటి కర్రల వాళ్లంటే వాళ్లతో అన్నాడు.

''బాబూ, మీరు తొందరపడకండి. నాను ఉరికే సిద్దం; నాకు సావో నెక్క కాదు. నన్ను కొడితే మీరు ఉరిలో పడతారు. మీ బిడ్డ పాపం ఉసురు నాకేల తగలాల? అన్నాడు. ఆ తరువాత అతను మండపం కేసి తిరిగాడు.

అతడి చూపులు శ్రీరాములునాయుణ్ణి వెతికిపట్టేయి. అతడికేసి చూసి చూసి అన్నాడు.

''బాబూ శ్రీరావులు బాబు! నువ్వంటే నాకు మాసెడ్డ కసి; ఎప్పుడు? ఇంతకు పూరవం, ఇప్పుడో - నేదు. ఎందుసేతో తెలుసునా? నువ్వొత్త యెర్రి పీరువి.

లోకవంత నువ్ సెప్పినట్టినాలని, ఇంటారని నీ మనసులో ఓ ఉద్దేశం. ఈ రాజ్యాన్నీ,

నిన్నూ ఏలే దొరలెవరో యెరుగుదువా -అదిగో ఆ బాబులిద్దరు. అదిగో ఆ కరణమయ్య్య, అది ఆ మునసబయ్య్య. ఆళ్లకి ఆళ్లు సేసుకోలేని మంచిని నువ్వు సేసినంత కాలవే నీ రాజ్జం. ఆ తరవాత - ఆళ్లెవరో, నువ్వెవరో, ఆ సంగతి నీకిప్పుడు తెలీదు''

ఇలా అంటూ మునబును చూసి వెఱ్ఱినవ్వుతో అన్నాడు.

''బాబూ, మునసబ్బాబు! శానాకాలానికి నీకు పన్తగిలింది. శ్రీరావులు బాబు మన్డపం తెరిచిన రోజున నువ్వూ ఓ మాట అన్నావట. ఇప్పుడు సెప్పు అచ్చు రిపోర్టు కొస్తావా, నా కూనీ మాఫీ సేస్తావా?''

ఇలా అంటూ ఎలా నించున్నవాడలా ఆ న్యాయమండపం ముందు చతికిలబడి పోయాడు - సీతారాముడు. ధర్మపన్నాలెంత వరకూ? ... అంతా నువ్ చెప్పినట్టు వినేవరకూ ...!

ఆ తరవాత...!

# ధనదాహం ఫలితం

మొలకపల్లి కోటేశ్వరరావు

నరసింహమంటే సింహమే అని ఆ వూరి ప్రజల నిశ్చితాభిప్రాయం.

అలాగని నరసింహాన్ని సింహంతో పోల్చటం కూడా సరికాదు. సింహం తన కడుపు సంతృప్తిగా నిండేవరకూ తోటి జంతువుల్ని చంపి తిని, కడుపు నిండిన తరువాత వాటి జోలికి రాదు.

నరసింహం కడుపు పూరాగా నిండినా - మళ్లీ తరతరాల వరకూ వుండేలా తోటి మానవుల్ని చంపి, వాళ్ల మాంసాన్ని ముందు తరాలకి భద్రం చేయాలనే స్వభావం కలిగినవాడు.

తండ్రినించి కేవలం మూడెకరాలు పనికిరాని పోరంబోకు భూమిని పంచుకున్న నరసింహం ఇవ్వాళ అరవై ఎకరాల సుక్షేత్రమైన భూములూ, బేంకుల్లో డబ్బూ, ఊళ్లో పెద్ద డాబా, టౌన్లో స్థలాలూ ఇవన్నీ సంపాయించాడంటే - వీటిక్రింద ఎన్ని పచ్చని సంసారాలు నిలువునా సర్వనాశనమై పోయాయో, ఎంతమంది వ్యక్తులు సమాధి కాబడ్డారో ఎవరి లెక్కలకు అందవు.

నరసింహం ధన పైశాచికత్వానికీ బలయిన కుటుంబాల్లో యంగడి కుటుంబం ఒకటి. యంగడంటే నరసింహం వాళ్ళ ఇంటి మాదిగవాడు.

తాత తరం నించ ఉన్న ఒక్కెకరం భూమి తండ్రి తరువాత యంగడి స్వంతమైంది. ఆ ఎకరాన్ని కాజేయాలని ఇరవై యేళ్ళ నుంచీ ప్రయత్నిస్తున్న నరసింహానికి యంగడు దొరకలేదు. ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎన్ని కుట్రలు పన్నినా వేటికీ యంగడు పడలేదు.

* * *

నట్టనడిజాము.

సూరీడు చండప్రచండంగా ఆకాశం నించి నిప్పులు వెదజల్లుతూ మలమలమాడ్చుతూ తింటున్నాడు మనుషుల్నీ, జంతుజాలాల్నీ, దోపిడీ ప్రభుత్వాలు ప్రజల్ని మాడ్చుకుతిన్నట్లు.

లల్లాయి పాటలు పాడుకుంటూ, కాలువగట్లు వెంట గేదెల్ని మేపుకుంటూ ఎండధాటికి తాళలేక గట్టుపక్కనున్న చెట్టుకింద చేరి సేదతీర్చుకుంటున్నాడు యంగడు.

''యంగయ్య బాబో! యేందే ఈ మజ్జెన కనపట్టం లేదు? అన్నాడు ఆ వైపే గొడ్లు

తోలుకొచ్చిన నిమ్మడు.

''నేను కనబడక ఎక్కడికి పోతున్నారా అబ్బియ్యా! నువ్వే కనపట్టం లేదుకానీ...'' అన్నాడు యంగడు.

''నేను పరవంటి పొలాలకల్లి తోలుకుపోతున్నానే గొడ్లని. సరేకాని, అమ్మోరు వచ్చిందంటున్నారేందే గొడ్డుకి? నిచ్చమేనా?''

''యేమొరా! పొద్దునొగ్గొడ్డూ. రేత్రొకగొడ్డూ చచ్చిపోయినైయంట!''

''వచ్చే శుక్కురోరం కొలుపులూ, అమ్మోరికి బలులూ చేత్తారంటనే!'' అన్నాడు నిమ్మడు.

''వారే? అప్పుడే ఎవురు నడుం కట్టారేయ్?''

''పొద్దున మా ఆసామిగోరు అంటంటే యిన్నానే'' అంటూ నిమ్మడు తన గొడ్డుని ఇంకోవైపుకి తోలుకుపోయాడు.

''ఊల్లో అమ్మోరంటున్నారు. యేది యెట్టుండిద్దో? ఇయ్యాల పెందలకడే గొడ్డుని ఇంటికి తోలుకుపోతే బాగుండు''మనసులో అనుకున్నాడు యంగడు

యంగడికి యాభైయేళ్లుంటాయి. ఉన్న ఎకరం పొలాన్ని కౌలుకిచ్చుకుని పాలికి గొడ్డుని మేపుతుంటాడు.

ప్రతి కాపూ అంతే!పశువుల పాడి అయిపోయిన తరువాత సూడిమీద గొడ్డుని మేపు కూలికి తోల్తారు. ఆ సూడి గొడ్డు మళ్లీ యీనేవరకూ మేపుతూ వాటి సంరక్షణ అంతా వీళ్లే చేయాలి. మేపుకూలి నెలకి ఒక్కో గొడ్డుకి వందరూపాయలిస్తారు.

నరసింహం కాపుకి లేని వ్యాపారమేం లేదు. పశువులఫారం వుంది. వాటి పాలమీదనే ఆయన చాలా డబ్బు సంపాయించాడు. ఆయన కూడా పాడిపశువులు ఎండిపోయిన తరువాత మేపుకూలికి తోల్తాడు.

యంగడికి నరసింహం కాపు రెండు గొడ్లని మేపుకూలికి తోలాడు. ఆ గొడ్లనే ఇప్పుడు యంగడు మేపుతున్నాడు. పగలంతా తనువాటిని మేపుకువస్తే , తన కూతుళ్లు పుట్టమ్మాటా, గట్లమ్మాటా తిరిగి గడ్డి దోక్కొచ్చి రాత్రిళ్లు వేస్తారు.

యంగడికి పెద్ద వయసులో ఇద్దరు కూతుళ్లు పుట్టారు. వాళ్ళకి యింకా పెళ్లిళ్లు కాలేదు.

కొద్దిగా పొద్దు వుండేవరకూ గొడ్లని మేపుకుని ఇంటికి తోలుకుపోయాడు యంగడు.

ఆ రోజు మళ్లీ ఇంకో రెండు గొడ్లు చచ్చిపోయాయి. ఊరంతా ఉడికి ఉడికిపోతోంది. ఎక్కడ విన్నా, ఎవరి నోట విన్నా అంతా అదేమాట.

యంగడికి భయంగా వుంది. ఆ గొడ్లు తనవి కూడా కాదు. తను పదీ, పరక్కీ ఆశపడి గొడ్లని మేపుతున్నాడు. ఒకవేళ పొరపాటున ఏమైనా జరిగితే....

నరసింహం కాపుగొడ్లు ఆయనవి ఆయనకు తోలాలని నిర్ణయించుకుని వాళ్ల ఇంటికి వెళ్లాడు యంగడు.

ఇంటి దగ్గర నరసింహం లేడు ఆయన టౌనుకు వెళ్లాడనీ, ఆ రోజు రాత్రికి రాడని చెప్పారు ఆడవాళ్లు

''ఊళ్లో గొడ్లుకి అమ్మోరు వుందమ్మా!'' అన్నాడు యంగడు.

'' అవున్రా యంగా! వచ్చేవారం కొలువులు కూడానట. అయితే ఇంతకీ ఏమిటి పని?''అంది నరసింహం భార్య.

''మీ బరిగొడ్లని మీయింటికి తోల్తానమ్మా! అమ్మోరు పోయిన తరువాత మళ్ళీ తోలుకుపోతాను.''

''అదేంట్రా? మా యింటి దగ్గర వుంటే వొకటీ, నీదగ్గర వుంటే వొకటీనా? ఏమైనా జరిగితే నీవు మాత్రం ఏం చేయగలవనుకో? ఇంతకూ ఆయనవూళ్ళో లేడుకదా! ఆయన వచ్చిన తరువాత మాట్లాడి, ఆయన చెప్పినట్లు చేయి'' అంది నరసింహం భార్య.

''ఆయన రేపు వస్తాడంటున్నారు కదమ్మా! గొడ్లకి ఏమైనా జరిగితే?''

''ఇవ్వాళ ఒక్కరోజుకి ఏం జరుగుతుందిలే? రేపు రాత్రికి వచ్చిమాట్లాడు''

''అట్టాగేనమ్మా!'' అంటూ ఇంటికి వెళ్ళిపోయాడు యంగడు.

ఆరోజు కూడా గొడ్లని పొలాలవైపు తోలుకు పోయాడు.

రోజూ హుషారుగా వుండే గొడ్లలో ఒకటి ఆ రోజు నలతగా, మెత్తగా వున్న విషయం యంగడు గమనించలేక పోయాడు. అది అసలు గడ్డివైపు చూడనేలేదు. ఒక్క పోస గరిక కూడా నమలలేదు.

మధ్యాహ్నానికి దాని పరిస్థితిని గమనించిన యంగడు భయపడి ఇంటికి తోలుకు రాసాగాడు అది అసలు కదలలేక పోతున్నది. ఎంత కొట్టినా ఒకటీ, రెండూ అడుగులు మాత్రమే వేయగలుగుతున్నది.

కొద్దిదూరం వచ్చిన తరువాత ఆ గొడ్డు నోటివెంట నురుగులు కక్కుతూ గిరగిరా తిరిగి కింద పడిపోయింది.

''వోర్నాయినో... గొడ్లు పడిపోయిందిరో దేవుడో'' అంటూ యంగడు పెద్దగా అరుస్తూ కేకలు వేయటం మొదలుపెట్టాడు. యంగడి కేకలు విని చుట్టుపక్కల పొలాలలో వున్నవాళ్లు పరిగెత్తుకుంటూ గొడ్డు దగ్గరకు వచ్చారు.

అందరూ నిస్సహాయంగా చూడటం తప్ప ఏమీ చేయలేకపోయారు. కింద పడిన ఆ గొడ్లు కొంతసేపు గిలగిలా తన్నుకుని, కాళ్లు నేలకేసి బాదుకుని ప్రాణాలు విడిచింది.

''నరసింహం కాపుకి నేనేం జవాబు చెప్పుకోవాలిరో దేవుడో.... ఆయన మొకం యెట్టాచూడాలిరు నాయనో..''అంటూ యంగడు పెద్దగా ఏడవటం మొదలు పెట్టాడు.

టౌన్లో పశువుల దాణా ఫ్యాక్టరీ పెట్టే పనిలో నరసింహం లైసెన్సు కోసం తిరుగుతూ నాలుగు రోజులకు తిరిగివచ్చాడు.

విషయం తెల్సుకొని యంగడి కోసం జీతగాన్ని పంపించాడు.

యంగడు భయపడుతూ వచ్చాడు.

''యేరా యంగా! బరిగొడ్లు చచ్చిపోయిందంట కదరా?'' అడిగాడు

''అవును కాపా!'' అన్నాడు యంగడు నసుగుతూ.

''మరిప్పుడేం చేయాల్రా? అది మామూలు గొడ్డుకూడా కాదు ఫారిన్ జాతి గొడ్డు. దాని ఖరీదెంతో నీక్కూడా తెల్సుకదా! ఏం చేయమంటావు?'' అన్నాడు నరసింహం

''చేసేదేం వుంది కాపా! నేను కావాలని ఏంచేసాను? ఊళ్లో చాలా గొడ్లు చచ్చిపోయినయికదా!'' అన్నాడు యంగడు.

''నువ్వు మేపు కూలికి మేపుతున్నపుడు ఏమైనా జరిగితే పూచీ నీదే కదా!'' అడిగాడు నరసింహం.

''నాదే అనుకోండి. మీ గొడ్లను మీయింటికి తోలుదామని ఆరోజు మీయింటికి వస్తే మీరులేరు కాపా! అమ్మగార్నడిగితే, ఏమైనా జరిగితే నువ్వు మాత్రం ఏం చేస్తావులేరా? నువ్వేమేపు అంది.

''అమ్మగారనటానికేం వుందిలే! ఇంట్లో పడివుండే వాళ్ళకేం తెల్సు? నాకు మాత్రం డబ్బుతెచ్చి కట్టు'' అన్నాడు నరసింహం.

''నా దగ్గర డబ్బులు ఇప్పుడు అస్సల్లేవు కదా కాపా!''

'' ఇప్పుడు లేకపోతే యెట్లా? నాకు నోటయినా రాసివ్వు''

''కూలీనాలీ చేసుకు బతికేటోల్లం మీరు దయజూపాలి. దాని రేటులో సగం కట్టుకోండి కాపా!''

''యేదో పేద ముండా కొడుకువి, అలాగే సగం డబ్బులకే నోటురాసివ్వు''

ఆ గొడ్డు ఖరీదు రెండువేలుంటుంది నరసింహం దానిఖరీదు ఐదువేలవుతుందన్నాడు.

''అన్నేయం కాపా! అది అంత ఖరీదుండదు'' అన్నాడు యంగడు.

'' ఉండకపోతే నాగొడ్డుని నాకు తెచ్చివ్వురా!'' అన్నాడు నరసింహం.

యంగడు చచ్చిపోయిన గొడ్డుని ఎక్కడినించి తెచ్చి ఇవ్వగలడు?

ఊళ్లో పెద్ద మనుషులు అందరూ కలిసి దాని ఖరీదు నాలుగు వేలు నిర్ణయించారు. చివరకు ఏడుస్తూ యంగడు అందులో సగానికి రెండు వేలకి నోటు రాసిచ్చాడు.

''నువ్వా డబ్బుని ఎక్కడినించి తెచ్చి కడతావురా?'' అన్నాడు నరసింహం.

'' ఊళ్ళో ఒక కాపుకి వెయ్యి రూపాయలు వడ్డీకిచ్చుకున్నాను కాపా! అవీ, ఇయ్యేడు వచ్చే కౌలూ మొత్తం కలిపి కడతాను. రేపు వడ్డీ అయినా లేకుండా చూడు'' అడిగాడు యంగడు.

''సర్లే వడ్డీదేవుంది? దాని వ్యవహారం అప్పుడు చూసుకుందాంలే?'' అన్నాడు నరసింహం.

పంటలు ఇంటికొచ్చే తరుణంలో యంగడు వడ్డీకిచ్చుకున్న పది వందల రూపాయలూ, కౌలు ఐదు వందలూ మొత్తం కలిపి తీసుకొచ్చాడు నరసింహంకు ఇవ్వటానికి.

''పదిహేను వందలు తెచ్చాను కాపా! మిగతా డబ్బు నెలరోజుల్లో కడతాను'' అన్నాడు యంగడు.

''సరేలేరా! ఇప్పుడేం తొందరొచ్చింది? నీదగ్గర వున్నప్పుడే కట్టు. పోతే, నోటు మా పెద్దోడి దగ్గరుందిరా! వాడు టౌన్లో వుండే! వాడు వచ్చిన తరువాత ఇవ్వాళ తారీకుతో జమ వేసుకుంటాలే!'' అంటూ నరసింహం యంగడు ఇచ్చిన డబ్బుని రెండుసార్లు లెక్కపెట్టుకుని భద్రంగా ఇనప్పెట్టెలో పెట్టుకున్నాడు.

''వస్తా కాపా! పదిహేనొందలిచ్చాను మరిచిపోకుండా నోట్లో జమవేసుకో!'' అంటూ యంగడు వెళ్ళిపోయాడు.

నెల రోజులకి ఇవ్వగలననుకున్న ఐదువందలు సంవత్సరం వరకూ ఇవ్వలేక పోయాడు యంగడు. సంవత్సరం తరువాత మళ్ళీ పంటలకాలంలో ఆడబ్బు తెచ్చి ఇచ్చాడు.

'' ఈ ఐదొందలిస్తే మిగతా డబ్బు మాటేమిటిరా?'' నరసింహం అడిగాడు.

''మిగతా డబ్బేమిటి కాపా! ఇంకా వడ్డీయే కదా ఇవ్వాల్సింది!'' అన్నాడు యంగడు.

''వడ్డీ యేందిరా? అసలెప్పుడిచ్చావు?'' అంటూ ఆశ్చర్యంగా చూసాడు నరసింహం.

ఆ మాట వినటంతోనే కుప్పకూలి పోయాడు యంగడు. నోటి వెంట కొంతసేపు మాటకూడా రాలేదు. నరసింహం కాపు పొరపాటు పడ్డాడని అనుకోవటానికి వీల్లేదు. కావాలని నిలువునా అబద్ధమాడుతున్నాడు.

''నిరుడు పదిహేనొందలు తెచ్చిచ్చాను కదా కాపా! అప్పుడు నోట్లో జమ చేసుకోలేదు. మీ అబ్బాయిదగ్గిర నోటుందని చెప్పావు'' చివరకు ఎలాగో గొంతు పెగల్చుకుని అన్నాడు యంగడు.

''యేందిరో, నాచేత అబద్ధమాడిస్తున్నావు? ఎవరైనా వింటే నోట్లో వ్రాస్తారు నేనేదో నీడబ్బు తిని, నిన్ను మోసం చేసానని తెలియని వాళ్ళు అనుకుంటారు. అసలు నోటు మాపిల్లోడి దగ్గర ఎందుకుంటుందిరా? ఈ మోసాలు నాదగ్గరేం కుదరవు. మిగతా డబ్బు తొందరగా తెచ్చి కడితే నీకే వడ్డీ తగ్గిపోద్ది. ఇంకెళ్ళు!'' అంటూ చీత్కారించుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు నరసింహం.

యంగడు జరిగిన అన్యాయానికి కుమిలిపోతూ ఇంటిదారి పట్టాడు. ఊళ్ళో అందరికీ జరిగిన విషయం, నరసింహం చేసిన మోసం అంతా ఏడుస్తూ చెప్పుకున్నాడు. నరసింహం వ్యవహారం తెలియనిది ఎవరికి? అందరూ యంగడితో సానుభూతిగా మాట్లాడారు.

యంగడి పరిస్థితీ కుడితిలో పడ్డ ఎలుక మాదిరిగా తయారయ్యింది.

తను బరిగొడ్లు మేపటం మానుకున్నాడు. కౌలు డబ్బు అప్పు తీర్చటానికే సరిపోలేదు. కూతుళ్ళు యెక్కొచ్చి మూడేళ్ళకు పైనే అవుతోంది. వాళ్ళకి ఎలా పెళ్లి చేయాలో అర్థంకాలేదు.

మిగతా డబ్బుకి నరసింహం తొందర చేయసాగాడు యంగడు ఎక్కడినించి తెచ్చి కట్టగలడు ఆ డబ్బుని?

యంగడి పొలం అమ్మి డబ్బు కట్టమని నరసింహం వత్తిడి చేస్తున్నాడు. భూమిబేరం పెట్టక తప్పలేదు యంగడికి.

ఊళ్ళో ఎవరూ యంగడి పొలం కొనటానికి ముందుకి రాలేదు. ఎవర్నీ బేరానికి రానివ్వకుండా నరసింహమే అడ్డుకున్నాడు. పదిహేను వేలు విలువ చేసే భూమిని చివరకు ఐదువేలకే నరసింహం కొన్నాడు.

తన నోటుకి ఇవ్వాల్సిన అసలు పదిహేనొందలూ, దానికి వడ్డీ ఐదు వందలూ, మొత్తం రెండు వేలు పోగా యంగడి చేతికి మూడువేలు రొక్కం ఇచ్చాడు నరసింహం.

యంగడు ఆడబ్బుని ఏడుస్తూనే తీసుకున్నాడు

ఆ డబ్బుతో పెద్ద కూతురికి పెళ్లి కుదిర్చి పెళ్లి చేసాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే యంగడి రెండో కూతురు పల్లెలో ఒక యువకుని ఆకర్షణకి రహస్య లైంగిక సంబంధంలో పడి, గర్భం దాల్చి, సమాజంలో నిలబడలేకా, రాబోయే అవమానాల్ని తట్టుకోగలిగే శక్తిలేకా, తనకి పెళ్లయ్యే మార్గం కనుచూపు మేరలో లేకా నిరాశా నిస్పృహలతో ఆత్మహత్య చేసుకుంది.

భూమి పోయిన దుఃఖంలో వున్న యంగడ్ని కూతురి మరణం క్రుంగ దీసింది దెబ్బ మీద దెబ్బ.

ఒక దెబ్బ తిన్న యంగడు రెండో దెబ్బకి తట్టుకోలేక పోయాడు, రక్తపోటు హెచ్చింది.

''వోరేయ్... నరసిమ్మడా! మా నోటిదగ్గర భూమిని లాక్కుని మా బతుకుల్ని అన్నేయం చేసినందుకు నువ్వు పురుగులుపడి సత్తావురా! నా బిడ్డల వుసురు తగిలి నీ వంశం సర్వనాశనమై పోద్దిరా! మా శాపనార్థాలు వూరికే పోవురా?'' అంటూ తిట్ల వర్షానికి లంకించాడు యంగడు.

రెండు రోజులకే యంగడికి పక్షవాతంవచ్చి, మంచంలోపడి, కొద్దిరోజులకే మరణించాడు.

యంగడి భార్యని అల్లుడు దరిచేరనివ్వకపోగా - ఆమె అనాధై బిచ్చమెత్తుకొని జీవిస్తోంది.

# ఆర్తి

కాళీపట్నం రామారావు

ధనుర్మాసం, ఉదయం వేళ, మర్నాడే భోగి. నాలుగైదు పెద్దిళ్లు తప్పితే వూర్లో సున్నాల క్కూడా కరువైనట్టుంది. వూరికీ, మాలపేటకీ మధ్య పచ్చని వ్యవసాయాలుండేవి. ఈ యేడు ఎండిపోయిన గుమ్మడి పాదొక్కటి కనపడుతోంది. మాలపేటలో వాకిట రెండు చదరపు గజాల ఎండ వుంటే, అందులో కూర్చున్నాడు పైడయ్య. అతని చుట్టూ అన్న పిల్లలు కూర్చున్నారు. పెద్దన్న ముఖం కడిగి, సూర్నారాయణ మూర్తికి దండం పెట్టుకుంటున్నాడు. వాళ్ల కెదురుగా అల్లంత దూరంలో ఎర్రెమ్మ నించొని వుంది.

''అయితే అంతేనట్రయ్యా!'' అంది పైడయ్య నుద్దేశించి ఎర్రెమ్మ.

ఎర్రెమ్మకు నలభైయేళ్లుంటాయి. కాలం విసిరిన గాడ్పులకు ఆర్చుకుపోయి యాభయ్యేళ్లు పైబడ్డదానిలా వుంది. ఆమె అల్లుడి కేసి సూటిగా చూస్తోంది. అల్లుడు వంచిన తల ఎత్తడం లేదు.

''కాదు, నీకూ అదే బోదా - అయితే సెప్పు, నానెలి పోతాను'' అంది మళ్లీ.

గొంతు చేతనైనంత సున్నితంగా మార్చుకొని అన్నదామాట. ఎర్రెమ్మ అలా సాత్వికంగా మాటాడగా పైడయ్య వినలేదు!

పైడయ్యకు నిండా పాతికేళ్లుండవు. పట్నం వెళ్లేక కొంచెం పొడుగెదిగి నట్టున్నాడు. మనిషికి తేటొచ్చింది. కొత్త కట్‌బనీను తొడిగి, గీరల సిల్కులాగు వేసుకున్నాడు. చుట్టూ వున్న అన్న పిల్లలు దిస మొలలతో, బోడిగుళ్లతో, నల్లని మొహాలపై తెల్లని చారికలతో, కాకులక్కూడా ముద్దురాని కాకిపిల్లల్లా వున్నారు. అయినా, 'పొట్టలు బాగా పూడుతున్నాయి. వుండ్రముక్కల్లా వున్నారు' అనుకుంది ఎర్రెమ్మ.

పైడయ్య మాటాడలేదు. ఆర్చుకపోయిన ఆమె పాదాల వంకా, వంకర తిరిగిన బొటనవేళ్ల వేపూ చూస్తూ వుండిపోయేడు. ఆమె వెనగ్గా - వేరుశనగ దిబ్బలకవతల - చాకళ్లు రేవులకు తయారౌతున్నారు. ఆపైన వూళ్లో ఎవరి పనిమీద వారు హడావిడిగా వున్నారు.

''అయితే నానెల్దునా?'' అన్నది గొంతు పెంచి.

ఈసారి బంగారమ్మ వూరుకోలేదు. అరుగులు మెత్తుతున్నదన్నమాటే గాని, ఆమె చెవులన్నీ యిటే వున్నాయి. జఁయ్‌న లేచి వచ్చింది -

''ఎల్దునా ఎల్దునా అని ఎవర్నోలమ్మ, అంత బెదిరిస్తావ్! నిన్ను మాఁపు బొట్టూ

కాటికెట్టి పిలవొచ్చినావే? నాను పిలవొచ్చినానా, నా కొడుకు పిలవొచ్చినాడా? ఎవరు పిలవొచ్చినారని పారొచ్చినావు? ఆనాడేవని కూసినా! నానూ, నా కొడుకూ మున్మారు నీ యింటి సుట్టూ తిరిగి నీ కడియాల కాలకి మొక్కిందాకా నువు కానీ నీ కూతురు గాని, నా గుమ్మం తొక్కరన్నావా? మరిప్పుడు ఏ మొహఁ వెట్టుకుని పారొచ్చినావు? ముందు నువ్వొచ్చినావా, మాఁవొచ్చినావా? సిగ్గు బొగ్గులొదిలేసుకొని నువ్వే మా గడప లడుగెట్టినావు. అయినా వఁవాంయేంపన్నావూ? సరే, నీ పిలుపంయ్యింది యెల్లన్నాం. వొచ్చిందానివి వొచ్చినట్టెల్లాల. మీదు మిక్కిలి బెదిరిస్తావా? ఎవల్నోలమ్మ బెదిరిస్తావు?'' అంటూ మళ్లీ తన పనిలోకెళ్లిపోయింది బంగారమ్మ.

బంగారమ్మ అంతతో వదిలినందుకు సంతోషించాడు పైడయ్య.

ఎర్రెమ్మకూడా ఏ బుద్ధినుందో, అన్నిమాటలు కిమ్మనకుండా పడింది. కొంతసేప్పోయాక బంగారమ్మే అంది...

''అది నీ కూతురు - నీ రకతంలో రకతం! కాబట్టే నాసత్తనైనా నామాట తలాయించి నీ యెంట పారొచ్చింది. ఎంత అల్లుడైనా - ముందు నా కొడుకైనాగ్గదా - ఈడు నీ అల్లుడైనాడు. నీ కూతురికి నువ్వెంతో నా కొడుక్కి నేనంత కానా? చేతనైతే, తీసుకెల్లే నీ యల్లుణ్ణి - నానేం వొద్దన్ను!'' అంది ఎత్తిపొడుపుగా.

అది వూడిగం మాటగా తీసుకొని ఎర్రెమ్మ పైయెత్తు యెత్తింది.

''అయితే కొడుక్కి, నువ్వేనాడో ఎట్టేసినావు''

''అదే నా వుద్దేశవైన్నాడు నీ గుమ్మం తొక్కకనే పోదును''

ఎర్రెమ్మ మాట విసురుతో పాటు, చేయికూడా విసరడం చూసింది బంగారి. దాంతో ఆమె దడదడ చేయి కడిగేస్తోంది.

మళ్లా మొగుసుకుపోతారు కావాల - అనుకుంటుండగా -

''నువ్వొండొహె!'' అని తల్లిని గత్తురుకొని, పెద్దన్నదమ్ముడు అరుగుమీంచి లేచొచ్చేడు. ఎర్రెమ్మ దగ్గరికెళ్లి బతిమాలుతూ అన్నాడు.

''ఎర్రెమ్మప్పొ; నాన్నీ గడ్డ పట్టుకు బతిమాల్తాను - ఇప్పటికింటి కెలిపో. మావైనా నీ మాట తోసేనేదు. ఆడికిష్టవైతే ఆడొస్తాడన్నాం. సిన్నోడూ సిటికోడూ కాడుకాదా - మెడలోంచి వుంచడానికీ, కసిరో కన్నెర్ర చేసో తోల్డానికీ. ఆడంతటోడు ఆడు, ఆడికి తోసిందేదో తోసినట్టు చేస్తాడు. ఈ లోపున తెగిందాకా లాగితే, టుపీమని పోతాది. మా మాటిని నువ్వింటికెల్లు''

నారాయుడు నిజంగానే గెడ్డం పట్టుకున్నాడు - పుట్టి బుద్దెరిగాక ఇంతలా ఓడిపోలేదు ఎర్రెమ్మ. కోపం వచ్చి సర్రున మళ్లిపోయింది.

''ఓలె, వోలె బంగారి; ఓ లీపరాలో... .. యియ్యపరాల! నానీనాడు సెపతన్నాను. నువు కొడుక్కీ, కోడలికీ యిడబావు లెడతన్నావు. అలా యెట్టినావో, యీ జలమలోనే కాదు - యేడేడు జనమలకి నువు పురుగులడిపోతావు. వొచ్చీ జల్మంలో నిన్న కిందెట్టా మీదెట్టా - మంచానబడి కుళ్లుసావు సస్తావు.

నానీనాడా దేవుడు సాచ్చిగా - ఆ సూర్నారాయణమూర్తి సాచ్చిగా - సెపతన్నాను నువ్వు పురుగులు గారి పోతావు. నా మాటినుకో'' అంటూ పదిబార్ల కవతల - కొత్తవీధిలో తన యింటికేసి విసవిసపోయింది.

''ఓ లెల్లే పత్తిత్త! శాపనాలెట్టొచ్చేవు, శాపనాలు! నీ శాపనాలకీ, నా శాపనాలకీ పట్టే వుంటే, యీ బూమ్మీజ్జనం ఎప్పుడో బుగ్గయిపోదురు''

అంటూ వెక్కిరించింది. వెక్కిరించి, తన పని చూసుకోబోయింది బంగారమ్మ.

* * *

ఆవిటికి సంకురాత్రి ఆర్నెల్లినారు. ఆర్నెల్లున్నారు. ఆర్నెల్లున్నారు. ఆర్నెల్లకోపాలి నా కూతుర్ని తీసికెల్తాను. నువ్వెంత అత్తవైతే మాత్రం అడ్డడానికి హక్కెక్కడుంది అంటుంది ఎర్రెమ్మ.

ఆవిటి - అంటే రథోత్సవం. వాళ్లుండేది పూర్వపు గంజాం జిల్లాలో. అక్కడి మనుషుల్లాగే ఆచారాలు కూడా - ఒరియా తెలుగుల కలగలపుగా వుంటాయి.

ఊళ్లో ఊళ్లోనే కదా - పండక్కో పున్నానికో ఎన్ని సుట్లు కావలిస్తే అన్ని సుట్లు తీసుకెల్లు, నానడ్డనూ - ముచ్చటగా మూడు రోజులుంచుకు పంపి - అంటుంది బంగారి.

శా... అదేంవమాట. ఆర్నెల్లుకోసారి ఆడపిల్లను తెచ్చుకోవడం లోక రివాజు. అదీ ఆవిటికీ, సంకురాత్రికీ తీసికెల్తారు. వున్న వూరైతే వొక రివాజూ... పొరుగూరైతే ఒక రివాజూనా - రివాజులు మారడానికి వొల్లకాదంటుంది ఎర్రెమ్మ.

నీకు రివాజులే కావలసిన్నాడు పండుగ రేపనగా వొచ్చి తీసుకెళ్లు. పండుగెళ్లేక నెల్లాళ్లు కావోతే రెణ్ణెల్లుంచుకో నానడ్డను - అంటుంది బంగారి.

నానెప్పుడు తీసుకెళ్లాలో సెప్పడానికి నువ్వెవత్తివి? ఎనక యీలైతే ఎనకుంచుకుంటాను. ముందు యీలైతే ముందు తెచ్చుకుంటాను. తెచ్చుకునే దాన్ని నా యిష్టం గాని, ఫలానా అప్పుడే తీసుకెల్లనడాన్కి నీకు రూల్సు లేవు. పొమ్మంటుంది - ఎర్రెమ్మ.

వినేవాళ్లు కూడా పంపడానికి ఒప్పుకున్నాక, ముందైతేనే వెనకైతేనేం అంటారు. ఆ తేడా యేవిటో బయటికి చెప్పుకోలేదు బంగారి. చెప్పుకోలేకే -

దాని మట్టుకది పురిటికెలిపోయి, దీని మట్టుకిది పుట్టింటికెల్లి కూకుంటే, ముందు కోడలు మునుపే సారగానికెల్లి కూకుందిగదా - ముసిల్దాన్ని ఈ గంపెడు సంసారం నా నొకత్తే నెత్తుతానా! అంటుంది.

నా కూతుర్ని దీని కొడుకుతో మనఁడాని కంపినావా దీనింటి శాకిరీ కిచ్చినానా? అని ఎదురడుగుతుంది ఎర్రెమ్మ.

పైడయ్య ఎక్కడో పట్నంలో కలాసీగా వుండిపోవడం; ఎర్రెమ్మ వాదానికి మంచి పట్టిచ్చింది. అతడింటి దగ్గరే వుంటే, దాని మొగుడు దాన్నొగ్గి వుండనేడు - నానేం సేతుమా? అనేది బంగారి.

పండుగ నెల్లాళ్లుందనగా పిలవడానికొస్తే పెద్ద కయ్యం పెట్టేసింది

పంపనని ఈమె - ఎలాగ పంపవో చూస్తానని ఆమె - చాతనైతే తీసుకెల్లని ఈమె - రాయే అమ్మి అని ఆమె అటులాగా, యిటులాగా - వూరూ వాడా మూగిపోయేరు.

పాపం సన్నెమ్మ సిగ్గుతో చచ్చిపోయింది. కొంతసేపు అటూ ఇటూ నలిగేక ఆమె మొర్రోమంటే ఇద్దరూ విడిచి పెట్టేసేరు. ఆ తరువాత వీరకత్తెలిద్దరూ జుట్లు జుట్లూ పట్టుకొని, రక్కుకొని, కొరుక్కొని, రాళ్లతో యుద్ధాలాడి, వాడవాడంతా పోగి విడిపించేక విడ్డారు. అనువుకాని చోట కయ్యం పెట్టుకుందేమో, ఎర్రెమ్మకు కొంచెం ఎక్కువ దెబ్బలే తగిలేయి. రక్తాలు కారుతున్న తల్లి - చుట్టూ మూగి మొర్రోమని పిల్లలు - చూళ్లేక సన్ని కూడా వాళ్లతో వెళ్లింది.

''ఇదిగో, యిప్పుడు దానెంట యెల్లినావో, మరీ గడపల అడుగెట్టవ్'' తెగేసి సెప్పింది అత్త.

తన భుజంమీద భారం మోపి నడుస్తున్నది కన్నతల్లి. తన కొంగు పట్టుకొని చుట్టూ నడుస్తున్నవాళ్లు చిన్న చెల్లెళ్లు. వాళ్ల గుప్పిళ్లు విడిపించుకొని తల్లిని పక్కకు నెట్టలేక, భగవంతు డేంచేస్తే అదే చేస్తాడు లెమ్మని వాళ్లతో వెళ్లిపోయింది సన్నెమ్మ.

* * *

ఆ సాయంత్రం తమ్మిమెల్చెరువు కళింగడా గట్టున ఆడపిల్లలు ముగ్గురు గరికేళ్లు తవ్వుతున్నారు. అందులో ఒకతె ఈ మధ్యనే పైట లేసుకుంటోంది. అక్కడికి రావడం అదే మొదటిసారిలా వుంది. చుట్టూ మహాసముద్రంలా వున్న నిశ్శబ్దంతో వూపిరాడుతున్నట్టు లేదు

''అవునే సన్నెమ్మా! ఇక్కడ్నుంచి కేకేస్తే వూరి కందుద్దా?'' అంది తవ్వడం ఆపి నీలి.

''ఓల్నిన్నెవురు ఎత్తుకుపోరు నేయే''

- యీసడించింది అంకెమ్మ.

''నన్నెవలెత్తుకుపోతారు. ఎత్తుకుపోతే నిన్నెత్తుకు పోవాల - నేకపోతే నీ నేస్తురాల్నెత్తుకుపోవాల. వయసులో పిటపిట లాడుతున్నారా - సక్కఁగ అవురుతారు''

సన్నెమ్మ పకపక నవ్వింది.

''ఇదే టోలమ్మ పోకిరీ గుంట!'' అంటూ అంకి చీదరించుకుంది.

''ఊరు వూరల్లా వొగ్గీసి మీరీ మారుమూల కేలొస్తారో నాకు తెల్దేటి?'' అంది నీలి.

అని -

''ఇక్కడికి కొత్తపేట దగ్గిరకదా! పొద్దోయి జేసి నీ మొగుడో పాలి నిన్ను సూడ్డానికొస్తాడు. అందు!'' అంది ముఖం పిట్టలా ముందుకు పొడుస్తూ.

అంకెమ్మా, సన్నీ పక్కలు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు. కొంతసేపు పోయేక, నీలి మళ్లా అడిగింది.

''నిబ్బగ సెప్పే సన్నెమ్మా! ఇక్కణ్ణుండి కేకేస్తే వూర్లో కందుతాదా?''

''ఏసి సూడే''

''అందక పోతేనో?''

''ఏస్సూడన్నానా''

నీలి నిజంగానే నిలబడి వూరుకేసిచూసింది. కనుచూపుమెక్కడా మనిషి కనబడ్డం లేదు.

''ఎవర్ని కేకేతునూ!'' అంది నీలి.

''దాలిగోణ్ని కేకేయ్''

నీలి, సన్నివమాట విననట్టు నటించింది. దాలిగాడంటే నీలి మొగుడు. నీలిని తొమ్మిదోయేట ఆ వూళ్లోనే యిచ్చేరు.

నీలి గొంతెత్తి...

''ఓ... రి పైడయ్ మావో...!'' అంది గట్టిగా. అంకెమ్మ కిచకిచ నవ్వింది. సన్ని ముసి ముసి నవ్వుతూ -

''సాల్దు. ఇంకా గట్టిగా అరు'' అంది.

ఈసారి దమ్మంతా కూడగట్టి కేకేసింది నీలి -

''ఓ...రి పైడయ్ మావో...?''

''ఓ...య్'' అంది సన్ని - మామిడి తోపులో పిట్టలా.

'' లెక్కిరించనక్కన్నేదు నేయే! నిబ్బగే వస్తన్నాడూ'' అంటూ దబాయించింది నీలి. తరువాత, చస్సన కూచుండిపోయింది.

''ఓలమ్మ నిబ్బగే వొచ్చేసినాడే!'' అంది గాభరా పడిపోతూ.

నీలి వరస చూడబోతే పరాసిక వాడుతున్నట్టు లేదు

''నిజివే నేటే?'' అంది అంకెమ్మ.

''వొట్టోలమ్మ! కావలిస్తే నువ్ సూడు. తుమ్మల్తోవు దాటి గట్టెక్కుతుంటే, యెవురో అనుకున్నాను. గీర్ల కామీజా గూడకట్టూ. ఆ డీదునోకి బయలెల్తుంటే నాన్సూసినాను కానా? ఆడే!'' అంది నీలి.

అంకెమ్మ యథాలాపంగా లేచినట్లు లేచి, పైడయ్య కనిపించగానే కూర్చుండి పోయింది.

''నిబ్బగేనే!'' అంది సన్నితో.

సన్నెమ్మ తొణకలేదు బెణకలేదు.

''వస్తే రానియ్యే!'' అంది నింపాదిగా.

అంది గాని, ఆమె గుండె దడదడమంటోంది.

నిముషంలో తక్కిన ఇద్దరు కూడ పెద్ద తరహా కొచ్చేసేరు. కొంచెంసేపు ఆలోచించి -

''నువ్వుండు మావొస్తాం'' అంటూ అంకెమ్మ గంప తీసుకు నిలబడింది నీలి కూడా గరికేళ్లు దడదడ యెత్తేస్తోంది.

''మీరెల్లద్దు''

సన్నెమ్మ గొంతులో కచ్చ వినిపించగా, అంకెమ్మ కోపం తెచ్చుకుంది...

''బాగుందోలమ్మ. మతోయిందే .. ఆలమ్మా మీయమ్మా తగువాడితే మద్దె ఆడేం జేసినాడు! వంటిమీద కేయుంచుకోయే'' అంటూ మందలించింది.

మందలించి, నీలితోపాటు తాటిపెండెల్లోకి వొసిలిపోయింది.

సన్నెమ్మ ఎప్పట్లానే గరికేళ్లు తవ్వుతోంది.

ఎదురుగా ఆగిన రెండు నల్లటి పాదాలను చూసేవరకు సన్నెమ్మకు గుండె గొంతులో కొట్టాడినట్టయింది. వణుకు పుచ్చుకుంటున్న చేతుల్ని వశంలోకి తెచ్చుకొంటూ, తత్తరపాటు కప్పిపుస్తోంది. కొంచెంసేపు చూసి -

''తీర్కైనాదా?'' అంది కళ్లయినా ఎత్తకుండా.

''దూరామారం కావడాన కొందరికి తీరికుండదు సరే. కొందరికి ఎదరకొచ్చిన మనిషిని పలకరించడానికేనా తీరిక్కాదు; ఏటంటా?'' అంటూ బట్టలు మట్టికాకుండా, గడ్డి కలచోటున చతికిలపడ్డాడు పైడయ్య.

పని ఆపకండానే ఒక్కసారి కళ్లెత్తి దించేసుకుంది సన్నెమ్మ

''నోరు మరి పెగల్దు'' అన్నాడు పైడయ్య.

అయినా, సన్నెమ్మ నోరు పెగల్లేదు.

రంగురంగుల గీరల సిల్కు కమీజు తొడిగి, ఇస్త్రీ మడత లుంగీ కట్టేడు పైడయ్య.

సన్నెమ్మ కట్టుకున్న రంగుకోక తెగవూసి, అలుక్కుపోయింది. ఆ వేళే పులిమి కట్టుకున్నా, ఎన్నాళ్లనుండో మాసినట్టుంది. ఆమె కుడిచేతికి ఒక రబ్బరగాజు, ఎడం చేతికి పూలుదారం వున్నాయి. అత్తింటే వుంటే, ఆ వేళప్పుడు అలా వుండే పరిస్థితి కాదు.

''నానంత దూరం నుంచి వొచ్చినాను కదా. నీనోట ఒక్క మాటంటే ముత్తేలు రాలిపోతాయా?'' అన్నాడు పైడయ్య.

కట్టేందికి కోకల్లేకపోయినా, పెట్టుకోడానికి నగల్లేకపోయినా అందంగా ఉండగల్దు సన్నెమ్మ. ఎంత పనున్నా, యింట్లో వంట్లో బాగులేకపోయినా తలా, ఒళ్లూ మాయనీయదు. ఆ సాయంకాలం నీరెండలో ఆరోగ్యంతో మెరసే ఆమె తేనెరంగు శరీరంమీద తను తెచ్చిన ఎర్రంచు పసుపుకోకా, పచ్చరంగు పట్టుగాజులు ఎలా ఉంటాయో చూస్తున్నాడు పైడయ్య.

''ఎన్నాల్లుంటా?'' అంది సన్ని. తవ్విన మేరకి గరికేళ్ల మట్టి దులుపుతోంది.

''నీ దయుంటే, యియాల్తో కలుపుకుని నాల్రోజులు. లేపోతే రేపే ఎత్తేస్తానెండా.

'దయ' అన్నమాట కులుక్కున తగుల్తుందనుకున్నాడు. కాని సన్ని నోట నిష్టూరాలేపీ రాలేదు.

'అసలేటి జరిగిందీ?'' అన్నాడు పైడయ్య.

''ఏటి జరిగిందంటే, యేటని సెపుతాను!'' అంది సన్ని. ఆమె యింకా తలెత్తి చూడ్డం లేదు. కానీ ముఖం వెనకటి కన్నా పైకి లేచింది గొంతులో ముందులేని వెచ్చదనం ఉంది.

''నీకు వుత్తరాలు అందనేలేదా?''

''తగువెలాగయ్యిందో సెపతారుగానీ, ఎందుకొచ్చిందో సెప్పరు గదా!''

- పైడయ్య బెల్లిస్తూ అన్నాడు. ఉరకలు పరుగులుగా తోసుకొచ్చే యెన్నో విషయాలు సెప్పేటట్టు కనిపించింది సన్ని. అంతలో మనసు మార్చుకొని గడ్డి తవ్వడం సాగించింది.

''ఎందుకొచ్చిందంటే నాకు తెల్దు. ఒకేల తెలిసినా నాన్సెప్పడం సబబు కాదు''

''ఉన్నమాట సెపితే సబవెందుక్కాదు!''

''ఒక్కాసి కనుక్కున్న తల్లి. ఇంకో కాసి కడుపులో ఎట్టుకోవలసిన అత్త. ఇద్దర్లో నానెవరి కాసి మొగ్గినట్టున్నా తప్పే''

పైడయ్య యింకేవీ అనలేకపోయేడు. కొంతసేపు పోయాక -

''సరే, నువ్వంత అంటీ ముట్టనట్టు మాటాడితే నానేం సెప్పలేను''

''జరిగింది జరిగిపోనాదనడానికీ - యియ్యేల మీల్ల కయ్యవాయ్యింది. నా పని ముందెల్తే గొయ్యా, యనకెల్తే నుయ్యా లాగుంది. ఇప్పుడు నన్నెలాగ నడవమన్నానో అదేనా సెప్పు'' అన్నాడు పైడయ్య.

ఎంచేతో, దీనికి తప్పక జవాబు చెబుతుందనుకున్నాడు. కాని దీనికి జవాబు లేదు. ఈసారి కోపం తెచ్చుకుంటూ అన్నాడు -

''అదీ సెప్పనంటే యిందులో నీక్కూడా మీయమ్మ మీదానామీదా కోపం ఉందనుకోవాల''

సన్నెమ్మ కళ్లలో నీళ్లు సుళ్లు తిరిగేయి. ఆమె తవ్వడం ఆపి గరికెళ్లు గంప కెత్తుతోంది. చివర పరకలు కూడా గంపకెత్తేక, బొంగురుపోతున్న గొంతుతో అంది.

''నీకెలా నడవాలంటే అలా నడుస్తావు. ఇలాటివి - ఆడమనిసిని - నాన్సెప్పరాదు. నాన్సెప్పినా -ఆ సెప్పినట్టు నువ్ నడవారాదు'' అంటూ గంప చేతపట్టుకు నిల్చుండి పోయింది.

పైడయ్య కా మాటలూ, అంతకన్నా ఆమె లేచిపోవడం చాలా కష్టాన్ని కలిగించేయి వచ్చిందగ్గర్నుండీ చూస్తున్నాడు. అన్నా, తల్లీ, ఆఖరికి పెళ్లాం కూడా పెట్టిన్తగువు పెట్టేసి, నీ యేడుపేదో నువ్వే యేడు అంటున్నారు. తాను సెయ్యని తప్పకి తనకే శిక్ష దారినపోయే వాడైనా కష్టంలో దయ చూపిస్తాడు. సొంత మనుషుల అనిమానాలు ఇంతల వున్నాయి. అతడు చప్న లేచిపోతూ అన్నాడు -

''సరే నా(నే)పొద్దున్నే బయలెల్లి పోతన్నాను - మల్లా ఈ వూరు మట్టీ తొక్కితే, మీరంతా నా పాగ సూసినట్టే'' అని అక్కణ్ణుండి కదిలిపోయేడు.

కన్నీళ్లతో సన్ని అక్కడే నిల్చుండిపోయింది

విసవిస అడుగులు వేస్తుంటే, పైడయ్య కాళ్లు దడదడ తేలిపోతున్నాయి. అక్కడికి వచ్చే ముందు కూడా అతని గుండె ఈవిధంగానే గబగబ కొట్టుకుపోయింది ఏఁవడుగుదావని వచ్చేడు? ఏఁవని వెళ్లిపోతున్నాడు!

చేస్తున్నది తప్పు, తప్పు, తప్పనిపించగా చప్పున వెనక్కి మళ్లి సన్నికి దగ్గిరగా వెళ్లేడు. వెళ్లేక తాడి పెండెల మధ్యలో అంకెమ్మా, నీలి తమకేసి చూస్తూ కనిపించారు

కళ్లనీళ్ల పర్యంతమౌతూ అన్నాడు.

''మాపిటికి తవిటప్ప గారింటికి ఓపాలి రావా?''

పైడయ్య గొంతు అతి దీనంగా వుంది. అది విన్నాక కాదనడమెలాగో తెలియలేదు సన్నెమ్మకు. అయినా తప్పలేదు.

''నువ్వే మా యింటికిరా'' అంది వంచుకున్న తలతో - రెండో పక్కకి తిరిగిపోతూ.

పైడయ్య యిహ ఆగలేదు. తిర్గైనా చూడకుండా వెళ్లిపోతున్నాడు. మూణ్ణెల్ల కోసారొచ్చి మూడు రోజులుండి వెళ్లిపోతాడు. ఈ వరసని మూడేళ్లయి అతడక్కడా, ఆమె యిక్కడా వున్నారు. సావాసికత్తెలు సమీపించేసరికి, ఆమె కళ్లు తుడుచుకుంటూ అక్కడే కూర్చుండిపోయింది.

* * *

దీపాల వేళకు యింటికొచ్చింది సన్ని. బుట్టెకు సగానికైనా లేని గరికేళ్లు చూసి -

''ఔనే ఓలమ్మి. ఆ యేలనగా యెల్లి పొద్దుకూకులా పడ్డ పాటిదేనే?'' అంటూ సతాయించింది ఎర్రెమ్మ.

మంజారులో బొరిగ దాచడానికి వెళ్లిన సన్నెమ్మ, ఒక్కసారి ఆవేశంతో వూగిపోయింది.

నాను నీ పంచను బాడిసరికానికి రాలేదు. నిన్నూ, నీ పిల్లల్నీ సాపాటెట్టి మేపాలనీ రానేదు. నువు పిలిస్తే సుట్టరికాని కొచ్చినాను. నీ కృష్టంగుంటే సెప్పు - ఇప్పుడెల్లిపోతాను.

- అంటూ దులిపే దామనుకుంది ఆమె వంతు పొరుగంటి పెద్దమ్మ ఆ పని ఆరంభించింది.

''ఓ లూరుకయె ముదినంజ! వూళ్లో అల్లున్నెట్టుకొని, పిల్లను పాటుకు పంపిందాన్ని నిన్నే సూసినాను. ఏఁవేనంటె నోరుండని నీ దిలాసా. దాని మనసు కష్టవేటో, దాని కడుపులో బాదేటో అని కసింతైనా ఆలోసించవు. ఓ పూట నాలుగ్గడ్డి పరకలు తక్కువైనాయని దెప్పొచ్చినావు'' అని కసిరింది.

నరసమ్మ యే వరసను చూసినా ఎర్రెమ్మ కన్నా పెద్దది. ఆమె కొక్కదానికే ఎదురు చెప్పదు ఎర్రెమ్మ.

''నా నేటన్నానోలమ్మ! పరకలు తక్కువైతే, వొళ్ళే నొచ్చిందో, కాలే నొచ్చిందో - యేవే పరకలు తక్కువయ్యే యన్నాను. నా రాత తిన్నగానేక, నా మాట తిన్నగ రాదు. అంతేగాని

నానిప్పుడేం తప్పు మాటన్నేదు'' అంటూ యింట్లోకెళ్లిపోయింది

ఆమె వెళ్లాక నరసమ్మ సన్నిని పిల్చింది దగ్గిరకి రానిచ్చి -

''జానే నీ మొగుడిటుకాసి వొచ్చినాడన్నారు - కనపడ్డాడా?'' అంది గొంతు తగ్గించి.

మనిషికన్నా ముందు, మనిషి కబురే పేటలోకి రావడం కొత్త కాదు. అంచేత సన్మెమ్మ ఆశ్చర్యపోలేదు.

''ఆనకొచ్చి సెపతాను -'' అంటూ ఇంట్లో కెళిపోయింది

ఆనకా రాక, ఆ తరవాతా రాకపోతే, జాఁవు రాత్తిరికి - నరసమ్మే సన్ని దగ్గిర కెళ్లింది.

ఆపూట, రోజులా సన్మెమ్మ వంటకు చేరుకోలేదు. దీపాలు పెట్టేక దినవెచ్చాలకూ్కాఁడ తల్లే వెళ్లింది సందెవేళ దాటనిచ్చి ఇంట్లో గోనె గుడ్డ పరుచుకు పడుకుంది సన్ని.

దరిమిలా లేచిన మాలపేటలో, ఆ యిల్లు ఉత్తరపు వాసలో వుంది. మూడేసి యిళ్ల వాసలు రెండు చేరి, కొత్త వీధయ్యింది. కొత్తవీధికీ, పేటకీ మధ్య ఒక పొగపాడుంది వాటికీ, వూరికీ మధ్య నారుమళ్లూ, కూరమళ్లూ ఉన్నాయి.

భూవికి మూరడెత్తున ఉండే వీధి మంజూరు కింద, ఎ(రెమ్మ వంట చేస్తోంది. పొయ్యికీ - ఓ చిన్న పిట్టగోడ చాటు.

సన్నెమ్మ పడుకున్న ఆ చిన్నగదికి, వీదివేసే గాని పెరటివేపు గుమ్మం లేదు. రాత్రుళ్లు సన్నీ, ఆమె ఆరుగురు చెల్లెళ్లూ అందులోనే పడుకుంటారు. ఎ(రెమ్మ వంట పొయ్యి దగ్గర కొంచెం చోటు చేసుకుని పడుకుంటుంది. మిగిలిన పంచ - ఉబ్బస రోగి మంచానికి సరిగ్గా సరిపోతుంది. ఆమె పెనిమిటి తెల్లార్లూ ఉబ్బసంతో జాపోస్తూ ఉంటాడు. ఎ(రెమ్మ పక్కనుండి తిడుతూ, ఓదారుస్తుంటే అతడికి పొద్దు పోతుంది.

జాఁవు రాత్రికి వంట చేసి, పిల్లలకూ, మొగుడికీ తినబెట్టింది ఎ(రెమ్మ. సన్నిని లేపితే - అక్కల్లేదంది. ఎక్కడి చట్టి అక్కడే వుట్టి కెక్కింది. తలుపు చేరేసుకు వెళ్లిపోయింది ఎ(రెమ్మ. ఆ తరవాత కొంతసేపటికి నరసమ్మ వచ్చింది.

''నా మాటిని నెగిసి మా యింటికి రా!'' అంది నరసమ్మ రెక్కట్టుకు లేవదీస్తూ.

అంతవరకూ నిద్రపోని చెల్లెలూ, తండ్రీ ఈ వింత చూస్తున్నారు. సన్ని యిహ లాభం లేదనుకుంది.

నరసమ్మ సన్నిని తన ఇంట్లోకి లాక్కెళ్తుంటే, ఎ(రెమ్మ ఆ యింట్లోంచి బయటికి వస్తోంది. లోపల నిద్రపోతున్న ఇద్దరు పిల్లలు తప్ప, మొగవాళ్ళెవరూ లేరు.

పొయిలో కుట్టుతీసి, కడవ సరిగా అవిర్చేక, వీధి గూట్లో దీపం తెచ్చి, గదిలో పెట్టింది నరసమ్మ. పక్కన కూర్చుంటూ -

''నీకు నీ తల్లి ఎలాటిదో, నానూ అలాటిదాన్నే. నాను సెప్పే మాట సక్కగినుకో కాపరాలు అగ్గయినా, బుగ్గెయినా, యిలాటి సందినీ మందినీ అవుతాయి. నామాటవిని, ఆడు సెప్పినట్టు నడు'' అంది ముందుగా.

''తన బతుకు యింత బజారు పాలయ్యిందా'' అని, సన్నెమ్మకు పట్టరాని దుఃఖం

వచ్చింది మొహాన చెంగేసుకుని ఏడుస్తోంది

పక్క చూరులోంచి యేడుపు విని, ఎర్రెమ్మ బయటికొచ్చింది. ఆ యింట్లోకి వెళ్ళడానికి తెగించలేకపోయింది.

''ఇప్పుడు నీకొచన గండకత్తె రేటుందే? ఏడుపు దేనికంట?'' అంటూ నిలేస్తోంది నరసమ్మ.

''నా బతుకిలా బజారు పాలైనాది సరే, ఆడు ఏకాడికి దిగజారినాడో సూడు. అడ్డవైనోళ్ళు దూరే గుడిసెలోకి నన్నూ రమ్మన్నాడు'' అంది సన్ని.

''- కదా! ఆడంత వొల్లూపయి కానకండ ఉన్నాడు కాబట్టే, నువ్వు నీ జాగర్త మీదుండాల. ఇలాటప్పుడ నువ్వాసడ్డ సేస్తే, ఆణ్ణెవర్తో ఒకర్తి తన్నుకుపోడం ఖాయం. అందుకే, ఆడు సెప్పినట్టు నడవమంటన్నాను''

సన్నెమ్మకీ మాటలు కొత్త దుఃఖాన్ని కలిగించేయి -

''ఏలా? - ఆడే మాయక్కడికి రారాదా?'' అంది పొర్లుకొచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

అయితే అది అర్థంలేని మాటని సన్నికీ తెలుసు.

''ఎలాగొస్తాడే? మానూనాడే ఆడు మీయక్కడ తొంగుంది కుండనేదు. మీ యింటికి ఓ యిమ్మా, తెమ్మా? ఆ మాటకొస్తే, పందుల గుడిసే మెరుగు!'' అంది నరసమ్మ.

కటువుగా వున్నా, నరసమ్మ మాటల్లో నిజం ఉంది. తొడుక్కోడానికి చింకి గుడ్డలేనా లేని పిల్లలు - ఈలికలు వాలికలైన కోకముక్కలు కప్పుకొని, యెముకలు కొరికే చలిలో ఆరుబయట పడుకోలేరు. ఒకళ్లమీదొకళ్లు పడి పెద్దప్ప చుట్టూనో, తల్లి చుట్టో, ఆ గదిలోనో పడుకోవాలి. అంచేత పగలల్లా అత్తవారింట గడిపినా, రాత్రికి తమ ఇంటికి తీసుకుపోతాడు పైడయ్య సన్నిని.

''పోనీ! మా అక్కడ తొంగుంటారంటే - ఆ మద్దిన మీ గురించే యేదో అన్నానని మీ యత్తకి గుర్రుగుంది. ఇత్తెలిస్తే యింక నానూ అదీ జుట్లట్టుకోవాల''

సన్నికి యేదారీ కనిపించకపోగా, ముడుకుల్లో మొహం పెట్టుకు కూర్చుంది. కొంతసేపు పోయేక నరసమ్మే అంది.

''అందుకని, లేనిపోని ఆలోసెన్లు యెట్టుకోక, ఆడు సెప్పినట్లు సెయ్యి. ఉడుకు నీళ్లెట్టినాను. యెచ్చగోసుకో. ఒక్క సిటం వోరిస్తే, కొప్పూ గిప్పూ దువ్వేస్తాను. ఆడక్కడికి వస్తే, కబురు తెమ్మని మా కన్నిగాణ్ణి కాపలా యెట్టినాను! అడొచ్చీలోగా తయారైపో. వొచ్చాక, ఆణ్ణి తోడు తీసుకెళ్లు. తిరొగొచ్చీటప్పుడు నీ మొగుణ్ణి తోడు తెచ్చుకో''

సన్నెమ్మకు కొంచెంసేపు అంతా సరిగానే ఉందనిపించింది. కాని యీ కబురు దాగదని తట్టగనే ఆమె గుండె మళ్లా చెరువైపోయింది. దాంతో -

''నానక్కడ కెలాగెల్దునూ?... యెల్లలేనో యెల్లలేను . !'' అని తల అడ్డంగా వూపుతూ, ఏడవసాగింది.

ఎన్నివిధాల చెప్పినా సన్నెమ్మ నచ్చుకోకపోవడంతో, నరసమ్మ విసిగిపోయింది.

''అయితే కాపరంలో సీళ్లోసుకుంటావేటే?'' అంది కసురుకుంటూ సన్నెమ్మ తలెత్తలేదు.

''నీ మనసులో వుద్దేశవేటో సెప్పు. ఇయ్యేల కాకపోతే రేపూ, రేపు కాప్పోతే యెల్లుండేనా ఆడు నీ పాదాల కాడికి రాడా, అని నీకుంది. మీ యత్త యేటంటుందో యిను?'' అంటూ ''ఔనే ఎర్రెమ్మ! యిలాగ రమ్మీ!'' అని కేకేసింది

ఎర్రెమ్మ వచ్చేక ''కూకోయే'' అని కసిరితే, కూచుంది.

''దుక్కోళ్ల కోడ లేటందే!'' అంది నరసమ్మ.

''నువ్వే సెప్పు'' అంటూ మొహం ప్రక్కకి తిప్పేసింది ఎర్రి.

''మీ యత్త, నిన్ను యింటికి రానీడాన్కి రెండుకండీసన్లెట్టిందట. రెండేళ్లో, మూడేళ్లో - తన మనసుకు నచ్చి, తను అవునన్నదాకా - నువ్వు మీ పుట్టింటి గడప తొక్కనని మాటివ్వాల. అప్పుడయినా మీ యమ్మొచ్చి తనవోల్ల పొరపాటయ్యిందని లెంపలేసుకోవాల.

ఆ రెండూ కాన్నాడు - తన బొందిలో జీవుడుండగా నీతో ఒక్క సూరుకింద నిలవనన్నాది. మీ యత్తదెంత కిర్రపట్టో నీ కెరికే కదా! నీ పెనివిటయితేం, నీ బావలయితేం దానిమాట కెదురు పడలేరు. ఇప్పుడు సెప్పు. కాపురం నిలబెట్టుకోడానికి మీ యత్త కాలుకింద దూరుంతావా... ఆడు సెప్పినట్టు నడుసుకుని దాన్ని నిలబెట్టుకుంటావా?'' అంది నరసమ్మ.

''ఆడు సెప్పినట్టు నడుసుకుంటే మాత్రం - అత్త మనో మారతాదేటి?'' అంది సన్ని. ఆమె పలుకులో రోషం వుంది.

''ఏవో యెటుబోయి యెటొచ్చునో? ఆలుమొగులేకమయిన్నాడు అత్తకాదు గదా, దాన్ని పుట్టించిన జేజెమ్మకయినా ఆ కాపరాన్ని ఇడదీయలేదు. లేన్నాడేటుంది! యేముండేనా యిడమావు లెట్టీగల్దు''

నరసమ్మ మాటల్లో తాత్పర్యం తెలిసేసరికి సన్నికి ఒళ్లు మండింది.

''అదే మీ ఉద్దేశవైతే వాసన లెల్లనం. నాకు నాయంవమ్మా, బాబు, నా తోడ బుట్టువులెంతో; ఆ వంక మనుసులు ఆడికీ అంతే. వొళ్లెరపెట్టి ఆణ్ణి తెచ్చుకోడవైతే నా సేతకాదు''

సన్ని మాట పూర్తికాలేదు. అంతలోనే -

''సెప్పనేదా? నాన్సెప్పనేదప్ప?'' అంటూ ఉప్పెనలా లేచిపోయింది ఎర్రెమ్మ. ''అదీ దానత్తా, దాని మొగుడూ, దాని అయినోళ్లు కానోళ్లు - ఆళ్లంతా ఒక్కటే. నానొక్కదాన్నే పైదానిని. నా కూతురేదో నాలో కలిసిపోయి దాని పడుపూ, తుడుపూ అంతా నాకే యెట్టేస్తోందని లోకనిందే! నిందొక్కటే నాకు దక్కినాది.

అడుగు. ఎప్పుడైనా దాని కూల్లోగాని, నాల్లోగాని ఒక్క పైస ఒక్క పైస్సుమీ - నాగ్గానీ, నా పిల్లలగ్గాని ఎట్టిందేంవో - అడుగు. అడుగు ఎదురుగా అద్దవుంది మొహవుంది - దాన్నే అడుగు.

ఎంతసేపూ, ఆ ముదనష్టపోణ్ణి మేపుద్ది - పందిని మేపినట్టు! ఒద్దే ఆడు సచ్చినా బతికున్నా ఒకటేనే! అంటే యినదు. ఆడికి పోస్తాది -సీసాలకి సీసాలు సారాలు. ఏవేనంటే, శీతగాలి ఆడు కిరకిర మట్టుకుపోతుంటే నాను సూళ్లేనంటాది. ఆడియాల సస్తే రేపటికి రెండు. బతికేం బావుకోవాల? ఆడుబతికుంటే, ఆడికి శ(వ; యింటి యింటిల్లిపాదికి శ(వ; అలాటి సానోటి పోడికోసం బయలెల్లి, తగు వీకాడికి తెచ్చింది.

ఒద్దమ్మ! మీ యత్త, కింకపట్టు పడుతోంది - నాను సిల్నన్నాను. కాదు పిలుపుకిరా అంది

ఒద్దమ్మ! యీాయేడు పండలు పోనాయి - కోతలా, యేతనా అన్నాను. కాదు రా! అంది.

యెల్లినాను. యెల్లినందుకి యేకీలుకాకీలు యిరిపించుకొని,నా(ల్రోజులు మంచమెక్కినాను.

నువ్వొచ్చి సేసిన వుద్దరింపేటి? - నీకు పండుక్కి ఒక కోక్కయినా కూల్డబ్బులు మిగల్చనేదు. ఇదీ - నువ్ సేసిన వుద్దరింపు! ఇప్పుడు దీని కోసం నేనెల్లి దాని కాలుకింద దూరాల. లేకపోతే, కాపురం గంగలో కలుస్తాది. లోకమంత నా నోట్లో వూస్తారు. ఇదంతా నానెపుడో సేసుకున్న కరమ - పూరవ జల్మంలో నాన్చేసిన పున్నెం!''

- అంటూ గట్టిగా నెత్తిన రెండు మొత్తులు మొత్తుకొని అక్కణ్నుంచి వెళ్లిపోయింది ఎఱ్ఱెమ్మ.

గొప్పవాళ్లలో - గొప్పవాళ్లూ, చాలా గొప్పవాళ్లూ, అతి గొప్పవాళ్లూ వున్నట్టే; పేదవాళ్లల్లో పేదలు, కడుపేదలూ, నిరుపేదలూ వుంటారు. అందులో - ఎఱ్ఱెమ్మ కడు పేదది.

ఎఱ్ఱెమ్మకు, వాళ్లుండే గుడిసొకటుంది. అందులో గట్టివి నాలుక్కుండ చలే కాక రెండు సిలవరి గళాసులూ, ఒక చిల్లుపడ్డ సిలవరి చెంబూ, తాకట్టుకు పనికిరాని లొత్తల తపేళా, పైగా రెండు కంచాలున్నాయి. అంచేత ఆమెను నిరుపేదల కోవలోకి చేర్చరాదు.

ఆమెతో తైపారేస్తే, బంగారమ్మ వొత్తి పేదరాలు మాత్రమే అవుతుంది. వాళ్లింట్లో - పిలవరి సావానే కాక, తాకట్టుకు పనికొచ్చే మూడు కంచుగిన్నెలున్నాయి. కోడళ్లు తెచ్చిన రెండు ఇత్తడి తబుకులూ, చిన్న ఇత్తడి బిందే వున్నాయి. బంగారమ్మ కాలానివి నాలుగ్గళాసులున్నాయి. ఇవిగాక స్థిరాస్తులు కూడా వున్నాయి.

వాళ్లకో ఎత్తరుగుల యిల్లుంది. దానిటికేసి గుమ్మం వుంది. ఆవైపు మంచం పట్టేపాటి మంజూరు, ఆ వెనుక చిన్న పెరడూ వుంది. సన్ని కాపరం కొచ్చేక, దాంచుట్టూ దడి వచ్చింది. అన్నిటినీ మించి, (ఎంత మదుపు పెట్టినా నోరావులించే చూడిగేదెలాంటి) చిన్న బంజరు ముక్క వుంది.

అంచేత, వాళ్లని కలిగినోళ్లంటారు చాలామంది.

బంగారమ్మ కాపరానికి వచ్చిన యేడాదికి వాళ్లత్త వేర్లు పెట్టింది. ఐదారు బస్తాలు వడ్లు పండే పొలం; వేస్తే నాలుగు బస్తాలు వేరుశనగయ్యే మెట్ట భూమి - వీళ్ల వాటాకి వచ్చేయి. రెక్కల కష్టం చేసుకునే యిద్దరు పడుచువాళ్లు; తిండి తప్పిస్తే, గుడ్డ కూడా .... కింద జమకట్టే కూలిబతుకు. బతుకు తోసుకుపోడానికి సరిపోతుండేది.

తరవాత, వాళ్ల కుటుంబం పెరిగింది. ఇంతలో యుద్ధం వచ్చింది. పంటలెప్పట్లానే పండుతూ, యెండుతూ వుండినా, ధరలు పెరగడం, సరుకులు దాచడం, బ్లేక్ మార్కెట్లూ కొత్తగా దిగేయి సదుపాయాలు పెరిగి పండిన పంటలు ఊరొదిలి పోవడం మరిగాయి. ఆ వస్తువులే వూర్లోకొచ్చేసరికి వాటి ధరలు విపరీతంగా ఎదిగాయి. జనానికి అప్పులు చేయకా తప్పలేదు; అవి తీరే దారిలేక భూవులమ్మకా తప్పలేదు.

ఆవిధంగా, వెనకటి రాజ్జంలో చాలామంది పేదవాళ్ల భూవుల్తోపాటు వాళ్ల భూవులూ చెల్లిపోయేయి. ఇంతలో రాజ్జాలు మారిపోయే యన్నారు. ఈసారి రావరాజ్జం వస్తుందన్నారు. కొందరు - కాదు! మాలల రాజ్యం వొస్తోందన్నారు.

మాలలకి వుద్యోగాలు; మాలలకి ఇళ్లు; మాలలకే బంజర్లన్నీ; మీవాడే ఒకడు .... రాస్తన్నాడ్రా! అన్నారు ఖావందులు.

అనడం, ఇనడవే తప్ప - యే బంజరు కాడికెళ్తె, ఆ బంజరు కాడే కర్రల్తో నిలబడేవారు కాపు నాయుళ్లు. ఎట్టకేలకు వూరికి ఆవడ దూరాన్నుండేవి; రాళ్లూ, రాపాషాణాలతో - ఆ బండలు పిండిచేస్తే తప్ప సాగుకి గొరగానివీ! అక్కడొకటీ, యిక్కడొకటీ చిన్న చిన్న ముక్కలు తప్పితే మాలలకి దక్కింది లేదు.

కరణంగారి కాళ్లచుట్టూ దక్షిణ తాంబూలాలతో ప్రదక్షిణాలు చేసి చేసి, మునసబు గారి ముంగిట్లో నెలల తరబడి వెట్టి చాకిరీలు చేసుకుంటూ, మనువులూ, ప్రార్థనలూ చేయగా చేయగా, ఒక చెరువు గర్బంలో చారెడు ముక్క వొరకట్టుకోగలిగేడు బంగారి మొగుడు. ఆ యాడాదే, అతడికి కాలం నిండుకుంది. దాంతో అది అచ్చి రాలేదన్నారు. అయినా, బంగారి దాన్నొదల్లేదు.

అప్పటికి పిల్లలంతా ఇంతా అంతా వాళ్లు. పెద్దకొడుకు నారాయుడే కసింత .... వుండేవాడు. అతణ్ణి పెట్టుకొని బంగారి యజమాను రాలయ్యింది. అంతవరకూ చూసిన బతుకు నుండి ఆమె కొన్ని విషయాలు తెలుసుకుంది.

పేదవాళ్లు పెద్దవాళ్లవడం ఎన్నటికీ జరగని మాట. లేనిదాని కోసం చేయిచాస్తే వున్నది పోవడం ఖాయం. నాల్రోజులు పస్తులున్నా వాళ్ల ప్రాణాలు పోవడం లేదు. ఆ మాత్రం దానికి వున్నది చేయిజారితే తిరిగి రాదు కదా!

అంచేత-

ముందు లేనిదాని కోసం ఇప్పుడు ప్రయత్నించను. ఇప్పుడున్న దాన్ని ప్రాణాలు పోయినా వదిలిపెట్టను అని గట్టిగా తీర్మానించుకుంది. ఆ తీర్మానానికి బెత్తెడిటుగాని, జానెడటుగానీ జరక్కుండా అమలుచేసింది. ఆమె హయాంలో పూచికపుల్ల బయటికి పోలేదు.

ఇలాంటి నిష్టలు నెరవేరలేని తక్కిన మాలలు, వాళ్ల రాజ్జం వస్తోందని నమ్మి, చెంబూ గిన్నే అమ్మి, చెమటోడ్చి బంజర్లు సాగుకు తెచ్చేరు. కొత్త నీరొచ్చేది పాతనీరుం కొట్టుకుపోడానికే కదా! అందుకైన మదుపదు కింద, అవి చెల్లిపోయేయి.

ఇప్పుడు వాళ్లకున్న ఆస్తులల్లా, రెండే రెండు.

ఒకటి ఇల్లు, రెండు వొళ్లు.

మాలపేటలో ఇళ్లు అగ్రవర్ణులు కొనరు అవర్ణజులకు కొనే తాహతు లేదు.

అలానే ఒళ్లు కొంచెం కొంచెం అప్పుడప్పుడు అద్దెకివ్వడాన్ని శాస్త్రమూ, శాసనాలూ అంగీకరిస్తాయి కాని దాన విక్రయ సర్వాధికారాలతో పూరా అమ్మడానికి అంగీకరించవు.

కాబట్టే వాళ్లలో చాలామంది కడు పేదలుగానే వుండిపోతున్నారు. లేకపోతే యేనాడో నిరుపేదలవ్వాలసింది.

నలుగురు కొడుకులూ చేతికంది, యిద్దరు కోడళ్లు వచ్చేవరకు, బంగారమ్మ కుటుంబం బాగానే వుంది. సీజన్లో నాలుగు రాళ్లూ, గింజలు వెనకేసి, సీజనెళ్లేక కాయా, కసరూ ఏద్దొరికితే దాంతో కాలం పుచ్చుతూ, అప్పు చెయ్యకుండా పాలంకి మదుప్పెట్టి, పండితే పండినంత తినేవారు; లేకపోతే లేదు.

ఇలా వుండగా, బంగారి మూడో కొడుకు మేజరయ్యాడు. కొత్త వయసులో బతుకుమీద రక్తీ, తమ శక్తియుక్తులమీద నమ్మకం వుంటాయి - దానికి తోడు పెళ్లి కూడా అయ్యింది.

తల్లికి తెగువ లేదనీ, అది లేప్పోతే యెక్కడేసిన గొంగళి అక్కడే వుంటుందనీ, గొణుగుడూ, సణుగుడూ ఆరంభించేడు.

మీ యిష్టమేటట అనుకోండీ. అప్పు మాత్రం తేడానికొల్లకాదు. గట్లే యేప్తిస్తారో, గెత్తాలే పెరిగిస్తారో, సెరువు మన్నులే నడిపిస్తారో, యిసకలు పరిపించి యెరువులే కొనిపోస్తారో, నూతులు తవ్వించి కూరాకులే పండిస్తారో - ఏం సేసినా నాను కాదన్ను. మీ రెక్కల కష్టం ఏం చేసినా సెయ్యండి. నాకూ బోదే అనేది బంగారి.

పౌరుషపడ్డ పైడయ్య అవకాశం కనబడగానే పట్నం వెళ్తానన్నాడు. ఒక మహరాజులా గెళ్లు అంది బంగారి; అనడమే తరువాయి, పట్నం వెళ్లిపోయాడు పైడయ్య.

ఆర్నెల్లు కిందపడి, మీదపడి ఒక యేడాది గలగల్లాడేడు. ఆ తరవాత యెక్కడో యేంవయ్యిందో తెలియదు. అతడి చేయి కట్టయిపోయింది. ఈ రెండేళ్లయీ - పైడయ్య గిజగిజలే కనబడుతున్నాయి గాని ఆ చెయ్యి సాగడం లేదు.

ఇక్కడ కూడా, పైడయ్య పట్నం వెళ్లిన యేడాదే పెద్ద కోడలు పోయింది. మూడేళ్లయి పంటలు సరిగా లేవు. పావూ అరా పూర్తిగా పోతూ వచ్చేయి. దాంతో వూరూ వాడనా బ్రతుకు భయం సెలలేసింది.

వర్షానసానాన వాగులు పుట్టి వరదలై పొంగినట్టు, వ్యక్తులలో పుట్టిన భయం, వెల్లువలై పొంగింది. గడ్డిమొక్కలు ముందు మునిగితే, గాలి వానకి వృక్షాలూ, ఆముదపు చెట్లూ ఆ తరువాత విలవిల్లాడుతున్నాయి.

ఆ వుక్కిరి బిక్కిరిలో బంగారికి మతిపోతోంది.

ఎంగిలాకుల కోసం వీధికుక్కలు ఎందుకు ఛస్తాయో... ఆ విస్తల్లలో భోజనం చేసిన వారికి అర్థం కాకపోవచ్చు. ఏడాదిపాటు పేగులు మాడితే యెవరికైనా అందులో నీతి కనబడుతుంది.

ఆవిటికి ముందు గొప్పులూ, వేరుశనగల నేతా... నెల్లాళ్ల కూల్లుంటాయి. ఆవిటి పైన మూడు నాలుగు వారాలగ్గానీ కూల్లు పుట్టవు

పండుగ ముందు నెల్లాళ్ల ముమ్మరంగా వరి కోతలు. పండుగెళ్లేక తొలకరిస్తేగా బతుకుల్లేవు.

అందుకే పండుగ ముందు తీసికెళ్తానంటుంది ఎర్రెమ్మ. అందుచేతే, పండుగెళ్లా తీసుకెళ్లమంటుంది బంగారి.

సన్నితో కలుపుకొన్నా... ఎర్రెమ్మ యింట ఇద్దరే ఆడకూలీలు. సన్నెమ్మ లేకపోయినా బంగారి యింట నలుగురు మగ కూలీలు, ఇద్దరు ఆడకూలీలూ వుంటారు.

అయినా, ఈ కరవు రోజుల్లో కోడల్ని వదులుకో నంటుంది బంగారి.

* * *

మర్నాడుంటయం చేదుమింగి, భోగినీళ్లోసుకుని, పెద్దమ్మగారింటికి బయల్దేరాడు పైడయ్య.

''ఇప్పుడెందుకు? మద్దేనం వెల్తెకాదా?'' అన్నాడు నారాయుడు తమ్ముడితో.

'తిండికి వుండననీ; ఆవేళకి వచ్చేస్తాననీ' మాట యిచ్చేక, 'సరే'నన్నాడు నారాయుడు.

రాత్రి యెంతోసేపు నిద్రపోలేదు పైడయ్య. ఆ వుదయం కూడా అతడి మనసు సరిగా లేదు. తన గోడు ఎవరితోనయినా చెప్పుకుంటేగాని తేలేటట్టు కనిపించలేదు.

పెద్దమ్మ వూరు అక్కడికి మైలున్నర దూరంలో వుంది. చిక్కని కొబ్బరిచెట్లనీడ, మధ్యని యెత్తుగా దేవాలయం. పెద్దమ్మ యింట అతని నేస్తుడు కన్నయ్య వున్నాడు.

పెద్దమ్మ కూతుళ్లలో పెద్దది పదిహేనేళ్ల క్రితం పోయింది. ఆమెకు ఒక్కడే కొడుకు కన్నయ్య. తల్లి పోయేక అతడు మేనమామల యింటే పెరిగాడు. పైడయ్యకూ, అతడికీ చిన్నప్పుడే జట్టు కుదిరింది. కన్నయ్యతో కొంతసేపు మాటాడితే మనసు తేలికౌతుందను కున్నాడు పైడయ్య.

పైడయ్యను చూసి యింటిల్లిపాదీ దేవుడొచ్చినంత సంతోషించేరు. తాటివార వేసిన యెత్తుపీట వేసి, ఆ చుట్టూ అందరూ కూర్చున్నారు. కన్నయ్య లేడంటే అర్జంటుగా కబురంపేరు.

అరముగ్గి, ఎముకలూ, చర్మం మిగిలిన ముసల్ది యెప్పట్లాగే అరుగుమీద అర్ధనగ్నంగా పడుకుంది. • అర మగతలో తెలివొచ్చిందేవో -

''ఎవురు? ఎవురర్రా; ఎవురొచ్చినారు?'' అంటూ పీలగా అరుస్తోంది.

పైడయ్య పెత్తల్లి, ఆమె దగ్గరకెళ్లి గట్టిగా అరుస్తోంది -

''మా సెల్లెలి కొడుకు. పట్నంలో వున్నాడు గదా! - ఆడు!''

అత్తకు బోధపడలేదు.

''ఎవ్వరు?'' అంది తెరిచిన గాజుకళ్లను మూయకుండా.

''మా సెల్లిలి కొడుకు మూడు. మూడోవోడు!'' వేళ్లు కళ్లకి దగ్గిరగా పెట్టి చూపిస్తూ అరిచింది. ఈలోగా, పైడయ్య ఆమె దగ్గరికెళ్లి -

''నానే అవ్వా! నాను. నీ ముని మనవణ్నేడా కన్నయ్య - ఆడి నేస్తుణ్ణి''

అప్పటికర్థమయ్యింది ముసలమ్మకు. కొడిగట్టిన కళ్లలో ఒక్క క్షణం మసక వెలుగు .. నోరావలించి ''అఁ...'' అంది తలాడిస్తూ.

''పోల్సింది ముండ'' అని పరమానందంతో నలుగురూ నవ్వుకున్నారు.

ముసలమ్మకి తెలిసినా తెలీకపోయినా - వాడ వాళ్లందరికీ తెలిసిపోయింది. యెరిగిన వాళ్లు ఒకరొకరే వచ్చి పలకరిస్తున్నారు. వచ్చిన వాళ్లందర్నీ కూచోమంటోంది పెద్దమ్మ.

కుశల ప్రశ్నలయ్యేక -

''అక్కడెలాగుందిరయ్యా'' అన్నారు భోగట్టా లారంభిస్తూ.

''ఎలాగటే యేంటి సెపతానం... యిలాగే'' అన్నాడం పైడయ్య గొంతం సవరించుకుంటూ.

''కాదు.. రేసనింగన్నారు... బియ్యాలూ గట్టా దొరకుతున్నాయా?''

''దొరుకుతాయి... బ్లేకు మారకట్లో - డబిలీ సార్జీలిచ్చి కొనగలిగితే''

''ఇక్కణ్నాగే'' అందో పెద్దవయసామె.

''కూల్లో?''

''అయీ యిక్కడ్నాగే. దొరికినోళ్లకి దొరుకుతాయి. లేనోళ్లకి లేదు''

తరవాత పైడయ్య వుండే పట్నం గురించి అడిగేరు. అతడుంటే పట్నం శానా పెద్దది. ఇత్తల అగ్గ్గరోరం అత్తల యెంకటాపురం, అటుకేసి తంగుడుబిల్లి - ఈ వుక్క కలుపుకొని యిదంతా వూరైపోతే యెండో అంత వుంటాదావూరు. తమ వూరికి పది మైళ్ల దూరంలో వున్న పెద్ద బస్తీ. ఆ పట్నంలో వో పేటంత వుండదు. దానికి మూడు దిక్కుల కొండలూ, వో పక్క సముద్రం.

పైడయ్య పట్నం గురించి చెపుతుంటే, చుట్టూ జనం నిచ్చరబోయి వింటున్నారు. ఒక పిల్ల మాత్రం...

''అవున్ట. ఆ వూరు సూడాలంటే రాత్తిరేలే సూడాలంట. ఆకాశంలో యెన్ని సుక్కలుంటాయో అన్నీ ధీపాలయిపోయి, ఆయన్నీ సీకటితో పాటు వో లోయలోకి దిగినట్టుంటాదిట. అక్కడ - దీపాలకే అవుతాదిట కోట్రూపాయలు! వూ వూవ సెప్పినాడు గదా!'' అంది - పైడయ్యను కూడా పదిమందితో కలిపి చూస్తూ.

ఆ పిల్లకు పాతికేళ్లుండొచ్చు అనుకున్నాడు పైడయ్య. పరాగ్గా చూస్తే సన్నికి అప్పలా వుంటుంది. ఎదురుగా తాటినిట్టను వాటేసుకు నిలబడింది. ఆమెకేసే చూస్తూంటే,

''మా బారికి రాఁవయ్య కోడలు'' అంది పెద్దమ్మ.

ఆట్టే చూస్తే బాగోదని తల తిప్పుకున్నాడు పైడయ్య.

''అవున్రయ్యా! అక్కడ నీకేటి పని!''

''కలాసీ''

''అంటే?''

పైడయ్య సెప్పేడు.

ఆ వూళ్ళో పెద్ద మార్కెట్టని ఓ పేద్ద మార్కెట్ వుంది. అక్కడ లక్షలూ, కోట్లూ మీద వ్యాపారం సాగుతుంది. ఓల్సేల్ డీలర్లుంటారు. బట్టలూ, పంచదార, పప్పులూ, చింతపండూ, చిల్లర సరుకులూ... ఒహటా అన్నిట్లోను వుంటారు ఓల్సేల్ డీలర్లు. వాళ్ళ యజమాని - కూరలూ వుల్లిపాయల్లో ఓల్సేల్ డీలరు. కలాసీ - అంటే, ఆళ్ళ కొట్టుల్లో బస్తాలు మోస్తారు. అందులో కొందరు బస్తాల దిగుమతి లెక్కలూ, సిల్లర కొట్టుకి సరుకు సపిలీల్లాటి తేలిక పన్లు చూస్తుంటారు.

పైడయ్యకి లెక్కా డొక్కా తెలీడం వల్లా, నమ్మకం పన్చెయ్యడం బట్టీ, అతడికి తేలిక పన్లే చెపుతారు. ఎప్పుడేనా మనుషులు తక్కువై, పనెక్కువైతే తను కూడా బస్తాలు మోస్తాడు.

''నెలకెంత కిడుద్ది?''

అనేక కారణాలవల్ల సూటిగా జవాబివ్వలేదు పైడయ్య.

''సీజన్ను బట్టి. మన అదురుష్టాన్ని బట్టి, వుంటాది ఆ కిట్టడం. లారీలు రాకపోకలు సజావుగుండి, సరుకు సప్లీ బాగా వుంటే ఒక్కోనాడు పది రూపాయులు కిట్నొచ్చు. లేకపోతే రెండూ మూడు కిడతాది. ఒక్కోనాడు అదీ వుండదు'' అన్నాడు.

వాళ్లు వదల్లేదు.

''నెలకో డెబ్బయి ఎనబై కిడతాదా?''

''సీజన్లో కిడతాది''

''ఉట్టప్పుడో''

''అలాగిలాగ యాభైకి తగ్గదు'' అన్నాడు.

మరింకేం? అన్నట్టు తలలూపుతూ, మొహాలొచ్చాసుకున్నారు. చూసీ చూడనట్టుగా రామయ్య కోడలివంకచూసిన పైడయ్యకు -ఆ పిల్లకళ్లన్నీ తనమీదే వుండటం కనిపించింది.

''అన్నట్టు నీ తిండెలాగరయ్యా?'' అంది పెద్దమ్మ.

వాళ్లైనమండుగురు మొక్కిలీసుగాల్లు ఒకే చోట పన్చేస్తున్నారు. వాళ్ల కులందే ఆడమనిషుంది. రోజూ వుదయాన్నే రెంద్రూపాయలిస్తే ఉదయం సల్లంది పోసి రెండు పూటలా మామ్మోలుగా భోజనం పెడుతుంది.

''అప్పటి మడిసేనా?'' అంది రామయ్య కోడలు.

ఎప్పటి మనిషా పైడయ్యకు బోధపడలేదు. తన దృష్టి తిప్పుకోడానికే ఆ పిల్ల అలా

మాటాడుతోందనుకున్నాడు తక్కినవాళ్లకిది వింతనిపించడం లేదు.

''నువ్వెరుగుదు వేటే?'' అంది పెద్దమ్మ.

''ఇదిగాదా! కొత్తూరు బారికప్పయ్య పెల్లంవా మనిషి. ఆ మనిషి పావులాడితోనో, గొడారాడితోనో నేసిపతే ఇప్పుడున్న దాన్ని పెల్లాడినాడు'' అంది బారికి రాంవయ్య కోడలు.

నిన్న మొన్నటి పిల్ల ముదిపాన్లా మాటాడుతుంటే, పెద్దమ్మకోపం వచ్చింది.

''యెప్పటి ముచ్చటే?'' అంటూ నిలేసింది.

''ఎప్పటిదేవీ - పదేళ్లో, పదేనేళ్లో అవుద్దిట. ఆ మద్దె మా మావ మీ యక్కడికి రానేదా? అప్పుడు పలకరిస్తే యెరగనట్టు తలతిప్పేసింది'' అంటూ సూటిగా పైడయ్యతోనే మాటాడింది

ఆవేం మాటాడుతోందో బోధపడనట్టు ఆ పిల్లకేసి కళ్లప్పగించి వుండిపోయేడు పైడయ్య. బొద్దుగా... ఆ వయసొచ్చేసరికి వొళ్లొస్తే, సన్ని యీమెలాగే వుండొచ్చు.

''అయితే అదెవరో! మీ మావ కబుర్ల కేటి. యింతుంటే అంతంటాడు. యియ్యాల్సూసిన మనిసిని రేప్పోల్చలేడు గాని, యెప్పుడో పదేనేళ్ల ముందు సూసిన మనిసిని యిప్పుడు పోల్తట్టినాడు!'' అంది పెద్దమ్మ.

పైడయ్యకింకా బోధపడలేదు. చిక్కు విప్పుతున్నట్టు విడమరిచి చెప్పింది అతడి పెద్దమ్మ.

''కిందటి నోసలకి పట్నంలో నిన్నెతుక్కుంటూ రానేదా, బారికి రాంవయ్యని నల్లగా పొడుగ్గా సెవిటోడు? వొచ్చినాక, వోపూటో రెండుపూట్లో మీయక్కడ తిన్నానని కూడా సెప్పినాడు... యిదా రాంవయ్య కోడలు. ఇందాకణ్నించి ఇదప్పగిస్తున్నదంతా ఆడు సెప్పిన ముచ్చట్లు''

అప్పుడర్థమయింది పైడయ్యకు.

ఆవేళ పొద్దోయి, బట్వాడా అందుకుని బయటికొస్తుంటే -

నీ కోసం సుట్టం దిగినాడ్రో అన్నాడు తోటి కలాసీ. చూస్తే, ఆ మనిషిని ఎన్నడూ కలసిన జ్ఞాపకం లేదు.

ఎవరికోసవండీ? అన్నాడు పైడయ్య.

ఆ మనిషి తనెవరో చెప్పకుండా, పైడయ్య ఫలానా అని తేల్చి తను పెద్దమ్మ చుట్టాన్నన్నాడు. ఆ వూరికి పైనా, యింకేదో వూరెల్లి తిరిగొస్తున్నాట్ట. పెద్దమ్మ చూసి రమ్మంటే ఆ వూళ్లో తన కోసం దిగేనన్నాడు.

పెద్దమ్మను బట్టి అతడికి చేయగలిగిన మర్యాదలన్నీ చేసేడు. హోటల్లో భోజనం పెట్టించి మర్యాదకి తనూ తిని, రెండో ఆట సినిమాకి తీసికెళ్లేడు.

గడకర్రలా చెయ్యెత్తు మనిషి. ఏళ్లు పైబడి మనిషి వొంగిపోతున్నాడు. నల్లగా, సన్నగా, తెల్లని పాత కమీజు తొడిగి, ఓ పంచె తలపాగా చుట్టేడు. కింద అలవాటుగా గోచీయే పెట్టేడు. తలయారి కాబట్టి, చేతికర్ర లేందే కదలడు. అతడి పక్కన నడుస్తుంటే తనో

సినీమా పొద్దయినా హాలుకొత్తది. కళ్లుచెదిరిన రామయ్య అది తట్టుకోడానికి కొంతసేపు పట్టింది. ఆ తరువాత పైడయ్య పడ్డ బాధ యింతా అంతా కాదు

ముసిలాడికి ఆ కథ బోధపడదు. ఏవేవో అడుగుతాడు. మెల్లిగా చెవితే వినిపించదు - గట్టిగా చెప్పటానికి చుట్టూ జనం.

ఇంటర్వెల్ తరవాత అతడికి నిద్ర పట్టేయడంతో బతికేననుకున్నాడు పైడయ్య. కానీ సినిమా వదలగానే మళ్లా ఆరంభం.

ఆ హాలేటి అంత డాబుగుందీ! సవగ్గా నేలమీద కూకునే సినిమాలు ఈ వూళ్లో లేవా! నువ్వు టూరింగు సినివూల్నెరుగుదువా - ఎరుగవు... ఇలా నడిచింది కొంతసేపు. ఇంకొంతసేపు -

వూళ్లోకి వూళ్లోకే, వొహసోట్నుండి యింకోసోటికింత దూరవేటి? నువ్వీ వూళ్లోకి సంసారవేల తేవూ! సంసారాలు లేని మనుషులు తిన్నగుంటారా? ఇలా సాగింది.

తోవలో కనబడ్డ ఆడా మగా, అర్ధరాత్రి దాటినా యింకా ముయ్యని కొట్లూ తిరిగే బస్సులూ, రిక్షాలూ - అన్నిటి గురించీ తెంపు లేకుండా ఒకటే ప్రశ్నలు.

పైడయ్యకు గదిలేదు. కూరల మార్కెట్‌లోనే ఓ అరుగుమీద పడుకుంటాడు. కొన్ని కారణాల చేత అక్కడ దీపాలు మన్నవు.

గేటుదాటి మార్కెట్లోకి అడుగు పెడుతుండగా, ఓ పందికొక్కు కాళ్లల్లో పడ్డది. అక్కణ్నుండి, ఏ పాడు వంకాయ కాలుకింద పడ్డా, యే కుళ్లు దోసకాయ మీద కాలుపడ్డా రావయ్య గాభరా పడిపోయేవాడు.

చూరుమున్న గోనెగుడ్డలూ, చాపముక్కలూ పీకి, వాటినోసారి గట్టిగా దులిపి పక్కలు పరిచేడు పైడయ్య.

అయితే, ముసలాడు నిద్రపోలేదు. అక్కడ వూరంతా అంత ఎలుగేట? యిక్కడీ సీకటేటి? అంటాడు. ఈ అరుగులు యింత గలీజుగా వున్నాయి. ఎప్పుడూ కడగరా? అంటాడు. దోవఁల్నీ, నల్లుల్నీ నలుపుకొంటూ యిటూ అటూ పరిగెత్తే ఎలుకలూ, పందికొక్కులూ యెక్కడ కరుస్తాయో అని భయపడుతూ, యెంతో రాత్రి దాకా నిద్రపోలేదు.

డబ్బుతో తెల్లారగానే బస్సెక్కుతాడనుకున్నాడు. యెక్కలేదు. పైగా, వూరు చూపించమన్నాడు.

తప్పేది లేక, తోటి కలాసీలతో షావుకారికి కబురంపి, తిండి పెట్టే మనిషితో యింకో మనిషికి వండమని, బయల్దేరాడు.

పట్నంలో వుండే భవనాలూ, ఆరేడంతస్తుల మేడలూ, హాస్పిటలూ, ఆఫీసులూ చూసి బజార్లన్నీ తిప్పేడు. దార్లో కనిపించిన వాటి గురించి తెలిసినంత వరకూ చెప్పేడు. ఒంటిగంటుక పేగులు నకనకలాడుతుంటే ఇంటికెల్దామన్నాడు రావయ్య.

నాకిల్లు లేదుగదా? అన్నాడు పైడయ్య

మర్నీకు సంచో గించో, పెట్టో బేడో, ఉండదా - అదెక్కడెట్టినా? అన్నాడు రావయ్య

కొట్లోనే ఓ మూల్నెట్టుకుంటాను - అన్నాడు పైడయ్య.

మరి తిండో?

తిండి యేర్పాటు గురించీ సెప్పేడు.

అయితే అక్కడికే తీసుకెల్లు - అన్నాడు రావయ్య.

మార్కెట్‌కి నాలుగైదు వీధుల వెనకనే వుంది - ఓ చిన్న మురికివాడ పెద్ద పెద్ద పట్టణాల్లో ఉండే అన్ని వాడల్లాగే ఉంటుంది ఆ వాడకూడా. నగర మధ్యలో వుండటం వల్ల ఆ వాడ చాలా చిన్నది. చిన్నదవడంవల్ల, మరీ యిరుగ్గా వుంటాయి అందులో యిళ్లు. ఒక పెద్ద మురుక్కాలవకి యిటూ అటూ చితచితలాడే చిత్తడి నేలపై, యిల్లుమీద యిల్లులేసి మనిషిమీద మనిషిగా ఉంటారు జనం. ఆ వాడకు రెండు పక్కలా పెద్దపెద్ద భవనాలతో వీధులు. ఓవేపు బ్రహ్మాండమైన సినిమా హాలు, దానిమీద బతికే హోటళ్లు. నాలుగో వేపు - యెడతెగని ట్రాఫిక్‌తో ఆ వూరినుంచి పోయే గ్రాండ్ ట్రంక్ రోడ్డు.

అందులో అడుగు పెడుతూనే, యిక్కడా వుంటున్నావు? - అన్నాడు రావయ్య.

దడిపెట్టి, మట్టి పూసిన గోడల్తో 'చుట్టు - యిలారం' గుడిసెలున్నాయి. పల్లెటూరి పందుల గుడిసెలు, యెంతో మెరుగు. పేకేజీ చెక్కల్తో చేసిన గుమ్మాలూ, తడికలూ, సింపిరి నాటిన యినపరేకులూ - తలుపులుగా అడ్డం పెట్టుకుంటారు. తాటాకులూ, యీతరేకుల చాపలూ, పైకప్పులు, గడ్డీ కమ్మా, గోనెపట్టాలూ, ఇనపరేకులూ, యే చెత్త పడితే ఆ చెత్తతో మూసి, అవే యిళ్లంటారు అక్కడి జనం!

మంచానికి సరిపోయే ఓ గది పట్టుకి అద్దె - పది రూపాయలని వినగానే రావయ్య మరి మాట్లాడలేదు. కన్నంలాంటి ద్వారంలోకి దూరలేక, వాకిట్లోనే కూచుని తనకు పోసిన గంజి మెతుకులు కతికేసేడు. రోడ్డుమీదకొచ్చి కొళాయి దగ్గర పాదాలు రాసి రాసి కడుగుతూ అన్నాడు.

నన్నడిగితే, తిండినేక యే గొడ్డో కరిసి సావడం మెరుగు; పేనాలు ఒక్కేపాలి పోతాయి

అతడొచ్చి చెప్పిందాకా, తను యెలాంటి చోట ఉన్నాడో పైడయ్య గమనించలేదు. ఆ వాడలోనూ, అలాంటివాడల్లోనూ, ఆ వూరి జనంలో ఐదోవంతు బతుకుతున్నారు. పదిరాళ్లు జేబులో వున్నప్పుడల్లా ఫరవాలేదనిపించినా, డబ్బులు తక్కువైనప్పుడల్లా ఆ మాటలు గుర్తొచ్చేవి.

''నా నందుకన్లే దప్పొ; ఇప్పుడు కులాలెవరు సూస్తన్నారు - నాను కులాల కన్లేదు. అప్పటి మడిసేనా? మడిసి మారిందా? అన్నాను...''

- ఆ పిల్ల పెద్దమ్మతో అంటోంది.

''ఏవో. ఎందుకన్నానో? - యెందుకన్నా - మీమావ అదెట్టిన కూడు వోపూట

తిన్నాడు ఆడి కులంపోతే నా కొడుకు కులవ్వా పోతాది ఆడిది పోప్పోతే యీాడిదీ పోదు''

విన్నవాళ్లు సవ్వేరు కొంతసేపు ఎవరూ మాటాడలేదు.

పైడయ్య వొదినల్లో ఒకామె ఉండుండి అరిచింది -

''నన్నడుగుతావేవే? నానేం యెల్లినానా, సూసినానా! మీ సినబాబు నడుగే''

పాదికట్టున కూర్చున్న పదిహేనేళ్ల పిల్లవంట తిరిగి అంటోంది. రహస్యం బయట పెట్టిందన్న ఉక్రోషంతో ఆ పిల్ల ముఖం ముడుచుకొని ఆమె వీపుమీద చెయ్యి పెట్టి తోసేస్తోంది.

చినబాబు వరసను బట్టి ఆ పిల్ల కన్నయ్య పెళ్లామని గ్రహించేడు పైడయ్య. ఏఁవిటేఁవిటంటే ఆ పెద్దామె చెప్పింది.

చెప్పడమే తరువాయి పెద్దమ్మ అందుకుంది -

''అవున్రయ్యా! సెప్పరా, ఈ పిల్ల కొహతికి మా ఉబలాటంగుంది. ఆ మద్దినల్లా దీని మొగుడు గెంతినాడు. ఆడట - ఇందంబడి కంబారరికాలు సెయ్యనేట్ట. నీకాడకొచ్చి పని సూసుకుంటానన్నాడు. ఆ మద్దె రాఁవయ్యొచ్చి పట్టం కబుర్లు సెప్పినాక కొంత తగ్గినాడు. ఇప్పుడు దీని బులపాటం మొదలయ్యింది. యెప్పుడో బయలెల్లి పట్టం వొస్తాది కావాల. సెప్పు'' అంది పెద్దమ్మ.

''కేవు - అడిగినంత మాత్రాన యెలిపోద్దా. నీ మాటగాని'' అంది పిల్ల పిన్నమ్మ.

''నీ మనవణ్ణొగ్గేసి అదొక్కతే యెలిపోద్దా!'' అన్నాదో వరసైన అమ్మమ్మ.

''ఏవో ఒగ్గేసెల్లినా యెల్తారీకాలం పిల్లలు! ఈ లంతా వో జట్టున్నారు. పట్టం అంటే ఆలకి సొరగం. ఆలకో గురువు - వుంది కదా!'' అంది రావయ్య కోడలుమీద విసురుగా. ఈసారి రావయ్య కోడలు వూరుకోలేదు.

''ఏం! యెల్తే తప్పేటి?'' అంది బయటపడుతూ.

పెద్దమ్మ జవాబివ్వకపోయేసరికి యింకా గట్టిగా అంది.

''ఇక్కడిలాగ పల్లిగర గురుసుక్కూకునే కన్న, యెల్తే వొచ్చిన నష్టవేటి?''

ఈ ప్రశ్న తక్కిన వాళ్లవంక తిరిగి వేసింది. వాళ్లెవరూ మాటాడలేదు. పెద్దమ్మే అంది -

''నష్టవని యెవురన్నారే. యెల్తే యెల్లండే! ఆ వుచ్చుల్లో, రొచ్చుల్లో, ఆ ఈగల్లో, దోవల్లో, ఆ పందుల గుడిసెల్లో పడి దొర్లండే? యెవరొద్దన్నారు?'' అంది పెద్దమ్మ.

''అవునుం. ఇక్కడున్న - మేడలూ, మిద్దెలూ, పట్టె మంచప్పరుపు లొగ్గేసి, అక్కడందబడ యిందబడ దొర్లడం తప్పే!'' అందా పిల్ల.

''ఇక్కడా నేదు; అక్కడా నేదు. ఆకాడికి అక్కడికెల్లి సావడం దేనికి? ఇక్కడే సస్తే కాదా?'' అంది పెద్దమ్మకి సాయంగా యింకో పెద్దమ్మ.

''అక్కడ ముద్దయినా ముక్కలొద్దికదా, యిక్కడేటుంది?'' అంది పడుచుపిల్ల.

దానిమీద ఆడవాళ్లు నలుగురూ నాలుగు మాటలుగా మొగుసుకు పోయేరు. వాళ్ల ధోరణి నుండి పైడయ్యకు అర్థమయ్యిందేమంటే, యీ తర్కాలకి మూలం యిప్పటి సంగతి కాదు - వెనకట్నుంచి వున్న రగడ మళ్లా బయటపడ్డం.

''అః! ఇక్కడ తినడం మానీసునారు!'' అంటూ సాగదీసింది పెద్దమ్మ.

''తింటన్నాం, కనపడ్డం నేదా? మళ్ల సెవతన్నావు! నీ కొడుకే వున్నాడు. యెనిమిదేళ్లయి యెంకట్రాయుడు కాడ కంబారిగున్నాడు. మొదటి నాలుగేళ్ల ఏం తిన్నగిచ్చినారో జీతాలిచ్చినారు. మరుసటేడాది యిదిగో రేపు, అదిగో మాపు, అవాసొస్తంది, పున్నవెల్లనీ అని అప్పుడో యిద్దం, యప్పుడో వుుత్తం సొప్పున ఆర్నెల్లు జీతం కొలిసేతలికి గగనవైపోనాది.

ఉన్న జీతం వచ్చీ పంటలకన్నారు.

ఆయేడు పంటలు పోనాయన్నారు. పంటలూ పోనేదు, ఆల బతుకులూ పోనేదు - మాడిపోతన్నావని కాల్లా యేల్లా పడితే, మూణ్నెల్ల జీతం కొలిసి ఇప్పటికింతే అన్నారు. ఇప్పుడీ రెండేళ్లయీ పంటలు పోతన్నాయి. అసలొక్క గింజ కొలిస్తే వొట్టు. గట్టిగా అడిగితే, తంతారని బయ్యం.

'అరువుకి పాటుపడ్డం దేనికి? మానీరాదా!' అంటే - మానీస్తే, 'మొదటికి మోసం కాదా! ఎప్పుడో పండితే, బాకీ జీతాలు కొలుస్తారేవో'' అంటాడు నీ కొడుకు. అంతేగాని, రోజు కూలికిపోయినా, దొరికిన్నాడో రూపాయి దొరుకుద్ది అనుకోడు'' అంది రావయ్య కోడలు.

''అయి మాత్రం తేరగున్నా యేటే?'' అంది పెద్దమ్మ.

''అయీ తేరగనేవ. యియీ తేరగనేవు. నాననీదీ అదే. అందుకే పట్నం పోతే కాదా? అంటాను. ఈ జీతనాతాలు లేని కొలువులు కొలిసి యిగిరి సావడం కన్న పందల దొడ్లలోనో, పాయికానాల్లోనో యెక్కడో వొక్కాడ తల్దాసుకుంటే, కడుపునిండా గంజైనా తాగొచ్చు. ఇక్కడా గంజికీనేక, తోటలంబటా దొడ్లంబటా తిరగనేల? తన్నులు తావులూ తినీ, మాలముండ జాతి దొంగ జాతని అడ్డవైన అడవా జాతుల్సేతా మాటపడ్డవేల?''

- రావయ్య కోడలు ఆగిపోయింది.

''అయితే నీ వొక్క పొట్టనిండితే సాలా?'' అంది పెద్దమ్మ.

''ఏం నిన్ను రావొద్దన్నానేటి?'' ఎదురు ప్రశ్న వేసింది కోడలు.

''ఊరు వూరల్లా యెల్లి పట్నం మీద పడితే అక్కడ మాత్రం కూల్లు కూకున్నాయేటే? ిలాగ యెన్నాళ్లనుండీ, యెంత వందెన్ని జాతులోళ్లు ఆ పట్నాలమీద పడాల! పొచ్చినోళ్లందర కక్కడ కూల్లు పుడతాయా? ఆ మద్దె కప్పరాం పోతయ్యా తమ్ములూ, వున్న యిల్లూ వాకిలీ అమ్మేసి, పట్నం పరిగెత్తినారు. ఆర్నెల్లు తిరక్కుండా పాలొచ్చినారు. అక్కడ మరదల్నివలకో అప్పగించి మరీ పారొచ్చినారు'' అంది పెద్దమ్మ వెటకారంగా.

''యెవడో పారొచ్చినోళ్ల సంగతి సెప్పడవేల? అక్కడున్నోళ్ల సంగతి సెప్పరాదా?''

''ఆళ్లా పారొస్తారు, యియ్యాల కాప్పోతే రేపు''

''సరే మావూ అప్పుడే వస్తాం అందాకా బతకనీ?''

''అంతేగానీ జనవందరి బతుకేటని ఆలోసించవు?''

రావయ్య కోడలికి వెంటనే జవాబు దొరకలేదు కొంచెంసేపాగి - ''సరే - నానాలోసించను. ఆలోసించిందానివి సెప్పు'' అంది తిప్పికొడుతూ.

యేం చెపుతుంది పెద్దమ్మ! పరమాత్ముణ్ణి సాయం తెచ్చుకోబోతే, భగవంతుడిలా దిగేడు కన్నయ్య.

అతడు మాటా మంతీ లేకుండా వచ్చి, తువ్వాలు దడదడ తలకు చుట్టుకున్నాడు. చుట్టుకుని -

''లెగహే తొత్తుకొడకా! లెగు. లెగురా... లెగు!'' అంటూ పైడయ్య గుండెలు మీదా, నుదురుమీదా నాలుగైదు చరుపులు చరిచేడు. వాటికి తట్టుకోలేక పైడయ్య లేచిపోతే ఆ యెత్తుపీటమీద కూర్చున్నాడు.

''తొత్తుకొడకా? నానెక్కడుంటే అక్కడికి రావాలని తెల్దా? నాన్నీ కాళ్లకాడికి రావా(లా? - రా! కూకో నా కాళ్లకాడ...!'' అంటూ అతడు కూర్చోకపోగా అతడి మీంద కలియబడ్డాడు. కోడెదూడల్లా కుమ్ముకుంటు ఆ నేస్తుల పట్లు చూస్తూ - గోల గోల చేసేరు ఆడవాళ్లంతా. పెద్దమ్మ ఓ క(ర పట్టుకొచ్చి కొడుతూ వాళ్లను విడిపించబోయింది.

* * *

అన్నాడుగాని పైడయ్య మాట నిలబెట్టుకోలేదు. తింటేగాని గుమ్మం దిగనివ్వలేదు పెద్దమ్మ. ఇంటికెళ్లకుండా తిన్నగా చెరువుగట్టుకొచ్చి కూర్చున్నాడు పైడయ్య.

ముది యెండ - నీరెండగా మారుతోంది. సన్నగా ఆరంభమైన చలి; సనసన్నగా పెరుగుతోంది. ఎంతకూ సన్నీ వచ్చే జాడ కనిపించలేదు.

'వూరవతల కనబడ్డ మనిషి తాటిపెండెలు దాటేవరకూ చూస్తాను. అప్పటికి జాడ కనిపించకపోతే, లేచిపోతాను' అనుకున్నాడు పైడయ్య.

పైడయ్య సన్ని కోసం చూస్తున్నాడే గాని - అతని మనసులో సన్ని కదలడం లేదు. రావయ్య కోడలే అతని మనసల్లా అల్లుకుంటోంది.

రావయ్య కోడలు... యేపుగా కాసిన కాయలా, నిండావిడ్డ పువ్వులా వుంది. ఆమెను చూస్తే అతడికి ఆశగా వుంది. ఆ వెనుకనే బెదురు కూడా వుంది.

అక్కడ మాటాడుతున్నంతసేపూ, ఆమె కళ్లు తనమీదే వున్నాయ్. పెద్దమ్మతో వాదిస్తున్నప్పుడు కూడా తననే పెద్దను చేసి వాదించింది. ఆమె కళ్లల్లో తడి, ఆ తడిలో వెలుగు, ఆ వెలుగు నిండిన ముకం, ఆ గొంతులో మాలిమి, అందులో రోషం అతణ్ణి విడవకుండా వెంటాడుతున్నాయి.

కల్లాకపటం లేని మనిషి. అంచేత అలా కనిపిస్తది. నా నెరిగిన కాడికి దాని కలాంటి

బుద్ధులు లేవు - అన్నాడు కన్నయ్య్య పైడయ్యకూ్కా డా అలానే అనిపిస్తోంది. అయితే నమ్మబుద్ధి కావడం లేదు.

అప్పిడే పయానవా? - అంది వచ్చేస్తుంటే.

మరేటి? వుంటే - రాత్రికి కూడేనా యెడతావా - యేవన్నానా? అన్నాడు కన్నయ్య్య.

నానెట్టడవేల? నీ యింట ఆడోళ్లు నేరా... ఆల కొండెట్టడం రాదా - అంది రామయ్య్య కోడలు.

వూరవతల కొచ్చాక, ఆ మనిషి గురించి అడిగేడు పైడయ్య.

కన్నయ్య్య చెప్పుకొచ్చాడు.

రావయ్య్య కోడలికి, పట్నంలో కాపరవెట్టాలని ఎంతకాలంనుండో మనసు, దాని మొగుడికి వొల్లుంది గాని కాసింత మెతక...

అందుకని, ఆమె కన్నయ్య్యని పూటు చెయ్యటం మొదలెట్టింది. కన్నయ్య్య అలాగలాగే అంటూ నెట్టుకొచ్చాడు. నెట్టుకొచ్చినకొద్దీ, ఎక్కడ దొరికి తక్కడ అవే వూసులు. రోజురోజుకు బలవంతం పెరిగిపోతోంది.

చివరికి యేటిగదా దీనుద్దేశం అనిపించింది.

ఒకటి రెండుసార్లు చెయ్యి చేసుకోబోతే సులువెరిగి తప్పించుకుంది. ఒకనాడు మాత్రం ఒంటిగా దొరికిపోయింది.

ఇప్పుడెటెల్తా? - అన్నాడు కన్నయ్య్య.

ఎటూ యెల్లను. కాని, నీకొక్కమాట సెపతాను. కడుపుకుండి, మనిషి దొంగతనం సెయ్యరాదు. కట్టుకున్న పెనివిటో, పెల్లవో వుండి కాని పని సెయ్యడం తప్పు. నీకింటికాడ పెల్లం నేకపోతే సెప్పు. దానికొంట్లో సుకం నేదన్నా నానొప్పుకుంటాను. కాని తీరి కూకోని కాపరాలు సెడగొట్టకు. అందరు మొగోళ్లూ ఒకటైనట్టే అందరాడోళ్లం ఒకటే - అందా పిల్ల.

కన్నయ్య్య తల వంచేసుకుని వచ్చేశానన్నాడు.

ఈ లెక్కని చూస్తే, ఆ మనిషి పక్కని యేవారని నిలపడలేదు సన్నెమ్మ. ఆ లెక్కని తను కూడా కన్నయ్య్య పక్క నిలబడలేడనే అనాలి -

గట్టెక్కుతూ బుట్టతో ఆడ మనిషి కనిపిస్తే, పరకాయించి చూసేడు పైడయ్య. అదెవరో యేభయ్యేళ్ల పైబడ్డ మనిషి. ఇంక రాదిది - అనుకుంటూ, పొద్దుసి లేద్దామనుకోగా, ఇంకొక్క సిటం అని గడ్డం పట్టుకుంది మనస్సు.

- అయితే అప్పటికి సన్నెమ్మ కాపరానికి రాలేదు. యెండ వేళప్పుడః పోతయ్యగారి పెండిని తాటికాయుల కోసం తిరుగుతున్నాడు. కిందా మీదా యెండ వూద్చేస్తోంది. పెండవతల దొంతర గెడ్డల్లో ఆడపిల్ల ఒంటిగా వొండలోకి పోతోంది.

ధగధగ ధగధగ వెలిగిపోతున్న ఆ బయల్లో, కనుచూపు మేర మనిషి పొడ కనిపించడం

లేదు గాలీ, గాలి చెల్లను దూసుకుపోయే చప్పుడూ తప్పితే, పిట్టయినా కీచుమన్నట్టు లేదు

సముద్రపు గాలి చల్లగా తగిలినా ఒళ్లు మండిపోతోంది. ఉండుండి విసిరే పాడిగాలుల వరసలో పూపిరాడ్డం లేదు. దడదడలాడే గుండెల్తో జవజవలాడే కాళ్లతో దొంగలా నాలుగు ప్రక్కలా చూసేడు. తెగించిపోతే దొంతరగిడ్డ వొండల్లో, 'మాదిగప్పయ్య కూతురు ఒంటిగా కూర్చుంది పొరుగు తోటలో తెంచుకొచ్చిన మామిడికాయలు దొంగతనంగా తింటోంది. కొరికిన కాయ పట్టిన చేత పైట తొలగిస్తూ రెండో చేత్తో ఒడిలో కాయలు బొడ్డు కొంగున దోపుతోంది. తనను చూసి - గతుక్కుమన చిరుగుల పైటతో కాయలు కప్పేసుకోబోయింది.

ఆనాడు తను చేసిన పనికి యెన్నాళ్లో ఆమె ముందు తలెత్తలేకపోయేడు. ఇప్పుడాలోచిస్తే - అందులో తన తప్పు లేదు. ఆకలే అన్ని పాపాలకీ తల్లి.

ఆరోజు ఏ పరిస్థితిలో వున్నాడో, ఈరోజూ అదే స్థితిలో ఉన్నా పైడయ్య. అతడి బుద్ధి పరిపరి విధాల పోతోంది. ఏం చెయ్యడానికీ తెగువ చాలడం లేదు.

'ఈ మనిషి వచ్చింది కాదుగదా' అనుకుంటూ, లేచిపోయేడు పైడయ్య. లేచేసరికి పట్టరాని కోపం వచ్చింది. అది దుఃఖమో, కోపమో తెలియడం లేదు. ఏదైనా తీర్చుకునే వుపాయం లేదు.

బుట్టలు దులుపుకుని గట్టున నడిచే పైడయ్య, పడమట బారెడు పొద్దుండటం చూసేడు. గట్టు మధ్య పేరంటాల గుడికొచ్చేసరికి, గంగమ్మ జ్ఞాపకానికొచ్చింది. చెప్పలేని విధంగా గుండె తేలికై చెరువుకడ్డం పడ్డాడు.

చెరువు గర్భం గడిచి పదడుగులేస్తే చెన్నంగి కొబ్బరితోట. దాని మొదట్లోనే ఉంటాది దెయ్యేల గంగమ్మ పాక.

''ఏంరోరయ్య ఇలా దారితప్పినా!'' అంటూ పలకరించిం గంగమ్మ. అక్కడికి వూరు మైలు దూరంలో కనబడుతుంటుంది.

''తప్పినా పొద్దారే కదా?'' అంటూ సమాధానం ఇచ్చేడు పైడయ్య.

శుభ్రంగా తుడిచిన దాగరంత వాకిట్లో - మూడు రాళ్లు పెట్టి గంజి కాస్తోంది గంగమ్మ. ఆమె కెదురుగా - ఒక రాయిమీద కూర్చున్నాడు పైడయ్య. అతడి మొహం మీంద సాయంకాలపు ఎండ పడుతోంది. ఎర్రని ఎండలో నల్లని మొహం. నిండా రగులుకొని నిప్పు కణికలా వుంది

''మొకవేట లాగుంది'' అంది గంగమ్మ పొయ్యిలో మంటకేసి చూస్తూ.

''పొద్దుటనగ బయులెల్లిన మనిసిని, ఇప్పటిదాకా తిరిగి తిరిగి యీ నలట్టి పోనాను. దాహానికి సల్లనీళ్లిస్తావని నీకాడ కొచ్చేను'' అన్నాడు పైడయ్య. వైద్యుడు రోగాన్ని చదివేటంత తేలిగ్గా, అతడి మొహంలో ఆకలి చదివింది గంగమ్మ. అంచేత శీతాకాలం అంటూ నోటిదాకా వచ్చిన మాట ఆపి -

''ఎక్కడెక్కడికెల్లినా?'' అంటూ, పక్కనున్న కంపల ముటిట దగ్గరికెళ్లింది గంగమ్మ.

పైడయ్య, ఎక్కడెక్కడికెళ్లాడో చెప్తున్నాడు. కొంతసేపు మాటలు విని -

''ఎవరది నారాయుడూ!'' అన్నాడు లోపల్నుండి ముసలాడు.

గంగమ్మను మొదట కట్టుకున్న మొగుడు ఐదారేళ్లు కాపరం చేసేక, ఇంకొకతెను లేవదీసుకుపోయేడు. పదేళ్లు మగతోడు లేకుండా బతికింది గంగమ్మ. ఇప్పుడున్న మొగుడు, రెండో పెళ్లం పోయేక యీమెను చేరదీసేడు. చేరదీసిన కొద్దికాలానికే అతడికి వొళ్లుమాలిన జబ్బు చేసి రెండు కాళ్లూ పడిపోయాయి. అయినా, అతడి ప్రాణాలకన్నా విశ్వాసంగా ఆ బొందిని పట్టుకు వేలాడుతోంది గంగమ్మ.

''నారాయుడు కాదు ఆళ్ల తమ్ముడు పైడియ్య'' అంది లోపలికి వినిపించేటట్టు.

''నాకాడ సుట్టముక్క ఉండదుర పెద్దోడా! బీడీ యిద్దువా!'' అంటూ పైడయ్య లేచి లోపలికెళ్లాడు.

ఆ పాకలో - ఓ మంచం, నీళ్ల కడతా తప్ప యింకేమీ లేవు. అంతకన్నా ఎక్కువ సామాను అది పట్టదు కూడా అనుకున్నాడు. ఉట్టిమీదున్న రెండు చట్టెల్నీ, మంచం కిందున్న యిసక చేటనీ అతడు గమనించలేదు.

''నీ దయ యేవిచ్చినా పుచ్చుకుంటాను'' అన్నాడు వెలుగు రాసిన గొంతుతో. పాలిపోయి గుంటలు పడ్డ ముఖంలో పత్తికాయల్లా తేలిన కళ్లలోకి చూడలేక, పైడయ్య చూపులు తప్పించేడు. ఒక బీడీ అంటించి యిచ్చి, ఇంకో బీడీ తీసి పక్కనుం పెట్టి, ఇవతలకొచ్చేసేడు. గంగమ్మ గంజి కలయబెట్టి, తెడ్డుపక్కన పెడుతోంది.

ఎదురుగా కూర్చున్న పైడయ్య యెంతకీ మాటాడకపోతే, పట్నంలో అతని మంచి చెడ్డల గురించి భోగట్టాలడిగింది. వీపరాళ్ల తగువు గురించి కదిపి విన్నదాంట్లో నిజానిజాలడిగింది. పైడయ్య ముక్తసరిగా జవాబులిస్తున్నాడే తప్ప మాటల్లోకి దిగడం లేదు.

కొంతసేపు పోయేక -

''ఏవొచ్చినా?'' అంది గంగమ్మ.

''సెప్పనేదా? దప్పిగ్గుంది'' అన్నాడు పైడయ్య మోర పైకెత్తి.

''దప్పిగ్గుంటే, సెగిడి సన్నాసయ్యా పాక్కెళ్లాల. నాకాడకొస్తే నానేటిస్తాను?'' అంది తొణక్కుండా.

''నీకాడ యేదుంటే అదే'' అన్నాడు పైడయ్య.

''నాకాడ ఈ గంజొక్కటే ఉన్నాది. ముసిలోణ్ణి యిగిర్చి పొయ్యమంటే నీకే పోస్తాను'' అంది నవ్వుతాల్లాగ.

గంజిలో మెతుకులు పలుకువిడ్డం చూసి, దాకను పాకలోకి తీసుకుపోయింది. తిరిగొచ్చి కుట్టు తీసేసి నిప్పొర్పుతుంటే పైడయ్య వణికే గొంతుతో ఆరంభించేడు -

''నానాఱ్నెల్లయి, ఆడమనిసి కోసం ఉపాసవున్నాను. ఇయ్యాల ఇంటికొస్తే మా యమ్మా

అత్తా కువుమ్మలాడుకుని వుమ్మల్నిడ దీసినారు. నిన్న రాత్తిరి దాన్ని తవిటప్ప ఇంటికి రమ్మన్నాను. దానికీ నాబళాధ అర్దవైనట్టు నేదు సెప్పకేం - కత్తెట్టి ఒక్కొక్కల్నో పోటు పొడిచెసి, ఆ యెంట నానూ సత్తునా అనుకున్నాను. కాని నాకాపాటి తెగువ నేదు - అంత తెగువే వుంటే నా బతుకిలా గుండదనుకున్నాను.

ఇల్లు గడవటం కష్టంగున్న రోజుల్లో మా సిన్నన్నని పట్టం రమ్మన్నాడు - ఆల్ల అత్తోరి తరఫున వునిసొకడు. మా సిన్నాదిన యెంత బతివూలాలో అంతా బతివూలింది. మాయన్న కదల్నేదు. అప్పుడు నాను బయల్దేరినాను. ఎల్లినందుకు ఎన్ని పాట్లు పడ్డానో, ఇప్పటికీ ఎంత పడతన్నానో ఆ బగమంతుడికి తెలియాల; నాకు తెలియాల. అష్టకష్టాలకీ వోర్చి కడుపు కట్టుకుని, కాలు కట్టుకుని కాపరానికొచ్చిన కొత్త పెల్లాన్నొగ్గకొని అడివినాటి పట్టంలో వొల్లిరుసుకుంటున్నాను. అయినకాడికి అయిదోపదో నెలనెలా మింగలేసి పంపుతున్నాను. అలాగవస్తలు పడుతున్నందుకు ఆర్నెల్లకోపాలి వస్తాడన్న జాలైనా లేకపోయింది మా జనానికి''

- అంటూ ఆగేడు పైడయ్య. ఆ ఉదయం కన్నయ్యతో చెప్పుకోబోయిన మాటలు, ఆమెతో చెప్పుకుంటున్నావా అనుకున్నాడు మనసులో.

''కావాలంటే, పట్టంలో నా యిష్టవొచ్చినట్టే నానుండగల్దును. నా తోటోల్లంత యెలాగ తంటాలు పడతన్నారో నాను సూస్తునే ఉన్నాను. అన్నిట్లో అల్లాగుండొచ్చు గాని, ఆడ దాన్దగ్గర అలాగుండాలంటే మనసొప్పుకోడం నేదు. ఇరుగమ్మకో పొరుగమ్మకో పాటుపడితే యిల్లిరగతియాల; కన్నెపిల్లని సెరిపితే, కలకాలం దానుసురు తగుల్తాది. మరింక రోడ్డోర మునుసులున్నారు - ఆల జోలికెల్తే, ఆసుపత్రికి పోవడం సరేసరి - పన్లో కెల్లకుండ పదిరోజులుంటే కూల్డబ్బుల మాటేటి? అందుకే నా బాధ నాకు తెలియాల; ఆ దేవుడికి తెలియాలన్నాను''

పైడయ్య చెప్పడవాపి తలొంచుకు కూర్చున్నాడు. అప్పటికి చీకట్లు బాగా వొత్తుకుంటున్నాయి. కొంతసేపు ఓ పుల్లతో నేలమీద గీసిన చోటనే గీస్తూ కూర్చున్నాడు.

''ఇప్పుడైనా నాన్నిన్ను అడ్డుకోకపోదును. రాత్తిరి నాకొచ్చిన తలపులు తలుసుకుంటే, నాకే జడుపు పుడుతోంది. ఎర్రిలో ఎప్పుడేం సేసేస్తానో - అని బెంగగుంది. ఆపైన నీదయ నా అదురుష్టం'' అంటూ ఆగిపోయేడు.

గంగమ్మ కాగొంతు ఆరేళ్ల క్రితం ఎలా వినపడ్డదో, ఇప్పుడూ అలాగే వినబడింది. ఆరేడేళ్ల క్రితం ఓ ఎండవేళ ఇలాగే వచ్చేడు పైడయ్య. అప్పటికి పెళ్లవుతుందో, అయిందో గాని సన్ని కాపరానికి రాలేదు. ఇంకోసారి అడగనంటే, అలాగే కానిమ్మంది గంగమ్మ. నాటికి నేడు మళ్లీ వచ్చేడు. పైడయ్య మనిషేవీ పెరగలేదనుకుంది తన మనసులో.

''ఇందాక ముసిలోడి పలకరింపు ఇన్నావు గదా! నిన్ను మీ పెద్దన్ననుకున్నాడు'' అంది ముందస్తుగా. ''నానిప్పుడు నీకొదెన్నవుతాను. గడియకో, సిటంకో మీయన్న రావాల'' అంది గంగమ్మ.

ఆ భోగట్టా విని పైడయ్య బొమ్మలా కూర్చుండిపోయేడు. అతడిమీద జాలి ఇబ్బడి కాగా గంగమ్మ అడిగింది.

''నీకు నాటుసారా పడతాదా?'' అంది తల్లిలా.

పైడయ్య యెప్పుడైనా తాగడం కద్దు. కాని అతడు మాటాడలేదు గంగమ్మ గ్రహించి లోపలికెళ్లింది. తిరిగొచ్చి వో సీసా ముందు పెడుతూ -

''ఇది మీ అన్నకైతే రెండు సుట్లుకొస్తాది. సగం దాకా తాగి సగం ఒగ్గీ'' అంటూ మసాలా పొట్లం పక్కను పెట్టింది.

ఆ తరువాత ముసలాడికి గంజి పొయ్యడానికెళ్లింది. అతడికింత పోసి, తను కొంచెం తాగి, కుండలూ మండలూ కడిగి తిరగొచ్చేసరికి - పైడయ్య వెచ్చగా కబుర్లారంభించేడు. ఒక అరగంట ముప్పావుగంట గడిచేసరికి - చుక్కల్లో యెగురుతున్నాడు.

సగం సీసా అయ్యేక ఆపమంది గంగమ్మ.

''వొదిన్నవుతానంటే నిన్నొగ్గేసినాను. అన్నీ నీ యిష్టవేనంటే. అలా సాగులావా?'' అన్నాడు పైడయ్య.

ఆ మాట విన్నాక, తాగనివ్వడమే మంచిదనుకుంది గంగమ్మ. తాగేవాళ్ల సంగతి ఆమెకు బాగా తెలుసు. అతడు మోతాదు మించినా యింకా మతి తప్పడం లేదు.

''మాయన్న అందరు పిల్లలమీద, పెళ్లానంటే, మంచోడు - మంచి పనిచేసేడను కున్నాను. అయితే ఆడు యెలాగ బరిస్తన్నాడా అని దిగులు గుండేది. ఇదిగిలా గన్నమాట!

నన్నడిగితే యిదీ మంచిపనే ననాల. అత్తలాడూ సుకపడతన్నాడు. ఇత్తల నువ్వూ సుకపడతన్నావు. మనలాటి కస్టపాటు జాతికే వుంది. కడుపు సుకం లేనే లేదు. ఎయ్యి జనమలెత్తినా వొస్తాదని నమ్మకమూ లేదు.

సుకాలన్నిట్లోకి సుకం ఆడా మగా ఒక్కా అనుబగించింధే - సుకం! ఇప్పుడిదీ సుకవే. కానీ దీనికి కరుసున్నాది. ఇదయ్యేక రేపుకొంత దండుగున్నాది. ఆ సుకానికైతే కానీ కరుసు నేదు - రేపు దండుగ నేదు. పేదోడికి బగమంతుడు మిగిలించిన సుకమది. అయితే, నాలాటి అదురుష్టవంతుడు కడుపు కాసిస్తే ఆ సుకవూ అందడం నేదు సూడు - అదెంత పసందుగుందో...''

సుఖంలేని తన బతుకును గురించి, ఏవిటేవిటో కూస్తున్నాడు పైడయ్య. అంత మైకంలోనూ మనిషినే కాదు దేవుణ్ణి కూడా నెపపెట్టడం లేదు.

కూసి కూసి, చప్పచప్పగా చల్లారిపోయేడు పైడయ్య. పాకలో ఎండుగడ్డి తెచ్చి పరిచేలోగా భళ్లున వాంతి చేసుకున్నాడు. తరవాత ఇంకోసారి కెవుక్కుమన్నాడు. గంగమ్మ వచ్చి సందిట పట్టుకోబోతే, ఆమెను బలహీనంగా తోసేస్తూ వొళ్లెరక్కుండా పడిపోయేడు. ఆ పడి-పోడం- సరిగ్గా అప్పుడైన వమనంలో పడ్డాడు.

* * *

''ఒలే! ఓలే బంగారి! యిత్రాయెు గుడిసేటా!'' అని ఒక్క సుగ్రీవ బొబ్బ పెట్టింది ఎర్రెమ్మ.

ఆ రాత్రికే పెద్దల్నీ, పేరంటాళ్లనీ, మూలకి తెచ్చుకొనేసరికి పొద్దు బాగా వాటాలి పోయింది ఇంటిల్లిపాదీ అప్పుడే భోజనాలకు కూర్చున్నారు.

"కనపడదేటే, ఓ లీపరాల! యిట్రా" అంది బయటనుండి కేక. నారాయుడు లేచిపోయేడు.

"నువ్వు లేపడానికొల్లకాదు పొద్దల్లా వుపాసవున్నావు. పెసాదం ముందు కూకుని లెగడం పెద్దల కసారం నా నెత్తానుండు" అంటూ చెయ్యి కడుక్కుంది బంగారి.

"నా మాటకి తొందరపడకు. నానొచ్చి మాటాడతాను. వుండమును" అన్నాడు నారాయుడు.

పెడసింపా గంధంతో, మెట్టలో యెర్రగన్నేరుతో, వీరావతారంలా నిలబడింది వాకిట్లో ఎర్రెమ్మ. బంగారి చూరుకింద కనిపించగానే -

"ఏసె! రాత్తిరి నీ కొడుకు నెక్కడి కంపినావె?" అంది తలెగరేస్తూ.

"ఎక్కడికి పంపినానూ?" అంది బంగారి.

"ఎక్కడికి పంపనేదా?"

"నువ్వే సెప్పు"

"నువ్వే సెప్పు"

"ఏంచిందానివి నువ్వు!"

"సెప్తానే సెపతాను. సెప్పితే సెప్పుతో కొట్టించుకుంటావా?"

"నావల్ల తప్పయిన్నాడు నాను కొట్టించుకోనా"

"నీవల్ల తప్పో, నీ కొడుకు వల్ల తప్పో మొత్తానికి తప్పయ్యింది"

"తప్పయిన్నాడు - అలాగే"

"రాత్తిరి నీ కొడుకెక్కడికి కెల్లినాడు? రాత్తిరి నీ కొడుకును యిద్దరు మనుషులు మోసుకు రానేదా?"

"ఏ వూరు కొడుకు - యే వూరు మనుషులూ?"

"నీ పెద్దకొడుకూ, సిన్నకొడుకూ - నీ మూడో కొడుకును మోసుకొచ్చినారు"

"ఔను మొసుకొచ్చినారు"

"ఎక్కణ్ణుంచి మోసుకొచ్చినారు?" అంది ఎర్రెమ్మ మళ్లీ.

బంగారి మాట్లాడలేదు -

"ఎందుకేత మోసుకొచ్చినారు?"

దానికీ జవాబివ్వలేదు.

"ఏం? నడ్డానికీ నీ కొడుక్కి కాల్లునేవా? నిన్న పొద్దున్ననగ యెల్లిన మనిసి, పొద్దో

యిందాకా యేమైపోనాడు? ఎతకడానికెల్లిన నీ పెద్దకొడుకు యేం తేలకొచ్చినాడు? బావు రేత్తిరికాడ నీ పెద్దకొడుకు, నీ సిన్న కొడుకు లబ్బలు కొట్టుకుంటూ యెక్కడికి పారెల్లినారు? యెల్లిపోల అద్దను రాతిరేల రగస్సెంగ మోసికొచ్చినాలేల? తాగేసి పడిపోతే అంత రగస్సెవెందుకు? నీ పెద్దకొడుకు తాగుముచ్చు. నీ రెండో కొడుకు తాగుతాడు అసలాడు తాగనే తాగట్టు. ఎన్నడూ తాగనోడు యియ్యాల ఎలా తాగినాడు? తాగితే, ఒక్కల్లు సాక్కాడ తాగుతారు; ఓ సారాబట్టీకాక తాగుతారు. యెనల్తో నంజ, అక్కడున్న నంజ; వూరవతల పాకేసుకున్న నంజ; గుడిసేటి నంజ; సడిసేటి నంజ; అడ్డమైనోటికీ ఆసించే నంజ! - ఆ నంజింటికెల్లి తాగడవేవి? అసలాడు అక్కడ కేలెల్లినాడు? దానికీ ఈడికీ సంబంధవేటి? ఆడ ఇసుట్టువ నెల్లినాడా? ఆడి ఎరసిద నెల్లినాడా? ఈడి పయిసేటి దానివయసేటి? ఆ యేలప్పుడు నాయక్కడ ఉండవలసిన మనిషి దానక్కడ కెలాగెల్లినాడు? ఇదాడికి పుట్టిన బుద్దా నేక ఏం నంజేనా నేరపుతోందా?''

అంటూ గుక్క తిప్పుకోడానికి ఆగింది ఎర్రెమ్మ. ఈలోగా మూగనలసిన జనమందరూ చుట్టూ మూగేసేరు.

''అయిందా యింకేవనా వుందా?'' అంది బంగారి.

''ఏవి? ఇది సాల్దేటి?'' అంది ఎర్రెమ్మ.

''అవునే సాల్ననే సెపుతున్నాను''

''అయితే అక్కడికెందుకెల్లినాడో సెప్పు!''

''నా నెల్లమన్లేదు. ఎల్లినోడు ఆడు. అడ్డాడుగు''

''ఆణ్ణే అడుగుతాను. యిత్తలకు రమ్మను''

''ఆడు కంచం కాడ కూకున్నాడు''

''తిన్నాకే రానీ''

''ఏవింట్లోకి రావా?''

''నీ కొడుకు నా యింటికొచ్చిన్నాక నీ గుమ్మం తొక్కను''

''అయితే అక్కడే వుండు'' అంటూ లోపలికెళ్లిపోయింది బంగారి.

''అవునే యెర్రి, నీకు పండుగా, పున్నం నేదేటే?'' అంటున్నారు బయట జనం. ఎర్రెమ్మ వాళ్లమీద కూడా కలియబడుతోంది.

''అదొత్తినే రానేదు. జగడానికొచ్చింది'' అంటూ లోపలికెళ్లిన బంగారి, పడుతున్న చెయ్యి 'డిగేసుకోడం చూసింది. ఎందుచేత అనకుండానే, నారాయుడు చెప్పేడు

''ఆడు పయానవ్వ పోతన్నాడు''

''మల్లేనొచ్చింది?''

''యీ తగవుల్నాను పడలేనంటున్నాడు''

''ఇదేట్రోరయ్యా! అత్తమీద కోపం దుత్తమీద సూపిస్తావేట్రా యిల్లొల్లూరా'' అంది బంగారి.

---

''నువ్వు మరీనే ఆడసలే బేజారుగున్నాడు. దానిమీద అత్తల యెర్రమ్మా, యిత్తల నువ్వూ. యిద్దరికిద్దురూ ఓటే'' అన్నాడు నారాయుడు

ఈలోగా, బంగారి రెండో కొడుకు తినడం అయ్యింది ''బ్రేవ్''మని తేన్చేడు కోటయ్యా - ఆవతలకెళ్తూ.

ఒచ్చిన మనిషిని, వీడా అన్నట్టు చూసింది ఎర్రెమ్మ.

''మీ తమ్ముడింకా నెగనేదేటి!'' అంది ఎర్రెమ్మ

ఎటో పోతాడనుకున్న కోటయ్య ఆమె దగ్గరికే నడిచేడు.

''నువ్వెక్కణ్ణుండీ నెగు'' అన్నాడు తాపీగా.

ఎర్రెమ్మ తన ననుకోలేదు!

''నువ్వెక్కణ్ణుండి నెగు'' అన్నాడు కోటయ్య.

''ఏఁవీ?'' అంది ఎర్రెమ్మ.

''ఇక్కణ్ణుండీ నెమ్మంటే!'' ఒక్క గత్తురు గత్తిరేడు. చుట్టూ జనంతోపాటు ఎర్రెమ్మా తుళ్లిపడింది. తుళ్లిపడుతూనే!

''ఓరి గండో!'' అంది.

అనడఁవే తరువాయి - గుపీ దబీ దుబీ మని మూడు గుద్దులు గుద్దేడు. కిందపడ్డ మనిషిని ఎడాపెడా నాలుగు తావులు తన్నేడు.

''ఇంక నెగు'' అన్నాడు తలమీద కిసురుతూ.

''ఓలమ్మో... ఓర్నాయినో...'' అంటూ లేచిపోయింది ఎర్రెమ్మ.

''ఎల్లు'' అంటూ ఆమె వెళ్లవలసిన దారి చూపించేడు. ఆమె అలాగే, అయ్యా, అవ్మల్నీ తలచుకుంటూ - ఊగిపోతూ, జోగిపోతూ అల్లంత దూరం వెళ్లింది. అక్కడినుండి వెనక్కి తిరిగి ఓరి అలాటి గండ... ఓరి యిలాటి గండ... అంటూ వల్లాపన మొదలెట్టింది.

ఈసారి పేట జనంతోపాటు, వూరి జనం కూడా ఈ వింత చూస్తున్నారు. కొంతసేపు ఆమె వల్లాపన విని, రెండడుగులు ముందుకేసేడు కోటయ్య -

''మల్లి రమ్మన్నావా? యింటికెల్తావా?'' అంటూ పొలికేక పెట్టేడు.

ఎర్రెమ్మ తిడుతూనే వున్నా నాలుగడుగులు వెనక్కెళ్లింది. అక్కడ మళ్లా తిరిగి మళ్లా తిడుతోంది. ఈసారి వాడి పెళ్లాన్నీ, తల్లినీ, వాడన్నదమ్ముల్నీ వరసపెట్టి తిడుతోంది.

కోటయ్య ఆమెను విడిచిపెట్టి లోపలికెళ్లేడు. లోపల పైడయ్య ప్రయాణానికి సిద్ధమై వున్నాడు.

''ఎట్రెల్తి'' అన్నాడు కోటయ్య గత్తురుతున్నట్టు.

పైడయ్య మాటాడలేదు.

''ఎల్తే, నువ్వు నీ పెల్లం కాడకెల్లు-లేకపోతే దాన్నిక్కడికి తెచ్చుకో ఏడుపు మొకవేసుకొని ఎక్కడికో పోతావేటి?'' అన్నాడు తుండుగుడ్డతో అరుగు దులిపి కూర్చుంటూ

అతడి మొహం కందగడ్డలా వుంది అతణ్ణి శాంతింపచెయ్యాలని నారాయుడికి మహా యిదిగా వుంది. కాని యేవంటే యేవవుతుందో అని భయపడుతున్నాడు.

''నీకు సేతకాప్పోతే సెప్పు నాను తీసుకొస్తాను'' అన్నాడు చప్పున లేచిపోతూ.

పైడయ్య మాటాడలేదు. కోటయ్య అకస్మాత్తుగా బయలుదేరి పోయేడు. ఈసారి నారాయుడు జడిసిపోయేడు.

''ఓరుండ్రా, అయ్య! దురితం తగదురా'' అంటూ వాకిట దాకా వెంటబడ్డాడు. కోటయ్య వినిపించుకోకుండా సాగిపోయేడు.

ఎర్రెమ్మను ఆమె ఇద్దరి కూతుళ్ళూ చెరో రెక్క పట్టి ఇంటికేసి లాగుతున్నారు. ఆమె వల్లాపన ఆపకుండా రెండడుగులు వెనక్కి నడిచి, ఒకడుగు ముందుకేస్తోంది. మధ్య మధ్య కుడిచేయి పట్టుకున్న కూతుర్ని విదిలించి, బారలు సాచి సాచి తిడుతోంది. పెద్ద పెద్ద అంగల్తో కోటయ్య వాళ్ల యింటికేసే నడుస్తున్నాడు.

''ఓర్లాయే!'' అంటూ కీచువంది సన్నెమ్మ. ఎర్రెమ్మ కూడా చూసినట్లుంది - కూతుళ్లకు లొంగిపోయింది. కాని యిల్లు చేరుకున్నాక, ధైర్యం పుంజుకుంది.

''ఏం? నా కూతురికి - అందం తక్కువ నెల్లినాడా! నా కూతురికి వయసు తక్కువ నెల్లినాడా! నా కూతురు కులం తక్కువ నెల్లినాడా! నా కూతురు గుణం తక్కువ నెల్లినాడా?... ఏలెల్లినాడు. ఎందుసేతెల్లినాడు?'' పిడికిలితో గాలిని తాటిస్తూ అడుగుతోంది - ఎర్రెమ్మ.

ఆమె ఆక్రోశంలో లోతున్నమాట నిజమే. కాని కోటయ్య కదేమీ పట్టడం లేదు. అతడి చూపులన్నీ సన్నిమీదే వున్నాయి. ఆ చూపు చూడగానే సన్నికి భయం వేసింది. ఆమె గబగబా లోపలికి పోయి తలుపేసుకోబోయింది. తలుపు పడలేదు.

''బయలెల్లు'' అన్నాడు కోటయ్య గద్దిస్తూ.

సన్ని వణికిపోతూ బయటికి వచ్చేసింది.

''పద!'' అన్నాడు దూరంనుండే.

గజగజ వణికిపోతున్న కూతుర్ని చూసి -

''ఓర్‌బాబు శాంతించరా - నాయనా! కోటయ్య శాంతించరా!'' అంటున్నాడు సన్ని తండ్రి. అతడికి ఆయాసంతో నోట మాట రావడం కష్టంగుంది.

''నువ్వూరుకోర మావా! నీకు తెల్దు'' అన్నాడు కోటయ్య హెచ్చరిస్తున్నట్టు.

సన్నిని రెక్క పట్టుకొని చూరుకిందనుంచి లాగి ఒక్క తోపు తోసేడు కోటయ్య.

ఆసరికి - ఎర్రెమ్మ చేసే రొదనతో ఆ వాడ వాళ్లందరూ యిళ్లలోంచి బయటికి వచ్చున్నారు. సన్ని చెల్లెళ్లు కుయ్యో, మొర్రోమంటూ అక్కని చుట్టుకున్నారు.

మరొక్కతోపు ముందుకు తోసేసరికి సన్నెమ్మ పరిగెత్తుకుంటూ అత్తారింటి బయల్దేరింది.

వాడకట్టును వాకిళ్లలో చూసిన ధైర్యంతో -

''ఓలమ్మ! యింటిమీద పడిపోనారే! ఓలమ్మ! నేనేం సేతునో! ఓర్నాయినో!'' అంటూ ఎర్రెమ్మ కూతురికి అడ్డం పరిగెత్తింది.

''నువ్వెల్లకు, నువ్వెల్లకు!'' అంటూ సన్నిని మళ్లించబోయింది ఎర్రెమ్మ.

కోటయ్యవాళ్ల మధ్యకొచ్చి - చెరోపక్కా తోసేసేడు. సన్నిని ముట్టుకోవలసిన పని లేకుండా - తుండుగుడ్డ ఆమె నడుంకు గొరగొర యీడ్చుకుపోతున్నాడు. కిందబడ్డ ఎర్రెమ్మ లేచి వెంటబడి, కొట్టి రక్కి కురవబోయి, దుమ్ము చల్లీ ఆపబోయింది. ఊరువాళ్లు - ఊరంచున నిలబడి చూస్తుంటే, రెండువాడల వాళ్లూ కొందరు - విడిపించడానికి పరిగెత్తేరు. అడ్డుపడ్డ వాళ్లనందర్నీ పక్కకు తోసేస్తున్నాడు కోటయ్య.

తుండుగుడ్డలో పట్టి తెచ్చిన మరదల్ని ఎదురుగా వస్తున్న తల్లిమీదకు విసిరి, గుడ్డ దులుపుకొని వెళ్లిపోయేడు కోటయ్య.

అత్తను చూడగానే బావురుమంటూ చతికిలబడ్డ సన్నెమ్మను పొదివి పట్టుకు లేపింది బంగారి. ''నీకేం బయంవే! - ఓలిగుంట నీకేం బయమే?'' అంటూ కోడల్ని యింటికేసి నడిపించుకుపోయింది.

ఎర్రెమ్మ అక్కడే చతికిలబడి ఏడుస్తోంది.

వాళ్లటూ వీళ్లిటూ కాగానే జనం పోగులుపడి పదుగురూ పది మాటలంటున్నారు.

''మొదట అది యింటిమీదకెల్లింది. యిప్పుడు ఈడొచ్చినాడు'' అంటున్నారో చోట.

''ఆడది ఎల్లి జగడాలాడిందానికి, మొగోడుయింట్లో పొరబడ్డదీ ఒకటేనా?'' అంటోంది ఓ పెద్దమ్మ.

''ఎంత సొంత మరదలైనా - యింకో ఆడదాన్ని పదిమంది ముందూ రెక్కట్టుకు వాగడం నానెక్కడ సూడ్నేదు'' అంటోంది ఓ ఆడపడుచు.

''అదే దాని మొగుడైతే తప్పు నేదుంగానీ, ఈడు దాని బావకదా. ఒంటిమీద సెయ్యెయ్యడం తప్పొ? తప్పున్నరా!'' అంటున్నాడో పెద్దాయన.

''అది ఆడముండైపోయి, దాని మొగుడు అవిటోడనబట్టిగాని ఒక్క కొడుకుంటే - పుచ్చి లెగిరిపోను'' అంటోంది ఓ వుడుకు నెత్తురు.

అలాటి సమయంలో, దుమ్ముల పండక్కి మంచి వేటపోతును తెచ్చుకొనే సన్నాహంలో, బారికిని పిలవడానికి బయల్దేరేరు అసిర్నాయుడుగారు. అల్లంత దూరం నుంచే, యీ గలాటా అంతా గమనిస్తున్న నాయుడు అక్కడకొచ్చి - సంగతేవిటన్నాడు. ఊళ్లో వాళ్లెవరు సరిగా చెప్పలేకపోయారు. అప్పుడాయన బారికి పాపయ్యను కేకేసేడు.

''అవున్రా? అక్కడేటా గలాటా?'' అన్నాడు నాయుడుగారు. పాపయ్య రెండు

ముక్కల్లో సారాంశం తేల్చేశాడు.

''దాన్నీడ్చుకెళ్తున్నవాడు దాని మొగుడు కాడా?'' అన్నాడు కోపంగా నాయుడుగారు

''కాదు ఆడి రెండో అన్న - కోటయ్య''

''పిలా తొత్తుకొడుకుని'' అన్నాడు నాయుడు. బారికి కదల్లేదు.

''రాకపోతే జుట్టట్టు కీడ్చుకురా'' అన్నాడు అంతకంటే గట్టిగా.

''సిత్తం!'' అన్నాడు గాని అప్పటికి కదల్లేదు.

నాయుడికి అనుమానం వేసింది.

''ఏం ఆడు తాగుతాడేట్రా'' అన్నాడు ఈసడిస్తూ.

''ఈ ఉడుకులేవో తగ్గేక, ఇంకో గంటకి ఆలే తవ పాదాలకాడ కొస్తారుగదా! ఈ లోపట్ల మనం తగువేసుకుంటే - యెంకయ్యపాలెం యెల్లడవెప్పుడు? పోతువను తేడవెప్పుడు? ముందెల్లి ఆ పని చూస్తే కాదా'' అన్నాడు పాపయ్య నేర్పుగా.

నాయుడిగారిక్కూడా - ఆ మాటల్లో నిజం కనిపించింది

''తొత్తు కొడుకులు! వొళ్లు కొవ్వెక్కి తెగ బలిసున్నారు. కన్నూ మిన్నూ కానక కొట్టుకు సస్తున్నారు'' అని గొణుక్కుంటూ బారికి పాపయ్య వెంటరాగా, వెంకయ్యపాలెం కేసి వెళ్లిపోయేడు.

* * *

''మన తిండి మనం తిని, మన బతుకు మనం బతికిందికి ఆడికాడా ఈడికాడా ఆదువెందు'' కంటారు నారాయుడి తమ్ములు. ఆ అదుపు లేప్పోతే బారికి అడ్డే పడప్పోతే, ఆ కథ ఎక్కడి కెళ్లునో వాళ్లు గ్రహించలేరు.

పాపయ్య సెప్పినట్లే ఒగ్గంట గడిచేసరికి పేట చల్లబడింది. చెరోపక్కా యిద్దరి బుజాలు సాయం చేసుకొని ఎర్రెమ్మ నాయుడిగారి యింటికెళ్లింది. ఆమె వెంట పది, పదిహేనుమంది ఆ పేటవాళ్లు సాయం వెళ్లేరు. పేట తాగుబోతుల సంఘం గజ్జకట్టి, తప్పిడిగుళ్లు తగిలించుకుని డబ్బుల కోసం వూరిమీద పడ్డారు.

బంగారమ్మ యింట్లో పెరటి పంచను కూర్చుని, సన్ని - అక్కుర్లు బుక్కర్లేడ్చి అలిసిపోయింది. మొహం కడిగి, కొత్తకోక కట్టుకోమని బంగారి నయానా భయానా చెపుతోంది. నాయుడికి కోపం వచ్చిన సంగతి విని, కోటయ్యను అత్తారింటికి పొమ్మని నారాయుడు బలవంతం చేస్తున్నాడు. అతడావూరు దాటాడో లేదో - ముగ్గురన్నదమ్ముల్నీ రమ్మని పిలుపొచ్చేసింది.

బారికి పాపయ్య చెప్పిన సలహా పాటించి పైడయ్య నింట్లో దాచి నారాయుడొక్కడే బయల్దేరాడు. నాయుడిగారి లోగిలి చేరగానే - నారాయుడ్ని గోడ పక్కనుంచి ''నాను మాటాడ్డవైనాక, ఒక్క సిటం ఆగి అప్పుడు రా'' అంటూ బారికి లోనికెళ్లాడు.

అప్పటికప్పుడే పొద్దుగుంకి పోయింది. మందనుండొచ్చిన పశువుల్తో దొడ్డంతా

హడావుడిగా వుంది. నాయుడుగారొచ్చారని తెలిసి తప్పిడిగుళ్ల వాళ్లు రెండోసారొచ్చేరు. ఎర్రెమ్మా, జనం, ఓవార కొసిలిపోయారు వరండా అంతా, తప్పిడిగుళ్ల ఆట చూసే జనంతో -అలగోడు బాలోగోడుగా వుంది.

బారికి బయటకొచ్చి - చెప్పవలసేది మరోసారి చెప్పేడు నారాయుడికి.

తప్పిడిగుళ్ల వాళ్లు వెళ్లిపోయాక -

''బాబో బాబు!'' అన్నాడు అసిరయ్య గారితో బారిక పాపయ్య.

ఆయన తల తిప్పగానే మనవి వినిపించేడు.

''నారాయుడొస్తున్నాడు ఆళ రెండో తమ్ముడు - అంటె ఎర్రెమ్మ అల్లుడు - ఆడెక్కడికో యెల్లినాట్ట. రాగానే తోల్తానన్నది ఆలమ్మ. మరొచ్చి ఆ నడిపోడు అత్తారింటి కెలిపోనాడు. రేపు కనుం గదా?'' అన్నాడు. అందులో వింతేమీ లేదన్నట్లు.

''నడిపేసినారు! నాన్సెప్పనేదా? దాటేంచీసినారు!'' అంది నరసమ్మ ఏడుపు మొహంతో.

''నువ్వుండే. అసలోలకి లేనిబాధ అంతల పొంత లోలికట - నువ్వూరుకో'' అన్నాడు బారికి.

''అవును. ఆళ్లూ మీరూ బాగార్లు కాదా? కోపం వొస్తది'' అంది నరసమ్మ. నాయుడిది వినిపించుకోలేదు.

ఇంతలో, ''బాబ్బాబు దండాలెడతాను'' అంటూ దిగేడు నారాయుడు. అతడెంత వినయంగా కనిపించినా, అతణ్ణి చూస్తూనే అగ్గిరుద్రుడైపోయేడు నాయుడు.

''అవున్రా తొత్తుకొడకా! మీకేం వొల్లు కొవ్వెక్కిందేట్రా - కాదు మీకేం వొల్లు కొవ్విందా? ఆడముండ అనువచ్చెప్పి, దానింటిమీదకెళ్లి దాన్ని తంతార్రా? యిదేం వూరనుకున్నారా అడివనుకున్నారా?...''

''బాబూ! నానందులో లే''ననబోయాడు నారాయుడు.

''ఛాప్? తొత్తుకొడుకు మళ్లా మాటాడుతున్నాడూ? కొట్టిన దెబ్బలు కనపడవా? సాక్షం రాదనుకున్నావా?'' అన్నాడు కూచున్న చోట్లోంచి లేచిపోతూ నాయుడుగారు.

నారాయుడికి యేం చెప్పాలో బోధపడలేదు.

''ఓ రోల్లకోరా! బాబాతన్న యెల్తూ - అంతా చూసినాడు'' అన్నాడు బారిక పాపయ్య.

నారాయుడు ఆ సైగ గ్రహించి నోరు మూసుకున్నాడు. అతడూరు కోవడం చూసి నాయుడు చెప్తున్నాడు.

''నేనొస్తూనే వున్నాను. లంజకొడుకు పశువునట్టి కెళ్లినట్టు ఆడదాన్ని బజార్లో ఈడుస్తున్నాడు. నా చేతిలో కర్ర లేకపోయింది. వుంటే తొత్తుకొడుకును ఏ కీలు కాకీలిరిచేసి, ఆర్నెల్లు ఆసుపత్రిలో పారేద్దును. ఇప్పుడైనా ఆ తొత్తుకొడుకు రావాల. అడిపని పట్టాల? అంటూ వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు.

కొంచెం మంట చల్లారనిచ్చి, ''నిజవే బాబు తప్పై పోనాది'' అన్నాడు నారాయుడు,

అని-

''అదే ముందరొచ్చి రేపెట్టింది లేప్పోతే యింత రగడ జరగప్పోను. ఉదయం నించి వూపాసాలొకటి ఇలాగ కంచంకాడ కూకున్నాం. కందిరీగ నాగ పారొచ్చింది. అకాడకీ మాయమ్మ దానికి జవాబియ్యకండ లోపలికొచ్చేసింది. మా తమ్ముడు కదా! సిన్నోడు - తరకం కాసుకోనేప్పోయేడు. ఇయ్యాలే కాదు - నెల్లాల్లనించి యిదే పోరు. మాటాడితే యింటిమీది కొచ్చేస్తాది వొద్దే అంటే యినదు'' అంటూ యెదురు నేరం ఆరోపించేడు.

ఎర్రెమ్మ ఏదో అనబోతే, నాయుడు ఆమె నోరు మూయించేడు

''యింటిమీదకొస్తే నాతో చెప్పాల అంతేగాని దానింటిమీద పడ్డఁవా?'' అన్నాడు నారాయుడితో.

''సిత్తం సిత్తం అది తప్పే!'' అన్నాడు నారాయుడు. తప్పొప్పుకున్న వాళ్లని, ఎవరూ యేం చెయ్యకూడదు కదా - అంచేత నాయుడు కూడా శాంతించాడు.

తరువాత అక్కడున్న నాయుడి భార్యా; ఆవె పొరుగింటి సుబ్బవ్మగారూ; నాయుడిగారికి సినీ పంచదార తెచ్చిన సెట్టీ; ఆరికి కాళ్లు పట్టడానికొచ్చిన మంగలెంకయ్యా - పదిమందీ, పదేసి మాటలన్నారు. అందరూ, దురితం కూడదన్నారు. అందరూ, దౌర్జన్యం పనికిరాదన్నారు. ఒక్కరూ దురాగతం తగునన్లేదు. తగువులొస్తే తమలో తాము పన్నుకోడం కాదు, తగిన పెద్దలముందు పెట్టి పరిష్కారం చేయించుకోవాల. కోపతాపాలకేం అందరికీ వుంటాయి. అది అణుచుకోడం లోనే వుంది పెద్దమనిషి తరహా -

నారాయుడు అన్నిటికీ - 'అవునవ్మా! ఔను బాబూ! సిత్తం సిత్తం'' అంటూ తలూపేడు.

అంతా అయ్యేక నాయుడుగారు శాంతించి అడిగేరు.

''ఇప్పుడాగుంటెక్కడుంది!'' అన్నాడు నారాయుడితో.

''మాయక్కడే వుంది బాబు'' అన్నాడు వినయంగా.

''ముందు దాన్ని తీసికెల్లి దాని తల్లికప్పగించు. రేప్పొద్దున నువ్వూ నీ తమ్ముడూ రండి. అదీ దాని కూతురూ వస్తారు. సంగతేటో సందర్బవేటో అప్పుడేదో అడిగి చెపుతాను'' అన్నాడు నాయుడు.

బతుకు జీవుడా అనుకుంటూ 'సిత్తం సిత్తం' అన్నాడు నారాయుడు. ఎర్రెమ్మ తరపు మనుషుల మొఖాలు వేలాడగా - నాయుడు కుర్చీలోంచి లేచిపోయేడు. రెండడుగులు వెయ్యనిచ్చి -

''బాబో అసలు మనిషి నొగ్గేసినావ్!'' అంది నరసమ్మ బితుగ్గా.

''అన్నట్టు మీ యమ్మను కూడా తీసుకురా'' అన్నాడు నాయుడు. దాంతో రెండో పార్టీ మొహాలు కూడా పైకి లేచేయి.

సిరిగల పండుగ, చీకటి రాత్రి వస్తుందంటారు పెద్దలు. ఇది సిరిలేని పండుగ - కాబట్టే వెన్నెల రాత్రి తగలడిందట.

నాయుడేం చెప్పాడో తెలుసుకోడానికొచ్చిన జనంతో, యింట్లో నిలబడ్డానికి కూడా చోటు లేకుండా పోయింది. వాకిట్లో మంచం వాల్చుకుని అక్కడ కూర్చున్నాడు పైడయ్య.

కొంతసేపు పోయేక ఒక్కొక్కరే బయటకొస్తున్నారు. ఆఖర్న అయిదారు గురితో సన్ని కూడా వచ్చింది.

తెల్లని కోకల్లో - తెల్లన కాకపోయినా తెల్లగా కనిపించే పసుపు కోక, నల్లని కొప్పులో - నలుపు కాకపోయినా నల్లగా కనిపించే యెర్ర బంతి పూలు. నారాయుడు వెంట నడవగా అతడి ముందునుంచే నడిచిపోతోంది సన్నెమ్మ.

పక్కింటి వసారాన అవేవో నీడల్లా నిలబడ్డారు ఆమె తాలూకు మనుషులు. చిన్నన్న పక్కూరిదాకా సాక్కొచ్చాడు - అక్కడిదాకా పిల్లని అంపకం పెట్టి తిరిగి వచ్చేడు పెద్దన్న.

* * *

అచ్చెన్నాయుడుగారు కుద్దిరంగా కుంచవంత మనిషి. గట్టిగా తూాద్దువంటె సేరు పిడికిలుండవు. మరా బెమ్మ యెక్కడ దాసినాడో పవరు. నోరిప్పినా, పంజాయిసిర్నా పులి. అతడంటే భయమ్మూ, భక్తీ వున్నాయి జనానికి.

పండు తమలపాకులాంటి లక్ష్మీకరమైన కళలతో, కలవారి ఆడబడుచు కాపురానికొచ్చిన్నాడే ఎత్తుకుంది సిరి. ఎక్కడెక్కడ అవిర్చిన భూవులూ సాం, సేరీ కిందకి లాగేడు. పెద్ద శలాకల్లాంటి యిద్దరాడ పిల్లలకీ రాజాల్లాంటి సంబంధాలు చేసేడు. ముగ్గురు కొడుకులు - పెద్దపెద్ద పట్టణాల్లో చాలా పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. నాలుగోవాడు అందరికన్నా మరుకలు. పై దేశాలు పోవచ్చుంటారు.

''అదృష్టవంటే నీదయ్యా అసిరి బావా? కడుపులో సల్ల కదలకుండా, ప్రభుత్వంవారి ఖర్చుతో నలుగురు పిల్లల్ని పెద్ద చదువులు చదివించేవు. వాళ్ల సంపాదనమీందా, కట్నాలమీదా తక్కువలో యెక్కువ కిమ్మత్తు చేసే ఇద్దరల్లుళ్లను పట్టుకొచ్చేవు. వూర్లో పలుకుబడికి పలుకుబడి. ఎన్నాళ్లు తిన్నా అరగని తరగని ఆస్తి. అవిరితే అలాగన్నీ అమరాలి!'' అంటాడు లోకల్ యెమ్మెల్యేగారు.

అతడికి యెపుడేనా నాయుడు తనకు పోటీ కావచ్చున్న భయం ఉంది. అది నిజంగా అనవసరమైన భయం.

అచ్చెన్నాయుడు గారికి రాజకీయాలంటే కిట్టవు. ఇవన్నీ పెద్దా చిన్నా చెడిపోడానికే పన్నాయించాడు. ఆయనా ఒకప్పుడు గాంధీ శిష్యుడే - యిప్పటికీ ఖద్దరే వేస్తాడు. అయితే గాంధీతోనే అతని రాజకీయాలూ అంతరించేయి.

ప్రస్తుతానికి అతని వూరే రాజ్యం. అందులో ప్రజల బాగోగులే అతని రాజకీయాలు. ఈ ప్రజలు తమలో తాము కలహించుకోకుండా, ధర్మమార్గాన నడుస్తూ నీతిగా బతకడమే అతనిక్కావాలసింది. ''బతుకు యివేళుండి రేప్పోయేది. ధర్మం కలకాలం నిలిచేది. దాన్ని తప్పితే లోకం తలకిందులు కాదా?'' అంటాడాయన.

ఆయన మాటల కందరూ తల వూస్తారు. ఆచరణ కొచ్చేసరికి మరిచిపోతుంటారు.

నాయుడుగారు దేన్నైనా సహించగలరుగాని, రెండు సహించలేరు ఒకటి దొంగతనం, రెండోది దౌర్జన్యం.

''తొత్తు కొడుకుల్లారా, మీకు తిండికి లేకపోతే అడుక్కు తినండి. బిచ్చం దొరక్కపోతే చావడమైనా మేలు. అంతేగాని, దొంగతనం చేస్తే యిహనా, పరనా చెడతా(్రా. మీకు బుద్ధెందుకు లేదూ'' అంటారు.

కన్నగాడు కన్నం వేస్తే అందులో కొంత ఘనతుంది. కొంత కష్టం కూడా వుంది అంచేత దాన్ని సహించవచ్చు. చేల్లో దొంగతనం మాత్రం అలాటిది కాదు. కృషి ఖర్మ అన్నది నమ్మికమీదా, మనిషిమీద మనిషికుండే విశ్వాసం మీదా సాగాలి. ఎంత మందీ మార్బలం వున్న రైతుకైనా అహర్నిశలూ కాపు కూచోవాలంటే సాధ్యం కాదు. అంచేత ఆ రకం దొంగతనం రుజువైందంటే యింక వెనకా ముందు చూడడు.

''తొత్తుకొడకా! నీ యమ్మగారి సొమ్మనుకున్నావా? నీ బాబుగారి సొమ్మనుకున్నావా? ఆ యెవసాయం నువ్వెట్టినావురా?'' అంటూ పులుసులోకి ఎవిక లేకుండా రోలేసి ''ఫో లంజాకొడకా!'' పొమ్మంటాడు.

అక్కడికీ దొంగతనాలు జరుగుతూనే వుంటాయి. కొన్నిటిని చూసీ చూడనట్లు వదిలి; కొన్నిట్ని గట్టిగా పట్టుకొని; కొన్నిట్ని కూకలేసి పొమ్మని, ఆర్నెల్లకి ఏడాదికోసారి పంజా విసిరి హడలగొడుతూ, అలా తీసుకొస్తున్నాడు.

అలానే దౌర్జన్యాల విషయంలో కూడా. అతడు వాటిని చాలా పట్టుదలగా అణుస్తాడు.

మీకూ మీకూ తగూవస్తే, వూర్లో గ్రామాధికారులున్నారు? మామీద విశ్వాసం లేప్పోతే పోలీసులూ, కోర్టులూ వున్నాయి. అంతేగాని తమకు తాము పెద్దలై తన్నేసుకుంటామంటే, ఆ దౌర్జన్యవేఁటో నేనూ చూస్తాను అంటాడు నాయుడు. చూసేడో అంతు చూసేడే!

దౌర్జన్యం అంటే అంత కోపం కాబట్టే నిన్నటి దినం కోటయ్యే చేసిన జులుంకి ఆయనకు అంత వొళ్లు మండింది. అందుచేతే ఇవేళ పండుగైనా ఆయన తగువుకు పిల్చేడు.

అన్నాడుగాని, ఆ ఉదయం అతనికి తీరిక కాలేదు. మధ్యాహ్నానికి కూడా నసుగుతుంటే పాపయ్యన్నాడు -

''బాబూ, వుదయంవల్లా ఆ మాలోల్లకి అగ్గుల్లేవు - తవరెయ్యేలకి పిలుస్తారో అని, అలక్కాసుక్కూకున్నారు. మరీ మద్దేనవైన ఆ తగువేదో తెల్లార్చకపోతే, రేపో గుంటడు- పట్టం పోవాల''

''సరే, అంబళ్లేల దాటేక పిలు'' అన్నాడు నాయుడు.

ఆ వేళకు ముందునుంచే తొందరచేసి, ఒక్కొక్కళ్ళే లోగిలికి తోలుకొచ్చేడు పాపయ్య. బాబు బయట్నుంచి వచ్చేసరికి బాగా పొద్దోయింది. ఈలోగా వాకిట జనం పడిగాపులు పడీపడీ - వాకిట కూర్చున్నారు బారన్నర పొద్దుందనగా వచ్చి -

''ఔ(్నా బారికి! అందరొచ్చే(్రా?'' అంటూ లోపలికెళ్లిపోయేడు నాయుడు.

ఆయన కాఫీ తాగి బయటకొచ్చే సరికి అందరూ సర్దుకు కూర్చున్నానాయుడుగారు కుర్చీ లాక్కొని కూర్చున్నారు

ఆయన కెదురుగా ఓవార నారాయుడూ, అతడి వెనుక తల్లీ కూర్చున్నారు. తల్లి పక్కనే, పట్నం వేషంలో పైడయ్య గొంతకూరు. ఆ వెనక యిద్దరాడాళ్లు నిలుచున్నారు.

రెండోవార - ఒంటినిండా పట్లతో, తలకో గాయం కట్టుతో ఎర్రెమ్మా - ఆ పక్కన ఆమె కూతుళ్లిద్దరూ కూర్చున్నారు. వాళ్ల వెనుక పొరుగు నరసమ్మా, ఇంకో నలుగురు ఆడా, మగా నిలుచున్నారు.

''ఆళ్లంత యెవరే?'' అన్నాడు నాయుడు.

''సాచ్చుకులు బాబు! సాచ్చుకులు'' అంది నరసమ్మ.

''దానికి నోర్లేదేటే! అవునే ఎర్రెమ్మ! ఆల్లంత దేనికి?'' అన్నాడు తలెగరేస్తూ.

''నిన్న నన్ను తన్నినారు గదా? ఈ పట్లని సూడు. ఈ దెబ్బలూసాడు. ఏ కీలుకు కా కీలు యిడిపోనాది''

''మంచిపనయ్యింది లంజా. అంతకన్నా ఆ నోరు నొక్కేస్తే బాగుండిపోను. తొత్తుకొడుకు కీళ్లిరిసేసినాడుగాని, తెగని కత్తట్టుకొని ఆ నాలిక్కోసీవలసింది. నేనైతే ఆ పన్సేదును'' అన్నాడు నాయుడు.

నారాయుడి తరఫు ఆడవాళ్లు తలలు పక్కకి తిప్పుకుని ముసి ముసి నవ్వుల్నవ్వేరు.

''బాబూ బాబు! నువ్వలాగ అలుసిస్తే, ఆలు మరీ మితిమీరిపోరా?'' అన్నాడు - ఎనకనుంచి ఎర్రెమ్మ మనుషుల్లో ఒకడు.

''చాఫ్ తొత్తుకొడుకుల్లారా! మీ యిరుగు పొరుగులు చేరే, అయినవాళ్లకీ కానివాళ్లకీ తగువులు పెంచుతుంటారు. లేప్పోతే, నిన్నటికి నిన్న తీర్చిపొమ్మన్న తగువుకి మళ్లా యియ్యేళ సాక్షేలూ, ఋజువులూ తెస్తారా?'' అన్నాడు నాయుడు. దాంతో అందరూ నోరు మూసుకున్నారు.

''నిన్న నువు తీర్చిన తగువేటి? నువ్వెట్టిన సీవాట్లు నీకాడే వున్నాయి. నా దెబ్బల్నాకాడే వున్నాయి'' అనాలనుకుంది ఎర్రెమ్మ. కాని అప్పటికే ఆయన ......మీదున్నాడు. ఏఁవంటే యేం తిడతాడే అని వూరుకుంది.

కొంచెంసేపు. పోనిచ్చి, శాంతించిన గొంతుతో అన్నాడు.

''ఔన్రా. నేను చూస్తూనే వుంటాను. మీ మాలపేట్లో రోజూ యే వారో ఓ వార, యెందుకో ఒకందుకు తిట్టుకుంటూనే వుంటారు కదా! ఎందుకోసవలా తన్నుకు సస్తారు? ఏం మీకు పంచుకుంటికి ఆస్తులున్నాయని తన్నుకుంటారా? కలుపుకుందికి భూవులున్నాయని తన్నుకుంటారా? లేకపోతే ఒక నీటికాడ తగువా? ఒక దారికాడ తగువా? దేనికి మీ తగువులు?''

అంటూ తగువుకొచ్చిన జనవంతా తలొంచుకున్న దాకా చూసేడు. అప్పుడు తన వుపద్ఘాతం యింకా సాగించేడు.

''ఏదో భగవంతుడు మీకింత రెక్కలిచ్చేడు పదిమందీ పస్సోలలు ఒక్కనాడు తెచ్చినా, పదిరోజులు గంజి తాగి గడిపేసుకోగల్రు. అలాటప్పుడు నలుగురూ కలిసి మెలిసుంటే అదెంత హాయి యిలా తెల్లారిలేస్తే తగువులు పడ్డం - యిదేం సుఖవు? మీకు మతులుండవా? లేకపోతే, అందులో ఏదో పురుగుండి అలా దొలుస్తుంటుందా?''

ఏం చెప్తారా జనం? యేం చెపితే నాయుడికి బోధపడుతుంది!

''అందుచేత నా మాట విని తగువులు పెంచుకోకండి వున్న తగువులు తుంచుకోడం నేర్చుకోండి''

అని, అసలు - తగువుకి మూల కారణం చెప్పమన్నాడు నాయుడు.

ఎర్రెమ్మా, ఎర్రెమ్మ తరఫున వచ్చిన మనుషులుకూడా ఆ తగువు గురించి సరిగా వివరించలేకపోయారు. వాళ్లెంతసేపు చెప్పినా - ఎవరు, ఎవరితో, ఎప్పడేం అన్నారో - దానిమీద ఎవరు, ఎందుకు, ఏవని యేం చేసేరో - చెప్తారే తప్ప, నాయుడికి కావలసినట్టు దాన్ని చెప్పలేకపోయేరు. అప్పుడు నారాయుడే యిరుపక్షాల వాదనా చేతనైనంత నిష్పక్షపాతంగా వివరించేడు.

నారాయుడు చెపుతుంటే - నాయుడు కొంత విన్నాడు; కొంత వినలేదు. వెంకయ్యపాలెం వెళ్లే దారిపొడుగునా బారికి పాపయ్య యేం చెప్పేడో, ఇప్పుడు అదే చెప్తున్నాడు నారాయుడు. అంచేత అంతా అయ్యేక -

''అయితే అదట్రాతగువూ?'' అన్నాడు నాయుడు.

''అంతేగాని బాబు యింకొక్కటుంది'' అంది నరసమ్మ. ''అట అట కబుర్లేగాని నా సెవులుతో నా విన్లేదు. కాని బంగారవమ్మ ఒక్క మాటందట. ఏం జూసుకుని దాని మిడిసిపోటో నాకు తెలీకుండున్నాది. నానియ్యేలే సెపుతున్నాను. ఏడాది తిరగకుండ నా కొడుక్కి మరో మనువు సెయ్యకపోతే నా పేరు బంగారే కాదు - అందిట. అది ఇన్నాకే ఎర్రెమ్మ కూపీల్లాగడం మొదలయ్యింది. ఏవి విన్నాదో నిన్న ఆలింటి మీదికి బయలెల్లింది. ఎల్లిందేవో వొళ్లు పులాగ్గా తన్ని పంపించినారు'' అంది నరసమ్మ.

బంగారి ఏదో అనబోతే ఆమెనాపి నాయుడడిగేడు.

''అవునే నీ పేరు నరసమ్మా?''

''......''

''నువ్వు ఎర్రెమ్మ తరపు ప్లీడరవా, సాక్షివా!''

''......''

''కాదు. నీకది వకాల్తా యిచ్చిందేటే!''

''బాబూ బాబు'' అంది ఎర్రెమ్మ. అని ''నానే దాన్ని మాటాడమన్నాను. మాటాడ్డానికి నా నోరు మంచిది కాదు. అసల్నాకు ఓపికా నేదు''

''నీకు సంకటం?'' అని యీసడించి ఒక్క క్షణం పోయేక సన్నెమ్మ కేసి చూస్తూ అన్నాడు.

''అవునే దాని కూతురెవరు నువ్వా?''

సన్నెమ్మ ఔనంది.

''నీ పేరేం పేరు?''

సన్నెమ్మ చెప్పింది.

''మీ ఇంటి పేరు?''

సన్ని తన అత్తారింటి పేరు చెప్పింది.

''అవునే యెర్రి, మీ ఇంటి పేరు?'' అన్నాడు నాయుడు.

''నీకు తెల్దేటీ?'' అంది ఎర్రి.

''చెప్పు లంజా''

వెంటనే ఎర్రెమ్మ చెప్పేసింది.

''అవును గద? కాబట్టి - అది పూర్వం యెప్పుడో నీ యింటి మనిషైతే కావచ్చు. ఇప్పుడు నీ పిల్ల కాదు -

దానిష్టవైతే దాని మొగుడిష్టవైతే వొస్తాది. దాని మొగుడికీ, అత్తకి యిష్టవైతే పంపిస్తారు, లేకపోతే లేదు. నా పిల్లన్నేను తీసుకుపోతాడాననడానికి, నీకు న్యాయం ప్రకారం యే హక్కూ లేదు. ఇంక నోరు మూసుకూరుకో'' అన్నాడు నాయుడు.

ఎర్రెమ్మ కంట్లో తిరగడానికి నీళ్లులేవు. ఆ పొడి కళ్లతో అలా నాయుడి కేసే చూస్తోంది.

''నీక్కావాలంటే, యేదో ఆళ్లని బతిమాలి తీసికెళ్లు. లేదా నీ కూతురు మనువొగ్గ కుంటుందేవో చూడు''

చివరిమాట గట్టిగా వినిపించేసరికి నారాయుడికే కష్టవైనట్టుంది.

''బాబూ! అదేం మాటగాని- 'కనుక్కున్న తల్లికిలేని హక్కు! కాని కండె కట్టినోడికా?' అని మాలో సావెతుంది. దానక్కు దానికీ వుంటది. మాయక్కు మాకూ వుంటది? ఆడపిల్లున్నదంటే ఇద్దరికీ అక్కులుంటాయి. మాం కాదనవు...'' అన్నాడు నారాయుడు వుదారంగా.

''కాకపోతే, కడుపు మంటకొద్దీ ఈ గోలంతా లేపినాది. ఎర్రెమ్మ యేటనుకుంటాదంటే, దానికి నలుగురు కొడుకులూ, యిద్దరు కోడళ్లూ గదా - నాకొక్కదాన్ని యిస్తే తప్పా. నాపిల్లేగదా - అనుకుంటాది. కాని బాబూ! ఎంత సెట్టు కంతగాలన్నారు.

మా తండ్రినాడు, తవరు మాకో మడిసెక్క వొరకట్టుకోమన్నారు - ఆ సెరువు గర్భంలో వొరకట్టిన ముక్క, అదో పాతిక సెంట్లుంటాది. అది మా పానానికి రాజుగారి యేనుగైపోనాది. అది వొట్టి గొడ్డునాగ యెక్కళ్లేందీ మింగడవే గాని సేపడం కనబడదు. వొద్దే అంటే, మాయమ్మా, సిన్న తమ్ములిద్దరూ యినిపించుకోరు. అప్పుతెస్తే - అందరి బంజెర్లనాగే అదీ ఆరిపోద్దని మాయమ్మ బయ్యం. అందుకని గడించడానికి బయలెల్లినాడు మా రెండో తమ్ముడు.

అక్కడాడు కష్టాలు పడ్డవే కనపడుతోందిగాని, కానీ మిగిలింది కనపడదు. ఆడికి కాలూ సెయ్యి వొచ్చినా, మాకిక్కడేవైనా, మా తను పల్ల ఆడిమీదే వుంటాది. పోనీ కాపర వెట్టిద్దావంటే తెచ్చింది సాల్దు. సాల్తే యిక్కడకు పంపనేడు. అదీగాక మా మరదలు లోకంనాటి పిల్లగాదు. సిన్న పిల్ల. అమాయకురాలు!

ఇన్నాలోసించి, ఒద్దర్రా, ఇవి నిలబడ్డానికి రోజులు కావు. బతకడవే కష్టంగున్న రోజులు. కలో గంజో తాగి ఇక్కడే పడుందాఁవంటే మా తమ్ములిక్కోపవు. మనవేటి యెకరాలొరకట్టినావా! గరిశల పండిస్తానన్నావా? కూల్లు పడిపోతున్నాయి. కాని కాలవొస్తే కలో గంజో తాగి పానాలు నిలుపుకోనాకి ఆ మాత్రం ఓ సెక్క సేతులుంటే, అందరం కాకపోతే కొందరవైనా బతకవా - అంటారు. గాలీ వానొస్తే కలే లేదని ఆలకి తెలవదు.

ఇదుగో, యేడాదీమద్దె ఆలకి నా మాటల్లో నిజెం కసింత తెలుస్తోంది. యింకా ఈ వొక్కడు సూత్తుం, ఈ వొక్కడు సూత్తుం అన్నట్టున్నారు.

ఇప్పటికి రెండేళ్లయింది. ఆడొచ్చినప్పుడు బట్ట పాతలు తేవడం తప్ప కానీ మిగల్చనేకపోతన్నాడు. అసలక్కడా - బతుకులిలాగే వున్నాయి. దాంతో యీ యాడాది మాం బతకడవూ కష్టమైపోతోంది. తల్లిలేని పిల్లలని మా పిల్లలు ఆకలి కేడిస్తే మాయమ్మ సూసోర్చనేదు. ఆళ్లకన్న అనుబగిస్తున్న వోళ్లు లేరా?... ఆ ఆడికి యీళు నయం కా? అంటే అదినిపించుకోదు. అదిగో ఆ కడుపుగోలల్లో పుట్టింది బాబూ యీ మంటంతా'' అన్నాడు నారాయుడు.

నారాయుడు చెప్పిందాంట్లో - అంత నిజం గాకపోయినా, చాలావరకు నిజముండాలి అనుకున్నాడు నాయుడు. కొంతసేపు పోయేక, నారాయుడే అన్నాడు.

''బాబూ! మాయమ్మని - మా యమ్మ మాటా అనను. ఎర్రెప్ప పైదని పైమాటా అనను, మాకు మా యమ్మెంతో మా మరదలికి దానమ్మ అంతే అని మాయమ్మ వొప్పుకోదు. తనకు తన మనవలైనట్టే, ఎర్రెప్పకీ దాని పిల్లలు అవుతారనదు. అలాగే మా ఎర్రెప్పా - మా తమ్ముడు దానల్లుడనుకుంటాది గాని మా యమ్మ కొడుకనదు. మానుండి యిడిపోయి అల్లుడు పట్నంలో కాపరఁవెట్టాలని దానికేవూలో సిన్న మనసుంది'' అని ఆగేడు నారాయుడు.

''ఓలమ్మ ఓలమ్మ!'' అంటూ ఎర్రెమ్మ మాట మధ్య అందుకోబోయింది. నారాయుడామె నాపి, చెప్పుకొచ్చేడు.

''పోనీగ్గాపోతే, నాకను. లేకపోతే యీ యిన్నోళ్లకే అను. ఎవురికైనా వుద్దేశం వొండుచ్చుగదా! అందుకు సెపతన్నాను.

నా నదీ ఆలోసించినాను. ఒకపాలి వూరొగ్గిపోతే అదేపోక, మరి రావడం జరగదు.

ఎర్రెప్ప సూడబోతే వొంటరి మనిషి. మొగుడు సూడబోతే అవిటోడు. దాని అయినోళ్లు కానోళ్లు ఎప్పుడో సెల్లిపోనారు. మాఁవకో తమ్ముడున్నాడు పడవట. ఉన్నా లేని కిందే జమ. అందుచేత దీనిగ్గాని, దీని కుటుంబానిగ్గాని ఎప్పుడేన ఈ అల్లుడో యింకో అల్లుడో - అల్లుడో అనాల. మరింకో అదరవు నేదు.

మా౦వున్నావంటే మాదారి యేరు. ఇంకో అల్లుడు రాకండానే - యీాడెల్లి పట్టంలో కూకుంటే, యెంటుబోంయి యెంటొచ్చినా ఆలకి దారీ తెన్నూ లేదు. నాదారోల బతుక్కేవుంది బాబూ! బూవా? పు(టా?... మనిషికి మనిషికి సాయం. మాటకి మాట సాయం అది కానుకోరు మా జాతి'' అంటూ ఆగిపోయేడు.

అతడి ధోరణి, అతడి ఆలోచన అందరికీ సచ్చినట్టున్నా కొందరికి కనువిప్పు కాలేదు. నాయుడు గారి తీర్పుకీ, నారాయుడి తగవరి తనానికీ తేడా ఒక్కళ్లూ గమనించలేదు. నాయుడు గ్రహించేడేమో తెలియదు.

''ఒలే! ఓ వెర్రి లంజ, ఆడి మాటలిన్నావె'' అన్నాడు ఎర్రి నుద్దేశించి నాయుడు గారు.

''తియ్యగున్నాయి'' అంది ఎర్రి.

''చావ్ లంజా'' నాయుడామెను చీవాట్లేసేడు. ఆ చీవాట్లు చాలించేక మరెవ్వరికీ నోరు విప్పడానికి లేకపోయింది. పొద్దెప్పుడు పోయిందో, దీపాలెప్పుడు పెట్టేరో గమనించలేదు నాయుడు. కొంతసేపు అలాగే కూర్చుని -

''అవునర్రా యీాది లైటెయ్యలేదేవీ!'' అన్నాడు.

దీపాలు పెట్టేక వరండా లైటు వేసేరుగాని, వెన్నెలుందని వాకిట దీపం వేయలేదు. టక్న వెలిగింది లైటు. ఒక్క పైడయ్య తప్ప అందరూ గక్కురుమన్నారు.

కొంతసేపు అక్కడున్న అందరికేసి చూసి -

''ఎంతసేపు యిలా కూచుంటారు. మీరడగవలసింది ఏవన్నా వుంటే అడగండి'' అన్నాడు నాయుడు.

''ఏవడుగుతాంబాబు! ఏవడిగినా కయ్యిన మీద పడి పోతన్నావు'' అంది ఎర్రి. ఆమె గొంతులో మార్పు గమనించి నాయుడు జవాబివ్వలేదు.

మరికొంతసేపు పోయేక, బారికి ముందుకొచ్చేడు.

''ఒలే ఓలె యెర్రెమ్మ! నెగుమీ'' అన్నాడు - కర్రతో పొడుస్తూ.

''ఉంగ్రోరి గండ నువ్వో తీర్పరివొచ్చినావు'' కసురుకుంది, ఎర్రి.

''ఆ కర్రతో ఒకటెయ్యిరా'' అని నాయుడు కసరగా, ఎర్రెమ్మ మూలుగుతూ లేచింది.

''ఎళ్లి నీ అల్లుణ్ణి బతిమాలి తీసుకుపో'' అని తీర్పిచ్చి, ''ఔనే నీ పేరేం పేరు - బంగారా?'' అన్నాడు బంగారితో. బంగారి ఔ, నంది.

''ఈ పాలికి దానివల్ల యేం తప్పున్నా గయుపుచ్చుకో. వీరూా మీరూా కొట్లాడుకొని పిల్లల్నేడిపించకండి. ఇంకొక్క ముక్క గుర్తుంచుకో - నువ్వేదో దానికన్నా ఓ కూరాకు ఎక్కువ కలిగున్నావు. దాని వుసురు తగిలినా, దాని పిల్లల వుసురు తగిలినా నీకు జయం కాదు''

బాబూ! నా వుసురు, నా పిల్లల వుసురు ఎవరికి తగలాల?' అనపోయింది బంగారి. కాని ఈలోగానే నాయుడు లోపలికెళ్లిపోయేడు.

ఆ తరువాత మామూలే. నిన్ననెన్నడో కలుసుకోవలసిన ఆలుమగలు ఆవేళ రాత్రి కలుసుకున్నారు.

* * *

ఆ రాత్రి తొమ్మిది గంటలకు యీడ్చి యీడ్చి తన్నిన పశువులా వున్నాడు పైడయ్య ఆ పశువుని కుడితి గోలెం ముందు పెడితే యెలా మొరాయించుకుంటుందో అలా మొరాయించుకుంటూ కూర్చున్నాడు కంచం ముందు.

సన్ని, దగ్గర కూర్చుని వడ్డిస్తోంది. ఎర్రెమ్మ పిల్లల్తోపాటు బయట కూర్చుంది.

''అమ్మీ! నాయురాలిచ్చిన పులుసొడ్డించె. ఆ పాకలో వున్నాది సూడు'' అంది ఎర్రెమ్మ.

నాయురాలు - పులుసొక్కటే కాదు! అన్నం, ఆకులో కూర కూడా పెట్టింది.

అందరూ కలసొచ్చేస్తుంటే నాయురాలు పిలుస్తోందని కబురొచ్చింది. ''యెల్లెల్లు. తింటే తిట్లు తిన్నావుగాని పండగ బువ్వెడతారు'' అన్నాడు బారికి పాపయ్య.

చూస్తే, వాకిట్లో నాయురాలు లేదు. నాయుడే కుర్చీలో కూర్చున్నాడు. దగ్గరికి పిలిచి -

''ఓ లెర్రిముండా, నీకు తెలకుండున్నాది. నే చెప్పే మాట జాగ్రత్తగా విని అర్థం చేసుకో -ఎందుకు చెపుతున్నానో గ్రహించు''అన్నాడు నాయుడు.''నువు చూడబోతే పేదముండవి. వెనకా ముందు ఎవరూ లేరు. వాళ్లు కాస్త పచ్చపచ్చగా వున్నారు. వాళ్లని మంచి చేసుకో. వాళ్లతో తగూలెట్టుకొని నిగ్రహించలేవు. అందుకే రాజీచేసి పొమ్మన్నాను.

ఇంకోమాట చెప్తాను విను.

ఆ గుంటడు చూడబోతే మంచివాడిలాగున్నాడు. నిడివిమీద ఆడి మనసు కరిగించుకో. పట్నంలో మెల్లిగా కాపరవెట్టించు. అప్పుడు నీ కూతురూ సుఖపడతాది. ఆళ్లతో మంచిగుంటె నువ్వూ ఒక కూరాకు తెచ్చుకోవచ్చు. లేదా కాలం కలిసొస్తుందంటే, ఒకర్నో ఇద్దర్నో పిల్లల్నక్కడికి పంపు. ఇక్కల్లా కాదక్కడ. ఏటికేడాదీ పనులుంటాయి. ఆడ తోడుంటే ఆ పెద్దది కూడా కూలీనాలీ చేసుకోవచ్చు. అడంటాడు గాని అందరూ యిక్కడే పడుంటే ఎవరికీ కడుపు నిండదు. కడుపెప్పుడు నిండదో కాని బుద్ధులప్పుడు తప్పవు''

అంటూ మంచిగా పని జరిగించుకోమని మరోసారి బోధించి నాయురాలిని కేకేసేరు. ఇంత అన్నం, యింత కూరా - ఇంట్లో యేవేం మిగిల్తే అవన్నీ పెట్టమన్నారు.

పైడయ్య ఇంటికెళ్లి తిరిగొచ్చేలోగా చిన్న పిల్లలకి తినబెట్టి పడుకోనుంది. పైడయ్య రాగానే సన్నిని వడ్డించమంది.

తల్లి చెప్పకముందే సన్ని పులుసొడ్డించింది. కూరముక్క ఒకటి రుచి చూసి పులుసు కలుపుతున్నాడు. పైడయ్య పరధ్యానంగా వున్నవాడు ఎర్రెమ్మ మాటల్తో యీ లోకంలోకి వచ్చేడు. వచ్చేక, అలా అన్నం కలుపుతున్నాడుగాని ముద్ద నోటికెత్తడం లేదు.

''ఏం ఆకల్లేదా?'' అంది సన్ని

లేకేం? వుందన్నాడు పైడయ్య

''రేం అలా కూకున్నా'' అంది సన్నెమ్మ.

పైడయ్య ముద్దే కాదు మొహం కూడా యెత్తలేదు,. కొంతసేపు చూసి -

''ఈ కోకెంతకి కొన్నా?'' అంది సన్నెమ్మ.

పైడయ్య అప్పటికీ తలెత్తలేదు. కాని రెండు ముద్దలు నోట పెట్టుకున్నాడు. ఆ తరవాత -

''నాకిది దిగడం నేదు...'' అన్నాడు సన్నితో.

''పో నాగ్గి'' అంది జాలిగా.

చెయ్యి కడుక్కోడానికి గిన్నె కోసం లేచింది. పైడయ్య గొప్ప సందిగ్ధంలో వున్నాడు.

అన్నం తినకపోతే ఆకలేస్తుంది. ఆ కూడు తినబోతే వెలపరిస్తోంది.

'మోచేతికూడు' - అనే ఎంచితే - ఎంచడానికి లేనిదేవుందా గుడిసెలో?

సన్ని కంచం తెచ్చి పక్కను పెట్టింది. పైడయ్య చెయ్యి కడిగేసుకున్నాడు.

*ఆంధ్రజ్యోతి వారపత్రిక, జూన్ 1969*

# ఆకలి

కొలకలూరి ఇనాక్

తెల్లారుగట్లో ఎప్పుడో రాత్రి రోడ్డు మీద గోండ్రుకప్ప చచ్చింది. కారో, లారో ఏదో తొక్కిపోయింది. కప్ప నాలుక్కాళ్ళూ, నేలకి కర్చుకుపోయాయి. పొట్ట టొమాటో లాగా చిట్లింది. పేగులురక్తం మాంసం కలగాపులగంగా కలిసిపోయి చిందిపడ్డాయి. కప్పపొట్ట, వీపు కలిసి నేల కతుక్కుపోయాయి.

ఆ కప్ప ఇక ఎగరదు ఇక దూకదు. ఇక వాన వచ్చినా వరద వచ్చినా బెకబెకలాడదు. ఎండొచ్చినా ఏమొచ్చినా ఉలకదు, పలకదు. చచ్చేముందు చురుగ్గా దూకుతూ, చలాకీగా ఎగురుతూ వచ్చి వుంటుంది. ఏం తిందామని వచ్చిందో! ఏం పొంకుందామని చూచిందో! చచ్చిపోయింది!!

చింతచెట్టు కింద కాళ్ల మధ్య తలపెట్టుకుని వీపు చెట్టుకుమోటించి చేతులు కాళ్ళ చుట్టు చుట్టుకొని బితుకుబితుకుమంటూ కూర్చున్న చిన్ని కప్పను చూచింది. అది చచ్చిపడివున్న రోడ్డు, రెండుప్రక్కలా భగవంతుడి అనంతత్వంలాగా వ్యాపించింది. రోడ్డుకవతల గరువునేలకాపక్క కొండమీద కిరీటంగా మబ్బు పట్టింది.

పదిరోజుల్నుంచి ఒకటే వాన! చింతచెట్టుకింద రాలిపడిన ఆకులు, చిదుగులు, పుల్లలు, చింతబెరళ్ళు వాననీటికి తడిసి రంగువూరి చిత్రంగా వున్నాయి. నేల, రోడ్డుప్రక్క చెమ్మగా, చెట్టుప్రక్క బురదగా వుంది. కాలుమోపితే నరాలు జిల్లుమంటున్నాయి. చిన్ని కాళ్ళు పైకి తన్ను కొచ్చిన చింతచెట్టు వేళ్ళమీదపెట్టి కూర్చుంది. తడిసిన చింతచెట్టు మొదలికి వీపు ఆనించిన చిన్ని వొంటికి తడి తగులుతూ వుంది.

ఈదురుగాలి విదిలించి కొడుతూవుంది. చెట్టుమీద మిగిలిపోయిన వయ్యాణ్ణాలుగు నీటిబొట్లు జారిపడ్డాయి. ఉదయం తొమ్మిదయినా పొద్దు పొడవలేదు. వెలుతురులేదు.

రోడ్డుకు రెండు ప్రక్కలా ఇళ్ళున్నాయి. కుడిపల్లెలో మేడలున్నాయి. రేడియోలున్నాయి. ఎడంపల్లెలో గుడిసెలున్నాయి. గూడులున్నాయి. కుడి ఎడమను కూలీకి పిలుస్తుంది. బత్తెమిస్తుంది. కుడిపల్లె ఎడమకుగాని, ఎడమపల్లె కుడికిగాని - పెరగకుండా వేదకాలంనాటి శాసనంలాగా, ఆధునిక కాలంలోవంతెనలాగా రోడ్డు - ముసిలిదీ ముతకదీకాదు - ఒట్టిదీ మట్టిదీకాదు, తీలుదీ తప్పటదీకాదు - సిమ్మెంటురోడ్డు, చిద్విలాసంగా చిరంజీవిగా ప్రకాశిస్తూ వుంది. ఈ రోడ్డు కదలదు, మారదు. ప్రభుత్వ చట్టంలాగా పడినచోటునుంచి లేవదు, ఆ పల్లెకీపల్లె, కనుచూపుమేర! కదలవు, అలసిపోవు!

చిన్ని కేడేళ్ళు! ఏడం పల్లెపిల్ల. ఊరికే కూర్చొని ఉత్తినే రోడ్డుమీదికి చూస్తూవుంది.

చిన్ని లంగా లంగాకాదు, జాకెట్టు జాకెట్టుకాదు. మాసిపోయాయి. చిరుగులు కుట్టగా కుట్టగా ఇక కుట్టే చోటు లేక చిరిగిపోతున్నాయి.

చిన్ని అందమయిందే! ముక్కులోంచి కారే చీమిడిదేముంది, తీస్తే పోతుంది. ఒంటి మురికిదేముంది, నీళ్ళుపోస్తే పోతుంది. తలదేముంది, చిక్కుదీసి నూనెరాస్తే బాగుంటుంది బట్టలేవుంది, కొత్తవి కుట్టించివేస్తే సరిపోతుంది. పూలు పెడితే చిన్ని పూవులాగా వుంటుంది. ఇవేమీ లేకపోయినా చిన్ని చూడ ముచ్చటగా వుంది. కనుముక్కు తీరు బాగుంది. కళ్ళలో కళ వుంది.

అప్పుడొకటి ఇప్పుడొకటి కారో బస్సో లారో వస్తున్నాయి, పోతున్నాయి. ఊళ్ళోంచి పశువుల్ని పొలం తోలుకుపోయే జీతగాళ్ళు గొడ్డుతోలే కర్రలూపుకుంటూ అరచుకొంటూ పోతున్నారు ఉండివుండి ఈదురుగాలి తోలుతూ వుంది.

చిన్ని కెదుర్గా కుడిపల్లెలోంచి పిల్లవాడు అరటిపండు తింటూ, రోడ్డు మీదికి వచ్చాడు. ఎడంచేతిలో ఇంకొకటి వుంది. కొంచెం కొరికి కొరికి గిల్లుకు గిల్లుకకు నాకి నాకి తింటున్నాడు.

చిన్ని చూచింది, నాలుక తడి అయింది. కళ్ళు ఆశతో మిలమిలలాడాయి. రెండు క్షణాలు తదేక తీక్షగా చూచింది. పిల్లవాడు ఎదురుగా రోడ్డు ప్రక్క నిలబడి వున్నాడు అరటిపండు తింటే అయిపోతుందేమోనన్నట్లు, తినకుండా వుండటానికి వీలులేనట్లు రవ్వంత రవ్వంత కొరుక్కుతింటున్నాడు.

చిన్ని లేచి నిలబడింది. కాళ్ళు ఈడ్చుకుంటూ నెమ్మదిగా రోడ్డుదాటి పిల్లవాడి దగ్గరకు పోయింది. వాడు కదల్లేదు ఆగలేదు. తింటున్నాడు. తింటున్నాడో, కొరుకుతున్నాడో, నాకుతున్నాడో, నోటికద్ది తీస్తున్నాడో కాని అరటిపండు తరగటంలేదు నోరాడకుండా ఆగటంలేదు.

చిన్ని పిల్లవాడి ముఖంలోకి చూచింది. వాడూ చూశాడు. చిన్ని చూస్తూ వుంది. వాడు ముఖం తిప్పుకోలేదు. నోటిపండు, చేతపండు, నోరు, చేయి, మార్చిమార్చి చూచి కళ్ళలోకిచూస్తూ నోరు తెరవకుండా అడుగుతూ వుంది. వాడు విననట్లు ముఖం ప్రక్కకు తిప్పుకొన్నాడు.

'నాకూ బెట్టవా?'

చిన్ని అడిగింది.

పిల్లవాడు వినలేదు.

'నాక్కొంచెం బెట్టవా?'

'యేందీ?'

సాగదీశాడు.

'కొంచెం'

బ్రతిమాలింది.

'వ్వూహూ - నాగ్గావొద్దూ - పెట్ను.'

చెప్పాడు

'కొంచెం, రవ్వంత'

'వ్వూహూ ౘ'

'కొంచెం'

'పెట్నే పెట్ను.'

'సీవ౯ తలకాయంత'

'వ్వూహూ౯'

చిన్ని నోటినిండా నీళ్ళూరాయి. కళ్ళనిండా నీళ్ళూరాయి. గుండెనిండా నీళ్ళూరాయి. చిన్ని ఏడుపు ఊటబావిలా అయిపోయింది ఉత్సాహం పుంజుకొని చేయిచాపి, గద్ద కోడిపిల్లను తన్నుకుపోయినట్లు, లాక్కోబోయింది పిల్లల్ని రక్షించుకొనే తల్లి కోడిలాగా అరటిపండు రక్షించుకొన్న పిల్లవాడు కుడిపల్లె లోకి పరుగెత్తాడు. వెంటబడబోయి, ముందకుపడి మోచేయి సిమ్మెంటురోడ్డు మీదపడి దోక్కుపోతే నుదురుకు బురదయింది. రక్తం గూడుకట్టుకున్న మోచేయి, నీళ్ళు కారుతున్న కళ్ళు, బురదయి, బ్రహ్మరాత కనిపించని నుదురు చిన్నిని అక్కడ నిలబడనీయలేదు. వెనుదిరిగి వస్తూ పిల్లవాడివైపు చూచి. వాడు పండుచూపి ఇవ్వబోతున్నట్టు చాపి నాలుక బైటపెట్టి వెక్కిరిస్తూ ఎగతాళి చేస్తూ కుడిపల్లెలోకి పోతున్నాడు.

చిన్ని ఏడుపు దిగమ్రింగుకొని,కళ్ళనీళ్ళు కళ్ళలో గ్రుక్కుకొని, లంగాచివరతో ముక్కూ, కళ్ళు, నుదురు, మోచేయి తుడుచుకొని వచ్చి, చింతచెట్టు మొదట్లో కూర్చుని వెక్కిళ్ళు అపుకుంటూ వుంది.

చిన్ని అన్నం తిని మూడు రోజులయింది. చిన్నితోపాటు తల్లి, అక్క, తమ్ముడు కూడా తినలేదు. బానలో నీళ్ళు చుక్కయినా మిగలకుండా తెల్లవారే సరికి చిన్నితోపాటు అక్కా తమ్ముడు తాగారు.

అమ్మ లేవలేదు. మంచం మీదే వుంది. నిండునెలలు, బలహీనత, తండ్రి కూలీతెస్తే ఇంట్లో కూడు, లేకపోతే నీళ్ళు! తండ్రి ఇంటికొస్తే కనీసం నీళ్ళు లేకపోతే కటికిపస్తు! తండ్రి మూడు రోజుల్నుంచి ఇంటికి రాలేదు. రాలేక పోయాడు. అక్క నాన్నలాగా కనీసం బావినుంచి నీళ్ళయినా తెస్తుంది.

అమ్మ అక్కను ఇరుగింటికి పొరుగింటికి గిద్దెడు బియ్యమయినా అప్పు అడుక్కు రమ్మని పంపింది. ఎడంపల్లెలో ఎవరి బ్రతుకయినా అంతంత మాత్రమే! తమ అదృష్టం లాగా అప్పు దొరకదు. ఆమాటే చెబుతున్న అక్కనుచూస్తే చిన్నికి - ఎందుకో తెలియదు - కోపం వచ్చింది.

ఎక్కడ అన్నంవాసన వచ్చినా, ఎక్కడ పొగవచ్చినా, అనుమాన ప్రమాణం తెలియక పోయినా, ఆ యింటికి పోయి, తొంగిచూచి, ఆ యింటి చుట్టూ తిరిగి 'వాళ్ళు అన్నం తినేశారు, గిన్నెలు కడిగేశారు. అన్నం కుండ బోర్లించారు' అని తెలిసింతర్వాత ఆ

యింటినుంచి ఇంకోయింటికి ఈ మూడు రోజుల్నుంచి ఏడుస్తూ పోయింది చిన్ని.

రాత్రి కడుపు నిప్పుపడ్డ వరిగడ్డి వామిలాగా కుమిలి కుమిలి కాలింది. నిద్ర పట్టలేదు. వానాకాలం ఒట్టి కడుపుతో బ్రతుకుకంటే చావు నయమని పించింది చిన్నికి.

మునుపు ఎప్పుడైనారాత్రి ఆకలి అయితే, తెల్లవారితే ఆకలి తీరు తుందన్న ఆశ వుండటంతో, ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూడటం చిన్నికి ఆనందమే. మొన్న తెల్లవారింది. ఆకలి తీరలేదు. నిన్న తెల్లవారింది. ఆకలి ఆకలిగానే వుంది. ఇవాళ తెల్లవారింది. ఆకలి ఎక్కువయింది. ఇంకొక ఉదయం వస్తుందంటే చిన్నికి సంతోషం కంటే దుఃఖమే కలుగుతుంది. ఆకలికి ఎడతెగని విజయం చిన్ని భరించలేదు.

రాత్రి, ఆకలితో మునగదీసుకు పడుకొంటే వర్షం - పేదవాడి శాపం లాగా ఇల్లంతా కురిసింది. చావతడిసి కప్పుకొన్న చిగురుబట్టతడిసి, ఆకలిమంటతో చలితో తెల్లవారిందాకా నిద్రను భద్రంగా గుప్పట్లో పెట్టుకొని, ముడుచుకు ముడుచుకు పడుకొన్న చిన్ని తెల్లవారితే బైటికివచ్చి, ప్రక్క టెముకల నంటుకుపోయిన డొక్క ఊరంతా చూస్తుంటే బాధపడింది.

కాళ్ళూ చేతులూ ఖాళీగా ఉన్న కడుపులో పెట్టుకొని చింతచెట్టు కింద చల్లని వొంటితో, చల్లని బట్టలతో దిగులుగా కూర్చుంది చిన్ని. సూర్యుడింకా పుట్టలేదు. పుట్టి ఈ కర్మకాండతో సాక్ష్యం పలకాలని కర్మసాక్షికి భయం. కొండమీది మబ్బు కురిస్తే అరిగిపోతాననో, కరిగిపోతాననో, తరిగిపోతాననో కదలకుండా కన్నెత్తి చూడకుండా, కలవాడి ఆస్తిలాగా కూర్చునింది.

'యావే సిన్ని?'

గొంతు కఠినంగా వుంది.

చిన్ని తలెత్తి చూచింది. ఎదురుగా అరటికాయతినే పిల్లవాడి అన్న.

చిన్ని భయం భయంగా లేచి నిలబడింది.

'యావే, మాట్టాడువ్?'

కోపంగా చూశాడు.

'యేంది?'

చిన్ని నంగినంగిగా అడిగింది.

'కాయలాక్కున్నా?'

'వూహూః'

'నిజం చెప్పే?'

'వూహూః'

'అబద్దవాడితే బుగ్గలు బిండుతా.'

'వూహూ!'

'ఛీ' అన్న కసురుకొన్నాడు 'పిల్లోణ్ణి ఏడిపిత్తావా?' ముఖం తుకతుక లాడింది, 'మొద్దు ముండ' తిట్టాడు

చిన్నికి ఏడుపు వచ్చింది

'నువ్వే!'

'యేందే? యేంది నువ్వందే? మళ్ళను, సెంప బగలగొడతా'

'నువ్వే!'

చిన్ని అంది. అన్న అన్నమాట నిలబెట్టుకోకపోతే సత్యహరిశ్చంద్రుడికి వారసుడు కాకుండా పోడు? ఆడి తప్పటమా? ఏం వీల్లేదు. కొట్టాడు. మాట వరసకు కాదు, కోపంగానే కొట్టాడు. కొట్టింది చెంపమీద.

చిన్ని చిన్నపిల్ల. ఆకలితో నకనకలాడుతూ చుమ్మలు చుట్టుకుపోతున్న కడుపు. బలహీనపు ఒళ్ళు. చెంపదెబ్బకు నేలమీద పడతే నేలదెబ్బ తగిలింది. 'అమ్మా' అని అంటే వినలేదు. విన్నా రాదు. రాలేదు. వచ్చినావాణ్ణి ఏమీ అనలేదు. అసలు కొట్టనేలేదు. కొడితే ఆమెకే పరాభవం. తండ్రి ఇంటి దగ్గర లేడు.కాబట్టి రాడు. అందువల్ల తగాదా లేదు. దాంతో పిల్లవాడి అన్న ప్రమాదం లేకుండా వెళ్ళిపోయాడు.

చిన్నికి కడుపులో పేగులు మెలికలు పడిపోయినంత నొప్పిగా ఉంది. పడిన చోటనుంచి లేవాలంటే వోపిక లేకపోయింది. ముణ్ణాళ్ళ నుంచీ శనిలాగా పట్టుకొని, దెయ్యంలా వెంటాడుతున్న ఆకలిని మరిపించగలిగినంత దెబ్బ వేసి అన్న పుణ్యం చేసుకొన్నాడు. ఆ దెబ్బతో కడుపు నిండిపోయింది. ఆకలి తీరి పోయింది.

చిన్నగా ఈదురుగాలి. సన్నగా జల్లు, తుంపర, కొండమీద మబ్బు గల్లా పెట్టె దగ్గర్నుంచి యజమానిలా కదల్లేదు. చింతచెట్టు కింద జల్లు పడటం లేదు.

రాత్రి వాన రోడ్డును కడిగింది. మళ్ళీ రోడ్డు మురికి కాలేదు. ఇంతలో మళ్ళీ జల్లు! దీంతో రుడ్డు శుభ్రంగా వుంది. వాననీరు పోయి చాలులో మట్టి కోసుకుపోగా మిగిలిన మట్టిరాళ్ళు భూమి ఇకిలిస్తుంటే కనిపించే వళ్ళు లాగా ఉన్నాయి.

తలస్నానం చేసిన జుత్తులోంచి జారిపడే నీటి బొట్లులాగా అప్పుడొకటి ఇప్పుడొకటి బొట్లు జారిపడుతున్నాయి. ఊరి ప్రక్కనున్న హయ్యరెలిమెంటరీ స్కూలు గంట మ్రోగింది.

నడవటం నేర్చుకొంటున్న కొడుకు చదవటం నేర్చుకోవడం కోసం బడికి పంపాలని వెంటతీసుకుపోతున్న తండ్రిని చలికి, ఆకలికి, దెబ్బలకు పిచ్చి ఎక్కినట్లు అయిపోయిన చిన్ని వెర్రిగా చూచి తలదించుకుంది.

నాన్న ఇంటికాడ లేడు. మొన్నటిదాకా వానాకాలంలో కూలీనాలీ లేక ఇంట్లో ఉండీలేక పూటలు గడుపుతున్నారు. ప్రతిరోజు పొయ్యిలో పిల్లిని తోలాలంటే ఒక మహాయజ్ఞం చేసినంత సంరంభం! నాన్న ఇల్లు వదిలి వెళ్ళేసరికి పొయ్యి తడిసిపోయింది. ఆరిపోయింది. మళ్ళీ వెలుగలేదు.

ట్రంకు రోడ్డులో పాతిక మైళ్ళపైన ఈ గాలివానకు వాగులు వంకలు వరద వచ్చి

అయిదారు వోట్ల గండీలు పడ్డాయి వచ్చేపోయే వాటి రాకపోకలకు ఆటంకం ఏర్పడ్డంతో తక్షణం రోడ్డు బాగుచేయవలసి వచ్చి, కూలీల కోసం మేస్త్రీ వెదుకుతుంటే పని కావలసిన చిన్ని తండ్రి మూడు రోజుల్నాడు వెళ్ళి ఇంతవరకు ఇంటికి రాలేదు.

రోడ్డు రిపేరు పూర్తి అయిందో, లేదో? నాన్న ఎప్పుడొస్తాడో ఏమో! ఆకలి ఎప్పుడు తీరుతుందో ఏమో! చిన్ని పిచ్చిమనిషిలా, తాగిన మనిషిలా, పూనకం మనిషిలా తూలిపోతూ వాలిపోతూ సోలిపోతూ ఉంది.

ఈదురుగాలి వీపు చీలుస్తూ వుంది. ఆక పేగులు కాలుస్తూ వుంది.

మోచేతిదెబ్బ, చెంపదెబ్బ, నుదుటి బురద తలచుకొంటుంటే, తలకాయ పగలగొట్టుకొ బుద్ది పుట్టిస్తున్నాయి. దెబ్బలకంటే తగిలిన తీర్లు ఏడుపు తెప్పిస్తూవుంది.

ఏడ్చి ఏడ్చి కళ్ళుబ్బి, అంతా కారిపోయిన కన్నీరులాగా కురిసే వోపిక లేక వాన సన్నగా జల్లుగా తుంపరగా పడలేక ఆగిపోయింది. అంతకుముందు, ఆ రాత్రి కురిసిన వాన చెట్లకొమ్మల మీదపడి, చరుపులు తిని, ముళ్ళమీద గుండె చీలి, రాళ్ళమీదపడి వీపులు పగిలి, నేలమీదికి పడి మూలుగుతూ పోతూవుంది.

క్వారీరాళ్ళు తోలుకుపోతున్న లారీ దూరంనుంచి కిటకిటలాడుతూ వస్తూవుంది. చిన్ని లారీవైపు మొదట అనసక్తంగా చూచి, అంతలో ఆసక్తితో చూచి, ఆశగా లేచి నిలబడింది లారీ కిటకిటలాడుతూ దగ్గరకు వచ్చేసరికి అత్యాశ పుట్టింది.

అడుగు ముందుకు వేసింది. లారీ నిండుబరువుతో నిండునెలల స్త్రీలాగా పూటీగా తూకంగా నెమ్మదిగా వస్తూవుంది. లారీ దగ్గరకు వచ్చేసరికి చిన్ని పూనకం మనిషిలా ముందుకు పరుగెత్తింది.

చిన్నిని డ్రైవరుచూచి 'సేయ్' అని అరిచాడు. వోనరుచూచి 'రేయ్' అని అరిచాడు. లారీకి సడన్‌బ్రేక్ వేశాడు. అరుపులు లారీ ఆగింది. కిరుకిరు లాడుతూ ఆగింది. లారీ వుంది చిన్ని వుంది. లారీముందు చిన్ని. అంగుళపు దూరపు సంబంధం. ఏమీ ఎరగని నంగనాచిలా తలవంచుకొని గోళ్ళుగిల్లుకుంటూ విలబడింది. లారీ కేబిన్‌లోంచి నాలుగుకళ్ళు దిగటం చూచేసరికి చిన్నికి విపరీతంగా అకలిఅయి విలవిలలాడిపోయింది. 'ఎవతెవే నువ్వు, సద్దామనుకున్నావా యేంది?' డ్రైవరు.

'యాఁవే, నువ్ జచ్చేదిగాక మమ్ముల్ని జంపుదావఁనుకొన్నావా యెట్టా?' వోనరు.

'లేయే లేయే.'

డ్రైవరు నెట్టాడు.

'పోయే పోయే.'

వోనరు తోశాడు.

చిన్ని మళ్ళీ చింతచెట్టు మొదట్లో పడింది. చింతచెట్టు! మునుపటి చెట్టు! శాశ్వతంగా చింతచెట్టు! తల చెట్టుకొట్టుకుంది. కష్టంలో ఉన్న కూతుర్ని చూచి తల్లి కన్నీరు నింపినట్లు చింతచెట్టు నీటిబొట్లు రాల్చింది.

రోడ్డు కడిగి తుడిచినట్లుంది. చెమ్మ ఆరుతూవుంది. రోడ్డుప్రక్క పిచ్చి చెట్లు మొదుళ్ళకు ఆకులు అలుములు కాగితాలు తగిలి నిలిచి మట్టి పేరుకొని బురద బురదగా వుంది. ఆ ప్రక్క ఇసుకనేల మీద నీటి జాలు సాగిపోగా ఏర్పడ్డ గీతలు బక్కవాడి ప్రక్కటెముకల ఎత్తుపల్లాల్లాగా కనబడుతున్నాయి

అక్క, తమ్ముడు వచ్చేసరికి చిన్ని కళ్ళల్లో, నీళ్ళు కనబడటంలేదు. నీళ్ళు ఎండమావులయ్యాయి. ఎండాకాలం చెరువు బావుల్లో నీళ్ళులాగా అయిపోయాయి.

'ఏం దిట్టుండా?'

వళ్ళంతా మురికి ఎందుకుంది అన్నట్లుగా చూచింది అక్క.

చిన్ని మాట్లాడలేదు.

'సేయ్! మాట్లాడవేందే? ఇన్నావా యిన్లేదా?'

చిన్ని బదులు చెప్పలేదు.

అక్క ఎగాదిగా ముఖంలోకి చూచింది చెల్లి ముఖం మరీ వంచుకొంది.

'అప్పా! అప్పోవ్!'

చిన్ని భుజం పట్టుకుని కుదిపాడు తమ్ముడు. వాడి చేతివేళ్ళు లేత బెండకాయల్లా నవనవలాడుతున్నాయి.

అక్కా, తమ్ముళ్ళ బట్టలు అతుకులుపడ్డాయి. తలలకు నూనెలేదు. తలలోంచి చెంపలలోంచి నీళ్ళు జారుతున్నాయి. తమ్ముడు చలికి వొణుకుతున్నాడు.

'మనమ్మ మూలుగుతా వుంది. సిన్నిసిన్ని అని అడుగతావుంది. దాయే - దా బోదాం!'

అమ్మ అనేమాట వినేసరికి చిన్నికి వణుకుపుట్టింది. నిండునెలల్తో మంచం మీంచి లేవలేని అమ్మను తలచుకొంటుంటే ఏడుపు వస్తూవుంది. తనకా తిండి లేదు. అమ్మాకూ లేదు. తనా తిరగగల్దు. అమ్మ తిరగలేదు. లేవలేదు. తనే నయం. తనకంటే అమ్మ కనాకష్టం. చిన్ని అమ్మకష్టం చూళ్లేదు. చూచి ఏడుపు భరించలేదు. ఏడిస్తే, వోపికలేదు. గుండెలో తడి అయింది. కళ్ళు ఎండిపోయాయి. తలమీది నీటిబొట్లు చెంపల మీదుగా జారి పెదాల్లోకిపోయి మాయమయింది. రెండు చేతులతో జుత్తు పైకి ఎగదోసుకుని అక్కవైపు, తమ్ముడివైపు మార్చి మార్చి చూచింది చిన్ని.

అక్కకు పదేళ్ళు! అక్క అమ్మకు చేదోడు వాదోడు. అమ్మ లేవలేక అమ్మ పనులన్నీ అక్క చేయటం ఈ మధ్యే మొదలయింది. చెల్లికి, తమ్ముడికి నీళ్ళు పోస్తుంది. ఒళ్లు తుడుస్తుంది. ఉంటే బట్ట లేస్తుంది. అక్కకు చిన్నిఅంటే ఎక్కళ్లేని యిష్టం!

తనకూ తమ్ముడికి పెట్టకుండా అక్క ఏం కొనుక్కొన్నా తినదు. ఇద్దరికీ పెట్టి ఏం లేకపోతే నోరు చప్పరిస్తూ తిరుగుతూ వుంటుంది. కుండలో అన్నం అయిపోవస్తే గుట్టుచప్పుడు కాకుండా తనకూ, తమ్ముడికి పెట్టి పస్తుంటుంది అక్క.

నాన్న పనికి పోయిన రోజు రాత్రి ఉన్న అన్నం అమ్మ తినకుండా అక్కకిచ్చింది. అక్క తినకుండా తనకిచ్చింది. తన కెందుకో తినబుద్ధి పుట్టలేదు. తమ్ముణ్ణే చూస్తుంటే జాలి

వేసింది నాలుగు ముద్దలు కలిపి తమ్ముడికి పెడితే వాడు అపురావురుమంటూ తిన్నాడు. ఆ కొంచెం అన్నం వాడి కడుపు అయినా నింపక ముందే అయిపోయింది.

తమ్ముడు తిని నీళ్ళుతాగి, అమ్మపక్కలోదూరి వెచ్చగా నిద్రపోయాడు. అక్కా తనూ పడుకొన్నా నాన్నలేక తనకు నిద్రపట్టలేదు ఆ రాత్రి అమ్మ అక్కతో 'సిన్నదిగూడ నీకు మల్లే పెద్దదైపోయిందే. సూశా, అద్దినకుండా తమ్ముడికి బెట్టింది బువ్వ యేందోలేషే, మనకి తినాగుడవా వుంటేవుంది. లేపోతే లేబోయింది గాని మీకొకళ్ళ మీదొక్కళ్ళకే యిదుంటే సాలే' అంది.

వాళ్ళ సంభాషణ వింటూ చిన్ని సంతోషించింది గాని, ఆకలి - అంత సంతోషంగా లేదు. అమ్మా అక్కా నిద్రయోయినా చిన్నికి నిద్ర రాలేదు. చీకట్లో పిల్లి కళ్ళు చూసి గట్టిగా కళ్లు మూసుకొన్న చిన్ని తెల్లవారిందాకా కళ్లు తెరవలేదు.

తమ్ముడు పిచ్చివాడు. వాడికి ఒక్క ఆట కూడా రాదు. చివరికి కుందాట కూడా సరిగా రాదు. మాటలు నోటివెంట సరిగా రావు. వాడు రోజంతా మాట్లాడిన మాటలు పాతికవుంటే గగనం. వాడికి మాటల కంటే నోట్లోంచి చొంగ వస్తుంది. వాడికి మూడేళ్ళు కూడా లేవు.

అక్కో తనో లేందే వాడు ఇంట్లోంచి బైటికిరాడు. వాడి నడక - పడుతూ లేస్తూ ముద్దుగా ఉంటుంది. వాడి మాటలు నంగినంగిగా నత్తినత్తిగా ముచ్చటగా ఉంటాయి.

హోటల్ శంకరయ్యకు తమ్ముడంటే మహాయిష్టం! ఇంట్లో తింటానికి ఏమీలేకపోతే తమ్ముడు చీమపోయినట్లుపోయి, శంకరయ్య చిటికెనవ్రేలు పట్టుకొంటాడు. శంకరయ్యకి భాష తెలుసు. తమ్ముడికి అప్పుడు కడుపునిండుతుంది.

తమ్ముడికి మూడు రోజుల్నుంచి ఆకలి అంటే ఏమిటో తెలియదు. అమ్మకి అక్కకి తింటానికి లేకపోయినా వుంటారు. తమ్ముడికి ఎప్పుడూ తింటానికేదో ఒకటి ఎక్కడో ఒకచోట వుంటుంది. తను ఆకలికి తట్టుకోనూ లేదు. పెట్టేవాళ్లూ లేరు.

శంకరయ్య హోటల్ తాటాకు పాక! తనకే తిండిలేక నలుగురికింత తినబెడుతున్నాడు. నిన్న తమ్ముడితోపాటు శంకరయ్య హోటలుకి పోదామని చిన్ని బయలుదేరింది. కూడా వెళితే తనకి తమ్ముడికి తింటానికేమి పెట్టలేక తనకు లేదని, తమ్ముడికి పెడితే బాగుండదని, తమ్ముడికి కూడా ఏమీ లేదని తరిమేస్తే, తమ్ముడి ఆకలి తీరేదెట్లా, వాడేమయిపోతాడు. అని తమ్ముడు వెళుతుంటే చూచి ఊరుకుండిపోయింది చిన్ని.

తమ్ముడు ఏం తిన్నాడో ఏమో బైటికి వచ్చి మూతి ముడుచుకొని ఎకాయెకి చిన్ని దగ్గరకు వచ్చి లంగాపట్టుకు లాగుతూ నువ్వేమన్నా తిన్నావా లేదా అని అయినా అడక్కుండా నోరుతెరచి చొంగ కారుస్తూ, కళ్లుమూస్తూ తెరుస్తూ 'ఆకుందాట కుందాట' అంటూ అడుగుతుంటూ ఏడుపు వచ్చింది. తమ్ముణ్ణెత్తుకుని ఏడ్చింది చిన్ని.

రోడ్డు పైన పల్లాల్లో నిలిచిన బురద నీళ్ళతో ఆడుకుంటూ జీపు ఉరుకులు పరుగులుతో పోయింది, అది చిమ్మిన బురద బట్టలమీద ఒంటిమీద పడింది. అక్క దులుపుకొంది. తమ్ముడికి తుడిచింది. చిన్ని మాత్రం లెక్క లేకుండా తుడుచుకోకుండా కూర్చుంది.

'దాయే యింటికి బోదాం!'

అక్క పిలిచింది

'దాప్పొదా!'

తమ్ముడు పిలిచాడు.

చిన్ని కదల్లేదు.

'దాయే దా!' అక్క బ్రతిమాలుతూ కుడిచేయి పట్టుకొంది. 'దావా?' తమ్ముడు మూతి మూడువంకరలు తిప్పుతూ ఎడం చేయి పట్టుకొన్నాడు. 'దా, లే.' ఇద్దరూ పిలిచారు.

చిన్ని లేవలేదు.

'వూహూఁ.'

అక్క, తమ్ముడు చేతులు వదల్లేదు.

'దా, లే.'

'నేను రాను ఈడేవుంటా! నువ్ బోయే, నువ్బోరా.'

చిన్ని కదలకుండా కూర్చుంది.

'అమ్మేడుత్తుంది'

అక్క చెప్పింది.

'దాప్ప, దా బోదాందా,'

'నేనిప్పుడ్రాన్రా మల్లొత్తా నువ్బో-పోరా.'

అక్క తమ్ముడు చిన్ని చేతులు వదిలిపెట్టారు. చిన్ని అక్కణ్ణుంచి లేవలేదు.

అక్కనీ తమ్ముణ్ణీ చూస్తూంటే చిన్నికి అమ్మానాన్నా గుర్తుకువచ్చారు. అక్క అచ్చంగా నాన్నలాగా వుంటుంది. నాన్నకి తనంటే ఎంతో ఇష్టం! పూలు తెస్తే తనకే ఇస్తాడు. తనని జోకొడుతూ నిద్రపోతాడు. తను లేకుండా ఇంట్లో వుంటే అన్నం తినడు.

'నా కూతూర్నా ఆదురుట్టం' అని పొంగిపోయే తండ్రి గుర్తుకువచ్చి, చిన్ని ఎండిన పెదాలమీద అమృతంలాంటి తడి ప్రాకింది. తను తండ్రి భుజాల మీద తప్ప క్రిందదిగి నడవలేదు.

రాత్రివేళ నిద్రపట్టకపోతే, నాన్న తనని గుండెల మీద వేసుకొని నిద్ర పుచ్చేవాడు. తండ్రి గుండె చప్పుడు వింటూ గుండెకు దగ్గరగా వుంటూ, ఆ హృదయం-తింటూ తను పెరిగింది.

నాన్నవుంటే తిండివుంటుంది. తిండిలేకపోయినా ఇంత ఆకలకాదు నాన్న లేక, కూడులేక, వానలో చలిలో బుట్టలేయ, ఇల్లు సరిగాలేక, లేవలేని అమ్మ కష్టం చూళ్ళేక వున్న చిన్ని కడుపులో, వొంట్లో, కంట్లో, చేతుల్లో, కాళ్ళలో ప్రతి రక్తంబొట్టులో ప్రతి

వెం(టుకపాదులో (ప్రతి స్వేదరం(ధంలో ఆకలి వేయి నాలుకల నాగులాగా కాటువేస్తూ వుంది.

తమ్ముడు పూర్తిగా అమ్మపోలిక. కనుముక్కు తీరులో అచ్చు గుద్దినట్లు అమ్మలాగా వుంటాడు. అమ్మ కళ్ళలో (ప్రేమలాగా తమ్ముడిచేయి చిన్ని భుజం మీద వుంది. చిన్ని ఎందుకయినా ఏడిస్తే తమ్ముడు చూళ్ళేడు. చిన్ని చిన్ని చేతులతో తుడుస్తాడు.

అమ్మ ఎంతగా లేవలేకపోయినా, కదల్లేకపోయినా, 'మీరాడుకొండే నే జేత్తాలే' అని అన్ని పనులు చేసుకొనేది. తనకు ఏం కష్టం కలిగినా అమ్మ సహించదు. చీమ కుట్టినా విలవిలలాడిపోతుంది.

అమ్మకు తనంటే ఎంతో గురి! ఎక్కడికయినా పోవాలనుకొంటే 'పోయేదా?' అని అడిగి 'పో' అంటే వెళుతుంది. 'ఒద్దు అంటే మానేస్తుంది.

చిన్నప్పుడు చిన్ని చిన్నదిగా ఉన్నప్పుడు అమ్మ బైటికిపోయి పొంత కడ బోర్లించి రావాలని పోబోతుంది. కొంప మునిగిపోయినట్లు ఉయ్యేలలో ఉన్న చిన్ని గగ్గోలెత్తి పోయింది. బైటికి పోబోతూ ఆగి వెనుదిరిగిపోయి ఏమయిందోనని కిరసనాయిలుబుడ్డి తెచ్చి చూచి ఏమీలేదని, మళ్ళీ బైటికి పోబోయింది. ఈసారి మునుపటికంటే పెద్దగా (ప్రాణాంతకంగా ఏడ్చింది చిన్ని. పురుగో పు(టో అయి వుంటుందని ఎంతగా వెతికినా ఏమీ కనబళ్ళేదు.

అమ్మ ఉయ్యేల దగ్గరుంటే ఏడుపువూని వెళుతుంటే ఏడుస్తుండటంతో పిల్ల భయపడిందని ఆమె అక్కణ్ణుంచి కదల్లేదు. అప్పుడే పొలంనుంచి వచ్చిన నాన్న వాకిట్లో ఉన్నదేవిటో క(రతో కదిపితేసరి అని చూస్తే పాము! ఆ రా(త్రి నాన్న పామును చంపి ఇంట్లోకి వచ్చాడు.

నాగుబాము చావుచూచి అమ్మ గగ్గోలెత్తిపోయింది. తనబిడ్డ తనకూపిరి పోసిందని ఏడ్చింది. తన తల్లి. తనను (బతికించిందని వలవల విలపించింది. ఆ రోజు నుంచి చిన్ని వద్దన్న పని అమ్మ చేయటం మానుకొంది.

వాన పడటం లేదు. ఆకాశం తెరిపివ్వలేదు రోడ్డు చెమ్మ అక్కడక్కడ ఆరి నూనెరాసిన తామర పాకులాగా ఎత్తుపల్లాలతో తడిపొడిగా మెరుస్తూవుంది. ఈదురుగాలి సన్నగా పక్కటెముకల్లో చొరబడటానికి సిద్ధమవుతూవుంది. కదిలిన చెట్లుమీతంచి నీటిబొట్లులాగా ఉండుండి పడుతున్నాయి.

స్కూలు నుంచి పదేళ్ళ అమ్మాయి వస్తూ వుంది. తలలో పూలు! సిల్కు జాకెట్టు! సిల్కు లంగా! అవసరం లేకపోయినా పరికిణి ! రెండు జడలు! చెర్నాకోలల్లాగా ఎగురుతున్నాయి.

జడల్లాగా చేతులు, చేతుల్లాగా కాళ్ళు, కాళ్ళలాగా నడక ఉత్సాహంగావుంది. తల ఉత్సాహంగా వుంది. కళ్ళు ఉత్సాహంగా వున్నాయి. ఒళ్ళంతా ఉత్సాహపు వెల్లువలాగా వుంది. కడుపులో అన్నకోశం నిండా కూడు ఉత్సాహంతో జీర్ణమవుతూ వుంది.

ఆ అమ్మాయికి అక్కవయస్సు. ఆ అమ్మాయినీ అక్కనీ మార్చిమార్చి చూసింది.

తల, ఒళ్ళు, కాళ్ళు, చేతులు, బట్టలు, పూలు, పుస్తకాలు, పుస్తకాలు చూచి చూచి బావురుమని ఏడ్చింది

'యేందే? యేంది'

అక్క అడిగింది.

'ఏందప్పా యేంది?'

తమ్ముడడిగాడు.

'యాంలే!'

అక్క, తమ్ముడు మళ్ళీ మాట్లాడలేదు. ఒకరిముఖంఒకరు చూచుకుంటూ నిలబడ్డారు. చిన్ని కళ్ళు తుడుకొంది.

బస్తీనుంచి బస్సు వచ్చింది. రంగసామి కూతురు దిగింది. కొడుక్కు జ్వరం వస్తే బస్తీ హాస్పటల్‌కు తీసుకుపోయి వారంరోజులుండి తిరిగి వచ్చింది. పిల్లవాణ్ణి తీసుకుపోతున్న బస్సులోనే వాడి జ్వరం పడిపోయి, ఎంత వెతికినా కనబడలేదు. ఆ భయం హాస్పటల్‌లో వారం రోజులుండి వారంరోజులు పిల్లవాడు ఉన్నచోట ఉండక హాస్పిటల్ అరణ్యం చేస్తుంటే విసిగిపోయి డాక్టర్లు అందరూ చెప్పి చెప్పి, తలబొప్పికట్టి, వెళ్ళకపోతే బయటికి నెడతారేమో అనిపించినప్పుడు హాస్పిటల్ నుంచి బైటపడి ఆరోగ్యంగా ఉన్న కొడుక్కు అనారోగ్యం ఎక్కడుందో వెదుకుతూ దిగింది.

బస్సు దిగిన కూతుర్ని చూచి రంగసామి వచ్చాడు. పడుతూలేస్తూ వచ్చాడు. కూతురు కొడుక్కు ఒంటిమీద ఈగ వాలితే తన ప్రాణం తీసుకునే అల్లుణ్ణి కళ్లల్లో పెట్టుకుని వచ్చాడు. దొర్లి వచ్చాడు.

పైన రోడ్డు మీద పిల్లలు ఆనందంగా వుంటే అక్క తమ్ముణ్ణి నడిపించుకుపోయింది. వాళ్లు పాముని ఎగరేసి చంపుతున్నారు. చిన్ని చూచింది. ఆ పాము వానకు తడిసి ముద్దయి చచ్చిపోయింది. జీతగాళ్లకి పల్లె పిల్లలకు అది కంటికింపయిన దృశ్యం.

ఆ చచ్చిన పాముని రాళ్ళతో కొట్టిచంపారు. కర్రలతో బాది చంపారు. దగ్గరకు పోకుండా దూరం దూరంగా వుండి చంపారు. చచ్చిందని తెలిసిన తర్వాత ఎగరేసి ఎగరేసి చంపారు.

పిల్లలు ఎగిరిందే ఎగరటం! ఒకటే గోల! అటు నుంచి ఇటు నుంచి పిల్లలు వెల్లువలో పరుగెత్తుకుంటూ పోతున్నారు, యేందంటే యేందని ఎగబడెగబడి చూస్తున్నారు.

ఎవరుతెచ్చారో ఎండు కట్టెలు తెచ్చారు. ఎవరు తెచ్చారో అగ్గిపెట్టె తెచ్చారు. ఎవరు ముట్టించారో మంటబెట్టారు. చచ్చిన పాముకు శవసంస్కారం చేస్తున్నారు భావిపౌరులు!

చిన్ని చింతచెట్టు మొదట్లో కూర్చుని చూస్తూ వుంది. అక్కడ కాలిపోతున్న పాము! ఇక్కనేలకు కరుచుకుపోయిన కప్ప! కాలుతున్న పాము పొగ మేడలు మిద్దెలు దాటి పైకి పోతూ వుంది. కప్ప గుడిసెలు చూస్తూ నేలకిలకరుచుకపోయింది కప్ప - పాము 'కరవమంటే కప్పక్కోపం - విడవమంటే పాముక్కోపం' - అమ్మ అనే సామెత చిన్నికి గుర్తుకు వచ్చింది.

అక్క, తమ్ముడు వెళ్ళి భావిపోరుల్లో కలిసిపోయారు. ఇక అక్కడ పిల్లలు కాదు - అల్లరి వుంది. ఒకటే రద్దీ! ధ్వని!!

చిన్నికి లేవబుద్ధి పుట్టలేదు. కదలబుద్ధి కాలేదు. కాళ్ళు ఆరజాపి చింత చెట్టుకు పూర్తిగా ఆనుకుని చేరగిలబడింది. కళ్ళలో పాము పొగ కావురు గ్రమ్మింది. కప్ప కనిపించటం లేదు. లారీ కనబడుతూ వుంది.

ఏడాది క్రితం ఇదే రోడ్డు మీద ఇక్కడే ఆ చెట్టు దగ్గర్నుంచి ఈ చెట్టు దగ్గరకు పరుగెత్తుతూ పిల్లలు ఆడుకుంటున్నారు. ఎవరో ఏం ఆటలని తిట్టారు గాని పిల్లలు ఆట మానలేదు.

దూరం నుంచి వచ్చే లారీ తీరా ఇక్కడకి రాకపోతే ముందే చిన్ని అటుపోయి, చెట్టును ముట్టుకొని ఇటు తిరిగిరాగలదని; చిన్ని గుండె కలదని, చిన్ని ధైర్యవంతురాలని ఉత్సాహపరిచారు.

చిన్ని పరుగెత్తుకుంటూ పోయింది. చెట్టును తాకింది. వెనుదిరిగి పరుగెత్తుకుంటూ వస్తాంది. లారీ ఎంత దూరం వచ్చిందో చూచుకోలేదు.

పిల్లలు అరిచి గగ్గోలెత్తిపోతున్నారు. లారీ వచ్చేసిందని అరిచారో, చిన్ని లారీ కంటే ముందుగా తిరిగివచ్చిందని అరిచారో, అది భయమో సంతోషమో చిన్నికి తెలియందు-పెద్ద అరపు వింది అంతే! మళ్లీ ఏమీ వినలేదు.

చిన్ని కళ్ళు విప్పి చూచేసరికి గొల్లుమంటున్న ఇల్లు నిశ్శబ్దంగా అయింది. అమ్మనీ నాన్ననీ చూచేసరికి చిన్నికి ఏడుపు వచ్చింది. తను చావుదప్పి బ్రతికినట్లు, రక్తం బాగా పోయినట్లు విని, చనిపోనందుకు, ఎందుకో సంతోషించింది చిన్ని.

చిన్నికి మెలకువ వచ్చిందాకా వోనరు అక్కడే వున్నాడు. స్పృహ వచ్చింతర్వాత బండెడు బరువు దించినట్లయి, గట్టిగా నిట్టూర్చి, లారీ తోలించుకొని వెళ్లిపోయాడు.

ఆ రోజు నుంచి నాలుగునెలలు, నెలకు వందరూపాయలు, ఆరునెలలు చిన్నికి మంచి ఆహారం, నష్టపరిహారంగా వోనరు తనంతట తానే నిర్ణయించుకొని ఇచ్చాడు.

ఆ రోజుల్లో చిన్ని నులక మంచంలో స్వర్గసుఖాలు అనుభవించింది. నిద్రలేస్తే ఎవరో ఒకరు పరిచర్య చేశారు.తన మంచి చెడ్డలు చూశారు. తను తిన్న తర్వాత తిన్నారు.

తన వల్ల నెలకు వంద! అమ్మ నాన్నలు సంపాదించలేనంత డబ్బు. ఈ డబ్బు చిన్ని ఊపిరి దీపం కొట్టుమిట్టాడుతుంటే కలిగే చీకటి వెలుతురుల కలయికకు ప్రతినిధి! ఈ డబ్బు శవ సమాధిపై పుట్టిన గడ్డిపూవు! ఈ డబ్బు మనిషి రక్తం మట్టిలో కలిస్తే ఆ మట్టికి కట్టిన విలువ! ఈ డబ్బు ఉన్నవాడి ఔన్నత్యాన్ని, లేనివాడి అల్పత్వాన్ని ఎత్తిచూపే జెండా!

ఈ డబ్బు లేకపోయినా బిడ్డను ప్రేమించే తల్లితండ్రులు, ఈ డబ్బుతో ఇంకా బాగా ప్రేమించారు. ఈ డబ్బు ఆనందమే కలిగించింది. ఈ డబ్బు సంపాదించింది తనేనని, దీంతో తల్లితండ్రులకుతనెంతో ఉపకారం చేసినట్టు రుణం తీర్చుకొన్నట్టు చిన్ని భావించింది. తృప్తి పొందింది.

బువ్వ తినటమంటే, చిన్ని దృష్టిలో, వరిమెతుకుల్లో పప్పుచారు పోసుకుతాగటం! అది తాము తినేకూడులో అతి వాంఛనీయమైన ఆహారం అంతకు మించి తినటానికి ఏమయినా కూడు వుంటుందని తెలియదు. బ్రెడ్డు గుడ్డు బువ్వతో సమానమని తెలియదు. బ్రెడ్డు బట్టరు, బ్రెడ్డు, జాము నాలుకకు నాజూకుతనం కలిగిస్తాయనీ తెలియదు లారీ వోనరు బస్తీ నుంచి తెచ్చి ఇచ్చే ఆహారం వల్ల తనెంత అమాయకురాలో చిన్ని తెలుసుకొన్నాననుకొంది.

బ్రెడ్డు గుడ్డు తింటుంటే నాలుకంతా పూసిన ఉద్యానవనంలాగా వింత వింత రుచులు రంగురంగుల పూలై నోరంతా వికసించాయి. బ్రెడ్డు బట్టరు తింటుంటే ఇనుపస్తంభం మీద చేయి రాసినట్లుగా, బురదలో కాలు జారినట్లుగా, అయిస్ ఫ్రూట్ చేతిలోంచి జారిపోయినట్లుగ ఒళ్లంతా మెత్తగా దూదిలాగా అయిపోయినట్లు అనిపించింది. బ్రెడ్డు జాము తింటుంటే పులుపూ, తీపి మెత్తగా గట్టిగా తగిలి, గొంతు గొంతంతా వయ్యారాలు పోయింది.

ద్రాక్షపళ్ళు తొల్ల తీసుకొని మింగితే , ఎండ పొద్దు బావిలో వేసిన రాయి కనిపిస్తూ పోయినట్లు, గొంతులోంచి పేగుల్లోంచి కడుపులోలోపలికి దిగి పోయిందాకా చల్లగా జారిపోయింది. బత్తాయో, కమలాపండో, నారింజో, కొనతొక్కావలచి, గింజలు తీసి ముత్యాలు మాత్రమే నోట్లో వేసుకొంటే నోరంతా ఊటబావి అయిపోయి, గొంతంతా ఎటుచూచినా కమ్మని రుచి! ఆపిల్ పండు తొల్లతీసి గింజలు తీసి ముక్క నోట్లో వేసుకుంటే మీగడే! నమిలే పనిలేదు. కొరికే పనిలేదు. పంటితో పనిలేదు. నాలుక వేడికి కరిగి గొంతులో దిగిపోవడమే! అరటిపండో, పచ్చరటిపండో, చక్కెరకేళో, రస్తాలో తింటుంటే యుగాల ఆకలి మాయమయిపోతుంది.

జిలేబి నోట్లో వేసుకొంటే నోరంతా నీరు అయిపోయి తీపి! మైసూరుపాక్ నములుతుంటే ప్రతి పన్ను పరమార్థం దర్శించి ఆవులింత! లడ్డు తింటుంటే స్వర్గం పునాదులు కూలిపడ్డట్లు అమృతం! బూంది నోట్లో వేసుకొంటే నవనాడుల్లోంచి తృప్తి!

మునుపు బిస్కట్లు తినటం పంటికి బలమైన పరిశ్రమ. ఆ మధ్య బిస్కట్లు నోట్లో వేసుకుంటే ఏమయిందో తెలియక దిక్కులు చూచింది పిన్ని. తీపి బిస్కట్లు, ఉప్పు బిస్కట్లు,వగరు బిస్కట్లు, కారం బిస్కట్లు - ఒకటేమిటి, మనిషి దేవుళ్లా షడ్రుచులు బిస్కట్లుతో ఇమిడ్చినట్లు గుర్తించింది చిన్ని.

తను తినగా మిగిలిన వాటిని ఇంట్లో అందరూ తినేవాళ్లు. నిజానికి చిన్ని కుటుంబంలో ఇటువంటి తిండి తినకలగటం - అలా ఆర్నెల్లు తినటం - అదృష్టం!

ఇంకోలా జరిగితే ఏమయ్యేది అన్న ప్రసక్తి అలా వుంచి, రోజుకు కనీసం కూడయినా ఉండని తనకు, ఇంత మంచి ఆహారం దొరికేలా ఇలా జరగటం వల్ల మేలే కలిగింది.

ప్రతిరోజు చిన్ని రోడ్డు మీద లారీ కోసం ఎదురుచూస్తూ నిలబడి, లారీ వస్తుంటే ఎగిరి గంతులువేసి, లారీలోంచి వోనరో, డ్రైవరో ఇచ్చిన ఆహారపదార్థాలు తీసుకొని ఇంటికిపోయే చిన్నికి లారీ అదృష్టంలా, వోనరు దేవుళ్లా, లారీ రాక అమ్మ -నాన్న ఆదరణలా గోచరించి ఆనందం కలుగుతూ వచ్చింది.

ఆర్నెల్లు అయిపోయి, నుదుటిదెబ్బ నయమయిం తర్వాత లారీ వచ్చినా పళ్ళు రాలేదు వోనరు నవ్వినా మిఠాయిలు ఇవ్వలేదు. లారీ ఆపి 'బాగుందా'? అని వెళ్లిపోతే దిగులుపుట్టి ప్రతిసారీ ఏడ్చింది. క్రమక్రమంగా లారీ ఆపటం కూడా మానేశారు.

బ్రెడ్డు తిన్న నోటితో గొడ్డుకారం తినాలన్నా, పళ్లరసం తాగిన గొంతుతో పిచ్చిపులుసు గాని పుల్నీళ్ళు గాని తాగాలన్నా, స్వీట్‌లు తిన్న నాలుకతో పప్పుచారు కూడు తినాలన్నా మొదట్లో వాంతి వచ్చినట్లుంది. ఆకలి దేవుడిచ్చిన వరం. క్రమంగా ఆకలి ముందు వాంతి పరారయింది. చిన్ని మళ్లీ మునుపటి తిండికి అలవాటు పడింది. కాని ఎప్పుడయినా, ఈ మధ్య తిన్న తిండి దొరికితే బాగుండునన్న ఆశ పొడసూపుతూ వుంది

లారీ ఆగటం కోసం ఆర్నెల్లు నుంచి, ప్రతిరోజూ నిరీక్షించి, చిన్ని నిరాశ పొందింది ఆ మధ్య లారీ ఓనరు ఎందుకు అంతగా తినబెట్టాడు? ఈ మధ్య ఎందుకు మానేశాడు? అన్న ప్రశ్నలకు సమాధానం తన సామర్థ్యం కొద్దీ ఆలోచించింది. అంతు దొరకలేదు.

పోనీ, ఏం చేస్తే మళ్లీ అలా తినే అవకాశం వస్తుందా అని ఆలోచించింది. ఆర్నెల్లు ఆ చిన్ని బుర్రలో తిరిగిన ఒకే ఒక్క ప్రశ్న! ఏం చేయాలి?

రాత్రి ఆకలికి కడుపు కాలిపోతుంటే, చలికి ఒళ్ళు పగిలిపోతుంటే, వానకి ఇళ్ళు అదురుతుంటే, అమ్మ మూలుగుతుంటే, నాన్న దగ్గర లేకపోతే, ఉన్నట్లుండి, ఆర్నెల్ల ప్రశ్నకు జవాబు లేతబుర్ర ఆకాశంలో సూర్యుళ్ళా పుట్టింది.

రాత్రంతా చిన్ని నిద్రకు దూరంగా ఉంది. తెల్లవారటం కోసం సూర్యుడి కంటే తొందర పడింది. మసకచీకటిలో నిద్రలేచింది. పదిసార్లు అయినా రోడ్డు మీదికి వచ్చి చూసి యింటికి పోయింది. చివరకి రోడ్డు ప్రక్క చింతచెట్టు క్రింద తొమ్మిది గంటలున్నప్పుడు కూర్చుంది.

సూర్యుడింకా ముసుగుతన్ని గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. చలికి మునగ దీసుకుపోయి వెలుపలికి రాకుండా ఇంట్లో కొండకొమ్మున తారట్లాడుతున్న మబ్బు రిక్రూటింగ్ ఆఫీసరులాగా మేఘాలను పోగేసుకొని ముందుకు వచ్చింది. గాలికి కాళ్ళొచ్చి, మేఘాల మెడలుబట్టి నెట్టుకువస్తూ వుంది. వున్నట్టుండి వాన మొదలయింది. చినుకులు గురిచూసి వదలిన బుల్లెట్ల లాగా పడుతున్నాయి.

చిన్ని కూర్చున్న చోటునుంచి లేవలేదు. ఏటవాలు చినుకులు ఒంట్లోకి చొచ్చుకొని పోయేట్టు పడుతున్నా లేవలేదు. రోడ్డు మీద ఆడుకొంటున్న పిల్లలు ఇళ్ళకు పరుగెత్తారు. కుడిపల్లెలో వాన హోరు తప్ప జనం అలికిడి లేదు.ఎడంపల్లెలో వానజోరు మరీ ఎక్కువగా ఉంది. రోడ్డు కనుచూపు మేరదాకా ఎడారిగా వుంది. ఎక్కడా మనిషి జాడ లేదు.

ఎక్కడ చూచినా వానే! కొండమీద, పొలం మీద, ఇళ్ళ మీద, చెట్ల మీద, రోడ్డు మీద ఎక్కడ చూచినా వానే! వాన విశ్వసత్యమై కురుస్తూ వుంది. ఆకాశం వానలు కంటుంటే నేల చలిని ఈనుతూ వుంది. ఈ చలి, ఈ వాన చిన్నికి తోడు!

నీటిబొట్లు పడి, ఆకులు బరువై, తలలు వంచుకొన్న చెట్లు బీదవాడి దైన్యం లాగా కనబడుతున్నాయి. వానకు తడిసి కుదించుకొని మునగదీసుకుపోయి గడ్డివామి ఆకలయిన కడుపులాగా వుంది.

చిన్ని రోడ్డును తేరిపార జూస్తూ వుంది. తూర్పున ఉదయించిన సూర్యుళ్ళా వస్తున్న లారీని చూచేసరికి చిన్ని ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయాయి. అదే లారీ! ఆ లారీ తనకీ ఏడు బాగా పరిచయం. అది కనబడుతుంటే ఒంట్లో ప్రతి రక్తం బిందువూ వెలుపలికి ఉరుకుతూ వుంది ముందుకు దూకుతూ వుంది

ఆ లారీ - వోనరు మంచితనంలా సాగివస్తూ వుంది. అమ్మ ప్రేమలాగా కనబడుతూ వుంది. దేవుడి దయ లాగా ఎదుటికి వస్తూ వుంది. బ్రెడ్డులా, పండులా, లడ్డులా, బిస్కట్టులా, కడుపునింపే తిండిలా లారీ కదిలివస్తూ వుంది.

చిన్ని లేచి నిలబడింది. లారీ క్షణక్షణానికి చేరువవుతూ వుంది. ఘడియ ఘడియకూ ఆశ పెరుగుతూ వుంది. రక్తం ఉబికిపడుతూ వుంది. ఆకలి తీరిపోతున్నట్లుగా వుంది.

లారీ నిండుగా బరువుతో వస్తూ ఉంది. వాన ఏటవాలుగా పడుతూ వుంది. ఆకాశం నుంచి భూమి మీదికి మసకపొర జారింది. పల్లెపట్టపగలు నిశ్శబ్దంగా వుంది. మనిషి అలికిడి లేదు.

లారీ దగ్గరకు వచ్చింది. చిన్ని రోడ్డు మీదికి పరుగెత్తింది. అంతదాకా చిన్నిని డ్రైవరు చూడలేదు. అప్పుడే చూశాడు. నవ్వుతున్న చిన్నిని చూశాడు. నవ్వుతున్న చిన్నిని చూచి గుర్తుపట్టి ఏడ్పుముఖం పెట్టాడు డ్రైవరు.

వోనరు నోట్లో వున్న చుట్ట చిన్నిని, నవ్వుతున్న చిన్నిని, లారీ ముందున్న చిన్నిని, చూచి జారి క్రిందపడిపోయింది.

చిన్ని నవ్వుతూ ఉంది. ఆ నవ్వులోనవ్వు లేదు. ఏడుపుంది. ఆకలుంది. బాధ వుంది. ఆ నవ్వులో కళ లేదు. కాంతిలేదు. ఆ నవ్వు నవ్వు కాదు. ఆ నవ్వులో దిగులుంది. దుఃఖముంది. దైన్యముంది. ప్రార్థన వుంది. బ్రతిమాలటముంది. ప్రాధేయపడటముంది.

రోజూ డ్రైవరు నవ్వటం రివాజు! అప్పుడ్నవ్వలేదు. ఎప్పుడూ నవ్వుకు బదులు నవ్వటం వోనరుకు ఆచారం. ఇప్పుణ్ణవ్వలేదు.

డ్రైవరు చేతులు వణికాయి. కాళ్ళు వణికాయి. లారీ నిండుతా కవుకిస్తూ వస్తూ వుంది. వాన పడుతూ వుంది. రోడ్డు జారుతూ వుంది. బ్రేక్ వేశాడు డ్రైవరు. లారీ ఆగలేదు. బ్రేక్ పళ్లేదు. లారీ ఆగే సూచన లేదు. చూస్తున్నారు.

ఎదురుగా దగ్గరగా చిన్ని. అందమైన చిన్ని. తెలివైన చిన్ని. చావుదప్పి బ్రతికిన చిన్ని. తనకిష్టమయిన చిన్ని!

వోనరు గుండెలు విలవిలలాడుతున్నాయి. నరాలు తెగుతున్నాయి. కాళ్ళూ చేతులు స్వాధీనం తప్పుతున్నాయి.

డ్రైవరు కాళ్ళు చేతులు బుద్ధి ఒళ్ళు చురుకుగా పనిచేశాయి. స్టీరింగు ఒడుపుగాతిప్పాడు. లారీ పక్కకు తిరిగింది. ఆగలేదు.

చిన్ని చూచింది. అమృతం లాంటి లారీ, అన్నం లాంటి లారీ తప్పించుకుపోతుంటే భరించలేకపోయింది. లారీ ఎటు తిరిగిందో చిన్ని అటు తిరిగింది. ఎటుపోయిందో అటు పోయింది. ఎదురుగా అడ్డంగా నిలబడింది.

'సిన్నా!'

అరిచాడు డ్రైవరు. లారీ స్టీరింగు మళ్లీ తిప్పాడు. లారీ రోడ్డెక్కింది. బలంగా ఓపిక కొద్దీ బ్రేక్ తొక్కాడు. కర్‌కర్‌మంటూ ముసలివాడి గొణుగుడు లాగా లారీ ఆగుతూ వుంది. చిన్ని కనబడలేదు.

చిన్ని చూస్తూ వుంది. ఎదుట లారీ! కర్‌కర్‌మని ధ్వని. నుదుటికి దెబ్బ! మునుపు తగిలిన చోట మళ్ళీ దెబ్బ!

చిన్ని పడుతున్నాను కాబోలు అనుకొంది . రోడ్ల మీద పడింది. మునుపు రోడ్డు పక్కకు పడింది. ఇప్పుడు రోడ్డు మధ్య పడింది. మునుపు లారీకి ప్రక్కగా పడింది. ఇప్పుడు లారీకి ఎదుట పడింది. లారీ ఆగలేదు. స్పృహ తప్పుతుందనుకొంది. తప్పింది.

పొట్టకు ఏమో తగిలింది. అమ్మచేయో, నాన్నచేయో అనుకోవచ్చు చిన్ని. స్పృహ వస్తే ఎదుట అమ్మో, నాన్నో ఉండవచ్చుననుకోవచ్చు చిన్ని. ఆకలయిన కడుపుమీద అమ్మ చేత్తో రాస్తూ వుంది అనుకోవచ్చు.

చిన్నికి ఇక ఇప్పుడేం తెలియదు. లారీ వుంది. రోడ్డు ఉంది. దాని మీద చిన్ని వుంది. లారీకి బ్రేక్ పడి ఆగింది. ఆగుతూ సాగింది. సాగి ఆగిపోయింది.

ముందు చక్రం తన క్రింద రాయి పడ్డట్టు అయితే ఎక్కి దిగింది. లారీ ఆగగానే అటు వోనరు, ఇటు డ్రైవరు లారీ లోంచి క్రిందికి దూకారు.

ఆ చుట్టు పక్కల చిన్ని లేదు. ఎటుబోయిందో కనబల్లేదు. లారీ కింద నుంచి రక్తం వర్షం నీటిలో కలిసి ఎర్రగా రోడ్డు ప్రక్క నీటి జాలులోకి పోతూ వుంది.

రోడ్డు మధ్య లారీ చక్రం క్రిందపడి, పొట్టపగిలి, రక్తం అన్ని ప్రక్కలకు చిమ్మి, కాళ్ళు చేతులు నేలకు ఇల కరుచుకుపోయి అప్పచ్చిలాగా అతుక్కుపోయి వున్న గొంగ్రుకప్ప, పెద్ద గొంగ్రుకప్ప, అరిచేది, ఎగిరేది, దూకేది, ఆలోచించేది, ఏడ్చేది, నవ్వేది, కడుపుకాలి అల్లాడేది, ప్రేగులుతునిగి ఆకలికి దూరంగా పోయింది.

ఆంధ్రపత్రిక పరీధావి సంవత్సరాది సంచిక

*(1972-73)*

# కోటిగాడు స్వతంత్రుడు

పులికంటి కృష్ణారెడ్డి

కోటిగాడి మొకంలో కోటిదివ్వెలు ఒక్కసారిగా వెలిగాయి. కోటిగాణ్ణి ఇంట్లో వాళ్లమ్మ 'ఒరే! కోటయ్యా'! అని ఆప్యాయంగా పిలిచేది. ఇంటి నుండి బయటపడితే స్నేహితులు 'ఒరే కోటీ!' అని ముద్దుగా పిలిచేవాళ్లు. ఊళ్లో వాళ్లు 'ఒరే! కోటిగా!' అని దబాయించినట్లు పిలిచేవాళ్లు. ఎవరు ఎలా పిలిచినా పలికేవాడు కోటిగాడు - 'ఏలా పిలిస్తే ఏముంది!' అని అనుకొనేవాడు. కానీ, ఆరోజు మాత్రం 'కోటిగాడు' అన్న పిలుపు వినిపించేసరికి కోటిగాడి మొకంలో కోటి కాంతులు చోటు చేసుకున్నాయి.

ఆదరాబాదరా పైకి లేచాడు. తడబడుతూ వేదిక వద్దకు నడిచాడు. ఒక్క ముంపులో ఎగిరి వేదికమీద పడగల శక్తి ఉన్నా, వెనకా ముందాడుతూ వేదిక నెక్కాడు. వంగి నిలబడ్డాడు. వంగి నిలబడడం 'వినయ'మనుకుంటే అనుకోవచ్చు. కానీ వాడు రిక్షా తొక్కి తొక్కి వినయవంతుడయ్యాడు.

ఆ వినయవంతుడు - అందించిన కవర్ని వణుకుతున్న చేతులతో అందుకున్నాడు. ఆ కవరందించిన పెద్దమనిషి ఒక దండం, ఎదురుగా కూర్చున్న ప్రజానీకానికి మరొక్క దండం పెట్టి వేదిక దిగాడు.

వేదిక దిగినా ఏనుగునెక్కినంత సంబరం వాడిది!

వేదిక దిగిన కోటిగాడు నేరుగా వెళ్లి తన స్థానంలోకూర్చోకుండా వేదిక ప్రక్కకు వెళ్లాడు. అక్కడ అప్పటికే అలాంటి కవర్లందుకొన్న కొంతమంది గుమిగూడి ఉన్నారు. ఆ గుంపులో చేరాడు కోటిగాడు.

అందరి మొగాల్లో పువ్వులు పూస్తున్నాయి.

ఆ రోజు ఆగస్టు పదిహేను. భారతదేశ చరిత్రలో ఆరోజు ఒక అరుదైన రోజు.

ఒకప్పుడు భారతదేశం బానిసదేశం. భారతీయులు తెల్లవాళ్ల దృష్టిలో నల్లవాళ్ళు. ఈ నల్లవాళ్లు ఆ తెల్లవాళ్ళకు బానిసలు. ఈ బానిసత్వాన్ని భరించలేని కొందరు మహనీయులు స్వాతంత్ర్య సమరం జరిపారు. ఆ పోరాటం ఎంతో శాంతియుతంగా జరిగినా, ఎంతోమంది ఆస్తిపాస్తులు దగ్ధమయ్యాయి. అసువులు గాలిలో కలిసిపోయాయి. జైళ్ళు ఇళ్లయ్యాయి. ఏది ఏమైనా, స్వాతంత్ర్య సాధన వాళ్ళ ధ్యేయమయింది.

పట్టుదలకు పరిశ్రమ తోడైతే ధ్యేయసాధన నల్లేరుపై నడక.

ఒక ఆగస్టు పదిహేనున భారతీయులు స్వతంత్రులైనారు.

అప్పటి నుండి ప్రతియేటా ఆ తేదీన స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపుకొంటున్నారు. మొదట మొదట ఆ ఉత్సవాల్లో ఆనందావేశాలు మిళితమై వుండేవి. ఆ సంబరానికి పట్టపగ్గాలు ఉండేవి కావు రానురాను ఆవేశం హరించుకుపోయి, ఆనందం మాత్రం అంతంత మాత్రంగా మిగిలి ఉంది. ఇప్పుడు గతాన్ని తలిచి గంతులు వేయడం మాని అంతో ఇంతో ప్రగతిపథం వైపు మొగ్గు చూపిస్తున్నారు.

ప్రగతిసాధన కార్యక్రమంగా జమీందారి పద్ధతి రద్దయింది. భూస్వామ్య సంస్కరణలు అమలులోకి వచ్చాయి బాంకులు జాతీయపరం అయ్యాయి. ఇలా ఎన్నో ఎన్నెన్నో. కార్యక్రమాలు మిట్టనున్న వాణ్ణి పల్లానికి, పల్లంలో ఉన్నవాణ్ణి మిట్టకు లాగి సమతలంపై నిలబెట్టాలన్న ప్రయత్నంతో ప్రారంభమయ్యాయి.

ఆ తేదీన స్వాతంత్ర్య దినోత్సవం.

పాఠశాలల్లో పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టారు. ఆ పిల్లలకు అర్థం కాని భాషలో స్వాతంత్ర్య దినోత్సవాన్ని గురించి ఆవేశంగా ఉపన్యాసాలు యిప్పించారు. కార్యాలయాలపై జాతీయ పతాకాన్ని ఎగరవేసి ఎటో చూసి నమస్కరించారు. ఒక తరానికి చెందిన కొందరు పెద్ద మనుష్యులు శుద్ధ ఖద్దరుధారులై గాంధీ గారి పటాన్ని ఒక రిక్షాలో పెట్టి వూరేగిస్తుంటే ఒక హోటలు ముందు నిలువుగాళ్ళ మీది యువతరం కొందరు 'గాంధీజీకి జై!' అని, మరికొందరు 'బ్రాందీకి జై' అని, ఆ పిమ్మట అందరూ కలిసి నవ్వలేక నవ్వుతున్నారు. ఆ వూళ్ళో అక్కడక్కడ కొన్ని సభలు, సమావేశాలు జరిగాయి. అలా జరిగిన ఒకానొక సభలో --

చిన్న చిన్న దుకాణాలు నడుపుకొనేవాళ్ళకు, వృత్తికారులకు, వీధులు తిరుగుతూ కూరగాయ లమ్ముకునేవాళ్ళకు, రిక్షావాళ్ళకు జాతిపరమైన బ్యాంకుల ద్వారా అప్పులిప్పించారు.

కోటిగాడికి కూడా అప్పు దొరికింది. కొత్త రిక్షా కొనుక్కోవడానికి!

కోటిగాడు కవరు విప్పాడు. వాడి గుండె దడదడలాడింది. కండ్లు మిలమిల మెరిశాయి. ఆ కవరు నిండా నోట్లు! అన్నీ 'ఫళఫళ'మంటున్న కొత్త నోట్లు! ఒకటి గాదు, రెండు గాదు - అయిదువందలు.

కోటిగాడు బానిస భారతదేశంలో పుట్టలేదు. స్వతంత్ర భారతదేశంలో పుట్టాడు. కాగా కోటిగాడు కడు స్వతంత్రుడు. అయినా వాడుపుట్టి బుద్ధి ఎరిగిన నాటి నుండి అయిదు వందలు కాదు కదా - అయిదు పదులైనా ఒక్కసారిగా కళ్ళ చూచిన పాపాన పోలేదు. అందుకే వాడి గుండె ఆనందంతో ఎగిరి గంతులు వేస్తూ ఉంది.

ఇంతకాలంగా కోటిగాడు రిక్షా తొక్కే బ్రదికినాడు. మరునాటి నుండి కూడా రిక్షా తొక్కే బ్రదుకుతాడు. అయితే ఆ బ్రదుకులో ఎంత మార్పు!

రిక్షా కోటిగాడు 'ఆపు' అంటే రిక్షాను ఆపాడు. 'పద!' అంటే ముందుకుసాగాడు. అయిదు నిమిషాలంటూ అర్ధగంట ఆలస్యం చేసినా, ఎదురుచూస్తూ నిలబడ్డాడు. తొక్కగలిగినచోట ఎక్కి తొక్కినాడు. వీలుగానిచోట దిగి లాగాడు. మండుతున్న ఎండలో చెమటలు కక్కాడు. కురుస్తున్న వానలో తడిసి ముద్దయ్యాడు.

కోటిగాడికి పరునాటి నుండి కూడా ఈ సాధక బాధకాలు తప్పవు

అయితే - 'రేపటి నుండి తన సంపాదనలో మూడు వంతులు రిక్షా బాడుగ కింద చెల్లించవలసిన అవసరం లేదు. తనదింకా కూలి బతుకు కాదు' అనుకొనేసరికి కోటిగాడి మొగంలో కొత్త కాంతులు వెల్లివిరిశాయి

కొత్త రిక్షా కొత్త బతుకు. కొత్త కొత్త ఆశలు. కోటిగాడు ఊహల్లో తేలిపోతు డబ్బు జేబులో భద్రపరుచుకున్నాడు.

సభ ముగిసింది. ఎవరి దారిని వాళ్ళు వెళుతున్నారు. అయితే కవర్లందుకున్న వాళ్ళు మాత్రం కాలు కదపడం లేదు.

''ఇంకా ఈడ నిల్చుకోని ఏం జెయ్యాలబ్బా! పోదాం పదండ్రా!'' అన్నాడు కోటిగాడు.

''బలేవోడివో నువ్వు! అక్కరదీర్తే అక్క మొగుడు కుక్కన్నట్టుందే నీ యువ్వారం ! పెంటయ్య రావద్దా!'' ఎదురుపలికింది ఒక గొంతు.

పెంటయ్య కోసం ఎదురుచూస్తూ నిలబడ్డారు.

పేరుకు పెంటయ్యే కానీ, ఆయన చాలా 'పెద్దయ్య'. ప్రజాసేవ ఆయనకు ఊపిరి. సభలు సమావేశాలంటే ఆయనకు అన్నపానాదులు. అలగాజనం ఆయనకు ఆప్తులు. రాజకీయ నాయకులు ఆయన జేబులో బొమ్మలు. బలహీనవర్గాల సమస్యలా! అరచేతిలో గీతలు.

ఊళ్ళో ఏ రాజకీయ నాయకుడైనా అడుగుపెడితే చాలు. ఆయన ముందు నిలబడతాడు. ఆయన వెనక వందలాది బక్కాబడుగు ఆకారాలుంటాయి -- జై అంటే జై అనడానికి !

ఆ ఊళ్ళో ఏ సభ అయినా, సమావేశమయినా ఆయన లేకుండా జరగడానికి వీల్లేదు. ఒక వేళ జరిగినా ఫలితం జరిపించే వాళ్ళకు తెలుసుగాబట్టి జరిపించరు.

అందువల్ల స్వాతంత్ర్య దినోత్సవ కార్యక్రమం పెంటయ్య భుజాల మీదనే నడిచింది. ఆ బరువును దులుపుకొని, స్వాగతం పలికిన పెద్దలకు వీడ్కోలు చెప్పి, చేతికింద మెలిగే మూకకు అప్పగింతలు పలికి, పెంటయ్య బయలుదేరేసరికి కాస్త ఆలస్యమే అయింది.

అంతవరకు కవర్లు ఆయన గారికోసం నిరీక్షిస్తూ నిలబడ్డాయి.

పెంటయ్య బయలుదేరాడు.

మందడి వెంటబడ్డ గొర్రె మందల్లా కవర్లు వెంటబడ్డాయి.

పెంటయ్య ముందు, కవర్లందుకున్న గుంపు వెనకగా ముందుకు నడిచారు. పెంటయ్య ఇంట్లో అడుగుపెట్టారు.

నెత్తి బరువు నేల పడ్డట్టు నిట్టూరుస్తూ దర్జాగా కుర్చీలో ఆసీనుడయ్యాడు పెంటయ్య. ఏదో ఘనకార్యాన్ని సాధించిన తృప్తి అతని మొగంలో తొణికిసలాడుతూ ఉంది.

''ఏ జన్మంవో ఏంపాడో గానీ, ఏదైనా పని అనుకుంటే అయ్యేదాక నిద్దర పట్టదు. ఈ బాధలన్నీ పళ్ళేక ఎప్పటికప్పుడు అనుకుంటూనే ఉండా, ఈ బాదలింక పళ్ళేమని. అయినా మీ అగసాట్లు సూస్తా ఉంటే 'అయ్యో'మనిపిస్తుంది. నాకు తెలవకుండానే

తలదూర్చేస్తాను. పెరుక్కోని బయటపడేకుందకి తలపాణం తోక్కొస్తుంది. అయినా ఏం చేద్దాం? తలకాయ ఉన్నంతకాలం పడిసెం తప్పుతుందా?'' అక్కడున్న వాళ్ళను ఉద్దేశించినట్లు కాకుండా తనలో తాను గొణుక్కున్నాడు, వాళ్ళకు వినబడేటట్లుగా.

ఆ తరవాత -

''ఏం? అందరికి డబ్బు అందినట్లే గదా!'' అని అడిగాడు పెంటయ్య. ఆమూక తోక ముడిచి ముక్తకంఠంతో 'సిత్తం' అనింది.

''అయితే ఇంకా ఆల్సి చేస్తుండారెందుకూ? తెండి! తెండి!!'' అడగడంలో దర్పం పడగ విప్పిన పాములా పైకి లేచింది.

ఒక్కొక్కడుగా రెండేసివందలు ఎంచి చూస్తుంటే నిర్లక్ష్యంగా కుడిచేత్తో అందుకుని ఎడమ వైపు జేబులో కుక్కుకుంటున్నాడు పెంటయ్య.

కోటిగాడు మాత్రం మినకరిస్తూ ఒక మూల నిలబడ్డాడు. వాడికి ఈ తంతు అంతు చిక్కడం లేదు.

''ఏవిరా? కోటిగా! అట్లా నసగతా నిలబణ్ణావే?'' ఏంసంగతి? తేతే ! నాకింకా ఓపినన్ని పన్లుండాయి.'' అసహనంగా అడిగాడు పెంటయ్య.

''అయిదొందల అప్పులో రెండొందలు నీకే యిచ్చేస్తే నేనింక రిచ్చా ఎట్లా కొనాలా? అప్పెట్లా తీర్చాల?'' సందేహాన్ని వెలిబుచ్చాడు కోటిగాడు.

ఇంటి పైకప్పు పైకెగిరిపోయేలా విరగబడి నవ్వాడు పెంటయ్య.

నవ్వుతున్న పెంటయ్యను, నవ్వుతుంటే కలిపి నవ్వకపోతే బాగుండదని ఆయనతో కలిసి నవ్వుతున్న గుంపును దేబెరించి చూస్తూ నిలబడ్డాడు కోటిగాడు.

నవ్వును ఆపుకోవడానికి పెంటయ్య కాస్త తంటాలు పడవలసి వచ్చింది.

''ఒరే కోటిగా! నీలాంటి పిచ్చోళ్ళుండే గదరా ఈ దేశం ఇట్లయిపోతా ఉండేది! నిన్ను రిచ్చా కొనమనిందెవుడు? అప్పు కట్టమనిందెవుడ్రా? సెప్పండయ్యా సెప్పండి! మీరన్నా సెప్పండి వాడికి.''

ఏం చెప్పాలో? ఎట్లా సెప్పాలో? తోచకుండా ఒకరి మొగం ఒకరు చూచుకొంటూ నిలబడిందా గుంపు.

''ఏవండయ్యా? సెప్పడానికి మీ సేతకాలేదా? అయితే నేనే సెప్తా!'' అందరినీ తేరిపార చూచి గొంతు సవరించుకున్నాడు పెంటయ్య.

''ఒరే కోటిగా! నీకు అప్పు పుట్టించడానికి రిచ్చా అడ్డం పెట్టుకోవలసొచ్చింది. నాలాంటోళ్ళు బతకడానికి నీలాంటోళ్ళు అవసరంవొచ్చింది. అంతేరా! అంతే!! రెండొందలిట్లా పారేసి మిగత మూడొందలు పట్టుకెళ్ళు. గుడ్డాగుసురు కొనుక్కో! కొన్నాళ్ళు అంత పచ్చంగా తిని, ఎచ్చంగా పాడుకో!''

పెంటయ్య ఉపదేశ వాక్యాలు కోటిగాడి చెవికెక్కలేదు. వాడి మనస్సంతా కొత్త రిక్షా మీద కొట్టుకులాడుతూ వుంది. ఎటూ తోచక అయోమయంగా చూస్తూ నిలబడ్డాడు.

''అట్లా గుణస్తా ఉండావెందుకు గుడ్డినా కొడకా! ఏందో నీ యబ్బ సొత్తు ఎత్తిచ్చినట్లు యాతన పడిపోతుండావే? ఆహాఁ! నీ కేఁవయినా ఇల్లుందా? వాకిలుందా? భూమి బుట్రా ఉందా? ఏవుందిరా నీకు ? మరి ఎవురి మొకం చూసుకోనిచ్చినారనుకున్నావురా అప్పు?''

ఆ మాట అంటూ అందరివైపు అసహనంగా చూశాడు పెంటయ్య. అందరు చేతుల్ని ముడిచి తలల్ని తోకలు చేసి ఆడిస్తున్నారు పెంటయ్య కాస్త శాంతించాడు.

''ఒరే కోటయ్యా! ఆ మాట కొస్తే ఈ అయిదొందల్లో పెద్ద భాగం నీదేరా పిచ్చోడా! నువ్విచ్చే బోడి యిన్నూరుకింక ఇరవై మంది మొగుళ్ళుండారు. తెలిసిందా? అంతేరా అంతే! పాపమని పాతకొకిస్తే ఇంటెనక్కు పోయి మూరేసకుణ్ణిందంట నీలాంటి ఒకామె. అట్లుంది యవ్వారం! తేరా తే!''

మంచిగానే కోటిగాణ్ణి వంచేశాడు పెంటయ్య.

వచ్చీరానీ మనసుతో ఆడీ ఆడని చేతులతో రెండు వందలు అందచేశాడు కోటిగాడు. వాడి మనసు కళావిహీనమయింది. కొత్త రిక్షా ఓనరుగా వాడు కట్టుకున్న పేక మేడలు కంటెదుటే నిలువునా కూలిపోయాయి. ఒక నిమిషం అక్కడ నిలబడలేకపోయాడు.

కోటిగాడు నడుస్తున్నాడు. తనకు జరిగిన అన్యాయాన్ని కోటి గొంతులతో ఘోషించాలని పరితపిస్తూ నడుస్తున్నాడు.

ఎవరితో చెప్పుకోవాలి? ఏమని చెప్పుకోవాలి? ఎలా చెప్పుకోవాలి?

రిక్షావాడు చెబితే వినేవాళ్ళుంటారా ఈ లోకంలో?

పోనీ తాను చెబితే ఎప్పుడు వినిందీ లోకం? వినకపోగా పైగా పట్టుకుని తన్నింది.

అమ్మ కూలీనాలీ చేసి మానెడు నూకలుతెస్తే తాను కట్టెలమ్మి పావలా పరకా తెచ్చేవాడు. ఆ పల్లెటూళ్ళో వేణ్ణీళ్ళకు చన్నీళ్ళుగా బ్రతుకు సాగిపోతూ ఉండేది. ఆ గానుగెద్దు బ్రతుకు అలానే కొనసాగి ఉంటే చీకూ చింతా ఉండేది గాదు. తన కర్మకాలకపోతే తమ్మిరెడ్డి - చంగమనాయుడు దారి జగడం ఇంటిదాకా అన్నట్లు ముత్యాలమ్మ తిరణాల కోసం 'నువ్వెంత? అంటే నువ్వెంతరా?' అని జుట్లు జుట్లు పట్టుకోవాలా? ఆ సమయానికి తానక్కడే ఉండాలా? అంతటితో ఆగకుండా ఆ వ్యవహారం కోర్టువరకెక్కాలా?

* * *

నాలుగయిదు బాటలు కలిసే కూడలి అది. ఆ కూడలి వద్ద నిలబడ్డాడు కోటిగాడు. ఎటు పోవాలో తోచక ఒక్క క్షణం ఆలోచిస్తూ నిలబడ్డాడు. ఆ బాటల్లో ఏ బాట మీద పడినా ఏదో ఒక గమ్యస్థానం దొరుకుతుంది. అయితే మనిషి ఏదో ఒక బాట ఎన్నుకొంటాడు. అలా ఎందుకు చేస్తాడో అతనికే తెలియదు. అదే జీవితంలో విచిత్రం. ఎప్పుడు, ఎక్కడ ఎలా మలుపు తిరుగుతాయో జీవితాలు!

అనుభవంతో వాడి ఆలోచనా విధానం వాడికే చిత్రంగా ఉంది.

తనలో తాను నవ్వుకుంటూ నడుస్తున్నాడు -- ఒకానొక బాట మీద. అది ఎక్కడ చేరుస్తుందో ఏమో? చూడాలి మరి!

* * *

ఆ వ్యవహారం జరిగి నెల తిరగక ముందే ఒక రోజు మాటు మణిగిన వేళ తమ్మిరెడ్డి పిలిస్తే తాను వెళ్ళాడు.

''ఒరే కోటిగా! చూస్తిని గదరా నాయుడిగాడి నిక్కు! వాణ్ణి ఒక్క దినవుంయినా పదారుకమ్ములెనక్కు పంపించకపోతే నే రెడ్డిబిడ్డే కాదనుకో! అయితే యవ్వారమంతా నీ మీదే వుంది. జరిగింది జరిగినట్లు చెప్పు! ఆమిందట నీ జరుగుబాటు నా కొదులు. ఏఁవంటావ్?''

దాదాపు దబాయించినట్లే అడిగాడు తమ్మిరెడ్డి.

''అట్లాగేనయ్యా!'' అన్నాడు తాను.

ఆ మరుసటి రోజు సందకాడ చంగమనాయుడు తన గుడిసె పైకే వచ్చాడు. చీలుస్తున్న కట్టెల్ని ఎక్కడి వక్కడ వదిలి చేతిలో గొడ్డలి పక్కనబెట్టి రెండడుగుల్లో వచ్చి నాయుడు ముందు నిలబడ్డాడు.

''ఒరే కోటి! ఎంతకాలఁవనిట్లా కట్టెలు కొట్టి చస్తావురా! ఒంట్లోరసున్నంత కాలం పరవాలేదనుకో! ఆ తరవాత? అందుకేరా వుందు సూపుండాలన్నారు పెద్దోళ్ళు. నా మాటిన్నావంటే -ఆ ముత్తేలమ్మ సాచ్చిగా సెప్తా ఉండా - రొండంకణాల పూరిల్లు ఒకెకరా మడి - ఏఁవంటావ్?''

ముంగాళ్ళకు బంధమే వేశాడు చంగమనాయుడు.

ఎటూ నోరు కదలలేక గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు తాను.

''రెడ్డోడి తీఁవురు చూస్తివి గదరా! అయినా మణిసికి అంత పెగ్గె పనికిరాదురా! వాడి తిక్క కుదిరించకపోతే నేనబ్బా అమ్మకు కాదు పుట్టింది. అయితే అంతా నీ సేతుల్లో ఉండాది. ఏం చేస్తావో ఏవో మరి!''

రెండు చేతులు పట్టుకోలేదు కానీ పట్టుకున్నంత పనిచేశాడు నాయుడు.

''అట్లాగేయ్యా!'' అన్నాడు తాను నంగిగా.

రెండు పొట్టేళ్ళు ఢీకొన్నాయి. వాటి మధ్య తలదూర్చితే చిత్తయి పోవడం ఖాయం.

కోర్టులో సాక్ష్యం చెప్పాలి. 'సాక్ష్యం' అంటే ఎవరివైపో ఒకరి వైపో చెప్పాలి. ఒక వైపు చెబితే మరొక వైపు కన్నెర్ర చేస్తుంది. అదీ కాక వాళ్ళు పెద్దోళ్ళు. ఈరోజు జుట్లు జుట్లు పట్టుకుంటారు. మళ్ళీ అవసరమొస్తే చేయి చేయి కలుపుకొంటారు. ఎటొచ్చీ యిద్దరి మధ్య యిరుక్కొని పెరుక్కోలేక యాతనపడేది తనలాంటివాళ్ళే.

అటు నూయి, ఇటు గోయి. ఏం చేయుటం? కోటిగాడు ఆలోచించాడు. తన చిన్న బుర్ర వేడెక్కేవరకు ఆలోచించాడు. ఎంత ఆలోచించినా వాడికి తోచింది ఒక్కటే మార్గం.

రెక్కాడితే కాని డొక్కాడని బ్రదుకులకు చిత్తూరైనా పుత్తూరైనా కాకుంటే వంరే ఊరయినా ఒక్కటే! లేదంటే, ముసల్ది ఉంది. ఎక్కడో అంత బ్రతుకు తెరువు దొరికితే ఆ తరువాత ఆమెను పిలుచుకొనిపోతే సరిపోతుంది.

ఈ నిర్ణయంతో ఒక అర్ధరాత్రి ఇంటి నుండి బయటపడ్డాడు.

కొత్త జీవితంమీద కోటి ఆశలు. కని పెంచిన తల్లిని ,పుట్టిపెరిగిన పల్లెను విడిచి పెడుతున్నందుకు గుండెల నిండుకు కొండంత గుబులు.

భళ్ళుమని తెల్లవారే వరకు నడిచాడు.

కనుచూపు మేరలో ఒక పెద్ద పట్టణం. పెద్ద పెద్ద భవనాలు అందంగా కనిపిస్తున్నాయి ఆ పట్టణానికి మధ్యగా ఆ భవనాలను మించి వాడి ఆశలకు ప్రతీకగా ఒక ఎత్తైన గోపురం ఒంగోలు గిత్త మూపురంలా కనిపిస్తూ ఉంది. గోపురం ఉంటే గుడి ఉంటుంది. గుడి ఉంటే గుళ్ళో దేవుడు ఉంటాడు. దేవుడు ఉండే ఊళ్ళో నిజంగా దేవుడి లాంటి మనుష్యులే ఉంటారు. అంత మంచి ఊళ్ళో ఇంత చిన్న ప్రాణానికి రవంత చోటు దొరక్కపోతుందా?

కోటిగాడికి ప్రాణం లేచివచ్చింది. మరీ తెంపుగా నడుస్తున్నాడు.

ఆ పట్టణంలో ఉన్న పెద్ద పెద్ద భవనాలు పెరిగిపోతున్న జనాభాకు చాలవన్నట్టుగా అంతకంటే పెద్ద పెద్ద భవనాల్ని కడుతున్నారు ఊరిముందర. ఆశగా అక్కడికి వెళ్ళాడు. ఆలోచిస్తూ నిలబడ్డాడు. ఆలోచించవలసిన అవసరం లేకనే నేలమీద తట్ట నెత్తికెక్కింది.

పొద్దు గూట్లో పడేదాకా తట్ట మోస్తే పొట్ట గడుస్తూ ఉంది.

'బయలుదేరిన వేళావిశేషం మంచిదే!' అనుకొన్నాడు. కాలికి కాలు కట్టుకొంటూ అడవులు మీదపడి కట్టెలు తేవడం కంటె తట్టమోయడం సులువుగా ఉంది. నాలుగురాళ్ళు వెనకబడితే వెళ్లి అమ్మను పిలుచుకొని రావాలి - అనుకొన్నాడు.

అంతవరకు బాగానే ఉంది. అయితే -

ఒకరోజు వేళకాని వేళ అనుకోనట్లుగా ఇంజనీరు వచ్చాడు. తనిఖీ కోసం. ఆ సమయాన సిమెంటును ఇసుకను కలగలుపుతున్నారు కూలీలు. అక్కడ ఒక్క క్షణం నిలబడ్డాడు ఇంజనీరు.

'ఎన్ని తట్టలు ఇసుకకు ఎన్ని తట్టల సిమెంటు!' ఇంజనీరు అడిగాడు.

''ఆరుకొకటేస్తా ఉండామ్ సార్!'' అన్నాడు కూలీల మేస్త్రీ. వాడు పాత పందికొక్కు. ఎవరికెలా చెప్పాలో వాడికి బాగా తెలుసు.

''ఒరే! ఒరే! అపద్దం చెప్తే ఆడబిడ్డలు పుట్టార్రో! పదికొకటేస్తా ఆరుకొకటంటావుగదరా అన్నాయస్తుడా!'' అమాయకంగా అన్నాడో, ఆలోచించే అన్నాడో! అనకూడని మాట అనేశాడు కోటిగాడు.

చివ్వున పైకి లేచాడు ఇంజనీరు.

గాలికి ఎగిరే కాగితం మీద బరువు పెడితే ఎగరదు. అరిచే కుక్క నోటికి కవళం పడితే అరవదు. కోపం వచ్చినపుడు ఈ కోవకు చెందుతారు ఆఫీసర్లు అని ఎరిగిన కాంట్రాక్టర్ అత్యంత చాకచక్యంతో ఆఫీసరు జేబులో బరువు పెట్టాడు. బరువు పడేటప్పటికి ఎగరడం మాని వగర్చడానికారంభించాడు ఇంజనీర్.

''ఇదో ఇలాంటి మాటలు ఇంక చెవిని పడితే టెండర్లే కాన్సిల్ చేస్తా! ఏమనుకున్నారో

ఏమో? జాగ్రత్త!'' అని హెచ్చరిస్తూ బయలుదేరాడు ఇంజనీర్. జేబులో బరువు మోస్తూ నిలబడలేక.

ఇంజనీర్ అటు వెళ్ళడం, కంట్రాక్టరు ఎగిరి నడ్డిమీద తన్నడం, కోటిగాడు నడిరోడ్డులో బోర్లగిలా పడడం అతి సహజంగా, సవ్యంగా జరిగాయి.

కోటిగాడు పైకి లేచాడు. తిరిగి చూడకుండా ముందుకు నడుస్తున్నాడు.

దేవుడు ఉండే ఆ పట్టణంలో ఒక దేశనాయకుడి పేరుమీద వెలిసిందా రాజవీధి. పేరుగాంధీ రోడ్డు.

గాంధీ రోడ్డులో బట్టల కొట్లు వున్నాయి. ఫాన్సీ షాపులు ఉన్నాయి. పాత్రల అంగళ్ళు ఉన్నాయి. మెడికల్ షాపులు ఉన్నాయి. మాంసాహార, శాకాహార హోటళ్ళు ఉన్నాయి. ఫోటో స్టూడియోలు ఉన్నాయి. అక్కడక్కడా ఈ అంగళ్ళ మధ్య అలంకారప్రాయంగా బ్రాందీషాపులు ఉన్నాయి.

ఈ అంగళ్ళన్నింటి ముందు రోడ్డుకిటువైపు, అటువైపు రోడ్డంతా వ్యాపించి కలిగిన వాడి నీడలో బతికే లేనివాడిలా చిన్న చిన్న కొట్లు ఉన్నాయి.నాలుగు చక్రాల బండ్ల మీద పండ్ల అంగళ్ళు నాలుగు బార్లకు ఒకటి ఉన్నాయి. ఆ బండ్ల మీద ఒయ్యారంగా వాలి ఒక ద్రాక్షపండునో, జామపండునో కొరికి తింటూ పోలీసువాళ్ళు ఉన్నారు. ఏమరితే పిడికెడు ఆకుకూరనో, లేదు అరటిపండ్లనో నోటికందుకోవడానికి ఆవులు ఉన్నాయి. గేదెలు ఉన్నాయి. మేకపోతులు ఉన్నాయి. వీటన్నింటితో కలిసి మనుష్యులూ ఉన్నారు.

ఆ రోడ్డు మీద నిలబడ్డాడు కోటిగాడు.

అక్కడ ఎవరి దారి వాళ్ళదిగా ఉంది. ఎవరిపని వాళ్ళదిగా ఉంది. ఎవరిమాట వాళ్ళదిగా ఉంది.

''ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?'' అని తనలో తాను గొణుక్కున్నాడు.

ఆకలి పీకుతూ ఉంది. నిలబడలేక అంగడి ముందు కూర్చున్నాడు. కూర్చున్నా నిలుచుకున్నా ఆకలి ఆకలే! ఆకలి తీరాలంటే అంతో ఇంతో పడాలి. అంతో యింతో పడాలంటే డబ్బు కావాలి. అదే లేదు తన దగ్గర. ఏం చేయాలి?

'' ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?'' అనుకుంటూ నడుస్తున్నాడు కోటిగాడు అంతకంటే చేసేది లేక, తెలియక.

అక్కడ వరసగా అయిదారు హోటళ్ళు . ఆ హోటళ్ళు ముందు నిలబడి వచ్చే పొయ్యేవాళ్ళను 'భోజనం చేస్తావా బాబూ! చేస్తావా బాబూ!'' అని ఆప్యాయంగా అడుగుతున్నారు.

ఆశ్చర్యంగా చూస్తూ అక్కడ నిలబడ్డాడు కోటిగాడు.

'భోజనం చేస్తావా, బాబూ!' ఒకానొకడు అడుగుతున్నాడు ముద్దుగా.

ఆనందంగా తల ఆడించాడు కోటిగాడు.

సాదరంగా లోనికి పంపాడు కోటిగాణ్ణి.

అక్కడ వాడు జంకుతూ ఒదిగి ఒక వారగా నిలబడితే చేయిపట్టి ముందు కూర్చోమన్నారు. ఒకడు విస్తరి పరిచాడు. ఒకడు నీళ్ళు పెట్టాడు మరొకడు విస్తరి నిండుకు అన్నం పెట్టాడు. ఇంకొకడు కూరలు వడ్డించాడు.

ఆవురావురుమని ఆకలి.

గుడ్డెద్దు చేలో పడ్డట్టు తింటున్నాడు కోటిగాడు.

''కోడికూర వేంపుడు, చేపల పులుసు పెట్టమంటావా, బాబూ!'' ఇంకొకడు అడుగుతున్నాడు.

వాళ్ళ ఆదరభావానికి ముగ్ధుడైపోయాడు కోటిగాడు. దేవుడున్న వూళ్ళో దేవుడిలాంటి మనుష్యులే! అనుకొన్నాడు. నోటి నిండుకు కూడు. బదులు చెప్పలేక జోరుగా తల ఆడించాడు.

అడిగి అడిగి వడ్డిస్తే తుమ్మితే ముక్కులో నుండి పడేదాకా మెక్కాడు. తృప్తిగా త్రేన్చుతూ బయటికి నడుస్తున్నాడు. 'తొమ్మిదిన్నర' అని ఒక గావుకేక పెట్టాడు సర్వర్.

తనకేమీ పట్టనట్లుగా, తన లోకం తనదిగా హాయిగా నడుస్తున్నాడు కోటిగాడు. అంతలో ఎవరో జబ్బ పట్టి నిలబెట్టి 'బిల్లు చెల్లించరా బేటా!'' అన్నాడు.

తెల్లమొగం వేశాడు కోటిగాడు. అంతలోనే తెపురుకొన్నాడు.

''ఇదేంవి అన్నాయమయ్యా! పిల్చి కూడంత బెట్టి దుడ్డడుగుతుండారే?''

వాడి మాటలకు పగలబడి నవ్వింది హోటల్!

''ఇది సత్రం కాదురా కొడకా! హోటల్!''

'భోజనంచేస్తావా బాబూ!'' అని మర్యాద చూపినవాడే మర్యాద తప్పి మాట్లాడు తున్నాడు.

''అదేందయ్యా అట్లా మాట్లాడతారే? ఓటల్లో అయితేఅడిగితేనే పెట్టాల. అడక్కుండానే అడిగడిగి పెడ్తిరి. మావూళ్ళో కూడా పండగ పబ్బాలకు ఇట్లానే పిల్చి పిల్చి పెడ్తారు. అట్లానే అనుకుంటి. 'ఎంత మంచోళ్ళు!' అని అనుకొంటూ పెట్టింది తింటి. ఇప్పుడు దుడ్డడిగితే నేనేం జేసేది?''

కోటిగాడి నంగిమాటలకు పగలబడి కాదు,వగలబడి నవ్వింది హోటల్. ''ఏం చేయలా? ఏం చేయాలో చెప్తాంరా!'' అంటూ మెడబట్టి గెంటారు. ఎంగిలి గిన్నెల ముందు పడ్డాడు కోటిగాడు. వాడిశ్రద్ధతో ఎంగిలి గిన్నెలు లోటాలు తళతళ మెరిశాయి.

వాడి శ్రద్ధను గమనించారు యజమానులు. ఒక్కొక్క మెట్టుగా వాడు పైకెక్కాడు కొంతకాలం మేజాల మీద ఎంగిలి గిన్నెల్ని ఎత్తుకొని ఇంకొకడి ముందు కుప్పపోశాడు. ఆ తరవాత ఆకుపరిచి నీళ్ళు పెట్టాడు. తరవాత సర్వర్ అయ్యాడు.

మూడు పూటలు ముక్కువరకు మెక్కడం, నీడపాటున ఉండటం - మనిషి మిస మిసలాడుతున్నాడు. అలాగే కొనసాగి ఉంటే అదొక తీరుగా ఉండేది. కానీ -- .

ఒకరోజు ఆరపోసిన అన్నంమీద సున్నపు నీళ్ళు చల్లుతున్న దృశ్యం వాడి కంటబడింది

వాడి కడుపు రగిలిపోయింది. చూస్తూ చూస్తూ ఊరుకోకుండలేకపోయాడు. 'తినేవాళ్ళ నోళ్ళు యివాళ్ళు కొడ్తే ఈళ్ళ నోళ్ళు దేవుడే కొడ్తాడు '' అనకూడదని మాట అననే అన్నాడు. ఆ మాట అనుకోకుండా అక్కడికి వచ్చిన యజమాని చెవిన పడింది. ఏ మాత్రం ఆలస్యం లేకుండా వాడి నోటి మీద దెబ్బ పడింది.

ఆ దెబ్బతో వీధిలో పడ్డాడు.

ఇప్పుడు ఒంట్లో కాస్త సత్తువ ఉంది. కాబట్టి ఆ దెబ్బకు తట్టుకొని నిలబడ్డాడు. నిలబడి 'ఏం చేయాలి?' అని ఆలోచిస్తున్నాడు.

తల మీద కుచ్చుల కుళ్ళాయి, నోట్లో సిగరెట్టు, కాళ్ళకు ప్లాస్టిక్ చెప్పులు, రిక్షా హేండిల్‌బార్‌కు మల్లెల వరాలు, రిక్షాలో చుక్క లాంటి చక్కని చుక్క!

దర్జాగా తొక్కుతున్నాడు రిక్షా.

'ఇదీ సొతంత్రమయిన బతుకంటే!' అనుకొన్నాడు కోటిగాడు.

ఆ నాటి నుండి రిక్షా తొక్కుతున్నాడు. ఆశగా తొక్కుతున్నాడు. ఏనాటికయినా తొక్కేవాడిదే రిక్షా కాకపోదులే అన్న ధైర్యంతో తొక్కుతున్నాడు. ఆ ఊళ్ళో ఎందరో ఒకప్పుడు రిక్షా తొక్కినవాళ్ళు, ఇప్పుడు ఒకటికి పది రిక్షాల 'ఓనర్లు' అయ్యారు. 'తనకూ అలాంటి అవకాశం రాకపోదులే' అన్న ఆత్మవిశ్వాసంతో తొక్కుతున్నాడు.

అవకాశం వచ్చింది. అయితే 'రానూ వచ్చె! పోనూ పోయె!' అన్నట్లు చేజారిపోయింది. ఆకాశమంత ఎత్తుకు ఎదిగిన కోటిగాడు అమాంతంగా పాతాళంలో పడిపోయాడు.

* * *

కోటిగాడు నడుస్తున్నాడు. కొంపలు తగలబడినంత బాధతో నడుస్తున్నాడు. నడిచి నడిచి బాగా అలిసిపోయాడు.

అలిసిపోయిన కోటిగాణ్ణి సేద తీర్చడానికి అమ్మలేదు. వాడి బ్రతుకులో అలాంటి యోగ్యత కలిగింది ఒక్కటే ఒక్కటి. అది గవర్నమెంటు సారాయి అంగడి.

స్వాతంత్ర్య దినోత్సవం - అప్పు లేక పప్పు కూడు. కోటిగాడికి సారాయి అంగడికి పోవలసిన గతి పట్టలేదు. సరాసరి బ్రాందీ అంగడికే నడిచాడు.

బ్రాందీ అంగడి ముందు నిలబడ్డాడు ఒక్క క్షణం. అటు చూశాడు. గాంధీ బొమ్మ. చేతులెత్తి ఒక్క దండం పెట్టాడు. ఇటు చూశాడు. బ్రాందీ అంగడి. చేతులు జోడించి రెండు దండాలు పెట్టాడు. మళ్ళీ గాంధీ గారి వైపు తిరిగాడు.

''ఓ పెద్దాయనా! పొద్దున అందురూ నిన్ను గురించి మాట్లాడేవోళ్ళే! నువ్వు సొతంత్రం తెప్పించినావంట. మాలాంటోళ్ళు అంత తిండీ గుడ్డ సొతంత్రంగా సంపాయించుకోవాలని సతపోరినావంట. ఇంకా ఏమేమో జెప్పిరి. ఇన్నెప్పుడు అంతా తెలిసినట్టే ఉండె. ఇప్పుడు సెప్పుకుందామంటే శాతగాకుండావుంది. అదట్లా పోనీ! పొద్దుగూకులూ ఈ దోవమిందే రిక్షా తొక్కుంటూ ఎన్నిసార్లు పాయ్‌నానో? ఏమో? లెక్కలేదు. అయితే మాత్రం మాయబ్బతో సెప్తావుండా! నువ్వీడున్నట్లే తెల్దు. ఇప్పుడు తెలుసుకున్నా!- కాస్సేపుండు.

ఎచ్చేస్తా! ఇయ్యాళ నీతో శానా శానా చెప్పుకోవాల!''

గాంధీ గారి దగ్గర సెలవు తీసుకొని కోటిగాడు బ్రాందీ అంగట్లో దూరాడు.

ఒక చిన్న సీసా మందును రెండు సోడాలతో కలిపి రెండు గుక్కల్లో గుటుగుటు తాగేశాడు. అలుపు ఆవిరై పోయింది. హాయి గుండెల్లో గూడుకట్టుకుంటూ ఉంది తూలుతూ తేలుతూ వచ్చి కోటిగాడు గాంధీ గారి ముందు నిలబడ్డాడు.

''నువ్వే జెప్పు సామీ! ఇదేవన్నా బాగుండాదంటావా? అప్పు తీసిస్తానన్రి. కొత్త రిచ్చా కొనుక్కోవచ్చని ఆశ చూపెట్రి. నా బతుకు నాదిగా సొతంత్రంగా బతకదావనుకుంటి, ఇచ్చినట్లేచ్చి పెరుక్కుంటారా? నువ్వే గదా! సామీ! వాళ్ళకు సొతంత్రం యిచ్చింది? ఇందుకేనా సామీ సొతంత్రం యిచ్చింది!''

గాంధీ గారు బోసినవ్వులు నవ్వుతూనే ఉన్నాడు.

''అదేందీ, సామీ, నేను సెప్తావుంటే నువ్వు నవ్వతా ఉండావే? నా బాధ నీకు సీమ కుట్టినట్లనిపించలేదే? వాళ్ళు చేసింది మంచి పనేలే!' అని నవ్వతా వుండావా? అవున్లే! రిక్షా తొక్కాల, అప్పు తీర్చాల. ఇంత బాద్దెత నెత్తిమంటే నాకు సొతంత్రం యాడుంటుంది? అసలు బాద్దెతుండే బతుకులకు సొతంత్రం యాడేసింది? నువ్వు కావాలనుకుణ్ణేంది సొతంత్రం. అయితే నేనిప్పుడు సొతంత్రుణ్ణి. నేనేవయినా చెయ్యొచ్చు. జై గాంధీమాత్మకు జై!''

గబగబా బ్రాందీ అంగట్లో దూరాడు కోటిగాడు. సీసా మీద సీసా సోడాతో కలిపి పట్టించాడు. వాడి కాళ్ళు తేలిపోతున్నాయి. ఒళ్ళు సోలి పోతూ ఉంది.

జేబులో భద్రపరచిన డబ్బును చేతికందుకొన్నాడు కోటిగాడు.

అప్పటికే ఆ బ్రాందీ అంగట్లో చాలా మంది స్వతంత్ర దినోత్సవాన్ని పురస్కరించుకొని సర్వస్వతంత్రంగా హాయిలో తేలిపోతున్నారు. వాళ్ళందరికీ డబ్బులు ఇవ్వబోతున్నాడు. వీడి స్థితిలోనే వాళ్ళూ ఉన్నారు. వీడికి డబ్బు విలువ తెలియనట్లే వాళ్ళకూ తెలియలేదు. అందుకే అందరూ వాడివైపే ఆశ్చర్యంగా చూస్తున్నారు.

''అదేం దబ్బా - అట్లా సూస్తా ఉండారే! ఈడేంది యిట్లిచ్చేస్తుండాడని గదా? ఒరే పిచ్చినాయనాలి గుంపా! ఇది అప్పుతెచ్చిన దుడ్డు గాదురా! తేరకొచ్చింది. నేనొకరి కియ్యాల్సిన పన్లేదు. మీరు నాకియ్యాల్సిన పన్లేదు. తీసుకోండ్రా!''

కోటిగాడు బలవంతం చేస్తున్నాడు. అందరు విస్తుబోయి చూస్తున్నారు.

''మా యబ్బతో సెప్తా వుండా! ఈ మాట పెంటయ్యే సెప్పినాడు. రొండునాళ్ళు పచ్చంగా తిని ఎచ్చంగా పొణుకోమన్నాడు. నేనొకడే రొన్నాళ్ళు తినేదాని కంటే మనవంతా కలిపి ఒక్క దినవే పచ్చంగా వుందాం. వాడు యినన్నూరు తీసుకుంటే మీరు ఇరవై తీసుకుంటే తప్పా? తీసుకోండిరా! తీసుకోండి! ఎర్రిమొగం నాయాండ్లాలా తీసుకోండి!'' అంటూ చేతిలోని నోట్లను వెదజల్లాడుకోటిగాడు.

బ్రాందీ షాపులోని ఫాన్ గాలికి రెక్కలు విప్పిన పావురాళ్ళులా ఎగురుతున్నాయి నోట్లు!

తూలుతూ సోలుతూ నవ్వుల్లో తేలిపోతూ మళ్ళీ గాంధీవిగ్రహం ముందు కూలిబడ్డాడు

కోటిగాడు.

''సాఁవీ! సౌతంత్రం! సౌతంత్రం!'' అని నువ్విట్లా నిలబడిపోయావు. సౌతంత్రంగా బతకదా ననుకుంటే నేనిట్లా నిలడిపొయ్‌నా! మనిద్దరూ ఒకటే, సాఁవీ! లేదంటే - నేను తాగినాను. నువ్వు తాగలేదు. ఒకరు తాగి ఉంకొకరు తాక్కపోతే అది వలపచ్చం, వలపచ్చ తప్పుసాఁవీ! అంత తాగు. తాక్కపోతివో నా మీద ఒట్టే!''

బ్రతిమాలుతున్నాడు కోటిగాడు.

గాంధీ విగ్రహం ముందు బ్రాందీ అంగడి పెట్టడానికి అనుమతించిన ప్రజలు కోటిగాడు గాంధీ గారిని బ్రాందీ తాగమని బ్రతిమాలుతుంటే -- నవ్వుతూ అదో వింతగా చూస్తున్నారు.

కోటిగాడు స్వతంత్రుడు!

ఆంధ్రప్రభ (3-2-80)

# ఉచ్చు

సింగమనేని నారాయణ

పంచాయితీ ఆఫీసు వరండాలో మెత్తని కుర్చీమీద కూర్చున్న వ్యక్తి రామిరెడ్డి అతడు ఆ వూరి సర్పంచ్. అతిని కటువైపూ యిటువైపూ కుర్చీలమీదా, బెంచీ మీదా, కుర్చున్న వారిలో ఇద్దరు పంచాయితీ బోర్డు మెంబర్లుగాక, మరో ముగ్గురు ఆ వూరి పెద్ద మనుషులనబడే వారుకూడా వున్నారు.. కోపంగా వున్నారు..మాట్లాడిస్తే కరిసేలా వున్నారు.

రామిరెడ్డి దవడలు విచిత్రంగా కదలుతున్నాయి. అతడు కోపంగా వున్నాడనటానికి అదే సాక్ష్యం... ఒకటిమీద ఒకటి వరుసగా సిగరెట్లు కాలుస్తున్నాడు. అలా వరుసగా సిగరెట్లు కాల్చడమంటే అతడు విసుగ్గా ఉన్నట్టు లెక్క. ఎడంప్రక్కన కుర్చీలో కూచున్న పెద్దారెడ్డి నోటి నిండూ నమిలిన తాంబూలాన్ని కొంత దిగమింగి, '' ఈ నా కొడుకుల్ని యాటికి పంపినా యింతే,'' అని కక్కసించాడు. ఆ పోయిన 'నా కొడుకులు' ఆవూరి వెట్టాడూ, తలరోడూ పెద్దారెడ్డి ఆవూరి మునసబు. వెట్టినీ, తలారినీ, అతడెప్పుడూ. ... నా కొడుకు అనే సంబోధిస్తుంటాడు. కుడిపక్కన కూచున్న శివరామప్ప జేబులోంచి దగ్గ పొగాకు తీసి యింత నోట్లో వేసుకొని '' ఈ నాయాళ్ళంతా బలిసిపోయినారప్ప! మీరేమన్నా అనండి. యాటికాటికి కీళ్ళిరగదంతా వుంటేనే మాటినేది...అన్నాడు. బజారువేపు చూస్తూ, ఆ మాటకి రామక్రిష్ణయ్య పళ్ళిగిలించి నవ్వాడు.

''ఇంతకూ ఆ కర్రోడు కొంపకాడ వుండాడో లేదో'' అనుమానాన్ని వ్యక్తం చేశాడు సుబ్బన్న.

''వానికి నిన్న యియ్యాలప్పుడే చెప్పి పంపినా, రేపు పంచాయితీకి వచ్చి యాసంగతీ చెప్పుకోమని.... ముసిలోడైనా బోనీలుగుడు నాకొడుకులే అన్నాడు. అక్కడ వీరందర్నీ సమావేశ పరచిన వెంకటరెడ్డి.

''అదిగో...రానే వస్తావుండారు....రానీ....రానీ నా కొడుకులు... యింత సేపట్నుండీ యాడ గాడుదులు కాస్తా వుండారో...'' అంటూ లేచి నిలపడ్డాడు పెద్దారెడ్డి.

వెట్టి, తలారి, వారిద్దరి ఎనకాల కర్రోడు, కర్రోని పెండ్లాము, మల్లక్క, వరండా ముందుకు చేరుకున్నారు.

''ఇంత సేపేం జేస్తావుండార్రా దొంగనా కొడుకుల్లారా.... ఈ డుండే మాదిగిండ్ల కాడికి పొయ్యేకి గంట సేపా....'' అని గద్దించాడు పెద్దారెడ్డి.

''ఈ ముసిలోడు కొంపకాడుంటే గదా సామీ శేనికాడుండాడని కొల్లా పురిగాడు సెప్తే' అక్కన్నుండి నేరుగా శేనికాటికి పొయ్యినాం'' వినయంగానే విన్నవించుకున్నాడు తలారి.

''ఈ పొద్దు పంచాయితీ వుందని చెప్తే శేనికాదేం పనిరా నీకు? నువ్వు చేసిః బాడ్కావు పనికి నీకోసం మనుషుల్ని గంటల తరబడి పంపల్లా మేము?'' అంటు కర్రోన్ని అరిచాడు వెంకటరెడ్డి.

లేదు సామీ లేదు. పద్దన్నే ఒగసారి యీటికొచ్చేపొయ్యినా ఇంగా మీరెవురూ యీటి రాకపోతే, ఒగసారి శేను తిరిగేసుకొద్దామని. .'' అంటూ దుప్పటి తీసి నేలమీద గుజ్జు వేసుకొని దానిమీద కూచున్నాడు కర్రోడు. అతని పక్కన అతని భార్య మల్లక్క కూచొని చేతులు మోకాళ్ళమీద ఆన్చి, వాళ్ళవైపు నిశ్శబ్దంగా చూసింది.

వెట్టినీ, తలారినీ, ఏదో పని పురామాయించి పంపించేశాడు పెద్దారెడ్డి.

రామిరెడ్డి చూపు కర్రోడి మీద పడింది... ''ఏం రా కర్రోడా'' అని పిలిచాడు. తను అడగబోయే విషయానికి వుపోద్ఘాతంలా రామిరెడ్డి కంటె కర్రోడు నిజానికి పదేళ్ళ వయసులో పెద్దవాడు. రామిరెడ్డి నాయన కూడా ''ఒరే కర్రోడా'' అని పిలిచేవాడు ఇప్పుడు ఈయప్ప కూడా అట్లాగే పిలుస్తున్నాడు. కర్రోడు కారు నలుపు. అసలు పేరు నాగన్న. నల్ల నాగన్న చిన్నప్పుడే కర్రోడయ్యాడు. ఓటర్ల లిస్టులో కూడా అతని పేరు కర్రోడే. అసలు కర్రోడికే తన పేరు నాగన్న అని గుర్తులేదు.

కర్రోడి వయసిప్పుడు అరవై దాటుతోంది... వంగిన దబ్బలా వుంటాడు. చినిగిపోర్తే ఎండిపోయిన నేరేడు పిచ్చిలా వుంటాడు. కాసి పుల్లలకు చెక్కిన వుల్లి గడ్డలా వుంటాడు. చర్మం అతికించిన అస్థిపంజరంలా వుంటాడు. అతని వీపు మీదున్న వెన్నుపూసల్ని యిప్పుడు ఒక్కటి కూడా తప్పుబోకుండా ఖచ్చితంగా లెక్కబెట్టవచ్చు.

కర్రోడు రామిరెడ్డి ముఖంలోకి, యింకా అక్కడ కూచున్న అందరి ముఖాల్లోకి చూశాడు.

''నీకొడుకు కథ ఏమన్నా తెలిసిందా?'' అడిగాడు రామిరెడ్డి.

''అంతలక్కా యిశారిచ్చినా సామీ! యాడ కొల్లపాయినాడో ఏమో.... ధర్మారం దగ్గిర రేగాటి పల్లిక్కాడ పుల్లిగాన్ని పంపిచ్చినా.... వాళ్ళ అక్కయ్య దగ్గిర కేమైనా పొయ్యినాడేమోనని.... ఆటికి వురువు రాలేదంట....'' అన్నాడు కర్రోడు.

''నీదంతా నాటకం లేవోయ్! లేకపోతే యిన్నాల్లయింది నీ కొడుకు మీకు తెలీకుండా యాటికి పొయ్యింటాడు....'' అన్నాడు సుబ్బన్న తానొక బీడీ వెలిగించుకొని, ఒక బీడీని అగ్గిపెట్టెనూ కర్రోని ముందుకు విసిరేస్తూ.

'' ఒట్టు నాయన్నా... నా కంత పానం మింది కేమొచ్చింది'' అని. తనముందు పడ్డ బీడీని తొర్రినోట్లో పెట్టుకొని చాలా నిదానంగా అగ్గిపెట్టెలోంచి పుల్ల తీసి వెలిగించు కున్నాడు.

''వాడేపొద్దూ సెప్పకుండా వూరిడిసి నోడు గాదు.... యాడేడ యే మువత్తలు పడతండాడో అని మేము ''కుయ్యో....మొర్రో...'' అను కుంటాంటే మీ రత మీది.... మా పిల్లోని బాదలో మేముంటే మీరిట్లంటే ఎట్లయ్యా'' అంది మల్లక్క-

''నీకొడుకు బాద నువ్వు సెప్పుకుంటే, యివతల యెంగట్రెడ్డి సంగతి యేం

సేయుల్లనుకుండావ్ ఏదో మంచి పిల్లోడు పనీ పాటా బాగా సేస్తాడని గదా జీతానికి పెట్టుకొని ఐదు నూర్లు ముందుగానే యిచ్చింది. వాడింగా పన్లోకి సేరి నెలగూడా దాటకుండానే గువ్వుకొని పోతే యిక్కడ పనెట్ల జరగల్ల.. మీ కిదేమన్నా పట్టిందా వూరికే నా కొడుకో నా కొడుకో అంటే సరిపాయనా....'' అన్నాడు శివరామప్ప.

''నువ్వు సెప్పింది రైటే సామీ? వాడు జరమెుచ్చి రెం(డ్రోజులు మల్లుకుంటే మూడోనాడు సింతసెట్టు కింద పండుకున్నోన్ని యాటికి పడితే యాటికి ఈయప్ప యంగట్రెడ్డి యెగిచ్చి యెగిచ్చి తంతే, వాడు కొంపక్కూడా రాకుండా అదే పోత- జరం మీద అన్ని దెబ్బలు పడితే వాడు మాత్రం తట్టుకుంటాడా! ఆ పొద్దట్నుంటీ ఇది వొగటే ఏడుపు.... యా పొయినాడో, యెట్టుండాడో అని- బందుగుల వూర్లన్నీ యెతికిచ్చినాము. దీంట్లో మా తప్పేమన్నా వుందా నాయన్నా- ఈయప్ప కొట్టకుండా వుంటే మావాడు వూరిడిసేవాడేనా! వానికేమన్నా అయ్యుంటే యాదేవున్తో చెప్పుకోవల్ల...' అంటుండతా కర్రోని కంఠం వణికింది. కళ్ళ మీద నీటిపొర కమ్ముకుంది. మణికట్టుతో కళ్ళను తుడుచుకున్నాడు.

''వోయబ్బ యీ మాత్రం కొడుకింకెవుడికన్నా వుండాడా.... పన్జెయ్య కుండా సెట్టుకింద పండుకుంటే రెండేట్లు యేసిందానికే యిట్లయితే వూర్లో యింక రైతులు సేద్యాలు సేసుకున్నట్టే....'' అన్నాడు చేతులూపుతూ వెంకటరెడ్డి.

''నువ్వట్టే సెప్పుతావు సామీ! ఆడ సూసినోల్లంతా ''అయ్యో - పాపం'' అన్నోల్లే యీాడ్చి యీాడ్చి కొట్టినావంటనే - మల్లా యీాడ సూత్తే యిట్లంటావ్.... కడగట్టోడు.... మొన్న సంకురాత్తిరికి వానికి పదారు దాటినాయి.... విది లేక వాన్ని జీతానికి పెడితే ఇట్ల సేసేదా సామీ....'' అంటూ చీదటం మొదలు పెట్టింది మల్లక్క-

''అయిందేదో అయింది-దానికంతా యీాడ రామాయనం బెట్టుకుంటే తెల్లారినట్లే - జరిగేదేదో సూడండి-'' అన్నాడు రామక్రిష్ణయ్య.

''ఇంగా జరిగేది యేంది సూడల్ల సామీ:- పెండ్లి కెదిగిన కొడుకు కండ్లకు కనబడకుండ పొయ్యేనంక - పెద్దోల్లు మీరన్నా నాలుగూర్లు యెతికిచ్చేటట్లు సూడండి. మా పెద్దోనికి వాని సంసారం యావ దప్ప యింగోటి పట్టదు. వాన్ని నమ్ముకొని శేనంతా కట్టపడి సేద్యం శేసుకున్నాము - రేపు రెండు సినుకులు బడితే యింట్లో వుండే రొావన్ని శెనిగిత్తనాలు యిత్తుకోవల్ల -'' చెప్పుకు పోతున్నాడు కర్రోడు.

''ఓర కర్రోడా వెంగట్రెడ్డి యవ్వారం పరిష్కారం సేద్దామని పంచాయితి కొస్తే కష్టసుఖాలు చూడమంటావేమిరా మీ మాదిగి నాయాల్లకు కాసింత పట్టిభూమి చిక్కినప్పట్నుండీ పట్టపగ్గాలు లేకుండా పోయాయిరా. అప్పుడే మాట్లాడే తీరే మారిపోయింది. పి(రమింద బట్టలేని నాయాళ్ళంతా సేద్యాలు చేస్తారంట.... సేద్యాలు.... ఏమప్పా వెంగట్రెడ్డి ఇదేమన్నా తెగేదా...పెట్టేదా....'' అంటూ అసహనం ప్రదర్శించాడు రామిరెడ్డి.

''అదేదో మీరందరూ తెల్చల్లనేగదా యీ పంచాయితీ పెట్టింది. ఈ కర్రోనికి పది దినాలనుండీ చెప్తానే వుండా-, యాడున్నా నీ కొడుకును యెతికి తీసకరమ్మని. నేను

మాత్రం యెన్నాళ్లని వూరికే వుండేది - నాకూ పనీపాటా, జరగల్లా వద్దా కొత్తీతగాన్ని పెట్టుకోవాల్లంటే టైమ్‌గాని టైమ్‌లో యిప్పుడెవరూ చిక్కుతారు. మాట్లాడిస్తే జీతంగాక పైగా వెయ్యో, రెండువేలూ వడ్డీ లేకుండా అప్పడగుతా వుంటే యా తెచ్చిపెట్టేది? మీరూ సూస్తానే వుండారు గదా- ఇప్పటికే ముగ్గురు జీతగాళ్ళని పెట్టుకొని యీదలేక సస్తావుండా- ఈటికే పని జరగడమే కష్టమై పోతావుంటే ఈ నా కొడుకు గువ్వుమ్కొని యాటికి పొయ్యినాడో యేమెమో రెండు బనీన్లూ, పంచీ, దుప్పటీ కూడా యిప్పిచ్చుకున్నాడు. సేరిన్నాడే యీ కర్రోడు ఆ ముండ మోపి పట్టాకు కరణమయ్యకియ్యల్లని ఐదు నూర్లిచ్చేదంకా వొగటే తిరగడం. తీరా యిచ్చిన నెలగూడా కాకుండానే యిట్ల జరిగింది. మాటిమాటికి 'నువ్వు కొట్టి మా వాన్ని మాకు దక్కకుండా సేసినావో' అని యీ ముసిల్ది వొగటే రంపు- నేనేమన్నా వొళ్ళు తీపర మెక్కి కొట్టినానా? పనెగబెట్టి వాని దోవన వాడు 'జరం జరమని' రెండ్రోజులు మల్లుకుంటే యేందోలే అనుకుండా, తీరా పనికొచ్చీ సెట్టుకింద గుర్రుపెడితే ఎవ్వురైతే మాత్రం వోర్చు కుంటారప్పా! అసలు కొట్టకపోతే మాటినే రకమా యీ నా కొడుకులు...'' చేతులూగిస్తూ చెపుతున్నాడు వెంకటరెడ్డి.

''అది సరే వెంగట్రెడ్డీ! యిదంతా వినిందే పురాణమే గదా! కర్రోని కొడుంకు ఎప్పుడొస్తాడో ఏమో వానికే తెలీదు. అసలు పత్తాకూడా తేలలేదు. ఇంతకూ యిప్పుడు నువ్వేమంటావ్'' అన్నాడు సుబ్బన్న.

''నేననేది యేముందీ.... వాని కత యింక నాకు కాబట్టదు - వీళ్ళ చుట్టూ తిరగడం దప్ప నాకింకేం పన్లేదా! నాయవస్తలేవో నేను పడతాను. నేనిచ్చిన ఐదునూర్లూ నాకు వెంటనే యిప్పించి ఇదేదో పరిష్కారం సెయ్యండి'' అన్నాడు వెంకటరెడ్డి.

'' ఏంరా కర్రోడా! మీవాడింక ఎప్పుడొస్తాడో యెవ్వుడు సూసినాడు? వెంగట్రెడ్డికి, ఆయప్ప యిచ్చిన లెక్క తిరిగి యిచ్చే మార్గం సూడు -'' అన్నాడు రామిరెడ్డి. కర్రోని ముఖం డీలా పడిపోయింది. ఏం మాట్లాడకుండా తన నేలకేసి కూచున్నాడు.

'' ఏంరా - మూతి మిందేసుకొని కుచ్చుంటే నీతోపాటు మేమూ ఈడే పడుదండల్లా- ఆ చెప్పేదేదో చెప్పుకో -'' తొందర పెట్టాడు శివరామప్ప.

''కాదు సామీ! ఇప్పుడు మల్లా లెక్క దెచ్చి గట్టమంటే నేనింగ యా వూరుపోవల్ల - మీకు తెలకుండా ఆ దగ్గిరేమన్నా ముడుపుందా - మా వాడు రాకుండా యాటికి పోతాడు - రొన్నాల్లు సూడండి నాయిన్నా'' అన్నాడు దిగులుగా కర్రోడు.

'' ఇదిగో నా దగ్గిర యింగ అదేం కుదరదు సూడు రాంరెడ్డీ! నా కత నీకు తెలిందేమీగాదు. పట్టినన్నాల్లూ వోపిక పట్టినాను - ఇంగ నాకు చాతగాదు-'' అన్నాడు గట్టిగా వెంకటరెడ్డి.

రామిరెడ్డి కర్రోని ముఖంలోకిచూస్తూ ''చూడు కర్రోడా! వెంగట్రెడ్డికి చెప్పే కత దాటి పోయింది. ఐదు నూర్లు నువ్వు యాడో ఒకచోట తెచ్చి యిచ్చితీరాల్సిందే'' అన్నాడు నిక్కచ్చిగా-

కర్రోడు రెండు చేతులూ పైకెత్తి ''ఇట్లసెప్తే యెట్లసామీ! నేనెవ్వుర్ని అడిగేది? అడుగుతానే యెవ్వురన్నా నాయట్లా వానికి యిచ్చే కాలమా యిది'' అన్నాడు.

''నీకేం వాయ్ మొన్న బూసోదీన వారోచ్చవాల్లో'' (భూస్వాధీనన వారోత్సవాల్లో) మూడెకరాల పట్టా సంపాయిచ్చు కున్నావు.... ఒక గిత్త కూడా వుండల్ల- 'అబ్బరంత' మాదిరి మాట్టాడుతావే'' అన్నాడు పెద్దారెడ్డి.

''పట్టా వస్తానే పండ్గై పాయనా సామీ! దాని కోసం పడినవస్త పగోడికి కూడా వద్దు ఆ కరణమయ్యకు యీ య్యైదేండ్లు సేసిన శాకిరీ సెప్పుకుంటే తీరేది గాదు- యిదిగో యిదిగో అంటూనే యిన్నేల్లు పట్టింది. ఆప్పకిచ్చిన దుడ్లు లెక్క-బెట్టుకుంటే గుండె పగులుతాది. ఆ పట్టా పున్నెమా అని యాడ సూసినా అప్పులే తీరా పట్టా వచ్చే ముందు కూడా వాల్లకీయల్ల వీల్లకీయల్ల అని మున్నూరు పీక్కు-ండాడు. యంగ్రట్టెడ్డిచ్చిన లెక్క-లో మునున్నూరు కరణమయ్యకే యిచ్చుకుందా.... మిగిలిన లెక్క-లో రొవన్ని శెనిగిబుడ్లు కొనుక్కు-ండాను.... ఆ రొవన్ని యిత్తనాలు యిత్తుకుందామని శేనంతా నానా అవస్తలూ పడి అదును సేసుకుంటే పిల్లోడిట్లా చేసినాడు. ముసిలి పానాలు యెన్నని పనులు సేసుకుంటాం సామీ ఆటికీ మా పెద్దోడు అంతో యింతో సాయం సేసినాడు.... నా తలకు మించిన అప్పులు సేసుకొని సచ్చిపోతందా నాయిన్నా యిట్లాంటప్పుడు మీరు నన్ను లెక్క-దెచ్చి కట్టమంటే....'' అంటూండతా కర్రోని కంఠం పూడుకు పోయింది.

''రొండు వాన సినుకులు పడితే శెనిక్కా-యేసుకుంటాం సామీ పంట పండినంక అంతో యింతో సేతికొస్తే మీ కీకుండా యాటికి పోతాము.... ఇప్పటికిప్పుడు కావల్లదంటే మా పానాలు తప్ప మా దగ్గిర యింకేంటి వుండాయి'' అంది మల్లక్క నెత్తిమీద పెద్ద బండ పెట్టినంత బరువుగా!

''వాన రావల్ల.... యిత్తనమెయ్యల్ల.... పంటపండల్ల.... దుడ్లు సేతికిరావల్ల.... అయినట్లే..... ఇదేందో సామెత సెప్పినట్లుంది. మీ యవ్వారం చూస్తే అదంతా యేం కుదర్దు మీకుండే కష్టాలు మాకూ వుండాయి - నా లెక్క మాత్రం నాకిప్పుడు తెచ్చి కట్టాల్సిందే'' ఖచ్చితంగా చెప్పాడు వెంకటరెడ్డి.

''కావల్లంటే నాలుగు దినాలు టైమ్ తీసుకో.... అంతేగాని పంట కూ బాకీకి ముడిపెట్టొద్దు.... ఏమప్పా వెంగట్రెడ్డీ....'' అని రామిరెడ్డి వెంకట్రెడ్డి కేసి చూశాడు.

''నాలుగు దినాలు కాదు, నాలుగు నెల్లయితే మాత్తరం లెక్క నాకు దొరకల్ల గదా సామీ! నా కుతికి కొయ్యండిగాని యిట్లా కరాకండిగా మాత్తరం సెప్పకండి సామీ! ముసిలి ముప్పున బద్నోన్నిసెయ్యకండి'' అంటూ బతిమాలుకున్నాడు కర్రోడు-

''మరెట్లారా నీతో సచ్చేది కాలికేస్తే మెడకు, మెడకేస్తే కాలికి లెక్కన మాట్లాడుతావు.... యిన్నాల్లయినా నీ కొడుకు రాకపోతే యీ యప్పకిచ్చే లెక్కన్నా యీకపోతే ఎట్లా.... నీ శెనిక్కా-య పంటయెంత గాంగరా.... కొత్త సేద్దెం.... నువ్వేసే యాబై శేర్ల యిత్తనాలకు పండే పంట యాటికయితుంది.... ఆ పొద్దుకు మల్లా ఎన్ని కూతలు కూస్తావో యిదంతా కుదిరే యవ్వారం గాదులే'' అన్నాడు శివరామప్ప-

కర్రోడు ఏం మాట్లాడలేదు.

మల్లక్క తల నేలకేసి వుండి పోయింది.

వాళ్ల తలలమీద ఎండ చురుకు తగులుతోంది- అప్పటికి పొద్దు బాగా నడినెత్తికొచ్చింది.

అంతవరకూ వాళ్ళ తలల మీద కొద్దిగా పడుతున్న వేప చెట్టు నీడ పక్కకు తప్పుకుంది. ఎండలో వీరు కూచున్నారన్న ఆలోచనైనా నీడలో కూచున్న వాళ్ళకు లేదు. లేచి నీడలో కూచోవాలన్న తలపు వచ్చి కూడా అట్లాగే కూచుండి పోయాడు కర్రోడు-

వెంకటరెడ్డి, రామిరెడ్డి ముఖంలోకి, యింకా అక్కడున్న అందరి ముఖాల్లోకి సాలోచనగా చూశాడు. రామిరెడ్డి సిగరెట్ తీసి వెలిగించాడు. పెద్దారెడ్డి వక్కాకు నవులుతూనే వున్నాడు. సుబ్బన్న బీడీ కాలుస్తున్నాడు. రామిరెడ్డి రెండుసార్లు సిగరెట్ పీల్చి గుప్పుమని పొగ వదిలాడు.

''ఐతే లెక్కయివ్వటం నీకు బొత్తిగా వల్ల కాదన్న మాట'' ఒక నిర్ణయానికి వచ్చి నట్లుగా కర్రోన్ని అడిగాడు రామిరెడ్డి.

''వూను సామీ'' అన్నాడు కర్రోడు.

మళ్లా అందరి మద్య నిశ్శబ్దం అలుముకుంది- శివరామప్ప లేచి దూరంగా పొగాకు ఎంగిలి వుమిసి, ఒకటి రెండు నిమిషాలు రామిరెడ్డి ముఖంలోకి, వెంకటరెడ్డి ముఖంలోకి చూసి పంచాయితీ ఆఫీసులోనికి వెళ్ళాడు. రామిరెడ్డి తల పంకించి వెంటనే తనూ లోపలికి నడిచాడు. ఒక నిముషం తర్వాత వెంకటరెడ్డి. కూడా లోపలకు దారి తీశాడు.

కర్రోడు, మల్లక్క వాళ్ళవేపే మోరలెత్తి చూస్తున్నారు. వీళ్ళంతా లోపలకి ఏం పని మీద వెళ్ళినట్టా అనుకుంటున్నాడు కర్రోడు. ఏదో నెత్తిమీద బెడతారు వీళ్ళంతా అనుకున్నది మల్లక్క.

ఎండ చురుకు రాను రాను ఎక్కువనిపిస్తోంది. ఇద్దరూ లేచి కాసింత జరిగి వేపచెట్టు నీడలో కూలబడ్డారు- ఆరిపోయిన బీడీని తీసి వెలిగించుకొని రెండు పీకులు పీకాడు కర్రోడు. బీడీ పీకుతున్నప్పుడు అతని చెంపలు అగాధమైన లోయల్లాగా అయ్యాయి.

పది నిముషాల తర్వాత పంచాయితీ ఆఫీసు లోపల్నుండి వాళ్ళు బయటకొచ్చి ఎవరి స్థానాల్లోవారు కూచొన్నారు.

రామిరెడ్డి తాపీగా మరో సిగరెట్ వెలిగించి జాగ్రత్తగా కర్రోని ముఖంలోకి చూస్తూ ''సూడరా కర్రోడా! నువ్వెటూ వెంగటరెడ్డికి లెక్క యివ్వలేనని వప్పుకున్నావు గదా! నేనొక మాట చెబుతాను- వినుకుంటావా?'' అన్నాడు.

కర్రోనికేదో ఆశలాంటిది కలిగింది- ''చెప్పుసామీ.... చెప్పు.... మీ పెద్దోల్లు సెప్పేమాట నేనెప్పుడన్నా కాదనేవాన్నా మీ దగ్గిర బతికేవాన్ని'' అన్నాడు ఆత్రంగా.

రామిరెడ్డి కొద్దిగా లేచి కుర్చీ కాస్తా ముందుకు జరుపుకొని మళ్ళీ కూర్చుంటూ ''భూస్వాధీన వారోత్సవాల్లో నీకొచ్చిన పట్టాభూమి యామాత్రముంటుందిరా?'' అనడిగాడు.

''యెంత సామీ.... మూడెకారలకు తక్కువే వుంటుందేమో....'' గుట్టూ నట్లూపోతే యెగసాయానికి రెండెకరాలుంటుంది సామీ'' అన్నాడు.

''శేనంతా బాగా అదును చేసుకుండావా....''

''ఈ నెల్రోజుల్నుండీ అదే పని గదా సామీ! దిన్నమూ పద్దన్నుండీ నేనూ, యిదీ దాంట్లో పొర్లాడుతుండావనుకో.... బాగా రాల్లన్నీ యేరిపోసి బూమిని అద్దమాకట్ల సేసుకుండాం సామీజ కట్టపడితే అంతో యింతో బతుక్కోవచ్చు గదా సామీ. నాకు యేరే పనిగాంగ యేముంది....'' ఉత్సాహంగా చెప్పుకు పోతున్నాడు కర్రోడు-

''ఈ ముసిలోనికి లేసినప్పట్నుండీ దాని సింతే సామీ- ఇంత ఆదరువు దొరికింది గదా అని వొకటే సంబడం-'' అంది మల్లక్క- ఆమె మనసులో యిదంతా యెందుకడుగు తున్నట్టా అనే చింత ఒకవైపు తొలుస్తూనే వుంది.

''సూద్రా- ముసిలి ముప్పున యీ అవస్తలన్నీ నువ్వేడ బడుతావ్! కొత్త బిచ్చగాడు పొద్దెరగడన్నట్టు నువ్వెప్పుడూ ఆ శేని మీద పడి చేసుకున్నా నీకు గిట్టేది మాత్రం ఏ ముంటుంది? కాబట్టి నేను చెప్పేది శ్రద్దగావిను-'' చాలా మెత్తగా అన్నాడు రామిరెడ్డి.

కర్రోనికేదో అనుమానం లాంటిది తగిలింది....'' ''యేంవుంవత్తల్లే సామీ- పుట్టినప్పట్నుండీ పడుతున్నదే గదా....'' అన్నాడు సమర్ధించుకున్నట్టు-

''అదిగాదురా- వ్యవసాయాలంటే చేసే మాకు తెలుస్తుందిగాని చేరెడు భూమి వుండే నీకేం అనుభవంరా- నువ్వెట్లా వెంగట్రెడ్డి బాకీ యిప్పట్లో తీర్చలేవు.... కాబట్టి....''

కర్రోడింక అపుకోలేక పోయాడు.... ''యేంది సామీ-యిట్లా చెప్పుతండావు-నాబూమిని ఆయప్ప కిమ్మంటావా'' అన్నాడు వణికిపోతూ.

''నీ భూమి యెవ్వురికి కావల్లరా- వెంగట్రెడ్డికేం బూమి లేదా! నీ బూమి నీకేవుంటుంది.... నువ్వు అప్పు తీర్చల్ల గదా- ఎప్పుడు తీరుస్తావని నువ్వు తీర్చేదంకా ఆ బూమి చెక్కను వెంగట్రెడ్డికి యిడిసి పెట్టు. నువ్వు యియ్యాల్సిన లెక్కకు వడ్డీ వుండదు- వెంగట్రెడ్డి ఆ బూమిని వ్యవసాయం చేసుకుంటాడు. నువ్వెప్పుడు బాకీ తీరిస్తే అప్పుడు నీ భూమి నీదే....?

అందరూ వూపిర్లు బిగబట్టి తలలు పక్కలకేసి కూర్చున్నారు. కాస్సేపటికి మల్లక్క ఎర్రికేకెట్టింది.

కర్రోడు ఒక వూగు వూగి ముందుకు వొరిగాడు.

(రచనకాలం - జనవరి 79,

ప్రచురణ : ప్రజాసాహితి - ఫిబ్రవరి 79)

# ఇరుకుమాను

పులికంటి కృష్ణారెడ్డి

అమ్మామ్మా .... అయ్యాయ్యా!

సేతిలో పన్లుంటే వొక్కసెణ పట్టా యెట్టండి

ఈ మాటట్టా సెవులో యేసుకోండి.

నా మణుసెట్టైట్నో చీకతావుండాది మందేసి కాల్చినట్టు నా గుండె మండిపోతా వుండాది. నిలిపిన సోట నిలబళ్ళేక, కూసున్న సోట కూసోలేక ఏఁవిజెయ్యాల్నో తోసకుండా తోసఁతీసెయ్ లేకుండా తికమక పడ్డావుండి ఎవుళో సెప్పుకోమంటా ర్సెప్పండి?-

సెప్పినా యినిపించుకునే వాళ్ళెవురు ఇన్నా- 'యిదో యిట్టా భోరా ఎదవా,' అని సెప్పేనాదుడెవురు? ఆ మాత్రం సెవుల్లో యేసుకునే నాదుడుంటే నాయట్టాటోళ్ళ బతుకు రెండు కెట్లా తెల్లారింది?

నా ఎఱ్ఱిగాలా? సెఁవిలి కంట్లో నీళ్ళు గార్తే యాటగాడి కేఁవన్నా ముద్దా? సెఁవిరి కంట్లో నీళ్లు జూసి యాటగాడే నీళ్ళు గారి పోతే డింట్లో నీళ్ళు తాగే పాణుకోవల్ల అందుకనే వీడి ముకం వాడు సూసుకుంటాడు.

ఎవుడి సుకం వాడు సూసుకుంటే తప్పెట్టావుతుంది.

సేసుకున్నోడికి సేసుకున్నెంత!

పెద్నోడికి పుట్టిందే సొచ్చి!

నా కర్మేట్టాగాలింది కాబట్టే నా మంణుసిట్టా కతా వుండాలి నా గుండెట్టా మండిపోతావుండాది ఎవురో జెప్పుకోవల్ల?

అసలొక మణిసి బాద యింకొక మణిస్తో ఎందుకు జెప్పుకుంటాడు బార్దీరే దానికి బార్దీరాలంటే యినేవోళ్ళకు బాదకలిగేటట్లు చెప్పాల ఏడ్సే వాళ్ళ సూసి నవ్వే వాళ్ళుండే ఈ లోకంలో అదేవంత సిన్నావనా?

అయితే యింకెట్ట?

అయితే యింకెట్ట? యింకెట్ట అని పడ్తానే నాయట్టాంటి ఎదవలు ఎట్లా కాకుండా పాయ్‌నారు. అడుగు ముందు కేస్తే యేఁవో? ఎయ్యక పోతే యేఁవో నోర్దెరిస్తే ఏఁవవుతుందో? తెరవకపోతే ఏవవుతుందో? అని వోళ్ళో పేతులు పెట్టుకోని కండ్లల్లో నీళ్ళు తుడ్చుకునేదాని గేడా శాత గాకుండా సతఁవతవై పోతుండారు నేనూ ఆ కొమ్మలో

రెమ్మనె కదా? అ ఎన్నులో గింజేనే కదా? నాకు మాత్రం నోరెట్లాడుతుంది. పెద్దోళ్ళున్నారు ఒరే? అబ్బోడా బాద మూసిపెట్టుకుంటే పాసిపోతింది మణుసుపాసి పొయ్యిందంటే మణిసి నసించిపోతాడు. అందుకే సెప్పుకోవల్ల ఇనే వోళ్ళు లేక పోతే సేవో సెట్టుకు జెప్పు. అడవిలో పుట్టకు జెప్పు. అది గూడా శాతగాకపోతే యింట్లో గోడకు జెప్పు అ,

అయ్యలారా! అమ్మలారా!

సెయ్యెత్తి మెక్కుతా వుందా నాకు కాతొచ్చినట్లు సెప్తావుండా మీరందరూ.

పాలన్నదినే పరమాత్ముళ్ళు మంచీ సెడ్డ తెల్సిన మహాన్నబావుళ్ళు?

ఇనిండి తూబెహ యీడెంత యీడనే తార నెంత యీడ్జెప్పేదేంది. మేవినేదేంది. అని కొట్టిపారేయద్దండి మీకూ కూడా పాపలుండారు. మీ బిడ్డల్లో నేనూ ఒక బిడ్డనుకోండి. సెప్పేదంతా యిని నాత్తప్పుంటే సెప్పు సేతికి తీసుకోండి.

నా పేరెంగటయ్య!

ఏ వూరంటారా ఊరూరికీ ఒక పేరుండాది. అయితే మా వూరికి మాత్రం లేదు. ఇదేంది చిత్రంగా వుండాదే? అంటే ఏఁవీలేదు. ఊరూరికీ ఒక పేరున్నట్టే ఊరూరుకీ కూత దూరాన ఉడ్డగా పదిరవై వూరి కొంపలుంటాయి. అదేవూరైనాగానీ ఆ వూరి పేరుకు 'మాలాడ' అని మూడచ్చిరాల్లదగిలిస్తే అదే పేరు అట్టాంటిదే నా వూరిపేరు గూడా. ఇనాలంటే అబ్బొంతరం లేదు సెప్తావినండి.

మాది ''పైడిపల్లి మాలాడ''.

ఆ వూరిపేరు మిందనే మా తాతలు బతికినారు. వాళ్ళ తాతలూ బతికినారు. నేనూ బతకతావుండాను. ఆ మాలాళ్ళోనే? అదే వూరింట్లోనె.

వూరిల్లయితే మాత్రఁవేఁని, రొండంకణాల ఎడం, మూడంకణాల పొడుగు, మా ముత్తాతల కాలంలో ఎట్టుంణ్ణిందోయేఁవోగానీ మా తాతల కాలంలో బెవ్మాండంగా వుణ్ణిందంట. మా తాత యిదండ్లు గప్పేదానికి ఆపాయ్‌కటో పేరుపోయ్‌నోడు. తట్టుడు పలక శాతబట్టి ఆయన్నిల్లెక్కితే యీగెజారి పడేంతసుద్దంగా కప్పేవాడంట. ఆ దినాల్లోయేఁవుండాది? వరస గుట్ట కట్టెక్కిదిగితే మొలెత్తు బోద కసువు గంట్ల గంట్లుగా పెరిగుండేదంట, ఇంటిల్లిపాదీ రొండు దినాల దివికి పొయ్యొస్తే -మూడంకణాలింటికి బోదకసువు యిను మిక్కులయ్యేదంట. అప్పుడూళ్ళో వూరిండ్లే మాలాళ్ళో వూరిండ్లే ఊరూ మాలాడ కల్సి ఆడివిమింది కెగబడ్తే కూడా బోదకసువు ఏ విసేసికాదంట. ఇప్పుడూళ్ళో మిద్దిడ్లంయినాయి. అయ్‌నా పదిఅరుగుల దూరం బొయ్‌నా వల్లుగుట్టుకోను పోనసిక్కనంటా వుంది. ఎట్లా దొరికితిందిలే ఎవుడుబడ్తే వాడు అడ్డవాపులేకుండా ఆడవలమిందబడి సెట్టు జేవను తెగనరికేస్తావుంటే అడువులన్నీ పేను గిరికిన తల్లుమాదిరై పోయ్‌నాయి.

ఈవూరి కొంప మిందితంత డాగోతం జెప్పాల్సిన పనుండేదేగాదు. బిడ్డకు పెండ్లీ పెట్టుకోకుండా వుంటే మాతాత యింట్నెంత సుద్దంగా కప్పుకున్నాడంటే మా నాయిన తరంలో యిల్లెక్కాల్సిన పనె లేకపోయింది. నా తనంగూడట్టా గడ్సిపొయ్యేదీ లేదంటే

నాలుగు సినుకులు రాల్లేనె కాసింతిబ్బంది. అప్పుడు గూడాయేఁవుతండాది? ఇంట్లో ఒకపోట కుప్పగా పడుండే నట్టి నట్టిపిడ్తను బాన్ను మూకుణ్ణి ఆ డొగిటా డిగిటేసేస్తే సరిపోతింది. ఇప్పుడట్టాగాకపాయె, నాకు బుద్దెల్సినాక నాయింట్లో జరగతావుందె సుబకార్యెం వాయు. ఆయినోళ్ళే లెత్తి సూపించకుండా సేద్దాఁవనాశ. అందుకే యింటిమిందట్టా వొచ్చిందీ పొయ్యిందీ సరిసూద్దాఁవంటే వెహపు బోదకసువు దొరికేకుంది పావుజంపులయింది. అది గూడట్టిపోనీ బోదకసువుగాకుంటే వరికసువవుతుంది. బిడ్డనూ సేదానికి శానం బట్లోళ్ళొస్తానన్నారు. వాళ్ళుంతో యిదంతో ఎసులుబాట్నాళ్ళు. బిడ్డకు మూతీ ముక్కు సక్కంగా వుండాదని మునావ పణ్ణారు. వాళ్ళొస్తే కాసింతవరెదగా సూడల్లగదా? సూద్దాఁవంటే కొంపలో పిడికిదొడ్ల గింజిల్లేవు. సంగటోసలిబిందో కెలికి వచ్చినోళ్ళ మెకాన కొడ్తావంటే ఎల్తిగా వుంటుంది. ఏంజెయ్యల్ల మీరే జెప్పండి?

ఏఁవీ సెయ్‌లేవనుకున్నెప్పుడు నా మాదిరోళ్ళకు శాయిందొగిటేవని. కలిగి నోళ్ళ కాళ్ళు పట్టుకునెది.

ఎంచిసూస్తే శానం బట్లోళ్ళొచ్చే దానికి మూడుదినాల్లేదు. నాకా ఎవకా ముందెవురూ లేరు. అన్నిపన్లా నేనే జూసుకోవల్ల. ముందుగా మూడు గుంచాల వడ్ల గింజలు కొంపజేస్తు మల్లెట్టన్నా అవుతిందని ఊరిమిందబణ్ణాను.

సిన్నప్పుడు ఇయస్కూలికి బొబ్మని మానాయినెంతో సతపోర్తే నెనిసికిలేక పోయ్‌నావంట. అట్లాడుకునేదానికి పలకా బలప్మెత్తుకోరాంటే-నాకు నేనుగా పొయ్యి రెడ్డోరింట్లో పేడతట్ట నెత్తికెత్తుకున్నానంట. సిన్నప్పట్నుండి రెడ్డోరిల్లంటే నాకంత గురి. అందుకే అట్టాయిట్టా తిరిగి సూడకుండా ఆడికే పొయ్‌నా.

రొండ సేతుల్నెనక్కించి ఆరిసేతుల్ని కోటగూర్చి ఆ కోట్లో తలకాయి పెట్కోని వరండాలో వాలుకుర్చీ మిందపొణుకోనుంది రెడ్డమ్మ. నన్జూస్తానె కాలెత్తి కాలిమిందేసి, 'ఏవిరా ఎంగిటిగా శానాదూరఁ వొచ్చేసినావే?' అనడిగింది.

నేనంట్టే వల్లమాల్నబిమానం రెడ్డెమ్మకు.

నన్జూస్తానె రారా రారా ఎంగిటిగా నీమాటే అనుకుంటావుంటే నువ్వే వచ్చేసినావు. నిండానూరేండ్లురా?' అని పిల్చేది. ఆ మాటల్తో నేను మెలికలిరగతానిలబడ్తే- యింట్లో గొడ్డల్లెచ్చి సేతికిచ్చేది. పొయ్యిలోకి పేళ్ళు సీల్చిచ్చేవాణ్ణి. శాందారం సేతికిస్తే నీళ్ళు జేదేవాణ్ణి. రెడ్డోరింట్లో నువ్వు నీళ్ళు జేత్తావా? అని సందేహపడబాకండి. నేనం సేత్తావుంటే-రెడ్డెమ్మ ఆ పక్కన్నిలబడుకోని దూకంది పోసుకునేది. నిజం జెప్పొద్దూ?- రెడ్డమ్మ మెకం జూసుకుంటా శాదబాయిలో సాదులేక సుక్కనీళ్ళు లేకుండా సేది సాయ్‌మంటే పోసేసేవాణ్ణి. ఆఁవెగూడా ఎనకా ముందు సూడకుండా-కుండడు గ్గికి నాలుగు రోస్కిల్ల సద్దినీళ్ళు గూడా పోసేది. అట్టాంటి రెడ్డమ్మ 'శానాదూరవొచ్చేసినాఁవే? అవే కుందికి మాట శానాదూరం బొయ్యింది. అయ్‌నా యేం జెయ్యల్ల? మినకరిస్తా నిలబడుకుంటి.

''ఏఁవిసంగతి సెప్పురా ఎగింటిగా?'' అనింది రెడ్డెమ్మ.

''బిడ్డకు పెండ్లి పెట్టుకున్నానమ్మా''

ఆ మాట సెవిని పడేకుందికి సివ్వలా ముందుకు లేసింది రెడ్డెమ్మ అరిసేతుల్నెట్టానె కోటగూర్చి కాలిమిందకాల్ని పెట్టుకునింది. అప్పుడు సూడల్ల - రెడ్డమ్మ మొకంలో నిజంగా సెండుమల్లెలె పూసినాయి. నాకు శానా కుశాలయింది.

''ఎక్కడిరా సంబందం''

''శానంబట్ల మాలాడనుంచమ్మా?''

''కొత్త సంబందఁవా పాత సంబందఁవా?''

''కొత్తదేనమ్మా''

అదే యీ పొద్దు నీమొకంజూస్తానె అనుకుణ్ణా ఏందోయిసేస వుండాలని'' ఆ మాటంటా రెడ్డెమ్మ ముసిముసిగా నవ్వతా వుంటే నేను కూడా ముసిముసిగా నవ్వతా వొచ్చిన పనవుతుందనుకుణ్ణా అందుకే- 'ఏ కావాల్రా ఎంగిటిగా' అనడిగితిందేఁవో అని ఎదురు సూసినా. రెడ్డెమ్మ వాలుకుర్సీలో వాటంగా ఎనక్కీ ముందుకూ గతా వుండేదే గానీ నోర్తెరిసడగలా. ఎంతోసేపనెదుర్జూసేది? నేనే కలగ జేసుకుణ్ణా.

''రేపులేదెల్లుంది శాసంబట్లోళ్ళొస్తా వుండారమ్మా పిల్లదాన్ని సూసేదానికి. కొంపలో పిడికి దొడ్లగింజిల్లేవు సంగటొసలి బిందోకెలికేద్దాఁవనుకుంటే సంగటంగా వుండాది. ఒక్క మూడు గుంచాలొడ్ల కొల్సియ్యండి. ఏదో ఒక పన్జేసి సెల్లబెడ్తా.

సేతులు పిసుక్కుంటానే సెప్పాల్సింది చెప్పేసినాను.

గలగల నవ్వింది రెడ్డెమ్మ?

''నీ సేతికడ్డంలేదు సూసుకోరా ఎంగిటిగా, ఇదిగా వొక్క గింజిలేదు. గాదెల్లోబోసి మెత్తేసుండావు. దరల్జూస్తేనా అగ్గిబడి పోతావుండాయి. అమ్మబోతే అడవి కొనబోతే కొరివి. ఏంజెయ్యమంటావు సెప్పు? మెత్తుల్దీసేదాని కెట్లవుతుందిప్పుడు? తీసినప్పుడు కావాలంటే తీసకపోదూరే మూడు గుంచాలు కాకపోతే ఆరు గుంచాలు ''యాడికి పోతాయ్?''

అదీ నిజవే. ఒక్క పూటిడువు లేకుండా బానకు బానోలి పండించిన పంటాయె. ఒగిటికి సగంగా దారదొయ్‌మంటే ఎవరు మాత్రం దారపోస్తారు. నాకవసరఁవొచ్చిందని మత్తేబుల్ని మెత్తుల్దీ మంటే తీస్తారా.

ఇట్టనుకునేకుందికి నాకు నా(రాలా ఈణ్ణెయిట్టయితే యింకెట్లబ్బా); అనుకునె కుందికి మెడకాయి మిందతలకాయి. నిలబళ్ళేదు. ఇంకాడ నిలబళ్ళేకుండా నేరుగా ఎగీదిలో ఎర్రఁవనాయుడంటి కెలబాణ్ణా

ఎర్రవఁనాయుడోళ్ళకు యేడెనిమిది మడికల సేద్దిం. నాలుగు కీనీరు బానలకింద ఏక సదరంగా బూఁవులు బాయి బాయికి కరంటు మిసిను మిసిన్లెప్పుడు జూడు తిరగతానె వుంటాయి. ఈరుగార్లూ పంట పండతానే వుంటింది. దినఁవూ పదిరవైమంది కూలోళ్లకు తక్కువ లేకుండా పన్జేస్తానె వుంటారు. ఆ యింట్లో పొయ్యిమింది బాన కిందికి దిగదు. పండిందొండిందే వార్చిందోర్సిందే. తిన్నోళ్ళు పోతావుంటే వచ్చినుళ్ళు తింటావుండా ఆ

యింట్లో అడుగుపెట్టే ఏ పనీ శాతగాని ఎర్రిముండగూడా ఎదోవాకపని సేద్దావనిపిస్తుంది ఆ యింట్లో దూళ్ళుకు ముగుజింబరాలు మొదలుకోని ఎద్దలకెంటికి దారాల్దాకా పేడుందా! అండగొట్టి అడుసు దున్నింది మొదలుకోని పైరుగోసి తాలుగొట్టేదాకా పన్జేసుండా! నేనంటే నాయుడిగ్గాని నాయుడమ్మగ్గాని శానా యిష్టం.

నేనా యింట్లో అడుగుబెట్టే టప్పటికి ఆవలేళ దాట్తావుండాది. యాడోళ్ళాడ పన్లమిందపాయ్‌నట్లుండారు. ఇల్లు బిసురోమనుండాది. సావిట్లో నిలబడుకొని నాయుడు నాయుడమ్మతో సరసంవాడ్తావుండాడు. నన్జూస్తానే నాయుడమ్మ నవ్వుతా యింట్లోకి జారుకునింది.

నాలో నేన్నవ్వుకుంటా తలంచుకోని నిలబడుకుణ్ణా.

'' ఏంవిగా ఎంగటా? యాళగానేళకాడ దిగబడితివి? ఏంకత?'' అదొక మాదిరిగా నవ్వుతూ అడిగాడు నాయుడు.

సెప్పలేక సేతులు పిసుక్కుంటావుంటే-

'' ఒరె నీ యమ్మనుగొట్ట రానూవొస్తివి. మీయమ్మనుతరంవనూ తరివేస్తిని గుటకలు మింగాల్సింది నేనత్తై నువ్వెందుకురా నసగతా వుండావ్? సల్లబడేటప్పుడు బాన పగలేస్తివి కదరా నీయమ్మ యిల్లా మల్లినాయాలా?' అని మిద్దెగిరి పొయ్యేటట్టు నవ్వుతా వుండాడు నాయుడు.

సెయ్‌రాని తప్పుజేసినట్టు నేనెంతో గుటకలు మింగతానే వుండాను.

నాయడమ్మ నవ్వతా మల్లా సావిట్లో కొచ్చింది.

''అదునూపొదునూపోయ్‌నాక నా మొగుడు గాంయిసేద్దిగాడన్నట్టుంది యవ్వారం. యాళాపాళాలేని సడపాలు పాడ్పాడుగనీ... ఆడికి పిలువు'' అని నాయుడమ్మ కోపం జేసుకున్న కొసిరి కొసిరి సూసింది. ఎర్రంవ నాయుడు జెర్రిపోతు మాదిరి మెలికల్దిరిగి పోయ్‌నాడు. నేనూ మెలికల్దిరిగి పొయ్‌నా వచ్చినేళ బాగుండాదని.

''ఆయన్నేంగనీ.... వచ్చిన పన్జెప్పు- ఎంగటిగా'' నాయుడమ్మ అడిగింది.

సెప్పినాను.

నాయుడిరగబడి నవ్వతా -

''ఊరికే అన్నారంట్రా మీకంగా బుద్దుండేది వేంకాళ్ళల్లోనె అట్టబొయ్యవూళ్ళా నుడికయ్యిల మింద తాలు. యాడ్డాడపడుండాది. దివాని ఇరవై ముప్పై మంది కోతకోస్తా వుండారె వుళ్ళా? కండ్లు దొబ్బినాయూ నీకేంవన్నా? ఇప్పుడొడ్ల గింజలు కావాలని యింటికాడి కొచ్చినావే?''

నవ్వతానే మెత్తమెత్తగా నాలుగంటించినాడు నాయుడు.

''నువ్వుజెప్పేది బలేగుండాదే? పాపం వాడవసరంవాడిది. పాతొడ్లే ఏవన్నా వుంటాయను కోమంటాడు. ఉణ్ణే కట్టాయిట్టా అయ్ పొయ్యి నాయని వాడికేవన్నా వాసనగొట్టిందా? వాణి మిందట్టాయిర్చుకవడ్డా వుండావే? అయన్తేంపనిగని ఎంగటయ్యా తాలుగొట్టేటప్పుడు

రాబోరా కళ్ళానికి రొండు తూఁవుళ్ళు గాకపోతే వందుల పట్టకపోదువు. నీ కిస్తే యాడికి బోతాయ్?''

యాళకానేళకాడ ఎనకాముందూ సూడకుండా పాణకంలో ఫ్లుయినానని నాయుడెగిరెగిరి పడ-నునంటే నాయుడమ్మకు శానాయిష్టం. అడ్డదంజెప్పే మణసిగాదు. ఇంతకూ నా తల్రాతట్టా రాసిపెట్టుంటే ఎవురేజాస్తారు?

అణ్ణుంచి ఎలవారొస్తావుండా కడపదాటి అడుగు బయటపెట్టావుంటూ ' ఒరెంగటా పిల్దానికి పెండ్లి బెమ్మాండ్గాం జెయ్యాలే అంటా పడిపడీ నవ్వుతా వుండాడు నాయుడు.

ఎలిక్కి పాణం పోతావుంటే పిల్లిసెలగాటఁవాడిందట .యియ్యపోళ్ళు బిడ్డన్నూసే దాని కొస్తావుంటే- నాలుగు వెంతుకులు వార్చిపెట్లేని బేవార్చవ్వుండా కొడుకునం. పెండ్లెట్లాబెమ్మాండంగా జేస్తాను.

ఇట్లానుకుంటానే ఆ ఊళ్ళో ఎక్కిదిగని కడప లేదంటా ఎక్కిదిగినా యాడికిపొయ్‌నా పొద్దైదురే నా ఎర్రి కాని రెడ్డోరు నాయుడోళ్ళంటే ఆ పాయికల్లో పేరెత్తినోళ్ల ఆ యింఢ్లల్లో ఎలికల్నడిగితే సెప్తాయి ఎన్నేండ్ల గింజలిరువుండేది. అట్లాంటి సోట్నే బతుకారూ మూడైతే యింకేడికి బోవల్ల.

ఇదంతా అయ్యేపని కాదనుకున్నా ఎట్టన్నాజేసి కోఁవిటి సిద్దయ్య కాళ్ళో సేతులో పట్కోని నాలుగుపాళ్ళ నూకలీవకపోతే ఆ పూటకిట్టా సుట్టుపట్లుగా సరిపోతాయనుకున్నా.

అంగిడోళ్ళ సందులో కొఁవిటాయి నింటికి పొయ్‌నా

అంగిడి మూసేసి యీాదిలో తిన్నె మింద రొండు సేతులు నెత్తినెట్టుకోని కూచ్చోనుండాడా కోఁవిటాయిన. ఆయన మొకం జూస్తే నాకే ఏడుపొచ్చేటట్టుగా వుండాది. ఇంకేఁ పనడిగేది? అడిగేదానికి వోఁ్రాకుం అట్లానే నిలబడుకుణ్ణా. నేనొచ్చినపని తెల్సుకుణ్ణాడాయిన.

''ఒరే ఎంగటయ్యా దొరికి దొరికి ఈ సేల్టాక్సోళ్ళకు నేనే దొరికినానుగదరా; ఎదవ లెదవలు. ఏల్లేల్లుగా బేరాల్జేసే ఎదవలెందరో వుంటే ఉప్పు, మిరపకాయమ్ముకునే ఈ పనికి గానెదవమింది పడ్రిగదరా; అంగిడి మూసేకమ్రని సిత్తుకాయితాలు వస్తే అడ్డగాడ్దలు కూడా తిన్నింటాయిరా. కొంపలు మునిగినట్లు అసో బోసోమని జవరుకోని సేతి సంచుల్లో కుక్కోని పక్కా పాయిరికదరా? వొచ్చిన బేరాలు పోతావుండాయి. నీబోటోళ్ళెరువైనా వొచ్చి అంత అప్పోగిప్పో అడిగితే యిద్దాఁవంటే సేతులు కట్టేసినట్లయిపొయ్యింది. ఏం జెయ్యమంటావురా ఎంగటా?''

ఏడవకుండానే బొరోఁమని డేస్రినాడే కోఁవిటాయ్‌ని

పాపం. ఆయన బాదాయన్జి.

ఏడస్తావుంటే సూసా నిలబడుకోలేక ఎలబార్నా నేనూ ఏడస్తా

''మొగోడవూళ్ళోకి పొయినాడు కదా? ఎట్నో వొకట్ట రొండు మూడు గుంచాలు పొట్టుగింజలు పుట్టించుకోలేకపోతాడా? ఈ గెండమెట్టి గెడవకపోతుందా?'' అని యింట్లో ఆడది ఎదురుసూస్తావుణ్ణెట్టుంది. నేనన్నాస్తానేలే సెదురంగా వచ్చింది నెత్తిట

దించుకుందావన్న వుననతో వూడిపాయ్న నా వూతిజూసే కుందికి దాని మూట మూడొంపుల్దిరిగింది.

ఏంజెయ్య మంటారు సెప్పండి? దాని బాద్దాన్ది!

ఆ బాజ్జాళ్ళేక నేనేదో తప్పు జేసినట్లు తలొంచుకొని నిలబడుకుంటే.

''ఏం మొగోడమ్మా ఈ మొగోడు? ఇరంపరం లేని మొగోడు. పొద్దనకంగా బాయి పొద్దిరిగేదా తిరిగి యిప్పుడొస్తావుండాడు. సేతులూసుకుంటా, మల్లా జూడు, ఆ రెడ్డోగినా, నాయుడోళ్ళన్నా గెవిన్లో అట్టా నిలబడి గొంతిస్తే సాలు ఎబెట్కోని పరిగెత్తాడు. ఇంతకూ దాన్నా తట్లారాసింది. నాకడుం పిట్టా కాల్తావుంది. కోతికయిన గీత సక్కంగా వుండాలంటారు పెద్దోళ్లు రేపులేదెల్లుండి వాళ్లొచ్చేస్తారు. వొచ్చేస్తే యేం జెయ్యాల? నాతాడుదెంచి వాళ్లసేతుల్లో బెట్టల్ల.''

ఆమాట సెవిని బడేకుంది సురక్క మనింది. ఇంకాడ నిలబళ్ళేక గిరక్కన ఎనక్క తిరిగివా మల్లా గబుక్కున సెయ్యి పట్టుకునిందిల్లాలు.

''ఎండనబడీ యాడేడ తిరిగితివోయేవో? ఎవ్వరైనా దొసిడు సద్దినీళ్ళయినా పోసినారో లేదో, సంగటి కెలికినా గురుగాకుపులగేర బావినా. అంత గొంతులో యేసుకోని మల్ల కావల్సుంటే యాడ్కైనా బో''.

కోప్మొస్తే తాడు తెంచేస్తాననేదీ ఆడదే మణిసిని కదిలీ మెదలకుండా తాడుతో కట్టేసినట్టు కట్టేసేదీ ఆడదే.

ఇసుక్కుంటా నసుక్కుంటా మూకుడు ముందర కుచ్చున్నా!

జొన్న సంగటికి గురుగాకు పులగూరకు బలే పక్కంగా ఉంటింది. రొండు ముద్దలంటే లెక్కలేకుండా లగాయించే వోణ్ణి అట్టాంటి ముద్దనంజేటప్పుటికి వొగ్గెండంగడ్సినట్టయింది.

ఇంటి మొగదాల్నే వొకసింత సెట్టు బాగా సిగిరించింది. ఆ సెట్టుకిందొకమంచం. తాతల్జం పాయించింది. దారాలన్నీ డాగా సళ్ళొదిలి వుయ్యాల మాదిరుండాది. దాంట్లో పొణుకొని ముసుగేసుకుణ్ణా.

''రేపులేదెల్లుండి వాళ్ళొచ్చేస్తారు వొచ్చేస్తే యేం జెయ్యాల? నా తాడ్డెంది వాళ్ళ సేతుల్లో పెట్టల్ల''. ఇంట్లో ఆడ్డన్న మాట్లేసెవుల్లో తూట్లు పొడస్తావుండాయి. మర్చిపోదావంటు మరుపురాలా కంటిమింద రెప్పట్టా పళ్ళా, ఆ మంచం మిందట్టపొల్లతా యిట్ట పొల్లతా ఎప్పుడు కన్ను మూసినావో నాకే తెల్దు.

మెలకువొచ్చి సూస్తే కస్సీగటి పడ్తా వుండాది.

''జలవెమ్మత్తి పుడ్తేసరి పొయ్యిందా? కొంచివయినా సిగ్గా సీపూ వుండక్కర్లా? పొద్దుపుట్టేదెంత సేపు? పొయ్యేదెంత సేపు? ఆ పొద్దట్లా పుట్టి మునిగిందంటే తెల్లార్తది వాళ్ళొచ్చేస్తారు. వొచ్చేస్తే యేం జెయ్యల్ల? ఈ మొగోడి నిద్దర కూడా పట్టింది కదమ్మా?''

పెళ్లో కుండ్లూ సట్లూ కడగతా నన్నూ కడిగేస్తా వుండాది యింట్లోద్ది.

తుండు గుడ్డెత్తి బుజాన వేసుకోని ఎలబార్నా -

ఆడ తిరిగినా ఈడ తిరిగినా, యాడేణ్ణో తిరిగినా, అట్లా తిరగతావుంటే నామణుసేఁవో పురగతానేవుండాది. ఇంట్లోడన్న వూట్లుసెవల్లో గింగురువుంటావుండాయి. ఎంతాలోసించినా యేఁవిజెయ్యాల్నోతోసలా. తోసలేదని సేతులు పిసుక్కుంటూ కుచ్చుంటే వొచ్చిన సంబంధం సెయ్‌దాటి పోతింది. ఏం జెయ్యాల్ల?

అంతలోనే ఎన్నిలొచ్చింది.

అప్పుడు నేను నాగల మిట్టబాయికాడనడస్తా వుండా. అందాకా కండ్లు సించుకున్నా కనబడన్దిప్పుడు కంటి వింటికి కనిపిస్తా వుండాది. ముక్కల్దాకా తాగి మత్తుగా తూలి వొకరి మిందొకరు పణ్ణెస్టు మళ్ళల్లో వరిపైరు యిరగబడి వాలబడుండాది. కయ్యల మింద నాయుడోళ్ళు కొయ్యించిన వరితాలు వాదెలోదెలుగా పడుండాది. ఇదంతా సూసేకాడికి నా మనసులో ఒకాలోసిన తట్టింది.

ఎవురి కంట్లో పడకుండా రొండుమూడు గుంచాలొడ్లు పులుంకుంటే -

సీసీ! సెయ్ బొయ్యేది సుబకార్నెఁవ్వూ, సేసేది దొంగతనఁవా.

అంతకన్నా నీళ్ళేని బావిలో దూకిసావచ్చు.

అట్టయితే నూరు బొంకులైనా బొంకి ఒక పెండ్లి జెయ్‌మన్నారు గదా పెద్దోళ్ళు. ఒక దొంగతనం దీనికంటే సెడిపొయ్యిందా?

అట్టనుకుంటే - ఆర్నెల కింద శీపరం వాలింట్లో దొంగలు పడ్డి. పొట్టపొగులే ఇంటిని సుట్టేసిరి. తుపాకుల్జూపించిరి. కదిల్తే కాలస్తావ(ని.దొర్ల మాదిర యినప్పెట్లో బాడ్లా దుగ్గాండ్లా దోసకపొయ్‌రి. ఎవురేం జేసినారు? ఆ దొంగతనం కానప్పుడిదెట్లా అవుతుంది?

నా మతి మండిపోనూ ఇదింకా బాగుండాదే. వాళ్ళకు బలవుణ్ణింది. తుపాకులుణ్ణాయి కండ్ల ముందర్నే సెప్పి సేసిరి. నా బోటేరి ముండకేఁ వుండాది? అవసరఁవుండాది. అవసరం వుంటే మాత్రం? కాయికష్టం జేసే జలమాలకు కన్ను గత్తిరించేద్దెలిస్తిందా?

అట్టయితే ఇంకెట్ట?

ఇంకెట్ట? ఇంకెట్ట? అని కుచ్చుంటే తెల్లారి పోతింది. మల్లా తెల్లార్తే వాళ్ళొచ్చేస్తారు. వచ్చేస్తే యేం జెయ్యాల్ల? ఎట్నో ఒకట్టు పొరువు కాపాడుకొవల్ల పొరువు కాపాడుకోవంటే పొరువు కోసరం సూస్తే కాదు.

దేవుడెట్టన్నా పెట్నీ! మూణ్ణాలుగ్గుంచాలు పులుంకోవాల్సిందే!

జాఁవురేత్తిరి కావస్తా వుండాది. ఇంకా ఆడాడా మణిసీమట్రా మొదల్తా వుండారు. అందుకే నాగల మిట్టబాయి గెడ్డమిందకుచ్చున్నా.

నాగల మిట్టబాయి తొవ్వినపుడు ఆ మట్టెంతా ఎత్తి ఆ పక్కన్నే పోసినారు. ఎండాకాలం వొస్తే ఆ బాయి అడుగంటితింది. అప్పుడు వూడెత్తారు. ఆ వూట మట్టి కూడా ఆ గెడ్డ మీదనే పోస్తారు. అట్లా పోసి పోసి శానా ఎత్తు లేసిందా గెడ్డ. ఆ గెడ్డ మీద కూచ్చోని ఎన్నిట్లో సాపుగా వాలబణ్ణ, వరి మళ్ళను సూస్తావుంటే కడుపు నిండి పోతావుండాది. అంతెత్తులో కుచ్చుంటే గాలి సల్లంగా యీస్తావుండాది. ఆగాలోటంగా ఆలోసిన్లొస్తా

వుండాయి.

నాగలమిట్టబాయి కిందంతా మడి ఎర్రపనాయుడోళ్ళదే. ఆకయ్యి లట్టాదాటుకుంటె రెడ్డోరి మడి. ఆ పక్కనే గొల్లగోయిందుకయ్యి. ఆ కయ్యల కవతల్నే అయినేరోళ్ళ మడీ.

నాయుడోళ్ళ మళ్ళో అండగొట్టి అడుసు దున్నింది నేనే! రెడ్డోరికి పైరు నాటించి కలుపు దీయించింది నేనే: గొల్లగోయిందు కయ్‌లో పైరు పొట్ట కర్ర కొస్తావుంటే - పీడ తగిలిందని యేడస్తా వుంటే - మందు గొట్టించింది నేనే! అయినేరోళ్ళ కరంటు మిసీను సెడిపోతే అది రిపేర్జేసుకోనొచ్చేదాకా మోట తోలిందీ నేనే ఈ పాద్దీ పంటింత బాగా పక్వాని కొచ్చిందంటే రెడ్డోరు రేపటెండ మొుకం సూడక పొయ్‌నా. నాయుడు నాయుడమ్మతో సరసాలాడ్తా కుచ్చుణ్ణా. సేవటోడ్చింది నేను. నాలాంటోళ్ళు. వాళ్ళేవో ఊరికే కుచ్చోని గాదెలూ, బొట్టూ, మెత్తులేసుకుంటా వుంటే, గొంతుమింది కొచ్చినపుడు ఒక్కొక్కయ్యిలో రొండుపొళ్ళ గింజిలుపులుంకుంటే కొంపలేఁవన్నా మునిగిపోతాయవా? వాళ్ళకేఁవనా, కూటిగ్గడ్డకు లోటైపోబోతిందా?

ఇట్లనుకొనే కుందికి నాకేడలేని తెంపొంచ్చింది.

లేసినా, సూపొన్నె తదూరం అట్టాయిట్టా సూసినా, పురుగు మొుదల్లేదు. తలపైకెత్తి సూసినా, సుక్కనడిమిట్ట కొచ్చింది. అదే అదుననుకుణ్ణా ఒక్కొపులోపొయ్యినాయి డోళ్ళకయ్‌ల మిందపణ్ణా. రొండోదెలుపులుఁవుకునేకుందికి రొండు దోసిళ్ళకెచ్చు తక్కువలగా కుంచానికిరాలా యి అడికాడ సాలనుకొని రెడ్డోరి మళ్ళో పణ్ణా ఆడా వొక్కందానికి తక్కువ లేకుండా పులుంకుణ్ణా. అణ్ణుంచి గొల్లగోయిందు కయ్‌లోపడి వొంచిన తలెత్తకుండా పులంతావుండా.

ఉణ్ణేట్టుండి నా బుజంమింద బలంగా రొండుసేతులు పణ్ణాయి. నిలవనా నీరుగారిపొయ్‌నా. అంత సల్లపూట కూడా సెవట్లుపట్టేసినాయి. గొంతెండక పొయ్యింది. లేద్దాఁవనుకుంటా వుంటే రొంర్రెక్కలూ పట్టుకోని పైకి లేపినారు. లెయ్‌లేనోణ్ణి లేపినట్టుగా!

సూద్దును గదా!

గొల్లగోయిందు కొడుకులు సిద్దయ్య, గంగయ్య యాణ్ణుకవొచ్చినారోయేఁవో? అంత రేత్రి పూట. సెరొక రెట్టొడ్చి పట్టుకోని గస పోస్తా వుండారు.

నిజం జెప్పద్దా? యిదిలించి కొట్టుంటే అఁవడకొకడు పడుండేవోళు. ఏఁవయి పొయ్యిందో యేఁవో నాసెగితి వాళ్ళ సేతుల్లో పిల్లయి పొయ్‌నా, పులిఁవినొడ్లు కట్రా మూటన్నాడు. కట్నాను నడవరా ఊళ్ళోకన్నార దూడ మాదిరోళ్ళెంట నడ్సినాను. ఊళ్ళో బజిని గుడికాడి కొచ్చేటప్పిటికి 'పెట్రామూటక్కడ' అన్నారు. పెట్నానుఅంతే. అన్నదమ్ము ళ్ళిద్దరూ ఆసొంతంగా పైనబడి రెక్కలెనక్కించి కూసొనికేసి కట్టేసినారు. నేన్నొద్దెరిసుంటే వొట్టు.

ఆ మింద టీ సెంపాసెంపా అదరగొట్నారు. ఎగిరెగిరి తన్నారు. కారికారి మొుకానూసినారు. ఆడిగూడా కుదటపడకుండా యిప్పుడే యేఁవయిందారా నీ పని నా కొడకా, తెల్లార్తే సూద్దువునీరా!' అనంటా అక్కణ్ణే గుడ్డేసి పొణుకుణ్ణారు.

ఊరు నిద్దరపోతా వుండాది.

గుళ్ళో దేముడు కూడా నిద్దరపోతా వుండాడు.

కొంచెపు కారాలు మిరాలు నూర్తా. కాకరించి వూస్తావుణ్ణే గొల్లగోయిందు కొడుకులు కూడా గురక పెడ్తా వుండారు.

రాతి కూసాని కేసి కట్టేసినారని నేను బాధపళ్ళేదు. ఎగిరెగిరి తన్నారని నేనేడవలేదు. కారికారి వూసినారని తపనపళ్ళేదు. తెల్లార్తే వూళ్ళో వాళ్ళ మొకంవెట్లా సూసేది? అర్ధల్చుకుంటే తలగొట్టేసినట్టవుతా వుండాది. తెల్లార్తే ఎట్లబ్బా?

అట్లని నాకోసరం తెల్లారకుండా ఉంటిందా?

పటంవెగరబోతావుంటే పూజారొచ్చినాడు. రాతి కూసానికి నన్జూసి నిర్జీవయ్ పొయ్‌నాడు.

''ఇదేంవెంగటయ్యా? ఊళ్ళో వాళ్ళకంతా గానుబంటువే? కళ్ళాలకాడ కావిలంటే నువ్వే వుండాలంటావుంద్రే! అట్లాంటోడికిదేం బతుకయ్యా? కంచే సేను మేసినట్టాయెనెకత! ఇదేంవి నాయం? ఇదేంవికాలం? కలికాలం కలికాలం ! అని నిట్టూర్చాడు.

గొల్లగోయిందు కొడుకులు కొట్టింది సీంవకుట్టినట్లనిపించలా.

ఈ మాట్లిండా వుంటే యీటిల్తో పొడ్చినట్లయింది.

'బోరో'మని యేడ్చేసినాను.

''యాడవద్దు నాయినా, యాడవద్దు. తల్రాత తప్పించుకునేదాని కెవురితరం?'' అని గొణగతా పూజారయ్యలోపలికి పొయ్‌నాడు.

గొల్ల గోయిందు కొడుకులిద్దరూ కలగన్నెట్టెరిగి వళ్ళేసినారు. తుండుగుడ్డిదిలించి బుజానేసుకొని ఊళ్ళో ఒకరీ పక్కకు యింకొకరా పక్కకు పరిగెత్తినారు.

ఇంక జరగబొయ్యేదేంవో నాకు తెల్సు.

ఊళ్ళో యింటికొక్కమణిసొచ్చి గుడికాడ సేర్తా వుండారు.

ఎంగటా నీకేం పొయ్యేకాలం ఇదేంటిట్టా పన్జేసినావే మంచోడనిపించుకునేదానికి శానాకాలం పట్టిందిరా!''

''ఎంత మంచోడైతే మాత్రంవేంజేసేది?

బాతెక్కడికిబోతింది. కొట్టాల్సిన పన్లే. తిట్టాల్సిన పన్లే. వాళ్ళమింద సెయ్‌జేసుకోనిదోవన బొయ్యే జగడం యింటిదాకా తెచ్చుకునేదెందుకు? కంప్లేంట్రాసి టేసినికిచ్చేస్తే సెయ్యాల్సిన పనేందో వాళ్ళే సేసేస్తారు. ఇంకా గూడేదైనా దొంగతనం నెత్తినబెడ్తే నా కొడుకత్తగారింట్లో అయిదార్నెల్లుండొస్తే సరిపోతుంది.''

''టేసినుకు పన్లే పొడూపన్లే మొట్టు తీసుకోని తలా ఒకేటు గొట్టే నా కొడుకిక్కి బుద్దొస్తుంది.''

నువ్వూ నేననుకుంటే యేంవి లాభం! ఊర్నాయంవొకటుండాది గదా? సీవపంవోళ సిన్నంపరెడ్డేవంటాడో యినద్దూ!''

ఆడ జేర్నోళ్ళు తలకొక్క తీరుగా మాట్లాడతావుండారు.

అంతలో సీపరవోళ సిన్నపరెడ్డి రానే వచ్చినాడు.

ఊళ్ళో అందరికీ అంతో యింతో కయ్యాగాల వుండాది. సీవరవోళ సిన్నపరెడ్డికి తలకాయుండాది. ఆయనకు జుట్లు పట్టించేది తెల్సు. అయితే ఎట్లా పట్టిస్తాడో ఎవరికీ తెల్దు ఆయనకు జుట్లిడిపించేదానికి తెల్సు. అయితే ఎట్లిడిపిస్తాడో ఎవరికీ తెల్దు అందుకే అయినా పాయికట్టు జుట్టంతా సేతిలో పట్టుకున్నాడు. మహన్నబావుడు దొరమాదిరి రగతాదొంగతనాల్జెయ్యిస్తాడు. శీరంగనీతుల్జెప్తా సిన్నంగా గుడిసెల్లో దూర్తావుంటాడు. అయితే మాత్రవేం? ఆ పాయికట్టు అయినేసిన పుల్లదాట్డు.

పేరుకు సిన్నపరెడ్డయినా పెద్దరెడ్డి నను జూసి పకపకా నవ్వినాడు.

ఆ పొదుట్నోన్నా తల్రాత సినిగి పొయ్యిందనుకున్నా.

నా కండ్లలో నీళ్ళు సలసలానేల్రాల్నాయి.

''ఏడస్తావేందుకురా వెర్రినాయలా. అట్టనుకుంటే ఈ దేశంలో సాలా మందేడవల్ల. ఏ నా కొడుకేడస్తా వుండాడు. ఓట్లేసి ఏంపిస్తే కొడుకులు పట్టపాగులే నిన్నూ నన్నూ నిలబెట్టి వొల్చుకొని తింటావుండారే? వాళ్ళెంటిక లెవురైనా సెరకతా వుండారా? నువ్వేందిరా? నాలుగుపాళ్ళు పొట్టు జలకు కక్కుర్తిపణ్ణావు. దీనికే కొంపలేవో మునిగిపాయినట్టు ఊళ్ళేవో మహా యెగిరెగిరిపడ్తా వుండారు. సాల్చాలుగనీ యిడ్సిపెట్టంఁడ్రా''

దేముడు సాచ్చిగా సెప్తావుండా ఆ వూళ్ళో దేముడి గూడా ఆసెగితి లేదు. సిన్నపరెడ్డి నోట్లో మాట నోట్లో వుండగానే నా కట్లిడిపించినారు. తలొంచుకొని నిలబడుకుణ్ణా.

''ఇప్పుడీడేఁ నీ కొంపలంటక పోలేదు. గోరింతలి కొండంతల్జేసుకోవాల్సిన పని లేదు. యింకా తలొంచుకోని నిలబడుకుణ్ణావెందుకురా. ఆ మూటెత్తుకోరా ఎంగటా ఏవీ జరగలేదనుకోని తిరిగి సూడకుండా పొయ్యి కొంప జేరుకోరా''

'తిరిగి సూడకుండా పోరా' అన్నాకు జెప్పి అయిన తిరిగి సూడకుండా పొయినాడు. అయినే పొయ్యేకుందికి ఊళ్ళోవాళ్ళే డోళ్ళాడపొయినారు.

మూటెత్తి బుజాన పెట్టుకున్నా.

అయితే యింటికి పొయ్యేదానికి కాలాళ్ళా!

నేరుగా సీరం సిన్నపరెడ్డింటికే పొయినా!

మారాజు సావిట్లో కారేట్నగరం కాజా మాదిర కాలమింద కాలేసుకోని కుచ్చోనుండాడు.

మూటెత్తకపొయి ఆయిన ముందరబెట్నా!

కాళ్ళ మిందబడి దణ్ణంబెట్నా!

''లెయ్‌రా పిచ్చోడాలెయ్'' అన్నాడు.

లేసి, రొండడుగులు లెనక్కేసి , సేతులు కట్కోని నిలబడుకుణ్ణా.

వడ్లమూట ఈడించాడ్డించి యీాడి పొయ్యింది. ఆ యీాడి పొయినమూటుట్నే

కాసింతసేపు సూసినాడు. ఆ మిందట మూట సరిగ్గా కట్టుకోరా అన్నాడు. కట్టుకున్నాను.

''ఒరే పిచ్చోడా. సేతగానవమ్మకు. సెలకాడ కొప్పన్నారు. ఈరొండం మూడం గుంచాలొడ్లగింజి వొక్కయ్యిలోనే పులుంకోనుంటే పోలా? ఇన్ని కయ్యిల్లే కెందుకు పాయ్‌నావురా? యాణ్ణో ఒకసోట్నే అయ్యింటే పనీసలీసు. వొంటికి సుకఁవు. నాయానికి యిరక్కపోతివి గదరా... బడవా?''

సత్తింగా సెప్తావుండా. నా తలకాయి తిరిగి పొయ్యింది. రొండు మూడు కయ్యిల్లో గింజలు పులుంకునింది నాకూ పైనుండేవోడికి తప్పితే నరవానవుడికి తెల్దు. తెల్సుకున్నాడు గదన్నా మొనగోడు? అందుకే గదా మహన్నబావుడు. ఆ పాయి కట్నంతా అరిసేతిలో పెట్టుకున్నాడు.

నేనిట్లా ఆలోచిస్తా వుంటే -

''యాఁవార్తే అందరూ దొంగనాకొడుకు లేరా? ఆ మాట కొస్తే ఈ దేశంలో వాణ్ణోరీడం, ఈణ్ణోరోడం కొట్టకుండా బతికే నాయాలెవుడం? ఇదంతా నువ్వేఁవీ మణుసులో పెట్టుకోబోక, పోపో''

ఎయ్యేనిగిల బలఁవొచ్చేసింది. నాకా మాట్లింటా వుంటే.

వొంగి వొంగి దండాలు పెట్నా. మూటెత్తుకోని ఎలబార్నా, ఆయినింటి కడప దాట్తావుండా

''ఒరే ఎంగటా!''

ఆయన పిలిసేకుందికి తిరిగి సూసినా!''

''ఇంటికిబోతానే నీ కూతుర్నిట్లా పంపించురే''

గాదిగుండు నా నెత్తిమిందనే పణ్ణిట్టయింది. నిల్దొక్కని నిలబళ్ళేకపాయ్‌నా. అట్లానే నిలువు గుడ్లేసి సూస్తావుంటే - సిన్నపరెడ్డి నోర్నవ్వతావుండాది. నొసులెక్కిరిస్తావుండాది. ఏఁవి సెప్పేదానికి నోరాడకుండా అట్లానే సూస్తావుండా!

''ఎందుకురాట మావురిబిలి సూసినట్లు సూస్తావుండావే? ఇప్పుడేం కొంప మునిగి పాయ్‌నాయని. మీయమ్మ ఊళ్ళో లేక వారం దినాలయింది. ఇంట్లో పన్జేసిది కూడా జరం తొగిలిందని ఆసిపత్రిలో పాణుకుణ్ణించి. ఇంట్లో ఆడమణిసి లేకుండా యిల్లూ వొళ్ళూ ఎట్టెట్నో వుడాది. పోరాపో. బిన్నెపొయ్యి నీ కూతుర్ని పంపించు. ఈడెవురూ దాన్ని పెరుక్కోని తినరుగనీ పోరా.''

ఆ కండ్లల్లో కొవ్వూ, ఆ పెదాల మీద నవ్వు సూస్తావుంటే వోడు పెరక్కతింటాడో లేదో తెల్సిపోతానే వుండాది.

ఒక్క సెణవాడ నిలబళ్ళేకుండా వొచ్చేసినా.

ఇప్పుడేం జెయ్యాల? ఎవుర్తో సెప్పుకోవల్ల? తలెత్తుకొని తిరగలేకుండా వుంటే తలపోసుకునే దానికి తావెక్కడ దొరుకుతుంది?

నరమానవుడిమింద నమ్మకం బొయింది.

కాలేఁవో నిలబళ్ళా కడుపేఁవో రగల్తావుండాది. ఏం జేసేది? పేదోడి కోపం పెదానికే సేటు?

ఉణ్ణేట్టుండి మణుసులో వొకాలోసిన తట్టింది. అట్టాయిట్టా సూడకుండా పరిగెత్తినా కాలికొద్దీ పరిగెత్తినా. మా తల్లి మారెమ్మ గుడికాడికి పరిగెత్తినా. వడ్లగింజల మూటా తల్లి పాదాలకాడ బెట్నా, సాష్టాంగపణ్ణా.

''అమ్మా! మారెమ్మ తల్లీ నాబిడ్డ నత్తగారింటికి పంపించాలనుకుణ్ణా. నేనే అత్తగారింటికి పొయ్యే గతిబట్టింది. అదెట్నో తప్పొయ్యిందనుకుంటే - ఆ బిడ్నినింకొకత్తగారింటి కంపింయయాలొచ్చింది. నువ్వే జెప్పు తల్లీ. నేను కన్నానా? కక్కినానా పీట్లమిందికి పంపాల్సిన బిడ్డను తెల్సి తెల్సి వోడినోట్లో ఎట్టేసేదమ్మా?- అంతకంటే సావుమేలు కదా! వాడగ్గిరికి పంపించలేను. పంపించక పోతే యింకీ వూళ్ళో బతకలేను. ఈ వూరు గాకపోతే ఁయింకొకూరనుకుంటే తాతముత్తాతలకాలాన్నుండి ఈ మట్నే నమ్ముకుంటిఁవి. నీపాదాలకాణే బతికినాగదమ్మా. ఇప్పుడెట్లా జెయ్యమంటావ్ సెప్పు తల్లీ!''

ఆ తల్లి ముందరపడి అల్లాడాను. పొల్లాణ్ణాను. అల్లాడ్తాపొల్లాడ్తావుంటే యాందో 'టప్'మిన కిందబడింది.

లేసి సూద్దును గదా అమ్మముందర నిమ్మకాయి జెక్కినిలబెట్న పట్టాకత్తి. నా ముందర పడుండాది. ఆ కత్తిన్జూసే కుంకి నాకెక్కళ్ళేని దయిర్నం వొచ్చేసింది.

కండ్లల్లో పలవల నీళ్ళు గార్తావుండాయి.

''అమ్మా, మారెమ్మా ఇది నా మాట గాదు. నీ మాట తల్లీ. ఇది నా బుద్ధి గాదు. నీ బుద్ధి తల్లీ. ఇంక నా బిడ్డ నా బిడ్డ గాదు. నీ బిడ్డ తల్లీ. ఉత్తరవిచ్చినావుగదమ్మా. నువ్వే ఉత్తరవిస్తే యింక నాకేం బయం తల్లీ.

కత్తి సేతికి తీసుకుణ్ణా!

అయ్యిలారా అమ్మలారా!

పాలన్నం తినే పరమాత్తుళ్ళు మీరు!

మంచీచెడ్డా తెల్సిన మహన్నబావుళ్ళు మీరు!

సెప్పండి మీరే సెప్పండి!

నాత్తప్పయితే సెప్పుసేతికి తీసుకోండి!

# ఎర్నీళ్ళు

కొలకలూరి ఇనాక్

డొంకలో నాలుగు తోవలు కలిసేచోట నిలబడి ఎదురుగా ఉన్న బాటమీద చూపు నిలిపి దీక్షగా చూస్తూ ఉన్నాడు చింతడు. చిల్ల కంపముళ్ళు గుచ్చుకొని గాలి అరుస్తూ ఉంది. గాలి వాలుకు వీలుగా దుమ్ములేచి వెళిపోదామని డొంకను ఊడుస్తూ ఉంది. గొంగళ్ళో వెంట్రుకలు ఏరినట్లు ఎంత దుమ్ము లేచిపోయినా, కావలసినంత దుమ్ము డొంకలో ఆవులిస్తూ ఉంది. దుమ్ము ఉంగరాలు చుట్టుకొంటూ, గింగిరాలు తిరుగుతూ చింతణ్ణే ఎత్తుకుపోదామని ఎగరేస్తున్నా వాడు కదిలితే ఒట్టు.

సూర్యుడు నడినెత్తిమీద ఉన్న సంగతి చింతడికి తెలియదు. వాడు ఎంతకీ కదలకపోతుంటూ సూర్యుడు మండిపడ్డాడు. చెవిటివాడి ముందో, గుడ్డివాడి ముందో అరిసినా దూకినా ప్రయోజనం లేనట్లే చింతడి దగ్గర సూర్యుడి ప్రతాపం పనిచేయలేదు. చింతడికి కళ్ళున్నాయి. చూపు ఉంది. అమ్మ తప్ప అన్యం కనిపించదు. చెవులున్నాయి. వినిపిస్తుంది. కానీ అమ్మ 'కన్నోడా!' అంటేనే వినిపిస్తుంది.

చింతడు చాలాసేపు నిలబడి, ఎందుకో కూర్చున్నాడు. కాని చూపు మాత్రం బళ్ళుబాటమీదనేవుంది. దృష్టి మరల లేదు. గంపెడు చీకటి నెత్తిన వేసుకొని ఉదయం అమ్మ ఆబళ్ళుబాట మీదే నడిచి పోయింది. ఆమె పొలం పోయిందని, పని ముగించుకొని వస్తుందనీ, వస్తూ కూలీ తెస్తుందని, వచ్చి వండిపెడుతుందనీ, చింతడికి తెలియదు.

అమ్మ వెళుతున్నప్పుడు చింతడు ఆవులించాడు. అమ్మ తలనిమిరి వెళ్ళి పోయింది. అన్నదమ్ముల్లేరు. తండ్రిపొరుగూరు పొలం పనులకు పోయాడు. నిద్రపోయినంతసేపు నిద్రపోయి, మెలకువ వచ్చిందగ్గర్నుంచి అమ్మవెళ్ళినబాట చూస్తూ మెల్లగా నడచివచ్చి కూడలిలో చేరాడు. ఇంట్లో ఉన్నా ఒక్కడే! వీధిలో ఉన్నా ఒక్కడే!

చింతడి వయస్సు, నాలుగేళ్ళు, అయిదారేళ్ళవాడు లాగా బొద్దుగా ఉన్నాడు. నల్లటి ఒళ్ళు. గోచీలు గొంగడి లేదు. అఖండమైన నలుపు అఖండంగా దిగంబరుడు. వాడు కదలకపోతే నల్లరాయి అనుకోవచ్చు. కూర్చున్నాడు కాబట్టి ప్రాణి.

పొద్దున్నే నిద్రలేచి కుండా, చట్టీ, మూకుడూ, ముంతా వెతికాడు అన్నీ నున్నగా కడిగితే శుభ్రమై గోడకానుకొని కూర్చున్నాయి. కుండలో నీళ్ళుంటే తాగాడు. రాత్రి ఏం తిన్నాడో గుర్తులేదు. పొయిలో పిల్లి లేవలేదు. పొంతలో నీళ్ళు వేడి కాలేదు.

చుట్టూ చూశాడు. ఎక్కడా తినటానికి ఏమీలేదు. ఉల్లిపాయా లేదు. చింతపండూ లేదు. అమ్మవస్తే అన్నం వస్తుంది. ఆకలి తీరుతుంది అమ్మ ఎప్పుడొస్తుందో చూడటానికి,

ఇల్లు వదిలి, వీధి వదిలి, డొంకలోకి పొద్దున చేరాడు. మధ్యాహ్నమయినా అక్కణ్ణుంచి కదలలేదు. అమ్మ తప్ప చింతడికి అన్యం కనిపించదు.

ఎందుకు కూర్చున్నాడో కాని, కూర్చున్నచోటు వాడికి తెలియదు, ఎందుకు చూపు మరల్చుకొన్నాడో కాని, నేల చూడటం ప్రారంభించాడు. ఎందుకు చూశాడో కానీ నేల మీద నిమ్మకాయను చూశాడు. అమ్మను చూడాలనుకొంటున్న కళ్ళు నిమ్మకాయను చూచేసరికి చుట్టూ చేరాయి.

చుట్టూ నిమ్మకాయలున్నాయి. ప్రతి నిమ్మకాయ దగ్గరా, ఉప్పూ ఎండు మిరపకాయలూ, చింతపండూ, వెంట్రుకలూ ఉన్నాయి. వెంట్రుకల పొత్తి ఎర్ర దుమ్ముకు అతుక్కు పోయింది. ఎర్రటి దుమ్ము మీద ఎర్రటి మిరపకాయల మీద పచ్చటి నిమ్మకాయ, నల్లటి వెంట్రుకల పొత్తి మీద చింతపండుముద్ద పోసిన ఎర్నీళ్ళు మరక తడారిపోయి ఉంది. ఈ మరకలు ఒకటీ అరాకాదు. అయిదారు చుట్టూ వున్నాయి.

వీటిని పెద్దవాళ్ళు చూస్తే తప్పుకు పోతారు. ఏ పరిస్థితుల్లోనూ తొక్కరు. పిల్లల్ని తొక్కనివ్వరు. తాకనివ్వటమే కాదు, చూడనివ్వరు. అది ప్రమాదానికి సూచనగా, ఆపదకు ఆనవాలుగా భావిస్తారు.

దిష్టితీస్తే అట్లా వుంటుంది. చేతబడిచేస్తే అలా ఉండవచ్చు. మంత్ర తంత్రాలు జరిపినా ఈ విధంగా ఉంటుంది. అది ఎవరికో ఉద్దేశిస్తారు. ఎవరో బలవుతారు. దిష్టి తొలగటానికి, ఆరోగ్యం బాగుపడటానికి చేసినా, ఒకరి కీడు మరొకరికి చుట్టుకొంటుందనీ నమ్మకం, చేతబడి, మంత్ర తంత్రాలు మందె జల్లటం, కీడు పూడ్చటం వంటవయినా ప్రమాదమే! నలుగురు తిరిగే చోట పోస్తే, ఎవరో ఒకరు తొక్కితే, తాకితే, ఉద్దేశించిన పని జరుగుతుంది.

పల్లెల్లో కలరా, మశూచివచ్చినా, ధూందగిలినా, ఆటలమ్మ, పెద్దమ్మపోసినా, విషజ్వరాలు వచ్చినా, ఇటువంటి ఎర్నీళ్ళు చూడవచ్చు. ఊరి మొగదల ఉన్న ఈ గుర్తులు ఆపదలకు ఆనవాళ్ళే అయినా ప్రమాదం అని గుర్తుచేసే హెచ్చరికలు కూడా, అయితే ఈ హెచ్చరికలు ఎవరికి తెలుస్తాయి? తెలిసిన వాళ్ళకు! చింతడికి ఏంతెలుసు?

ఎర్నీళ్ళ దిగ్బంధనంలో చిక్కుకుపోయాడు చింతడు. ఆమరకల్ని తొక్కాడో, తొక్కలేదోకాని, తొక్కకుండా వెలుపలికి రాలేడు. ఎవరయినావచ్చి, ఎత్తి ఇవతలకు లేపుకొని తీసుకువస్తే ఫరవాలేదుకాని, లేకపోతే తొక్కకుండా చింతడు ఇవతలకు రాలేడు.

వెలుపలికి వద్దామన్న యోచనకూడా వాడికి ఉన్నట్లులేదు. వాటిమధ్య ఉండకూడదని తెలిసినట్లులేదు. అది అపాయమని అర్థమయినట్లు అనిపించదు.

ఎండే వళ్ళు మండించనివాడిని, గాలి దుమారంకూడా కదల్చలేనివాడిని, ఏమీ తెలియని ఈ నమ్మకాలు ఏం బాగుచేయగలవు? ఎవరైనా వచ్చి, చింతణ్ణి ఎలాగైనా వెలుపలికి తెస్తే బాగుండుననిపించటం ధర్మమేకాని, నడినెత్తి చుర్రుమని, అరికాళ్ళు భగ్గుమనే చింతనిప్పులు చెరుగుతూ, పడమటి శాంబరం తోలుతున్న మధ్యాహ్నం - ఎండాకాలం - ఎవరు బయటికి వస్తారు? ఎవరూ రారు. రాలేరు. పనివాళ్ళు రావచ్చు. కూలీవాళ్ళు రావచ్చు. ఎండను మోసుకువచ్చేవాళ్ళు ఈ బండను తీసుకుపోవచ్చు. వాళ్ళు రావాలి. వచ్చేవేళ

అయింది. అమ్మకూడా రావచ్చు. వస్తే, చూస్తే, కొడుకు రేపటిబతుకుగూర్చి ఆవురుమని ఏడుస్తుంది.

చింతడికి ఆకలి అవుతూ ఉంది కడుపులో మంట తెలిసినంత స్పష్టంగా నెత్తి మీద మంట అర్థం కావటంలేదు. జ్వరం వచ్చినవాడి శరీరం మీద చీమపాకి నట్లుంది ఎండ. అమ్మ రాలేదు. ఆకలి మండిపోతూ ఉంది. అమ్మరావాలి. ఆకలి తీరాలి.

గాలి తోలుతూ ఉంది. వడగాలి ఎక్కడో సుడిగాలి రేగింది. ఉంగరాలు తిరుగుతూ, బొంగరాలు ఆడుతూ, ఆకలలములు ఆకాశంలోకి ఎత్తుకుపోతూ వస్తూ ఉంది. వీడు లేస్తాడో, కూర్చొనే ఉంటాడో అంతు తేల్చుకోటానికి చింతడి మీదికి వచ్చి, ప్రతాపం చూపి, వాడి దెబ్బకు తట్టుకోలేక, వాణ్ణేమీ అనలేక, వచ్చిన తోవనే ఉడాయించింది సుడిగాలి. పోతూపోతూ రెండు పుల్లిస్తిరాకు ముక్కలు, నాలుగు గడ్డిపరకలు, ఒక కాగితం, ఇంత దుమ్ము, చింతడి ముఖాన కొట్టిపోయింది.

చింతడు దుమ్ము దులుపుకొన్నాడు. గడ్డిగాదం తొలిగించుకొన్నాడు. విస్తరితుంపులు విసిరేశాడు. కాగితం పట్టుకొని కూర్చునే ఉన్నాడు. కళ్ళు తూలినట్లు అనిపించింది. నిద్రవచ్చినట్లు మగత. ముక్కుపుటాలు చిట్లించి చుట్టూ చూశాడు.

దూరంగా ఎండ కదలిక, నీటిజాడ, ఎండమావి. అమ్మ వస్తున్న ఆలోచన. వస్తూ అన్నం తెచ్చినట్లు, కూర తెచ్చినట్లు, వడ్డించినట్లు, అనుభూతి. ఆకలి తీరే జాడ.

చుట్టూ ఏర్నీళ్ళ మరకలు చెదిరాయి. వెంట్రుకలు లేచి గాలిలో దూరతీరాలకు ప్రయాణమై, పెట్టే బేడా పట్టుకుపోయాయి. నిమ్మకాయలు కదిలాయి. స్థానం తప్పాయి. కాని గాలిలో కలిసిపోలేదు. కొన్ని మిరపకాయలు గల్లంతు అయ్యాయి. ఉప్పు చింతపండు మాత్రం ఎర్ర దుమ్ము కొట్టుకొని అందంగా కొత్త పెళ్ళికూతుళ్ళులాగా విలాసంగా డొంక దుమ్ములో శయనితంచి చిద్విలాసం వలకబోస్తున్నాయి.

చింతడు చుట్టూ చూశాడు. సుడిగాలి పోయిం తరవాత డొంక కడిగిన గదిలాగా, తోమి తుడిచిన పాత్రలాగా, అందంగా మనోహరంగా ఉంది. చిల్ల కంపకు చుట్టుకొన్న చీదర సుడిగాలి దెబ్బకు దిక్కూ దివాణం లేకుండా పారిపోయింది. పరారయింది. ముళ్ళకంప పరమార్థం ప్రసవిస్తూ ఉంది.

చింతడు లేచి నిలబడ్డాడు. వాడి చేతిలో కాగితం ఉంది. డబ్బు కాగితం కాదు. ఉత్తి కాగితం. సుడిగాలి లొడపెట్టిన బాపతు మురికి కాగితం, దాన్ని రెండుచేతులతో పట్టుకొని పెద్ద పండితుడులాగా, పురాణం సూరి శాస్త్రుర్లు మాదిరిగా, పంచాంగ బ్రాహ్మణుళ్ళా, సరి చేశాడు. సవరించాడు. సరిదాడు.

నిలచిన చింతడు వంగాడు. సరిగా ఉన్న కాగితం డొంకలో దుమ్ములో పెట్టాడు. గాలికి కదులుతుంటే దానిమీద రాయి పెట్టాడు. అది కదలటం లేదని, లేచి పోదని, నిశ్చయంగా నిర్ణయించుకొన్న తరువాత అటూ ఇటూ చూశాడు. నిటారుగా నిలబడి చూశాడు.

నిలచిన చింతడు కదిలాడు. అటు పోయాడు నిమ్మకాయ పుచ్చుకొన్నాడు. ఇటు పోయాడు నిమ్మకాయ అందుకొన్నాడు. రెండ చేతులతో రెండేసి తెచ్చి కాగితం మీద పెట్టాడు.

చింతడు కదులుతున్నాడు. నడుస్తున్నాడు వెనక్కూ ముందుకూ తిరుగుతున్నాడు. కాగితంలో నిమ్మకాయలు చేరాయి. చింతపండు చేరింది. మిరపకాయలు చేరాయి. ఉప్పు చేరింది. కాగితం నిండింది.

డొంకలోని చింతడులాగా కాగితం మీది నల్లరాయి కూర్చుని ఉంది. సుడిగాలికి చుట్టూ అటూఇటూ అవీఇవీ చేరిన చింతడిలాగా నల్లరాయి వాటినీవీటినీ దులుపుకొంటూ వుంది.

ఆకాశంలో మండిన ఎండ నేలను కాలుస్తూ ఉంది. పొలిమేరలో పుట్టేగాలి ఊరూవాడా ఏకం చేస్తూ ఉంది. చిల్లకంపకు ఎండా, వడగాలీ, ఉడుకు పుట్టిస్తున్నాయి.

దూరంగా అమ్మ వస్తుందన్న ఆచూకీ తెస్తున్న ఎండమావి గాలి గుర్రం మీది చేతగాని రౌతులాగ దౌడుతీస్తూ ఉంది. చింతడు ఆకాశంలోకి చూచి సూర్యుడున్నాడని గుర్తించాడు. బళ్ళుబాటమీద రాబోయే అమ్మకోసం సుదూరం చూచే చూపుకు ప్రాణప్రతిష్ఠ కావించాడు చింతడు.

కాగితం మీది రాయి తీసి ప్రక్కన పెట్టి, కాగితం నలుమూలలు కలిపి పట్టుకొని, పైకెత్తి, ఒక చేతిలోకి మార్చుకొని, కింద పెట్టి రాయి మరొక చేతి లోకి తీసుకొని, అమ్మ వచ్చే డొంక వైపుతేరిపార జూచి, వెనుదిరిగి, ఇంటితోవ పట్టాడు చింతడు.

మళ్ళీ వెనుదిరిగి చూడలేదు. అమ్మరాలేదు. ఎండవచ్చింది. గాలి వచ్చింది. అమ్మ రాలేదు కానీ, వెంట, గాలి వచ్చింది. ఎండవచ్చింది.

ఇంటి ముంగిట రాతి రోలు దగ్గర చింతడు ముందు రాయి పెట్టాడు. తర్వాత కాగితం పొట్లం ఉంచాడు.

పాకలో ఈత చాప మీద నల్లరాయి లాగా పడి నిద్రపోతున్న చింతణ్ణి సూర్యుడు కనుమరగవుతున్నప్పుడు అమ్మ లేపింది. ఎండ లేదు. వడగాలి లేదు. సుడిగాలి రాదు. చల్లగాలి తోలుతూ ఉంది. అమ్మకంట చూపు వెన్నెల వచ్చింది.

చింతడు ఆవులిస్తూ లేచి, అమ్మను చూచి, మెడ వాటేసుకొని, నడుం మీదికి ఎక్కి, అమ్మ ముఖంలోకి చూస్తూ, సర్రున జారి, మూలకు పోయి ముంత తెచ్చి, అమ్మ మూతి కందించాడు.

'ఇదేందిరా?' అంది అమ్మ.

'నీమలసం!' అన్నాడు చింతడు దీర్ఘాలు తీస్తూ.

'మరి నీకో?'

'తాగా!'

'ఎక్కడిదిరా?'

'తాగు'

అమ్మ ముంతెడు నిమ్మరసమూ ఆపకుండా తాగి చింతణ్ణి ఎత్తుకొని చిల్లర కొల్లరుగా చిక్కురొక్కురుగా పెట్టినచోట పెట్టకుండా గంపెడు ముద్దులు పెట్టింది.

# పాపం కుంటేలుగాడు

పులికంటి కృష్ణారెడ్డి

కుంటేలుగాడు కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు.

తనలాంటివాళ్ళువి కండ్లు కావు. ఆ కండ్లల్లో కారేదీ కన్నీళ్ళు కావు. ఆ సంగతి వాడికి తెలుసు.

అందుకే తన ఏడుపును వాడు గుండెలకే పరిమితం చేసుకుని ఏడుస్తున్నాడు.

కుంటేలుగాడి బాధ కుంటేలుగాడికే తెలుసు.

వాడి బాధను యితరులు పసికట్టారంటే -''ఒరే కుళ్ళుబోతు నా కొడుకా! ఇదేం పాడు బుద్ధిరా నీకు ? ఇట్లా ఎవుడైనా ఆలోచిస్తాడా? పోనీ, ఆలోచించినా యిట్లా పనిచేస్తాడా? చేసుకున్నోడికి చేసుకున్నంత! చేజేతుల చేసుకునిందానికి అనభవించక తీర్తిందా?'' అని చెప్పి దెప్పి పొడస్తారు.

అందుకే వాడు లోలోపల కుమిలి కుమిలి ఏడుస్తూనే ఉన్నాడు!...

అదొక పల్లె!

ఎక్కడుందా పల్లె అంటే? - రాయలసీమలో ఉంది. రాయలసీమ అంటే? రత్నాలసీమ. ఇంగువ కట్టిన గుడ్డగా మిగిలిన ఆ రత్నాల సీమ విసిరేసిందాపల్లెను. చీమలు దూరని చిట్టడవుల కవతలికి. ఆ కసితో అత్తమీద కోపాన్ని దుత్త మీద చూపినట్లుగా ఆపల్లె ఒక్క తన్ను తన్నిందా వాడను పరుగు దూరానికి. ఆ వాడ మెడబట్టి మెత్తగా నెట్టిందా గుడిసెను వాడ చివరకు!

రత్నాలసీమలో అది ఒక గుడిసె!

'ఎట్లా ఉంటుందో?'అని ఆశ్చర్యపడుతున్నారేమో? ఏముంది? నాలుగు రాతి కూసాలు. నాలుగు నాలుగు ఎనిమిది లేకపోతే ఎనిమిది ఎనిమిది పదహారు వాసాలు. రెండుమోపుల తాటి మట్టలు. కాకుంటే టెంకాయ కీతులు. వాటికి నోచుకోకపోతే రెండు వాదెల బోద కసువు. రాతి కూసాల్ని సిమెంటు పిల్లర్స్ అనుకుంటే ఆ పిల్లర్స్‌ను కలుపుతూ చుట్టూ మట్టిగోడ పెట్టే అది గుడిసె! రత్నాలసీమకే జాతిరత్నం!

అట్లాంటి గుడిసెలో మాకడు, మంగ దాదాపు పదేండ్లు సరసాలాడిందానికి సాక్షి! కుంటేలుగాడు.

మాకడు ప్రతిదినము తూర్పున పట్టమెగరక ముందే నిద్రలేస్తాడు. మంగ మాత్రం

యింకా ఆ కుక్కిమంచానికే అతుక్కొని అట్లా యిట్లా పొర్లాడుతూ ఉంటుంది. గుడిసె ముందర నాల్గు తడికెల్ని అడ్డదిడ్డంగా కట్టే అది పెరడు. ఆ పెరట్లో ఒక బాన. ఆ బానలో రాత్రి తెచ్చిపోసిన నీళ్లు గుక్కెడు నోట్లో పోసుకొని పుక్కిలించి ఊస్తాడు. గుడిసెలో 'ఎనుగాడి'కి వేలాడుతూ ఉట్టి. ఉట్టి మీద ఒక చట్టి. ఆ చట్టిలో రాత్రి మిగిలించిన రెండు పిడికిళ్ళ మెతుకులు. ఆ కూటిలో పోసిన నీళ్లు - కూట్నీళ్లు! పిడికెడు మెతుకుల్ని పిడిచి ముంతలో వేసుకొని రెండు దోసిళ్ళ కూట్నీళ్లు వంచుకుంటాడు. ముంతను మూడుచుట్లు తిప్పి గొంతులో పోసుకుంటాడు.

అప్పుడు లేచి మంగ సంకటి చిక్కాన్ని చేతికందిస్తుంది. ఆ చిక్కాన్ని చంకలో తగిలించుకొంటాడు. కత్తి చేతబట్టి అడవికి బయలుదేరతాడు.

మధ్యాహ్నానికి నిలువెత్తు కట్టెలమోపుతో తిరిగి వస్తాడు.

ఆ కట్టెల మోపును ఆ పల్లెలోనో, పల్లెకు పరుగు దూరాన పేట లోనో అమ్ముకొంటాడు. మంగను కడప దాటనీకుండా గుట్టుగా కాపురం చేస్తున్నాడు.

ఒకనాడు మాకడు పుట్ట మీదెక్కి కట్టెలు కొట్టుకుంటున్నాడు. ఎక్కడ మాటేసి ఉన్నిందో ఒక పాము కాటేసి పోయింది. అక్కడికక్కడే నురుగులు కక్కుతూ 'హరీ!'మన్నాడు మాకడు.

అప్పుడు కూడా యిట్లా కుమిలికుమిలి యేడవలేదు కుంటేలుగాడు!

కడపదాటనీకుండా కన్నుల్లో పెట్టి కాపాడుకుంటూ వుండిన మొగుడు పాము వాత పడేటప్పటికి మంగ మంచం వాత పడింది. ఒక్కగానొక్క నలుసు కుంటేలుగాడు. వాడికోసం ఎంత తొందరగా దిగాల్నో మంచం అంత తొందరగా దిగాలనుకొనింది. దిగింది. ఏడాది తిరగక ముందే దిగింది - అయితే పాడె మీదికి.

అప్పుడు కూడా కుంటేలుగాడిట్లా కుమిలి కుమిలి యేడవలేదు!

తండ్రి చనిపోయినాడు. తల్లీ చచ్చిపోయింది. కడుపులో ఆకలి మాత్రం చావలేదు. బతుకుమీద ఆశ చావలేదు. ఈ స్థితిలో ఆ వయసులో ఎవ్వరైనా చేసేది! చేయగలిగేది! ఒక్కటే పని. చేయి చాపడం. అయితే కుంటేలుగాడు చేయి చాపలేదు. చేతికొద్దీ కష్టపడినాడు. ఆ ఊళ్ళో ఎవరేపని చెప్తే ఆ పని చేసినాడు. పెడ్తే తిన్నాడు. పెట్టకపోతే పస్తులుపడుకొన్నాడు.

అప్పుడు కూడా కుంటేలుగాడిట్లా కుమిలి కుమిలి యేడవలేదు.

ఒకనాడు మిట్టమధ్యాహ్నం కుంటేలుగాడు గుడిసింటి గోడకానుకుని కూర్చున్నాడు. ఆ ఎండపూట ఎందుకో వాడికి తెలియకనే వాడి వొంటిమీద వాడికి చూపు పడింది. ఒళ్ళు కాస్త కిందపడినట్లుంది. పిల్లిగడ్డం మొలిచింది. సన్నగా మీసకట్టు కూడా ఏర్పడింది. 'ఇంకా వంగి వొకడి మోసే కింద నీళ్లు తాగాల్నా?' అనుకొన్నాడు. ఆ తలంపుతో వాడి పెడి బిర్రు తన్నింది. చూపులు గుడిసింటిని కలియచూసినాయి.

చూస్తే ఏముంది?

చూరులో చెక్కిన మచ్చుకత్తి. గుడిసింటి 'ఎనుగాడి'కి తగిలించిన చిక్కం. ఈ రెండు

తండ్రి తన కోసం నిలబెట్టిన ఆస్తిపాస్తులు. బాల్యంలోనే తండ్రిని పోగొట్టుకుని సింహాసనానికి వారసత్వాన్ని సాధించిన బాలమొగలాయి చక్రవర్తిలా కుంటేలుగాడు దీనంగా పైకిలేచినాడు. చూరులో కత్తిని ఒరనుండి లాగినట్టు లాక్కొన్నాడు. గుడిసె ముందర కూర్చుని ముష్టికొమ్మమీద సన్నని యిసుక పోసి నూరినాడు. కత్తి వాదరను ఎడమచేతి బొటనవేలితో తడిమి చూసినాడు.

కత్తి మంచి పదునుమీద ఉంది!

కుంటేలుగాడు అడవిలో చొరబడినాడు. వాడి చేతిలో మాకులు మోడులవుతున్నాయి. కత్తిచేత పడ్తే వాడికి కన్నూమిన్నూ తెలియడం లేదు. ఒకానొకదినం ఆ కన్నూమిన్నూ తెలియని దశలో కత్తిజారింది. కాలి బొటనవ్రేలు కసక్కుమని తెగింది. తెగిందంటే అట్లాయిట్లా కాదు. కొమ్మనుండి విడివడిన రెమ్మలా వేరయింది. అమ్మా నాయన అల్లారుముద్దుగా పెట్టుకొన్న మునిగాడి పేరును 'ఎనుగాడి' కెక్కించి ఊళ్ళో వాళ్ళంతా 'కుంటేలుగాడు!' 'కుంటేలుగాడు!' అన్నారు.

అప్పుడు కూడా కుంటేలుగాడిట్లా కుమిలి యేడవలేదు.

కుంటేలుగాడికి కాలివేలు కుంటయినా కాళ్ళున్నాయి. ఆ కాళ్ళమీద నిలబడే శక్తి ఉంది కుంటేలుగాడికి చేతులున్నాయి. ఆ చేతుల్లో శ్రమశక్తి ఉంది. కుంటేలుగాడికి కడుపు ఉంది. తన శ్రమశక్తితో కడుపు నిండుతూ ఉంది.

కుంటేలుగాడికి మనస్సు ఉంది. ఆ మనస్సుకు కోరికలున్నాయి.

ఒకనాడు కుంటేలుగాడు గుండెల్లో కోర్కెల్ని ముడేసుకొన్నాడు. ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు. దినానికొక్క రూపాయి బిళ్ల వంతున దొంతిలోని అడుగు కడవలో దాచిపెట్టిన రూపాయి బిళ్లల్ని మూటగట్టుకున్నాడు. ఆ మూట నెత్తి భుజాన పెట్టుకున్నాడు. నేరుగా మన పెద్ద యింటికి నడిచాడు. అప్పుడు పెద్ద యింటిముందర వాకిట్లో మంచంమీద కూర్చుని ఊరి పెద్దలతో మంతనాలాడుతున్నాడు కుంటేలుగాడు. భుజాన మూటదించి పినపెద్ద ముందర పెట్టినాడు.

''ఏందిరా అది కుంటేలూ?'' ఆప్యాయంగా అడిగాడు పినపెద్ద.

''ఒలి మాఁవా!''

''గేలి చేస్తుండావా?''

''లేదు మాఁవా!... నన్నొక యింటోణ్ణి సెయ్యమని అడుక్కొంటుండా!''

ఆ మాట చెవిన పడకతానే పకపక నవ్వాడు పినపెద్ద.

''ఒరే! వాలిస్తే పొట్టా! దించితే నూకా? పాఁవుండాదిరా నీకు? అందులో కుంటేలుగాడివి. నీకెవురిస్త్రారా పిల్లను?''

పినపెద్ద మాటతో ఊళ్ళో పెద్దలు నవ్వొందుకొన్నారు. ఇల్లెగిరిపోయేటట్టు విరగబడి నవ్వుతుండారు.

అప్పుడు కూడా కుంటేలుగాడిట్లా కుమిలి కుమిలి యేడవలేదు!

ఒకానొక రోజు ఒకానొక వేళకాడ పినపెద్ద ముద్దుల కూతురు చెంగి వంచిన తలెత్తకుండా యిల్లు విడిచి నడిచింది. ఊరి చివర గుడిసెలో దూరింది. కుంటేలుగాడి ముందర నిలబడింది. వంచిన తలెత్తకుండానే, 'బొట్నేలు తొక్కి బొట్టు కట్టు మాఁవా!' అనింది.

కుంటేలుగాడు ఎర్రోడి మాదిరి ఎగాదిగా చూచినాడు. ఎట్లా చూచినా ఎదట నిలబడింది పినపెద్ద కూతురు 'చెంగే!' అని తేలేసరికి తెల్లమొగం వేసినాడు. ఎగిరిపడి ఏడడుగులు వెనక్కు జరిగినాడు. అక్కడ నిలబడి అటు ఇటు కలియ చూచినాడు. నిజంగా అది తన గుడిసే! కలా? నిజమా? అని కలవరపడిపోతున్నాడు.

వేపపువ్వు గుమ్మడి పువ్వంత పెద్దది కాదు. రోజా పువ్వంత అందమయినదీ కాదు. సంపెంగ పువ్వంత నాజూకయినదీ కాదు. విప్పపువ్వంత మత్తయినదీ కాదు. అయితే యేది చూచి తుమ్మెద ఆ చేదు పువ్వు చుట్టూ పరిభ్రమిస్తుంది?

ఈ రహస్యం అర్థం కాకుండా కుంటేలుగాడు అయోమయంగా చూస్తాంటే - అందంగా నవ్వుతూ ఉంది చెంగి!

కత్తిబట్టిన చెయ్యి తాళి పట్టుకోవడానికి తటపటాయిస్తుంటే- 'నీ ప్రాణానికి నా ప్రాణం వుండాది మాఁవా?' అనింది.

పందిళ్లు లేవు. ఆ పందిళ్ళకు పచ్చని తోరణాలు లేవు. మేళతాళాలు లేవు. ఆకాశవాణి సాక్షిగా... భూదేవి సాక్షిగా... సూర్యచంద్రుల సాక్షిగా... సురులు ముక్కోటి దేవతల సాక్షిగా అని చెప్పడానికి పదిమంది పెద్దలు లేరు. వాళ్లకు పప్పన్నమూ లేదు.

తడబడుతున్న చేతులతో కుంటేలుగాడు చెంగి మెడలో మూడుముళ్లు వేసినాడు. మనిషిలో తడబాటే కానీ మనస్సులో లేదు. మూడుముళ్ళు గట్టిగా పడినాయి.

పినపెద్ద తోకతొక్కిన త్రాచులా పైకి లేచినాడు. వాడవాడంతా ఒకటై పినపెద్ద వెంట నిలబడింది. అది చూచి చెంగి కుంటేలుగాడు ముందర నిలబడింది, కండ్లలో నిప్పులు కక్కుతా... పండ్లు పటపటా కొరకతా... పైటకొంగు

ఈడ్చి నడుఁవున చెక్కి కాళికామ్మోరులా నిలబడి 'నా మాఁవ మింద సెయ్యిపడాలంటే నా శవం మింద మీరు నడిసిపోవాల్సిందే!' అని సవాలు చేసింది. ఇంట్లో గురుగు పువ్వులా పెరిగిన అమ్మాయి పులిపిల్లలా గాండ్రించేసరికి పిన పెద్ద పిల్లయినారు. పిన పెద్దే పిల్లయ్యేసరికి వాడ మెడలు వాల్చింది.

కుంటేలుగాడు తల పైకెత్తినాడు.

ఇప్పుడు కుంటేలుగాడి కండ్లకు కాంతి వచ్చింది.

కత్తికి పదును వచ్చింది. ఆ రోజు కూడా తూర్పున పటమెగిరింది. అయితే ఏదో కొత్తగా ఉంది.

కుంటేలుగాడు కత్తిచేతి కందుకున్నాడు. చెంగి సంకటి చిక్కాన్ని చంకకు తగిలించుకొనింది. రాముడి వెంట అడవికి బయలుదేరిన సీతమ్మలా 'పదమాఁవా!' అని

అనింది.

''నువ్వెక్కడికే?'' అన్నట్లు వింతగా చూచినాడు కుంటేలుగాడు.

చెంగి ఆ చూపుల్ని చదవగలిగింది.

''నీతో గూడా నేనూ ఒక మోపు కట్టెలు తెస్తాను మాఁవా! యేన్నీళ్ళకు సన్నీళ్ళు తోడయినట్లుంది గద మాఁవా!''

''ఒసే పిచ్చిదానా! నేను బతికుండగా నీ తల్లో పువ్వులు పెడ్తాను గానీ, తలమింద కట్టెల మోపు పెట్తానంటే?''

ఆ మాట వింటానే చెంగి అట్లానే వాడి ఎద మీద వాలిపోయింది. వాలిపోయిన చెంగిని వాడట్లానే గుండెలకు హత్తుకొన్నాడు.

''ఎదమింద ఎదబెట్టి కతల్జెప్తా పొణుకోవాలంటే పెట్టి పుట్టుండాల. కన్నగసాట్లు పడి కట్టెలు తెస్తేనే కడుపునిండేది. ఇట్లా వుండే దానికి మన బోటోళ్ళకేడే కుదిరితింది?'' అని గుండెలు కూడ పలుక్కొన్నట్లుంది. రెండు నిమిషాలు అనుభూతిలోనే ఆ గుండెలు బరువెక్కినాయి. బాధ్యత అట్లాంటిది మరి?

చెంగి చంకలో చిక్కాన్ని చేతికందుకున్నాడు కుంటేలుగాడు.

''కట్టెలు లేకపోతే పొయ్యింది. నేను కూడా నీతో అడివికి వస్తా మాఁవా!''

''ఈపూట నేనడివికి పోబొయ్యేదిలేదే!''

''ఎందుకు మాఁవా? నేను కూడా వస్తానన్నాననా?''

బదులు చెప్పకుండా కుంటేలుగాడు చిక్కాన్ని చిలుక్కు తగిలించినాడు. కత్తి చేతిలోనే ఉంది. గుడిసె దాటి బయటికి నడిచినాడు. ఇంతకు మునుపు ఎప్పుడూ చూడనట్లు గుడిసెను చూస్తా నిలబడినాడు.

చెంగి యింతింత కండ్లతో వాణ్ణిచూస్తూ నిలబడింది.

కుంటేలుగాడు కత్తి నటుయిటు తిప్పి చూచుకొన్నాడు. వాడి పెదాలు కోడి కత్తుల్లా వంపులు తిరిగినాయి. ఆ వంపుల మీద కెంపులు పూసినాయి. అంతే ! గుడిసింటి చుట్టూ మొలెత్తు పైగా పెరిగిన ముండ్ల పొదల మీద పడినాడు. రెండు బార్ల పొద్దెక్కేటప్పటికి గుడిసింటి చుట్టూ సుద్దంగా చదరమయింది. అప్పుడంత బొగ్గు నోట్లో వేసుకొన్నాడు. కరకరనమిలి రెండుసార్లటు యిటు తిమిడినాడు. అంత తొందరగానే మొగం కడుక్కొన్నాడు. తలకు చుట్టుకొన్న తువ్వాలు గుడ్డ విప్పి మొగం తుడుచుకుంటున్నాడు.

మొగంలో చిరునవ్వు పువ్వులు పూస్తుంటే చెంగి ముంతలో సద్ది కలిపి చేతి కందించింది. తాగినాడు. గుడిసింట్లో మంచాన్నెత్తి వాకిట్లో వేసుకొన్నాడు.

కుంటేలుగాడు మంచం దారాల్ని బిగిస్తున్నాడు.

చెంగి పొయ్యి మీద ఎసరుబెట్టి మూకల్లో రాయీ రప్పు ఏరిపిస్తా ఉంది.

పొద్దు నడిమిట్ట కెక్కింది.

కుంటేలుగాడు మూరడుతుంటకట్టె చేతికందుకున్నాడు. మంచానికి పట్టిన దుమ్ముధూళీ వదలిపోవడానికి ఆ కట్టెతో దారాల మీంద తట్టుతుంటే 'టంగ్‌టంగ్'మిన శబ్దం వస్తూ ఉంది. ఆమీదట మంచం మీదికి వంగి రెండు చేతులతో మంచం దారాల్ని కిందకు అదిమినాడు. అదిమినంత వరకు కిందకివెళ్లి వదిలితే మళ్ళీ పైకొస్తున్నాయి దారాలు ఫోమ్‌బెడ్‌లాగా! తృప్తిగా నవ్వుకొన్నాడు.

చెంగి కెలికిన సంకటి ముద్దలు పొగలు కక్కుతున్నాయి.

కుంటేలుగాడు మంచాన్నెత్తి గుడిసెలో వేసినాడు. ఆ మంచం మీద యిద్దరు ఎదురెదురుగా కూర్చున్నారు. ఇద్దరి మధ్యలో ఒకటే కంచం - యింకొక్క కంచం కొనుక్కునే వరకు. ఆ కంచంలో యింతకు మునుపు అయిదేళ్ళే! ఇప్పుడీయిదయిదు పదేళ్ళు అనుకోనట్లుగా పెనవేసుకుంటున్నాయి. పెరుకులాడుకొంటున్నాయి. పెరుక్కొన్న ముద్దను యింకొకరికి పెడుతున్నాయి. రెండు గుండెలకు నాలుగు జన్మాల అనుభూతి!

కుంటేలుగాడు పైకి లేచినాడు. కత్తి చేతికందుకున్నాడు. బయటికి నడిచినాడు. రంగి అట్లానే ఆ మంచం మీద వాలింది. దాని మనసు పూలపల్లకీలో తేలినట్లు తేలిపోతూ ఉంది.

''చాటడు వడ్లు ఆరబొయ్యచ్చు. నా మాఁవ గుండెల మింద, మూట నూగులు ఒక మూలకు సాలవు నా మావ యీపు మింద, మహామహామాకులే పెళపెళా నేలకొరిగిపోతాయి నా మాఁవ సేతి ముందర. అందరూ మహా సక్కనైనోళ్ళయినట్టు నా మాఁవను 'కుంటేలుగాడు'కుంటేలుగాడు!!'అంటారే!- ఒక యేలు కుంటిదయితే అయింది. మణుసు కుంటిది గాదులే!''

సద్దిలో ఊరుబిండి నంజుకున్నంత కమ్మగా సాగిపోతుంటే ఆలోచనలు చెంగికి ఎప్పుడు కంటి మీద రెప్పపడిందో తెలియదు.

'దప్'మన్న శబ్దంతో ఎగిరిపడి లేచింది. చూస్తే మొయ్యలేంత బందారాకు మోపు గుడిసె ముందరేసినాడు మాఁవ ఎందుకో? ఏమో? అనుకుంటూనే ముంతలో నీళ్ళు తెచ్చి యిచ్చింది. ముంత చేతికందుకున్నాడు. అటువంటి సమయాల్లో మునుపెన్నడూ చేతికందని అనుభవం, తియ్యని అనుభూతి, మురిపెంగా చూస్తూ ఒక్క గుక్కలో ముంతడు నీళ్ళు ఖాళీ చేసినాడు. ముంతను చెంగి చేతికిచ్చినాడు. బందారపు మోపు విప్పినాడు పెరట్లో తడికెలకు చీమలు దూరనంత చిక్కంగా చెక్కినాడు.

మాఁవ మణుసు పసిగట్టిన చెంగి ముసి ముసిగా నవ్వుకొనింది.

ఆ తరువాత కుంటేలుగాడు అటుయిటు చూచి పాత సంచి పట్టనొకటి చేతికందుకున్నాడు. చీలికలు పేలికలుగా చింపుతున్నాడు. 'ఈ మణిసి కేఁవన్నా పిచ్చిగిచ్చి పట్టిందాబ్బా?' అని ఆశ్చర్యంగా చూస్తూ ఉంది చెంగి. చింపిన గోనెపట్టా పీలికల్ని చేతికెత్తుకున్నాడు. గుడిసింటి తలుపు సందుల్లో కూరుతున్నాడు.

చెంగి కిలకిల నవ్వుతూ ఉంది.

''నవ్వితే నవ్వుకో! నాకేం(వి)'' అన్నట్లుగా ఎర్రమట్టిని గొజ్జుగొజ్జుగా కలుపుకొన్నాడు సందులకు కూరిన సంచిపట్టల మీద పూసినాడు మట్టిరంగు తలుపుచెక్క రంగు దాదాపు ఒకటిగా కలిసిపోయినాయి. తలుపు మూస్తే చిమ్మచీకటి.

అమాంతంగా వాటేసుకొని ముద్దులలో ముంచెత్తింది చెంగి!

కన్నవాళ్ళు కన్నెత్తి చూడడంలేదు. వాడలో వాళ్ళు నీడపడితే నిప్పులు కక్కుతున్నారు. అయినా వాళ్ళకు చీమ కుట్టినట్లనిపించలేదు. 'నాకు నువ్వు, నీకు నేను, మనకు మనం, మనమే లోకం!' అనుకొంటున్నారు.

ఈ తృప్తిలో ఆనందంలో ఏడాది గడిచింది.

చెంగినీళ్ళు పోసుకుంది.

కుంటేలుగాడి కుశాల అంతా యింతా కాదు. కనపడిన పుట్టకు, చెట్టుకు రాతికి రప్పకు మొక్కుతున్నాడు. 'రొండూ రొండట్టాయేరుజేసి తల్లీ బిడ్డను సల్లంగా కాపాడు సాఁవీ!' అని ముడుపులు కడుతున్నాడు.

చెంగి నీళ్లాడింది.

పుట్టింటివాళ్ళు పురుడు పొయ్యడానికి రాలేదు. కాళ్ళావేళ్ళా పడి బ్రతిమిలాడినా వాడలో మంత్రసాని మెడ మూడు తిప్పులు తిప్పింది.

పండంటి మగబిడ్డను చేతికిచ్చి చెంగి చెయ్యిజారిపోయింది.

అప్పుడు కూడా కుంటేలుగాడిట్లా కుమిలి కుమిలి ఏడవలేదు.

వరదకిప్పుడు ఆరేడ్లు. ఈ ఆరేండ్లల్లో కుంటేలుగాడి తిప్పలు వాడికే తెలుసు.

ముంతడు నీళ్ళతో ఒళ్ళు కడిగేవాటం తెలియదు. గుక్కెడు పాలు తాగిపించే వైనము తెలియదు. బ్రతిమిలాడినా పినపెద్ద మాటకు భయపడి వాడలో పలికే దిక్కు లేదు. ఈ పల్లె ఆ పల్లె తిరిగి కొంతకాలం ఆవుపాల తెచ్చి పోసినాడు. ఆవుపాలు దొరక్కపోతే పేటకు పొయ్యి బుడ్డీపాలు దెచ్చి పోసినాడు. పొద్దస్తమానము బతుకు వాడితోనే సరిపోతూ ఉంది. గుడిసింట్లో వాడితోనే కూర్చుంటే కడుపు ఊరికే ఉండమంటే ఉంటుందా? ఒక్క చంకలో చిక్కం. యింకొక చంకలో వరదండుగా అడవికి బయలుదేరేవాడు. అక్కడ యే చెట్టు కొమ్మకో పైగుడ్డతో ఉయ్యాల కట్టేవాడు. ఆ ఉయ్యాల్లో వరదణ్ణి పడుకోబెట్టేవాడు. తాను అడవిమిందపడేవాడు. కొమ్మమిందకు కత్తిపడేకుందికి 'క్యార్' మని అరుపు. ఆ ఏడుపు చెవిని పడేసరికి పరుగుల మింద వచ్చేవాడు. బిడ్డను చేతికందుకొని సుతారించేవాడు. మళ్ళీ పడుకోబెట్టి వెళ్లి కత్తి చేతికందుకొంటే - రెడ్డొచ్చే మొదలాడు వ్యవహారమే. ఒక్క మోపు కట్టెలు కొట్టుకునే కుందికి ఒక్కొక్కరోజు పొద్దు గూట్లో పడేది. ఈ బతుకింకొద్దురా తండ్రీ అనిపించేది.

అప్పుడు కూడా కుంటేలుగాడిట్లా కుమిలి కుమిలి యేడవలేదు.

ఒకనాడు పొద్దు తిరుగుతున్న వేళ. అందాక యేడ్చి యేడ్చి వరదుడప్పుడే అట్లా కన్నుమూసినాడు. అదే అదననుకొన్నాడు. వాడు లేచేటప్పటికి ఎట్లయినా మోపు కట్టెలు

కట్టుకోవాలనుకున్నాడు. కత్తి చేతికందుకున్నాడు. ఆదరాబాదరా కట్టె కొట్టుకుంటున్నాడు.

ప్రతినెలా కుంటేలుగాడు కొంత మొత్తాన్ని ఫారెస్టువాళ్ళకు మామూలు కింద ముట్టజెబుతున్నాడు. అందువల్ల ఫారెస్టు గార్డు కానీ, వాచర్ కానీ వాడి జోలికి రారు. అయితే ఆ రోజు ఉన్నట్టుండి స్పెషల్ బీటోళ్ళు వచ్చినారు. వాళ్ళు కనుచూపుదూరంలో కనిపించగానే పారిపొయ్యేవాడే. పరుగెత్తినంత దూరంలో పరుగెత్తి ఏ చెట్టు చాటునో, ఏ పుట్టమాటునో లేదా ఏ పొదమాటునో తలదాచుకుంటే పట్టుకొనేదానికి వాళ్ళబ్బతరంగాదు. కానీ పిల్లవాడొకడున్నాడు. వాడి మాట తలచుకొంటూ, 'ఏం చెయ్యాలా' అని తటపటాయిస్తుంటే వాళ్ళు ఒక లగువులోవచ్చి అదుముకొన్నారు. 'నడు స్టేషన్'కన్నారు. కాళ్ళావేళ్ళాపడి బతిమిలాడితే, 'ఈవెధవనంతదూరం తీసకపోవడమెందుకు?' అంటూ రెక్కలు విరిచి చెట్టు గట్టి గొడ్డను బాదినట్టు బాదినారు. ఆ రంపుతో వరదడు ఎగిరిపడి లేచినాడు. వాడు ఆరున్నొక్కరాగాన్ని ఆలపిస్తుంటే 'నీ చావు నువ్వు చావు నా కొడకా!' అంటూ 'స్పెషల్ బీటోళ్ళు' వెళ్ళిపాయ్‌నారు.

ఏడుస్తున్న బిడ్డను ఓదార్చవలెనని 'తండ్రి. తండ్రి రాలేదే' అని బిడ్డ నడిమిట్ట మండుతున్న సూర్యుడిలా వాళ్ళ గుండెలు మండుతున్నాయి. కుంటేలుగాడు చేతులకు కట్టిన కట్లు తెంపుకోవాలని లాడుతున్నాడు. తీసి కాస్తున్న ఎండ సూదులతో పొడిచినట్టు పొడుస్తూ వుంది. చేతులకు కట్టిన కట్లు పెనుగులాడుతుంటే కత్తితో కోసినట్లు కోతలు పెడుతున్నాయి. అయినా కుంటేలుగాడు వదలలేదు. పెనుగులాడి పెనుగులాడి తుదకెట్లో తెంపుకొన్నాడు.

ఒళ్ళంతా వాతలు. ముంజేతులంతా రక్తమయం. ఆ ఎండ పొద్దులో ఏడ్చి ఏడ్చి వరదడు గుక్క తిప్పుకోలేకుండా సొమ్మసిల్లి పడిపోయేవాడు. ఇంతకాలం కడుపుకు కూడ బెట్టిన కత్తి చేజారిపోయింది.

అప్పుడు కూడా కుంటేలుగాడిట్లా కుమిలి కుమిలి యేడవలేదు!

''మా అయ్య కట్టెలు గొట్టే బతికినాడు. పాము వాత పడ్డాడు. మా అమ్మ కూడ పొయ్యింది. నేనూ కట్టెలు కొట్టా వుండా! నట్టింటికి నడిసొచ్చిన లచ్చిమి నాకు లేకుండ పొయ్యింది. పచ్చని సెట్టు కొట్టే బతుకులు పైకెక్కి రావంటారు. నిజమేనేమో?''

కుంటేలుగాడి మనస్సులో చిత్రంగా మెదిలిందీ తలంపు.

ఆ రోజు నుండి వాడు కత్తి పట్టలేదు.

అప్పుడు వాడి దృష్టి గవర్నమెంటోళ్ళు తన తండ్రికిచ్చిన అయిదెకరాల పోరంబోకు నేల మీద పడింది. తన మాదిరి తన కొడుకు కట్టెలు కొట్టి బతకకూడదనుకొన్నాడు. వారంలో నాలుగురోజులు కూలికిపోతున్నాడు. ఆ కూలి డబ్బుల్లో అంతో యింతో మిగుల్చుకుంటున్నాడు. ఆ మిగిలింది తింటూ మిగతా మూడు రోజులు తన పొలంలో చెట్టూ చేమా కొట్టి మిట్టాగట్టలో పోరాడుతున్నాడు.

నెలలు తిరగకముందే నేల దువ్వినా తలలా దివ్యంగా తయారయింది. అందులో పంట

పెట్టాల. పంటపెట్టాలంటే నీళ్ళుకావాల. నీళ్ళు కావాలంటే బావి కావాల. బావి కావాలంటే దుడ్డు కావాల. అదే యిబ్బంది.

పోనీ, ఏదైనా మెట్టుపైరు వేద్దామంటే వానలు కురవాల.కుంటేలుగాడు నెలలు తరబడి చెవుటోడ్చి చదును చేసిన భూమి వైపు చూస్తాడు. అటుపైన ఆకాశం వైపు ఆశగా చూస్తాడు. ఎక్కడా మబ్బుతునక కనిపించదు. అట్లా చూచిచూచి వాడి గుండెకరిగి నాలుగు కన్నీటిబొట్లు రాలుతున్నాయి. కానీ, మేఘం మాత్రం కరగడం లేదు.

కట్టెలమ్మి బతుకుతున్నపుడు వాడికి చీకూ చింతా లేదు. కట్టెలు తేవడం అమ్మడం తినడం ఇప్పుడు తనకంటూ కాసింత ఆస్తి యేర్పడే సరికి అన్నీ ఆలోచనల్నే! --

''ఎట్టయినా సరే! బూఁవిలో బాయి తవ్వుకోవల్ల. ఆ బాయికి కరెంటు మిసిను పెట్టుకోవల్ల.''

రేత్రింబొగుళ్ళు ఆ పొలంలోనే పడి పొర్లాడల్ల, ఏడాదికి యిరుగొర్లు పంట పెట్టాల. మూడంకణాల పూరిల్లయినా యేసుకోవాల. వరదడు దొరమాదిర కూసోని తినాల!''

ఇట్లా సాగిపోతున్న వాడి ఆలోచనలకు వత్తాసు పలికిందొక్క సంఘటన!

వాడకు పరుగుదూరంలో వున్న ఆ ఊరు ఆ పాయకట్టుకే తలకట్టు గ్రామం. ఆ పాయకట్టులో దాదాపు యిరవై పల్లెలున్నాయి. అన్నింటిని కలిపి తలకట్టు గ్రామంలో ఒక హైస్కూలు నెలకొల్పినారు.

''ఇంట్లో తిని యీదుల్లోతిరిగి దానికంటే యిస్కూలికి పంపిస్తే రొండచ్చిరాలయినా వస్తాయిలే!'' అన్న సదబుద్ధితో ఆ పల్లీయులు పిల్లల్ని బడికి పంపుతున్నారు. 'రొండచ్చిరాలు' నేర్చుకొంటాడన్న ఆశతో మీరు పంపిస్తే 'అరచ్చరమైనా మేము నేర్పుతాములే' అని అయ్యవార్లు శ్రమిస్తున్నారు.

బడిలో ఏమీ నేర్చుకొన్నా, నేర్చుకొనకపోయినా రాజకీయం నేర్పడం, నేర్చుకోవడం తప్పనిసరి. అందుకే ఆ మారుమూల గ్రామంలోని హైస్కూల్లో కూడా ఎన్నికల తేదీని ప్రకటించినారు హెడ్మాస్టరు. ఆ మాట చెవిన పడటంతో విద్యార్థుల హడావిడి అంతా యింతా కాదు. ప్రచారం ఒక ఉద్యమంగా ప్రారంభించినారు.

ఆ పల్లెల్లో ప్రచార సాధనాలు ముఖ్యంగా గోడలే.

ఏ యింటి గోడ మీద పడితే ఆ యింటి గోడ మీద ఎన్నికల్లో నిలబడబోతున్న విద్యార్థుల స్థలాల్ని 'రిజర్వ్' చేసుకుంటున్నారు. ఆ 'రిజర్వ్'స్థానం తనదని తెలియ చేయడానికి ఆ స్థలంలో ఒకమూల తన పేరు పొడి అక్షరాల్తో రాసుకొంటున్నాడు.

ఆ ఎన్నికల్లో ఒక హరిజన విద్యార్థి కూడా పోటీ చేస్తున్నాడు. అందరిలాగే వాడు కూడా ఊళ్ళో గోడల మీద తన స్థానాన్ని రిజర్వ్ చేసుకున్నాడు. నినాదాల్ని ఆచితూచి ఆలోచించి రాసుకోవాలి కదా మరి?

అప్పటికే నాలుగు కాకుల్ని చేరదీసుకొని, అవి అరచినప్పుడల్లా బొరగుల్లా జేబులోని చిల్లర డబ్బులు చల్లుతూ ప్రాసలు మీసాలు తిప్పే నినాదాల్ని గోడలమీదకెక్కించాలని రవి

తేజముల లరగరాజులా వెడలిన రెడ్డికొడుకు యింటి గోడల మీద హరిజనుడి రిజర్వేషన్లు చూచి ఆగ్రహోదగ్రుడైనాడు

''ఈ నా కొడకల కేడ చూసినా రిజర్వేషన్లు కావాల్నా? చదువుకోవాలంటే రిజర్వేషన్. మళ్ళీ చదువుకుంటే ఉద్యోగాల్లో రిజర్వేషన్. ప్రమోషన్లలో రిజర్వేషన్. వయస్సుల్లో రిజర్వేషను. కడకు మా గోడల మింద కూడా రిజర్వేషన్. ఉండే రిజర్వేషన్లు చాలుగనీ కొడుకులకు మన స్లోగన్సు రాయండ్రా రాయండి''రెడ్డి కొడుకు ఆజ్ఞ.

ఆ మాట కోసమే ఎదురుచూస్తు వుండిన కాకులు గుంపుగా ఆ హరిజన విద్యార్థి మీదనే పడినంత తృప్తిగా గోడలమీద పడినాయి. కాళ్ళతో గీరతా ముక్కుతో పొడస్తొ వాడి పాడి అక్షరాల పేరును పొడిచి పొడిచి తుడిచినాయి. అక్కడికి కాస్త శాంతించి, అప్పటికి ఆ చోటు తమకు సొంతమైనట్లు భావించి తమ నినాదాల్ని అందంగా రాసుకొన్నాయి.

''ఇది న్యాయమా?'' అని సవినయంగా అడిగానాడు హరిజనుడు.

''న్యాయమో, అన్యాయమో? ఎవరితో చెప్పుకుంటావో చెప్పుకో పో! నీ యబ్బతో కాకుంటే వాడబ్బతో'' అని అన్నారు. అనడమే కాదు నాలుగంటించినారు. అడగడమే తప్పన్నట్లు.

హరిజన విద్యార్థి కిమ్మనకుండా తలవంచి తన్నులు తిన్నాడు. వంచిన తలెత్తకుండా ముందుకు నడిచినాడు. వికృతమైన నవ్వులు వీపును పొడుస్తున్నాయి.

వాడలో అడుగుబెట్టి వంచిన తలను పైకెత్తినాడా విద్యార్థి.

కుములుతున్న గుండెల్ని కుడిచేత్తో అదిమి పట్టుకొని ఎడమచేతిని పైకెత్తి ఆవేశాన్ని కంటి చూపుల్లో నిలిపి తనకు జరిగిన అన్యాయాన్ని గొంతెత్తి వివరించినాడు. ఇది తనకు కాదు తన కులానికే తీరని అవమానమన్నాడు. ఈ అన్యాయాన్ని కలిసికట్టుగా ఎదుర్కొనకపోతే బతుకులే అన్యాయమైపోతాయని ఉసికొల్పినాడు.

పొయ్యి దగ్గర నిత్యం పడుకొనే పిల్లి ఎదురుతిరిగితే పులి అవుతుంది.

ఎన్నికల గొడవ దేవుడెరుగును కానీ, రెడ్డి కొడుక్కు , అతని అనుచరులకు హాస్పిటల్లో స్పెషల్ వార్డులో మంచాలు మాత్రం దక్కినాయి. 'కుయ్యో మొర్రో'అంటూ మొనగాళ్ళు మంచాలెక్కినారు. ఎక్కిన మంచాల్ని కనీసం నెలదాకా దిగకూడదని శల్యపరీక్షం జరిపిన డాక్టరు సెలవిచ్చినాడు.

రెడ్డి కొడుకు పడకమీద పడితే రెడ్డిగారు ఈడెగిరి ఆడపడ్డాడు. అక్కడ నుండి ఎగిరి వాడమీద పడబోయినాడు. అయితే అతని శ్రేయోభిలాషులు తలా ఒక్క చెయ్యేసి ఎగరనీకుండా పట్టుకొన్నారు. ఆ ఎగురుడు గసతో రెడ్డి వెనక్కూ ముందుగు ఊగుతుంటే.

''అయ్యా రెడ్డిగారూ! మా మాట కొంచెం వినండి. ప్రస్తుత పరిస్థితుల్లో వాండ్లు ముండ్లు. మనం అరిటాకులం. ఏది దేనిమీద పడినా చినిగేది మాత్రం అరిటాకే. అందుకని చేతులు కట్టుకోని సహించమని చెప్పడం లేదు. ప్రతీకారం జరగాల్సిందే. అయితే ప్రత్యక్షంగా మాత్రం కాదు'' అని సలహా కూడా యిచ్చినారు.

ఫలితంగా ఒకనాడు సందకాడవాడలో గుడిసెలంటుకొన్నాయ్.

ఆ రోజు తూర్పుగాలి తోలింది. అందువల్ల వాడలో తూర్పువైపున యిండ్లన్నీ కాలి పొయ్‌నాయి. అదృష్టవశాత్తూ పడమటివైపు యిండ్లన్నీ కాలిపోకుండా మిగిలినాయి.

ఈ పుణ్యకార్యం కాస్త గ్రామపెద్దల చేతుల మీదుగా జరిగిందేనని, తమకు జరిగిన అన్యాయాన్ని విచారించి తగు న్యాయం చేకూర్చమని హరిజనులు ప్రభుత్వానికి నివేదించు కొన్నారు.

హుటాహుటిగా జీపులు వచ్చినాయి. కార్లు వచ్చినాయి. జీపుల్లో కార్లల్లో ఆఫీసర్లు వాళ్ళ మందీ మార్బలం వచ్చినారు. హడావిడిగా అటుయిటు తిరిగినారు. కాలిపోయిన యిండ్లను చూచి కంటతడిబెట్టినంత పని చేసినాడు. 'అయ్యో! పాపం!!' అని సానుభూతి ప్రకటించి నారు. ఆ తరువాత విచారణ ప్రారంభించినారు. తీగ కదిలిస్తే డొంకంతా కదిలినట్లు పిల్లవాళ్ళ జగడం పెద్దవాళ్ళవరకు వెళ్లిందని తేలింది. హరిజనులకు జరిగింది అన్యాయమే అని రుజువయింది. అందుకే కలెక్టరు గారు తక్షణ కర్తవ్యంగా అగ్ని బాధితులైన ప్రతి కుటుంబానికి అయిదువేల రూపాయలు స్వయంగా అందచేస్తున్నారు.

కుంటేలుగాడి గుడిసె వాడకు చివరగా పడమటి దిశలో ఉంది. అది కాలిపోలేదు. వాడికి అయిదువేల రూపాయలు రాలేదు.అప్పుడు కూడా కుంటేలుగాడు ఏడవలేదు. కానీ కుళ్ళి కుళ్ళి ఛస్తున్నాడు!

''అయ్యో! నా గుడిసె కాలిపొయ్యుంటే....నాకూ అయిదువేలు వచ్చుంటే...నా బూఁవిలో బాయి తవ్వుకోనుందును, బాయికి మిసిను పెట్టుకోనుందును. ఆ మిసిను పాతాళ గంగను పైకెత్తి పోస్తావుంటే సూసినోళ్ళ కండ్లు పగిలిపొయ్యేటట్లు పైరెక్కించి వుందును. గుడిసె పెరికిపారేసి మూడంకణాల పూరిల్లేసుకునుందును. నా కరమగాని గుడిసె కాలిపోకుండా పాయినే!

కుంటేలుగాడు కుళ్ళి కుళ్ళి ఛస్తున్నాడు!

పొలంలో నిలబడతాడు. పొలమంతా కలయజూస్తాడు. ఆ తరువాత దూరంగా కనబడే తన గుడిసె వైపు చూస్తాడు. 'అయ్యో! అదీ కాలిపోలేదే'అని బాధపడతాడు.

గుడిసె ముందు నిలబడతాడు. పక్కన నిలబడివుండే కొడుకును చూస్తాడు. ఆ తరవాత కనుచూపు మేరలో ఉన్న పొలాన్ని చూస్తాడు. మరలా గుడిసె వైపు చూస్తాడు. 'అయ్యో! యిదీ కాలిపోలేదే?' అని అంగలారుస్తాడు.

నిలిచినచోట నిలబడలేక కూర్చున్నచోట కూర్చోలేక కాలుగాలిన పిల్లిలా తిరగతా వుంటే ఉన్నట్లుండి కుంటేలుగాడికొక ఆలోచనతట్టింది. ఆ ఆలోచనలో వాడెగిరి గంతేసినాడు.

ఆ రోజు కుంటేలుగాడు కూలికిపోలేదు. పోనీ, తన పొలంలో పనికంటే - దానికీ పోలేదు. గుడిసెలోనే కూర్చున్నాడు. వాడిలో వాడు తలుచుకొని తలచుకొని నవ్వు తున్నాడు. వాడి ఆనందానికి మేరలేదు. ఆ ఆనందంలో గుడిసింట్లో నుండి బయటికి, బయటి నుండి గుడిసింట్లోకి తిరుగుతూనే ఉన్నాడు. 'ఎందుకు నాయినా! ఈ పొద్దు పనికి పోలేదే?' అని అడిగిన కొడుకును అమాంతంగా జవురుకొన్నాడు. ముద్దులతో ముంచెత్తినాడు. ఆ బుడతగాడికేమీ తోచకుండా మిడిగుడ్లు పెడ్తే, వాడి చేతిలో ఒక పది పైసల బిళ్ళపెట్టి 'ఏఁవయినా కొనుక్కోఁని ఆడుకోబో నాయినా!' అంటూ పంపించినాడు.

మనిషిలో ఆతురత హెచ్చినపుడు కాలం నెమ్మదిగా నడుస్తున్నట్లు తోస్తుందేమో?

వాడి పాలిటికి క్షణమొక యుగంలా గడుస్తూ ఉంది. ఓర్చుకోలేక పోతున్నాడు. మాటిమాటికి గుడిసె బయటికి వచ్చినపుడు పొద్దు వంక అసహనంగా చూస్తున్నాడు.

వాడి పోరుపడలేక పొద్దు నడిమిట్టకొచ్చింది.

వాడలో అందరివీ కూలి బతుకులు. అందువల్ల ముసలీ ముతకా, పిల్లాజెల్లా మినహాయిస్తే మణిసీమ్రటా మెదలడంలేదు. ఆ ఎండపూట ముసలీ ముతకా ఏ మూలల్లోనో ముడుక్కొన్నారు. పిల్లలు వాళ్ళ ఆటపాటల్లో వాళ్ళున్నారు. కుంటేలుగాడదే అదననుకొన్నాడు. దొంతికుండలు ఆదరాబాదరా దించినాడు. అడుగు కడవలో దాచిపెట్టిన రూపాయి బిళ్ళల్ని మొలసంచిలో పోసుకొని మొలకు చుట్టుకొన్నాడు. ఒక్క క్షణం చిలుక్కు తగిలించిన చిక్కాని చూచినాడు. దారాలు సడలొదిల్ని మంచాన్ని చూచినాడు. భారంగా నిట్టూర్చినాడు. చరచరా బయటికి నడిచినాడు. చుట్టూ కలయచూచినాడు. పురుగు మెదలడం లేదు.

చేతిలో అగ్గిపెట్టెను చూచినాడు. సన్నగా నవ్వుకున్నాడు. అగ్గిపెట్టె తీసి ఒక్క పుల్ల చేతికందుకున్నాడు. ఆ పుల్లను గీచినాడు. మండుతున్న ఆ పుల్ల వైపు ఒక్క క్షణం మనసు పెట్టి చూచినాడు. అట్లానే గుడిసెకంటించినాడు. ఎండుబోద. అంటించడమే తరువాయి, అంటుకొనింది. కుంటేలుగాడు ఒక్క లగువులో పరుగెత్తినాడు.

ఊరి ముందర చింతతోపులో ఒక చెట్టు మాటున నిలబడుకొన్నాడు. కాలుతున్న గుడిసె వైపు ఆశగా చూస్తున్నాడు.

గుడిసె బాగా అంటుకొనింది. వాడి మొగం విప్పారింది.

మెల్లగా గాలి ఆరంభమయింది. చుట్టుపక్కల యిండ్లు అంటుకొంటున్నాయి. వాడు ఆనందంగా నవ్వుతున్నాడు.

ఉన్నట్లుండి గాలి తిప్పించి మళ్ళించి కొట్టడానికారంభించింది. ఇంటిపై కప్పులు తెట్టెలు తెట్టెగా లేచి పడుతున్నాయి. వాడంతా అంటుకొనింది.

''అయ్యయ్యో! తూర్పోరయిండ్లు కూడా అంటుకుంటున్నాయేం! ఎట్లబ్బా! మల్లా ఒకసారి వాళ్ళకంతా అయిదువేలొచ్చేస్తాయేం? పోనీలే నా పేరెప్పుకొని తింటార్లే నాయాండ్లు!''

ఒక్క క్షణం అసూయపడినా కుంటేలుగాడి ఆనందానికి అవధులులేవు.

మంచి ఎండ తిప్పించి మళ్ళించి కొడుతున్న గాలి భగభగ మంటలులేస్తున్నాయి. ఆ మంటల్లో నుండి కారుమేఘాల్లాగా పొగ మేఘాల్లో మెరుపుల్లాగా పొగలో మంటలు. వాడలోని ముసలీ, ముతకా, పిల్లాజెల్లా హాహాకారాలుచేస్తూ దిక్కుకొకరుగా పరుగెత్తు తున్నారు. గూటానికి కట్టుబడ్డ గొడ్లు 'అంబా! అంబా!' అని అరుస్తూ గుంజులాడు కొంటున్నాయి. తెంపుకొన్న గొండ్లు తోకలు పైకెత్తి పరుగిడుతున్నాయి. గంపల కింద మూసి పెట్టిన కోళ్ళు ఆ సెగకే మాడిమసి అవుతున్నాయి. ఫెళఫెళా ఫెళఫెళా వెదురు వాసాలు పగులుతున్నాయి. మంటలు నాల్కలు చాస్తూ పైకెగురుతున్నాయి.

కుంటేలుగాడికివన్నీ కన్పించడమే లేదు. వాడి ఆనందం వాడిది. వాడిప్పుడు పుత్రకామేష్టి యాగాన్ని నిర్వహించిన దశరథుడు. దశరథుడికి యజ్ఞపురుషుడు అమృతభాండాన్ని అందించినాడు. ఆ మంటల్లోనుండి చిరునవ్వుల్తో నడిచి వస్తున్న కల్లెక్టరు కుంటేలుగాడికి అయిదువేలు అందిస్తున్నాడు.

ఆ అయిదువేలతో పొలంలో బావి. బావిలో జల. ఆ జలను పైకెత్తిపోస్తూ కరెంటు మిసినూ. కన్నులపండువుగా పంట. కాలుమింద కాలేసుకుని తింటూ కూర్చున్న కొడుకు.

తృప్తిగా నవ్వుకున్నాడు కుంటేలుగాడు.

గాలి ఉధృతమయింది. ఇండ్లపైకప్పులు తెట్టెలుతెట్టెలుగా లేచి, పోగలిగినంత దూరం పోయి, పడుతున్నాయి. కుంటేలుగాడి ఆశలు వాటితో పోటీ పడుతున్నాయి.

నాన్న కోసం ఎక్కడెక్కడ వెదికినా? యేమో? వరదుడు చింతతోపులో కనిపించేసరికి నాన్నా! అని అరుస్తూ పరుగెత్తికొని వస్తున్నాడు.

కొడుకు కంట పడేసరికి వాడి వొళ్ళు పరవశించింది. రారా! నాయనా! రా! అంటూ రెండు చేతులు చాపుతున్నాడు. వాడి భవిష్యత్తుమీద కమ్మటి కలలతో కాలు కదలలేక పోతున్నాడు. వరదుడు మాత్రం నాన్నా! నాన్నా! అంటూ పరుగు మీద వస్తూనే ఉన్నాడు.

ఇద్దరి మధ్య పది బారల దూరం. ఆ పది బారల దూరం పరిగెత్తితే - బిడ్డ తండ్రి చేతుల్లో బిడ్డ భవిష్యత్తు తండ్రి ఊహల్లో. యింతలో వచ్చి పడింది. ఎట్లా వచ్చిందో? ఇటు బారెడు అటు బారెడుతెట్టె. భగభగమండుతున్న తెట్టెకి నిగనిగలాడుతున్న తెట్టె సరిగ్గా వచ్చి వరదుడి నెత్తిమీదన్నే పడింది.

''నాన్నా!''అని ఒక్క గావుకేక పెట్టాడు వరదుడు.

''వరదా!''అని ఒక్క అరుపు అరిచినాడు కుంటేలుగాడు.

ఇంకెక్కడి వరదుడు? బండ కింద పడిన ఎలుకపిల్లలా కణకణలాడుతున్న అగ్ని కణాల్తో కలిసిపోతున్నాడు.

''ఒక్క యేలు కుంటిదయితే అయింది. మణుసుకుంటిది గాదులే!'' అని తృప్తిపడింది చెంగి. అయితే ఆ మనసే కుంటిదయింది. స్వార్థంతో ఆకాశానికెగురుదామనుకొని అధఃపాతాళంలో పడిపోయింది.

పాపం! కుంటేలుగాడు! తన గుడిసె కాలిపోలేదే? తనకూ అయిదువేలు రాలేదే? అని కుమిలి కుమిలి చచ్చిన కుంటేలుగాడి చేతిక్కూడా దొరకని కొడుకు శవం కోసం కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు!

# పొద్దుకుంకింది

పులికంటి కృష్ణారెడ్డి

''మంగా!''

''ఊఁ.... ఆఁ! ఆఁ!.... ఊఁ!''

''అట్టా మూలగతావుండావే!.... ఎట్టుండాదె వొళ్ళు!''

''ఒళ్ళంతా నలగ్గొట్టేసి నట్లుండాది. కాళ్ళూ చేతులు కుక్కలు పీకినట్లు పీకస్తావుండాయి. ఎటెట్లో సఁవాళించుకోని లేద్దావంటే సాద్దిపడకుండా వుండాది. ఏం జెయ్యావుంటావు సెప్పు మాఁవా!''

''ఏఁవి జలమాలో యెదవ జలమాలు!.. ఇట్టాంటి బతుకులు బతికే దానికంటే చచ్చేది మేలే!''

''ఊఁ!.... అదేంటి మాఁవా అట్టంటావే!''

''లేకుంటే నువ్వట్టల్లాడ్తా పొల్లాడ్తా వుండే నీకంత గొంతులో మందాకో పాయ్‌ంలేని ముదనష్టపోణ్ణి. ఎర్దుకు బతకాల్నేను!''

''అట్టనుకుంటే నేను గేడా అంతేకద మాఁవా'' మూడుదినాల్నుండి నువ్వా మంచాన పడుంటే నేను మాత్తరం యేం జేస్తావుండా!''''అట్టనుకుంటెట్లా మాఁవా!....యింక బిడ్డ గతేంకావాలి!... ఒక్కరా యిద్దరా! ఆరుమందే?.... అందరూ మొగబిడ్లేనే?''

''అవునే! అందరూ మొగబిడ్లే! నోరు గట్టి, కడుపుగట్టి పెంచి పెద్దోళ్ళజ్జేస్తే రేపొద్దున వాళ్ల కుచ్చులకుళ్ళాయి పెట్టబోతారు. ఆ కుళ్ళాలు పెట్టుకోని మనం కులకబోతాం!''

''ఏందో?.... ఈ పొద్దు జరం తగిలి యిట్లా మాట్లాడ్తావుండావ్ కానీ, వాళ్ళ మీంద ఈ గోల్తే యిర్సకపడ్తావుంటావే!''

''కదా మరి? ఈగోల్తే యిర్సక పణ్ణు!.... ఈ పొద్దు మూలకొకడు యీలగర్సుకోని పడుంటే సూస్తా వూరుకొనుండా!''

''ఎందుకు మాఁవా బాదపడ్తావ్!''

''బాద?.... ష్హా ష్హా ష్హా!.... ఎందుకే బాద? బిడ్డల్ని కన్నతల్లి బిచ్చంపెట్టిన తల్లి ఎప్పుడూ సెడిపోరుఁగదే?.... అవిరిమచ పెట్టినట్లు ఈ యిల్లు.... అడిగిందడిగినట్లే అందిస్తా యిల్లాలు.. కళకళలాడ్తా పిలకాయిలు!.... ఏం తక్కువే నాకు? ఎందుకే బాద?''

''నువ్వూ నేనే యిట్లా దిగులుపడిపోతే పిలకాయల గతేంకావల్ల మాఁవా? ఊరుకో

మా(వా ఊరుకో?.... వొచ్చిన జెరం వదలకుండా పోదు. మనం లేసి తిరక్కుండా పో(వు లేసి తిరిగితే మనకేం మా(వా! అందరూ మొగబిడ్డే కదా? ఈరాది యీరుళ్లు సూరాది సూరుళ్ళవతారే!..... ఎందుగ్గారు?.... ఫ్హా ఫ్హా ఫ్హా!''

మాకడు విరగబడి నవ్వుతున్నాడు. విరగబడి నవ్వుతూంటే విపరీతంగా దగ్గు వచ్చింది. నవ్వుతో కలసి దగ్గు.... దగ్గుతో కలసి నవ్వు. పాలు నీళ్ళలా కలగలిసినాయి. మూన్నాళ్ళుగా పచ్చి మంచినీళ్ళు నోట్లో పొయ్‌లేదు.కండ్లు తిరుగుతున్నాయి. కడుపులో చెయ్యేసి కలబెట్టినట్లుగా వుంది. కాళ్ళు చెప్పినమాట వినటంలేదు. నిలబడలేక పోతున్నాడు. ముక్కుతా మలగతావుండే పెండ్లాం పక్కన్నే కూలబడితే మాలిగే నక్కమీద తాటికాయ పడినట్లవుతుంది. అందుకే మెల్లగా బయటికి నడిచాడు. గుడిసె ముందర కుక్కిమంచంలో కూలపడినాడు.

మాకడిఅయ్య మంగపతి. పోతూ పోతూ గుడిసెతోపాటు మిగిలించిపోయిన మంచమిది. దారాలు సళ్లొదిలి ఆకలిగొన్న కడుపులా గుంతపడి ఉంది. అక్కడొకటి అక్కడొకటిగా తెగిన దారాలు ఆకలి గొన్న కడుపులో తెగిన ప్రేవుల్లా వేలాడుతున్నాయి. మాకడా గుంతలో కూలబడినాడు. మంచం కిర్రుమనింది.ఆ అరుపు ఆకలిగొన్న ప్రేవుల అరుపులా వినిపించింది. ఆ ఆకలి బాధకు తట్టుకోలేక ఆ కడుపుమీద తడిపి పిండిపెట్టిన తడి గుడ్డలా ముడుచుకొని కూర్చున్నాడు మాకడు.

మాకడి మనస్సు మధనపడిపోతే ఉంది.

మంగ గుండెలు మండిపోతున్నాయి.

''ఆకలమ్మా! ఆకలమ్మా!'' అంటూ అంతవరకు అమ్మను సతాయించిన ఆరుమంది పిల్లల్లో నలుగురు ఆమాట పలకడానికి కూడా శక్తిలేక ఆ గుడిసెలో పడివున్నారు - మూలకొకరుగా, పెద్దోడు, రెండోవాడు మద్యాహ్నమనంగా వెళ్ళిపోయ్‌నారు. ఎక్కడికి వెళ్లారో? యేమో?

ఇంచుమించుగా రెండబార్ల పొద్దున్నట్లుంది. అప్పటికే గుడిసె ముందర చింతచెట్టుమీద కాకులు చేరుతున్నాయి. కొంపలు కూలిపోతున్నట్లో, కాలిపోతున్నట్లో అవి ఒక్కమాపున అరుస్తున్నాయి. వీధిలో కుక్కలు రకరకాలుగా మొరుగుతున్నాయి. ఆ కుక్కిమంచంమీద కూలబడి మాకడు రకరకాలుగా ఆలోచిస్తున్నాడు.

అందమైన మొగం అంచులో అవతరించిన పులిపిరిలా ఆ పల్లె చివరన వెలసిన హరిజన వాడ అది. ఆ వాడలో దాదాపు నలభై కడపలున్నాయి. కొన్ని గుడిసింటి కడపలు.. మరికొన్ని మూడంకణాల పూరింటి కడపలు. ఈ కొంపల్లో మనుష్యులున్నారు. ఆ మనుష్యుల శరీరాల్లో నరాలున్నాయి. ఆ నరాల నిండుగా రక్తముంది. ఆ రక్తంలో శక్తి వుంది. ఆ శక్తి కరెంటులాంటిది.

ఈ నాగరిక ప్రపంచంలో కరెంటు లేకపోతే ఒక్క క్షణం జరగదు. అయితే మనం కరెంటును ముట్టగలుగుతున్నామా?

హరిజనుల విషయంలో కూడా అంతే!

వాళ్ళుకాదు మనకు కావలసింది. వాళ్ళ శక్తి మాత్రమే!

వాడలోని నలభై కడపల్లో ఒక్క గుడిసింటి కడప మాకడిది. ఆ గుడిసింట్లో మకడు తన పెళ్ళాం మంగతో, ఆరు మంది కొడుకులతో కలిసి కాపురం చేస్తున్నాడు.

మాకడికి పెండ్లయి ఎనిమిదేండ్లు అయింది.

వాడి అమ్మా నాయనా చెల్లి పొయ్యి యేడేండ్లయింది.

-అంటే, పెండ్లయిన ఏడాదికే అమ్మా నాయన పొయ్యేసరికి ఊరంతా అదోరకంగా చూసి, 'గాటికి గొడ్డు, దొంతికి కడవ, యింటికి యిల్లాలు వచ్చిన వేళావిశేషం!' అని మూతి మూడువంకర్లు తిప్పింది. అయితే ఆ మరుసటి సంవత్సరానికే మంగ మగబిడ్డను కనేకుందికి 'అంతా వాళ్ళ తాత పోలికేనమ్మా! అదురుష్టవంటే మాకడిదే!' అని తెగ పొగిడేసింది.

మాకడు కూడా పసికందులో తన అయ్యను చూచుకొని తెగ మురిసిపోయినాడు.

నెలలు తిరక్కముందే మంగ మళ్ళీ నీళ్ళుపోసుకొనింది? ఏడాది తిరగకముందే కనింది. ఈ సారికూడా మగబిడ్డే!

''మంగనేఁవో అనుకుంటివే! వర్సగామొగబిడ్డనే కంటూవుండాదే! ఇంకే వుండాది మాకడికి?.... కూసోని తిండే కూడు.''

ఊరు ఊరంతా ఒకటైనట్లు అభినందన పరంపరల్ని గంపలకెత్తి కుమ్మరించినారు. మంగా మాకడు ఒకరిమొగం ఒకరు చూచుకుంటా నవ్వుకుంటా ఉబ్బితబ్బిబ్బులైనారు.

అట్లా ఉబ్బితబ్బిబ్బు లవుతావుంటే మంగ పొట్ట కాస్తకాస్త ఉబ్బుతున్నట్లుగా కనిపించింది. అవునో? కాదో? అని తడిమి చూసుకునేసరికి తొమ్మిదో నెల వచ్చేసింది.

మంగ మళ్ళీ నీళ్ళాడింది!

ఈసారి కూడా మగబిడ్డే!

వాడలోని యిరుగూ పొరుగూ దీన్నంతగా పట్టించుకోకుండా 'దీని జాతకఁవే మొగబిడ్డ జాతకంగా వుండాదే!' అని సరిపెట్టుకొన్నారు.

ఇంట్లో యిద్దరికిద్దరుకాదు....యిద్దరికి ముగ్గురయ్యేప్పటికి మాకడు ఒక్కడు తెచ్చే కూలి పట్టుపట్లుగా సరిపోతావుంది. అయినా వాడు పట్టించుకొనే స్థితిలోలేడు. 'అందరూ మొగబిడ్డే కదా? ఏదో ఒక విధంగా సర్దుబాటు కాకపోతుందా? అన్న ధీమాతో తిరుగుతున్నాడు.

మాక డట్లా ధీమాగా తిరుగుదూంటే- అంతకంటే ధీమాగా మంగ మళ్ళీ మగబిడ్డనే కని 'మగబిడ్డల జాతకురాలేకాదు. ఏటా బాలెంతరాలు' అన్న బిరుదు ప్రదానానికి అర్హత సంపాదించుకొనింది.

మంది ఎక్కువయితే మజ్జిగ పలచనవుతుంది.

మాకడు తింటున్న తిండిలో రెండు పిడచలు తగ్గించవలసివచ్చింది.

వంచిన నడుము పైకెత్తకుండా పనిచేసే కూలోడు మాకడు. ఏది తగ్గినా తట్టుకోగలడేమోకానీ, పిడచ తగ్గితే పీకులాటే! అందుకే ఆలోచించినాడు. పొలంలో

పనిచేసుకుంటా ఆలోచించినాడు. ఇంటిముందర కుక్కిమంచాన కూలబడి ఆలోచించినాడు. అట్లా ఆలోచిస్తావుంటే తళుక్కున మెరుపు మెరిసి నట్లొక ఆలోచన తట్టింది.

ఆలోచన కలగడమే తరువాయి. ఆదరాబాదరా పెండ్లాన్ని పిలిచినాడు. చంకబిడ్డ ఒకపక్క చన్ను కుడుస్తూంటే దోగాడే పిల్లోడు చీరబట్టి లాగుతూంటే మంగ ఎట్లో తెములుచ్చుకొని వచ్చి మగని పక్కన కూర్చొనింది- ' ఎందుకు పిలిచింది?' అన్నట్లుగా చూస్తూ!''సూడు మంగా! సంపాయించేదొకడు. తినాల్సిందారుమంది. బిడ్లా పెరిగి పెద్దోళ్ళయిపోతావుండారు. పెరిగేనోళ్ళకు పెరుక్కూడు కాకపోయినా యాళకింత తిండిపెట్టాలి కదా!''

''వాళ్ళకు పెట్టకుండా నేనే తినేస్తావుండానంటావా మాఁవా? నువ్వు జెప్పేదింకా యిచ్చిత్రంగా వుండాదే?.... ఒక పూట కడుపుగట్టి వాళ్ళకు పెడ్తావుంటే?''

'' ఒసే నీ యమ్మను గొట్టా! నేజెప్పే దదిగాదే? నేను పూటకు రెండు పిడసలు తగ్గిస్తే నువ్వొకపూటే కడుపుగట్టుకుంటావుండావ్? నేను కాదనలేదే?''

''అయితే నువ్వనేదేంది?''

''నిప్పుమిందుప్పు మాదిర నువ్వెగిరిపడ్తావుంటే, యింక నేనేం జెప్పేది;''

'' ఎగినీపళ్లా? వొరగాపళ్ళా? సెప్పింటాను.''

'' ఇంతకాలఁవూ నిన్ను గడపదాటి కాలు బయట పెట్టకుండా కాపాడుకున్నా? యిప్పుడు చెప్పాలంటే మనుసెట్లెట్లో పోతావుండాదే;''

''అదేంది మాఁవా అట్లంటావే? నువ్వు జెప్తే నే నెప్పుడు కాదనింది?''

''అవుననుకో?''

''అనుకోగినుకోనులే! సెప్పింటాను.''

''పరుగు దూరంలో పరవగుట్ట. గుట్ట దడిలో దండిగా వెండుపుల్లలు. దినఁవూ పాలు మరారకుండా పొయ్యి ఒక మోపు కట్టెలేరకొచ్చుకుంటే,సన్నీళ్ళకు యేనీళ్ల తోడయినట్లుంటాది. ఏఁవంటావే?''

''అంతే గద మాఁవా అట్లానే జేస్తే పోలా?''

ఇప్పుడు దినమూ మంగ పరవగుట్టకు పొయ్యి కట్టెలు తెస్తావుంది. ఊళ్ళో ఏ నాయుడమ్మకో, రెడ్డమ్మకో వేసి గట్టి గింజలయితే మానెడు, పొట్టు గింజలైతే రెండు మానికలు తెచ్చుకుంటా వుంది. మాకడు ఒక్కరోజు తప్పకుండా కూలికి వెళ్ళుతూనే ఉన్నాడు.

ఇంట్లో యిప్పుడందరికి నాలుగు వేళ్ళు నోట్లోకి పోతున్నాయి.

మాకడు తన ఆలోచన పారిందని ఆనందపడిపోతున్నాడు.

మగనికి తోడుపడుతున్నానని మంగ సంబరపడిపోతావుంది.

మాకడి ఆనందానికి మంగ సంబరానికి ఆకాశమే హద్దనుకొంటే-వాళ్ళ మళ్ళీ వయసు వచ్చినట్లనిపించింది. అట్లనుకుంటా వుండగానే, గుడిసె ముందర చింతచెట్టు రెండుసార్లు

పచ్చగా చిగురించింది మాకడి యింట్లో జనాభా కూడా ఆ చింతచెట్టుతో పోటీపడినట్లుగా పుష్పించి ఫలించి ఆరునుండి ఎనిమిది కెదిగింది

అందరు కొడుకులన్న ధైర్యం. మాకడికి చీమ కుట్టినట్లనిపించలేదు చీమకు దోమకు తిండిపెట్టే దేవుడే తమకూ అంత గంజపోస్తాడన్న గట్టి నమ్మకంతో ముందుకు పోతున్నాడు.

ఇప్పుడున్నట్లుండి అదేదో మాయదారి జ్వరం వాడమీద దాడిచేసింది. వాడవాడగా దీని వాతబడింది. ఒక్కరోజు వెనకాముందుగా మంగా మాకడు కూడా పడకేసినారు. మంగ గుడిసింట్లో గోనె పట్టెమింద, మాకడు గుడిసె ముందర కుక్కిమంచాన!

మంగా మాకడు పడకబెట్టి అప్పటికి మూన్నాళ్ళయింది.

కూలిచేస్తే కుండ గాలు లేకుంటే కడుపు గాలు- బతుకుల్లో వరసగా మూన్నళ్ళు కూలికి పోకపోతే కుండెట్లా పొయ్యిమీది కెక్కుతుంది? పొయ్యిలో పిల్లి పడుకుంటే మాకడు ఆరుమంది బిడ్డల్నియే గంపకిందేసి మూసి పెడ్తాడు?

కుక్కి మంచాన కూలబడి అదే ఆలోచిస్తున్నాడు మాకడు.

అట్లా ఆలోచిస్తావుండిన మాకడు ఏఁవో యేడుపులు చెవిని పడేసరికి తల పైకెత్తి చూచినాడు. పైకి లేవలేక లేచినాడు. ఆ దృశ్యాన్ని చూస్తుంటే కంటిమీద రెప్పపడలేదు.

కుడిచేత్తో ఒకడిజుట్టును, ఎడమచేత్తో యింకొకజుట్టును పట్టుకోని యిద్దరు పిల్లకాయల్ని బరబరా యీడ్చుకొస్తున్నాడు వీరారెడ్డి. గుండెలవిసిపోయేటట్లుగా ఆ పిల్లోళ్ళు యేడుస్తున్నా, వీరారెడ్డి లెక్కపెట్టకుండా యీడ్చుకొస్తున్నాడు. ఆ పిల్లోళ్ళుయేం తప్పుచేసినారో? యేఁవో? అర్థంకాకుండా అయోమయంగా చూస్తున్నాడు మాకడు. నిలువు రాయిలా నిలబడినాడు.

ఆ పిల్లోళ్ళిద్దర్నీ వీరారెడ్డి రెండు చేతులతో అవలీలగా పైకెత్తి విసిరేసినాడు మాకడి కాళ్ళముందర పడేటట్లుగా! ఎత్తి కుదించివేస్తే మట్టిముద్దలా కుప్పగా కూలపడినారా పిల్లోళ్ళిద్దరూ!

''నాన్నా!'' అంటూ ఆ పిల్లోళ్ళు మాకడి కాళ్ళకు చుట్టుకున్నారు.

''సాకలేనని నా కొడకలకు సంతెందుకురా? కంటే సరిపొయ్యిందా పంది కన్నట్టు. అదే మేలు. పదికిర్వై పిల్లల్ని కన్నా అట్టా సూడు చింతచెట్టు కింద- కెట్లా పాలిస్తావుండాదో? మా తోట్లు, సెనిగతోట్లు నీ కొడకల పరం కాదురా మేం వేసిపెట్టుండేది? జాగర్త! నా యండ్లాలా! యింకెప్పుడైనా ఆ ప్రక్కకు తొంగా మళ్ళీ సూసినారో?- తాటొలిసేస్తా!''

ఏదో ఘనకార్యం చేసినట్లుగా వీరారెడ్డి బుసలుకొడతా విసవిస వెళ్ళిపోయినాడు.

'' ఆకలిగా వుంటే రెడ్డోళ్ళ సెనిగతోట్లో రెండు సెట్లు పెరుక్కున్నాం నాయినా!''

చెప్పలేక చెబుతూ 'బోరో'మని యేడుస్తున్నారు పిల్లోళ్ళు!

ఆ యేడుపులు మాకడి చెవినిపడడం లేదు. వీరారెడ్డి మాటలే చెవుల్లో గింగురుం మంటున్నాయి. 'సాకలేన్నాకొడకలికి సంతెందుకురా?' అని.

అవును మరి?- సాకి సంతరించ లేనోళ్ళకి సంతానమెందుకు?

కుక్కిమంచాన కూలబడి మాకడు అదే ఆలోచిస్తున్నాడు.

వీరారెడ్డి గుద్దిన గుద్దులు పిల్లోళ్ళ ఒంటిమీద కుడుములు కుడుములుగా దద్దులు కట్టినాయి. ఆ దద్దుల్ని తడిమి తడిమి చూస్తూ మంగ కుమిలికుమిలి యేడ్చింది. అట్లా యేడుస్తూవుంటే ఎన్నో ఆలోచనలు ఆమె గుండెల్ని సలుపుతున్నాయి. వీరారెడ్డి గనిమమీద పంచ కొంగు పైకెత్తిపట్టి నిలబడుకోనుంటే తన మగడే ఆ చేనిలో మడకదున్నినాడు. విత్తనాలు విత్తినాడు. నీళ్ళు గట్టినాడు. కలుపు తవ్వినాడు. అయినా ఆ చేనిలో రెండుచెట్లు పెరుక్కోవడానికి తమకు యోగ్యత లేదు. ఆ మాట మనస్సులో మెదిలేసరికి మంగ గుండె మండింది.

అయితే ఏం లాభం?

పేదవాళ్ళ కోపం పెదవికి చేటు.

మంగ మెల్లగా పైకిలేచింది. గుడిసింటి వెనక్కు నడిచింది. నాలుగు పుల్లాపుడకలు యేరుకొనింది. తెచ్చి పొయ్యిలో వేసింది. కిరసనాయిలసీసా చేతికందుకొని పొయ్యిలోని పుల్లలమీద వంచింది.

ఆ పుల్లలమీద కిరసనాయిలు కారింది. ఆమె కన్నీళ్ళు! నిట్టూరుస్తూ అగ్గిపెట్టె అందుకొని పొయ్యి ముట్టించింది.

రగలలేక రగులుతున్నాయి. ఆ పుల్లలు. పొయ్యిమీద చట్టిబెట్టి, ఉప్పుచట్టిలో చెయ్యిపెట్టింది.

పిల్లోళ్ళ ఒంటిమీద దద్దులకు కాస్త కాపడం వేద్దామంటే నాలుగు ఉప్పురాళ్ళు చేతికంద లేదు. ఉసూరుమంటూ ఆ పొయ్యిముందరే కూలబడింది.

పొద్దుకుంకింది!

మాకడు మంచానపడి ఆలోచిస్తూనే ఉన్నాడు. ఏడ్చి ఏడ్చి పిల్లోళ్ళు ఎక్కడి వాళ్ళక్కడ పడి నిద్రపోతున్నారు. తనలో తాను ఎంతసేపు యేడ్చుకొనిందో యేమో?-మంగ తనకు తానే ఓదార్చుకొని లేవలేక పైకిలేచింది. మెల్లగా గుడిసె ముందరి మంచం దగ్గరికి నడిచింది.

''అట్లా కూర్చుంటే ఎట్లా మావా పిల్లకాయిలకంత గెంజి కాసిపోసి రొండుదినాలయింది గదా?.... యాడైనా అంత అప్పోసప్పో లేకపోతే ఎట్లా!''

''పొద్దుగుంకింది గదే?- ఇంకిప్పుడేడ పుడుతుంది?''

అవును. ముందు చూపులేకుండా ప్రవర్తించిన బతుకుల్లో పొద్దుకుంకడమే సహజం. పుట్టడమే అసహజం.

# పోటు

బడబాగ్ని శంకరరాజు

''ఒరే! కల్లాలోడా! నీకిదేం పోయే గాలంరా! నా మడిగెనాన్ని దున్నేస్తాండావు'' అన్న పెద్ద రైతు వెంకట్రామయ్య కొడుకు సుబ్రమణ్యం మాటలతో కూతురి పెళ్లి గురించి ఆలోచనల నుంచి తేరుకొన్నాడు కల్లాల రామయ్య.

నిన్నటి రోజున అయిపోవస్తున్న చనగ తండు కోటా తగ్గించి, జొన్న సొప్ప ఏసినందుకు కోపగించుకున్నాయా అన్నట్లు మడకని పక్కా కయ్యిలోకి లాక్కుపోతున్న దేశ పెద్దులను చూసి తనలో తాను గుంభనంగా నవ్వుకొని -

''ఏమయ్యా ముగరాజా! 'చవగతండు బండెడు బదులీవయ్యా' అని మంగలారం సంతలో అడిగితే ఇనిపించుకోకుండా ఎమ్. ఎల్. ఎ. లెవలీలో కద్దరు సొక్కాని మోచేతుల కాడికి ఎగదోసి అసెంబిలీలో గొడవకు బయలుదేరుతున్నోడిలా ఏడికో బిరబిరా ఎలిపోతివి. కడుపు కాల్నోటికి ఇది మనోడి మడి, పక్కోడిమడి అని ఆలోసించే ఆ మాత్రం ఓపిక యాడుంటాది సెప్పు అబోడా! అయినా తెల్లార్తో నువ్వేందీ ఇట్టా ఎల్లవారొచ్చినావు. మడికయ్యిలో ఏమన్నా కోల్లపారం గానీ పెడతావా ఏంది?'' అన్నాడు రామయ్య.

పదో తరగతి పరీక్ష ఐదుసార్లు తప్పాక కోడిపిల్ల దగ్గర నుండీ కోడె దూడల వరకూ దేన్నైనా కొని కొన్నాళ్ళు మెపి మారు బేరానికి అమ్ముకొనే స్వయం ఉపాధి చేపట్టాడు సుబ్రమణ్యం. 'పాతికేల్లకే ప్రపంచాన్ని కొనేసే తెలివి తేటలు అబ్బాయని' అనుకొనే ఊళ్ళో అందరూ ముద్దుగా 'ముగరాజా' అనే పిలుస్తారు. ఎవరి వల్లయినా పైసా ఆదాయం వస్తుంది అనిపిస్తే ముగరాజు కాదుగదా 'పెంటరాజా!' అని పిలిచినా విని సహించగలిగేంత మాన 'ధనుడు'. ''అయితే చనగతండు ఇవ్వలేదని నా మడిని నీ మడికయ్యిలో కలిపేసుకొంటావా ఏంది కల్లాలోడా! మాట మీద నిలబడే వాడివి కదా అని నమ్మకంతో నా సెంతన లేకున్నా - పండక్కు అల్లుడి మర్యాదలు సెయ్యలేదని మాట్లాడ్డమే మానేసిన నేను, మల్లా నీ కోసమని మా మామగారింటికి సిగ్గుపెడి పోయి డబ్బులు తెచ్చి ఇస్తిని. ఇప్పుడేమో నీ యవ్వారం సూస్తాంటే నా నెత్తిమీద సెయ్యి బెట్టేట్టుండావే'' రామయ్యపంట బెట్టిన టమోటా తోటలోంచి మాంచి సైజు పండ్లను కోసి పైపంచలో వేసు కొంటూ అన్నాడు ముగరాజు.

''అదేందబ్బోడా అట్టాంటి మాటలంటావు! నీకు బాకీ లేదు పో!' అని నేనెప్పుడైనా అన్నానా. అట్లా అంటే వచ్చే జన్మంలో గాడిద కడుపున పుట్టనా! నాలో నేనే మా బతుకు బాధల గురించి ఇసారించు కొంటూ కొంచం ఏమార్నా. ఈ కొల్లబోయిన కోడెలు నీ గెనె మేపు నాగల్ని లాగేశాయి. ఆ మాత్రానికే ఏదో అక్రమం జరిగిపోయినట్టు అగాయితం

సేస్తాండావు అయినా ఏ మాట కాడ ఆ మాట మాటాడకుండా ఎప్పుడో వచ్చే చనగపంట కాలానికి తీర్చాల్సిన బాకీ మాట ఇప్పుడెందుకంట? అప్పు తీసుకొని నాలుగు నెలలు కూడా కాలేదే!'' దేశపు కోడెల కంటుకొన్న బురదను నీటి మడుగులో కడుగుతూ అన్నాడు కల్లా రామయ్య.

''అదేదో సినిమా పాలో సెప్పినట్లు ' ఏ నిముసానికి ఏమి జరుగునో ఎవరూహించెదరూ' అని చెప్పినట్లుగా మా ఆడదానికి ఆ మాయదారి కడుపు నొప్పి ఇప్పుడే దాపురిస్తుందని నేనూహించానా. నిన్నింతలోనే అప్పు సెల్లించమని అడుగాల్సొస్తుందని నేనేమన్నా కలగన్నానా. ఎగువ పల్లెలో ప్రజలు పదివేల రూపాయల మీద చెల్లించిన వడ్డీ డబ్బంతా ఆ డాక్టర్ల ఎదాన గొడితి. అయినా జబ్బు తగ్గలా. సివరికి ఏలూరు పెద్దాసుపత్రికి తీసుకుపోదామనుకొన్నా. మరి డబ్బులో! మల్లా చనగపంట వచ్చేదాకా ఎవరూ అప్పులు సెల్లించరాయె'' అని సత్తు బేసిన్‌లో మద్యానం సంగటి తెస్తున్న రామయ్య కూతుల్లను సూసి టక్కున ఆపాడు.

నాసిరకం టెర్లిన్ చీరను కట్టుకొన్న పెద్దపిల్ల, చిరుగుల జార్జెట్ పైట వేసుకొన్న చిన్న పిల్ల - ఎగుడు దిగుడు గెనాలు దూకుతున్నట్లు కుదుపులతో దిగుతూ వస్తున్న వారిని - తలకోన జలపాతంలానూ, తను ఆ జలపాతంలో తడచి తన్మయత్వం చెందుతున్నట్లూ వూహించుకోసాగాడు ముగరాజు.

కానీ వయుసు తెచ్చిన వంపు సొంపులకు సరిగా అతకని వారి వంటి మీది దుస్తులు మాత్రం అనంతపురంలో తనతోటల్లుడి ధనియాల పంట భూమిని చుట్టుముట్టిన ఇసుక, పొరలు... పొరలుగా తన శృంగార హృదయం మీద ఎడారిలా పరుచుక పోతున్నట్లనిపించడంతో తనలో తాను గింజుకొంటూ '' ఇంత బంగారాన్ని ఇంట్లో పెట్టుకొని ఎందుకోయ్ మళ్ళీ వచ్చే పంట కాలం వరకు ఆగమంటావ్'' పెద్దపిల్ల సరోజ వైపు ఆబగా చూస్తూ అన్నాడు.

''అదేంది ముగరాజా! అలాగంటావ్. మహలచ్చుమ్మల్లాంటి నీ కూతుల్లు వనజ, గిరిజలు మేలిమి బంగారం కాదా ఏంటీ'' నెత్తి మీది సంగటి బేసిన్‌ను తనకభిముఖంగా వంగి దించుతూ అన్న సరోజ మాటలు ముప్పై మల్ల బావిలాంటి తన గుండె లోతుల్లో పెద్ద బండరాయి ''గుభేల్లు''!! మని పడ్డట్లనిపించడంతో ముగరాజు కొంటె చూపులకు కనిపించవలసిన అందాలస్థానంలో బాధ్యతలు దర్శనమిచ్చాయి.

రామయ్య ఎద్దుల్నూ, మడకనూ కడిగాక, తనను పంచలోహాల విగ్రహంలా మార్చిన వంటి మీది బురదను శుభ్రపరుస్తున్న నీటి గల గలలలో వారి మాటలు కలిసిపోయాయి.

''అరె....! నీ పాసునుగాల 'కల్లుకొచ్చి ముంత దాచినట్లు' ఆ ఇసియం ముందుగానే కక్కలేకపోయావా? మా కాలంలో అయితేనా - ఇలాటి జబ్బులు రెండూ కాకపోతే మూడు రోజులు. అంతే అబ్బోడా! అడికిమించి సచ్చి సొరగానున్న సిద్దముని వైద్యానికి ఆ జబ్బు ఆగితే సెప్పు! ఇంతవరకూ ఆ బిడ్డకు ఏం సూపించినావో ఏమోగానీ, పీసిని పట్టుబట్టి ఆ బిడ్డకు అగసాట్లు బెట్టకుండా మూంచి డాకటరు దగ్గర సూపించేయి. మల్లా వచ్చే శనగపంట వరకు నువ్వాగబల్లా - నువ్వట్టా ఒకసారి ఊర్లోకెళ్ళి ఒక సుట్టేసి నా ఇంటి దగ్గరకి రా నీ డబ్బులిచ్చేస్తా'' అని, ఆ పూట పొలం పనులకు అర్ధాంతరంగాస్వస్తి చెప్పి

ఓమ్మో! సంగటి బేసిన్ ఎత్తుకొని ఇంటికి, 'బదాండి నాకు సిన్న పని బడింది''. అని కాలుష్లను కేకేసి ఇంటిదారి బట్టాడు రామయ్యా ముగరాజు అతన్ని అనుసరించాడు.

'నాట్లకు సిద్ధమవుతున్న అద్దంలాంటి మడికయ్యలో నీళ్లిగిరిపోతే మల్లా గూడేసి నీట్లు బెట్టాలంటే తాతలు ముత్తాతలు కనబడతారే ఎట్టబ్బా!' అని అనుకొంటున్న రామయ్యా కళ్ళముందు బంగలు చుట్టుకుపోతూ రోదిస్తున్న ముగరాజు భార్య సుశీల రూపం కనబడ్డంతో ' ఆ బిడ్డ ఉసురు నా బిడ్డలకు సుట్టుకోకుండా వుండాలంటే ముగరాజు పనే ముందు సూడాల' అని నిశ్చయించుకున్నాడు.

''ఈడికేం పనిలేదబ్బా! ఊరికో ఐదేలో పదేలో అప్పిచ్చి, తీసుకొన్న ప్రతి మనిషినీ మాకోడి మాదిరి కయ్యకాడా కంచం కాడా పట్టుకొని పనులు జరగనీకుండా, తన పనులు సేస్కొబెట్టుకపోతుంటాడు. మడి పని ఈ రోజుకైనా అయిపోనీకుండా సెనివూదిరొచ్చి అడ్డుపడినాడు. ఈను మల్లా ఏకువ నుంచి అన్నం యాల దాకా బురదలో పార్లొచ్చి ఎంత సింగారించుకొని కూసుంటే మాత్రం ఏ పెళ్లికొడుకు సూపులకాసుతానం! ఈన్నోట్లన్నో, మన్నుగొట్టా! ఈసి మూలాన నా పదో పెళ్లిసూపులు కూడా సూరెక్కేట్లుందే. నా మాటట్లున్నీ రామయ్య కూతురికీ ఈ సంబంధం కూడా కుదర్లేదని వూరోల్లకు తెలిస్తే మా నాయనకు ఎన్ని బగిసాట్లు-'' అని అనుకొంటూ చెల్లితో పాటు తండ్రిని అనుసరించింది సరోజ

ఏడు నూర్ల రూపాయలకు వడ్డీ మూడు నూర్లుకలుపుకొని ఎయ్యి రూపాయలు తీసుకొన్నట్టు పత్రంలో రాసుకొన్న ప్రకారం, ముగరాజు అప్పు తీర్చేసాడు రామయ్యా.

మూడు నెలలు గడిచిపోయాయి. తన దగ్గర ముగరాజు పట్టుకెల్లిన కోడిపెట్ట మిడిపెట్టయింది. కానీ రామయ్యకు పత్రం ఇయ్యలా!

''ఆ జబ్బు మనిషితో ఎన్ని అగసాట్లు బడతాండాడో! నిదానంగా ఇస్తాడులే'' అనుకొనే. ఆరు నెలలు గడిచిపోయె - తన దగ్గర పట్టుకెల్లిన పొట్టేలు పిల్ల కోత కొచ్చింది -

పత్రం అడిగితే '' ఎక్కడో బెట్టేసినా ఎతికిస్తాను''అనె.

రామయ్య నిజమే గాబోలు అనుకొనె. ఆరద్దల కార్తిపోయి మల్లా ఆరద్దల కార్తి వచ్చె. ఈ సందులో... మద్దె-మద్దెన - మల్లా ఒక కోడిపిల్లను, ఒక తరుపు దూడను పట్టుకెల్లి కొన్నాల్లపాటు మేపి మారుబేరాల్లో మాతంచి లాభాలు సంపాదించె.

అబ్బా! కోరుకున్న రామయ్య పత్రంగురించి అడిగితే ఏదోఒకటి సెప్పి నోరు మూయించి, నోరులేని జీవాలను పట్టుకెల్లి పది నూర్లదాకా లాభాలు సంపాదించుకొండె.

ఈ యవహారం ఇలా నానుతుండగానే, పెద్ద పిల్లకు పెల్లి అయిపాయె, కడుపు పండి తల్లిగారింటికి ఇంటికి రానే వచ్చె. పత్రం విషయంలో వాళ్ల నాయన అసమర్ధత గురించి సరోజకు తల్లి సెప్పనే సెప్పె. కూతురి దగ్గర చివాట్లు తిని, ఈ సారి ముగరాజు చేత పత్రమెట్టైనా తెప్పించాలని నిశ్చయించుకొని బయలుదేరె.

వాస్తాకే సెరువు మరవ కాడ ఎదురుబడిన ముగరాజును పత్రం గురించి నిలదీసి అడిగితే-

''దాన్ని గురించి సెబుదామనే నీ కాడి కొస్తాండా బీరువా అంతా ఎతికినా కల్లాలోడా! కనబళ్ళా! సివరికి సెల్లింపులయిన పత్రాలు పడేసే కోల్లి అటకలోని రేకు పెట్లో గూడా ఎతికినా ప్చ్.. ! అక్కడా గనబల్లా! మళ్లా ఒకసారి ఎతుకుదామనుకొనే లోపల నీ కూతురు నీరసపు మూలుగు వినపడటంతో నా గుండె కలుక్కుమనె. దాని నీరసం తగ్గాలంటే నీ యింటి పెట్టకోడి పులుసే సరయిన మందనిపించె. అనిపించిందే తడవు ఇట్లా ఎల్లబారొచ్చేసినా'' ఒగరుస్తూ వరసలు కలిపి మరీ అడిగినా, రామయ్యకు అది ఎటకారంగానే అనిపించె. పత్రం ఇంట్లోనే బెట్టుకొని ఏసకాలు 'ఏస్తాండాడని [illegible] అయిపాయ. పత్రం ఇయ్యకుండా ఊరించి, ఊరించి దూది లాంటి మెత్తని మాంసపు కోల్లనుం; పొట్టేల్లనూ సీపుగా ఇంకొన్ని పట్టుకు పోవాలనే దురాశతో ఈ నక్కజిత్తులు ఏస్తాండాడని తేట తెల్లమయిపాయ, ఇక సరే ఆలోసించబనిలాదె...

''ఛూ! నీయమ్మ బతుకు...! ఆడకూతురు ఆపదలోవుంది అంటే ఇంటిల్లో అడోల్లినాప్పించి ముత్తైదవ మెడలో పసుపుతాడు గట్టి బొట్టుసైసు కొడవ బెట్టి గడువు తీరకముందే వడ్డీతో సహా అప్పు సెల్లిస్తే....!కడుపులో ఎంత కుటిలం బెట్టుకొన్నావో! పత్రం పోయిందని మొంకుతావా! కానీ...!కానీ...!! ఏ సట్టం, ఏ సంతా తెలీనోణ్ణి గదా అని నీ ఇష్టమొచ్చినట్లు నన్నాడిద్దామనుకొన్నావా! ఇంకా ఎన్ని రోజులు ఇలా సాధిస్తావో సూస్తా...! వంచన ముందు నీరుగారిపోతున్న నిజాయితీ, ఉక్రోషం రూపంలో రామయ్య చేత ఆమాటలనిపించింది.

''కల్లాలోడా! కల్లు తాగిన కోతిలా ఏందా గెంతులు? పనికి రాని పత్రం కోసం ఎందుకు ఆ మాదిరి బాధపడతావు. అప్పుగావాలంటే మల్లా అడుగు ఇస్తా. మనిషికి మనిషి నమ్మాలయ్యా....!'' అన్న మృగరాజు మాటలు రామయ్యకు వినబడింటే 'అప్పు ఇచ్చేటపుడూ, పత్రం రాసుకొనేటపుడూ ఇసియం నీకు గుర్తుండదట్రా అప్పుడు నాయనాలా?' అని, నిలదీసి అడిగిణ్ణేవెూ కానీ అప్పటికే రామయ్య ఎనుదిరిగి, చాలాదూరం ఎలిపోయాడు.

రామయ్య మనసు మనసులో లేదు. బాకీ తీరాక కూడా తన జుట్టు వాని చేతలో చిక్కుకుపోయిన వైనానికన తలుసుకొంటే మనసంతా సెగలు! పొగలు!!

బస్సు అతని మనోస్థితితో ప్రమేయం లేకుండా చిత్తూరు జిల్లా సరిహద్దులు దాటి నెల్లూరు జిల్లాలో ప్రవేశించినా, రామయ్య ఆలోచనలు ' ఆ హద్దులు' దాటి రాలేకపోతున్నాయి.

నెల్లూరులో బస్సుమారి కావలి మీదుగా తన తమ్ముడు రాజన్న, టీచర్గా పనిచేస్తున్న సైసాడు తీరంలోని జాల్లర్ల గ్రామాన్ని చేరుకొన్నాడు రామయ్య.

తాటాకుల కొట్టం క్రింద కూసాని పిల్లోల్లకు వేమన పద్యాలు సెబుతున్న రాజన్న, అన్న రాకను గమనించి పిల్లల్ని ఇంటికి పంపించేసాడు.

మధ్యానం భోజనాలు అయ్యాకరామయ్య తన పరిస్థితిని ఇవరించి సెపితే ''అన్నా! నువ్వొట్టి అమాయకుడివి! పత్రం పోతే బోయింది నువ్వు గమ్మునా ఉండిపో! [illegible] గూడా కోర్టు ఏపు ఎల్లద్దు. ఎల్లావో చేతి చమురు ఇంకొంచెం ఒదులుద్దే తప్ప [illegible]

ఒరగదూ...! వాణ్ణే మరోసారి బతిమాలి సూడు.''అన్న తమ్ముడి మాటలు మనసులో మంటల్ని మరింత రగిల్చె.''నువ్వుత్త అమాయకుడివి'' అన్న తమ్ముడి మాటలు సెవుల్లో గింగురు మంటుంటే తలంతా బారమెక్కె.

ఆ రాత్రి అన్నందిన బుద్దిబుట్లా. మనసులో బారాన్ని కాసింతైనా తగ్గించుకొందామని పిండారబోసినట్లున్న ఆ పౌర్ణమి నాటి ఎన్నెట్లో ఒక్కడే మైపాడు సముద్ర తీరానికేసి నడవసాగె.

సముద్రం గాలికి శరీరం సల్లబడి నామనసంతా వేడి ఇసుకతో నిండినట్లు గరుగ్గరుగ్గానే వుండె. ఆ మనసు ఇసుక మీద వెండి కిరణాలను ప్రసరింపచేసిన చంద్ర బింబం అతని ఆలోచనల పొరల్ని ఛేదించుకొని చూపుల్ని ఆకర్షించింది.

చంద్రుని మీదినుండి దిగువన భూమికి సమాంతరంగా చూపులు మరల్చిన రాయమ్యకు అతి ''పోటు''ను కలిగించిన చంద్రుని ముంచి వేయడానికి కెరటాలతో ఉవ్వెత్తున లేస్తున్నట్లుగా సముద్రం కనిపించింది.

ఆ భావం మనసులో కలిగిందే తడవు తన మనసులో అసంతృప్తి ''పోటు'' సృష్టించిన వారిని ఏమి చేయాలో బోధపడినట్లుందతనికి - ఒక్క ఉదుటున లేచి వడివడిగా గ్రామంవేపు నడుచు కెలుతున్న రామయ్య అడుగుల సవ్వడికి, తీరం వెంబడి వేట సాగిస్తున్న పీతలు భయంతో బొరియల్లోకి చకచకా దూరేసాయి?

ఆ మరుసటి రోజే తమ్ముడికి మాటైనా చెప్పకుండా తన స్వగ్రామానికి బయలుదేరాడు రామయ్య.

రామయ్య స్వగ్రామం చేరిన పదిరోజుల తరువాత - ముగరాజు ఇంట్లో దొంగలు పడి డబ్బులు ముట్టకోకుండా పత్రాలు మాత్రం పట్టుకెల్లి పోయారనే వార్త ఆ గ్రామమే కాదు ఆ మండలంలోని ధనవంతుల మనసుల్లో కల్లోలం సృష్టించింది.

పోయినవన్నీ చెల్లింపులు అయిపోయిన పత్రాలైనందున ముగరాజు పోలీస్ రిపోర్ట్ ఇవ్వలేదు. పైగా ''డబ్బులు పోలేదు అది సాలు బగవంతుడా!'' అని మనసులో అనుకొన్నాడు.

కానీ గ్రామస్తుల నోల్లకు ఇదో మంచి రుచికరమైన చర్చనీయాంశం కావడంతో - ఈ పని చేసింది కల్లాల రామయ్యేనని కొన్ని నోళ్ళు, చెవులను కొరికాయి. తరువాత్తరువాత బహిరంగంగానే ఆ విషయాన్ని చర్చించుకొన్నా - ముగరాజు మీద కోపమో! రామయ్య మీద ప్రేమో!! తెలీదుగానీ ఏ పెద్దమనిషీ మద్దిస్తం బెట్టి 'విషయం' తేల్చడానికి ముందుకు రాకపోయే సరికి, నోళ్ళు తమ నాలుకల్నే కొరుక్కోవడం ప్రారంభించాయి.

రానురాను ఈ సంఘటన గ్రామస్తులకు 'పాతిసియం' అయిపోయినప్పటికీ ఊర్లోకొచ్చే కొత్తోల్లకు కొత్తగానే వుండె.

''అందుకేనేమో ఏమిటీ! ఊర్లో ప్రతి ఒక్కరూ 'కల్లోలరామయ్య! కల్లోల రామయ్య!!' అని నామస్మరణ చేస్తున్నారు. ''అదేమన్నా ఎలక్షన్లలో పోటీచేస్తున్న రాజకీయ నాయకుడి పేరా?'' అని ఊరికి కొత్తగావచ్చిన 'సైటిస్కూలు' టీచర్ ''డేషస్కూలు' టీచర్ని ఆసక్తిగా

అడిగాడు.

దానికి జవాబుగా ఒక చిరునవ్వు చిందించి ''మీరనుకుంటున్నట్లు అతను రాజకీయ నాయకుడేమీ కాదు. వంచననే మతంగా చేసుకొని ప్రజల్ని పీడించే వాళ్ల మనసుల్లో మాత్రమే ''కల్లోలం'' సృష్టించిన రామయ్య అతను. తోటి కర్షకులకు తన పూర్వీకుల్లాగా అతను పంట కల్లాలు నూర్పిడి చేసే ''కల్లాల'' రామయ్య మాత్రమే'' అని అన్న 'దే ఇస్కూలు' టీచర్ మాటలు అర్థం కావడానికి - చీకటిలో గుడ్డాడిలా కాస్సేపు తడుముకోవలసి వచ్చినా, చివరికి బోధపడినట్లు నిలువుగా తలోమారు ఊపి, తన వృద్ధ శిష్యులకు అక్షరాలు నేర్పించడంలో మునిగి పోయాడు.

ఆ వృద్ధ శిష్యుల గుంపులోనే ఏ కల్లోలమూ పట్టనట్లు వో మూల ప్రశాంతంగా కూర్చొని 'అ' అప్పు, 'ర' రద్దు అనే అక్షరాలను దిద్దుకొంటున్నాడు కల్లాల రామయ్య.

# ఎల్లువ

దాదా హయత్

''యెంకటేస్వర సామీ, కాపాడు తండ్రీ,'' కోర్టు హాల్లోకి వెళ్తూ తిరుపతి కొండ వున్న దిక్కుకు తిరిగి దండం పెట్టుకున్నాడు గొల్ల నారాయణ.

దావా గెలిస్తే కొండకొస్తానని మొక్కుకున్నాడతను. ఆరోజే తీర్పు. కొద్ది సేపటి క్రితమే అతని వకీలు అతనికి ధైర్యం చెప్పాడు. ''మరేం పరవాలేదు. దావా గెల్చేది మనమే నువ్వు నిమ్మళంగా వుండు,'' అన్నాడు.

గొల్ల నారాయణ అలగేనని బుర్రూపాడు. అయితే అంతటితో అతనికి ధైర్యం చిక్కలేదు. ''అన్నింటికీ నువ్వే వుండావు సామీ,'' తిరుపతి వెంకన్నకనను తల్చుకుని అప్పుడే మనసులో దండం పెట్టుకున్నాడు. అతని భార్య కూడా అతను కోర్టుకు బయల్దేరే ముందు అదే చెప్పింది ''సామి సల్లంగా సూడాల్నే గాని, ఈ వకీల్లతో యేమైతాది? కోరటుకాడ నిన్ను బిల్సినప్పుడు యెంకటేస్వర సామిని తల్సుకో,'' అని హితబోధ చేసింది. గొల్ల నారాయణ ఇప్పుడలాగే చేశాడు. దాంతో మనసుకు కొంత ధైర్యం చిక్కింది. అన్నింటికీ బగవంతుడే వుండాడు. యెవరికీ ఆయన అన్యాయం సేయడు, అనుకున్నాడు. దాంతో మరికొంత ధైర్యం చిక్కింది. జడ్జిగారి ముందు వణక్కుండా నిలబడగలిగాడు.

''గొల్లనారాయణ నువ్వేనా?'' అడిగాడు బెంచి గుమాస్తా.

''నేనే సామీ,'' అన్నాడు నారాయణ.

''నీ దావా కొట్టేసినారు పో,'' అన్నాడు బెంచి గుమాస్తా. నారాయణకి అతనేం చెబుతున్నాడో తెలీలేదు. దావా కొట్టేసినారంటే గెల్చినట్టో ఓడినట్టో అర్థం కాలేదు.

''అంటే దావా గెల్సినానా సామి?''

ఆ ప్రశ్నకు కోర్టు హాలంతా గొల్లున నవ్వింది.

''ఓడి పోయినావు పోవయ్యా నీ దావా పోయింది,'' అన్నారెవరో.

గొల్లనారాయణ కళ్ళముందు చీకటి వ్యాపించినట్లయ్యింది.

''అన్యాయం సామీ, ఆ భూమి నాదే,'' మొరపెట్టుకున్నాడు.

జడ్జి మొదటిసారిగా నోరువిప్పాడు. ''భూమి నీదేనంటే అప్పీలు చేస్కో ఇంక నేను చెయ్యగలిగిందేం లేదు.''

నారాయణ ఎలా కోర్టు హాల్లోంచి బయటి కొచ్చాడో అతనికే తెలీదు.

''యెంకటేస్వర సామీ, నువ్వు గూడా మోసం జేస్తివా!'' బిగ్గరగానే అనుకున్నాడు.

అతని వకీలు ఎక్కడా కనిపించ లేదు. మాల ఈరిగాడు మాత్రం కనిపించాడు.

''ఈరిగా, మీకేం జేసినానవిరా వన్నీవైనా సతాయిస్తావుండారు?'' కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా అడిగాడు.

ఈరిగాడు అతనివైపు జాలిగా చూశాడు.

''మాదేం లేదన్నా. గవర్నమెంటోల్లు ఆ భూమి మాకిస్తామంటే తిరుగుతాండాం అన్నాడు.

''ఆ భూమి నాదిరా,'' వాపోయాడు నారాయణ.

''గవర్నమెంటుదంట గదన్నా! నీది కాందాని కెందుకు గసపెట్టుకుంటా తిర్గుతావ్? లెక్కంతా కొండబోయి వకీల్ల నోట్లో యెందుకు బోస్తావ్? దావా వదిలేయ రాదా?'' సలహా ఇచ్చాడు ఈరిగాడు. ''యెంత మాటంటివిరా ఈరిగా! ఆ భూమి నాదన్నా,'' ఏడుపొక్కటే తక్కువగా అన్నాడు నారాయణ.

ఈరిగాడు అతని మొహంలోకి చూడకుండా కళ్ళు తిప్పుకున్నాడు.

''వస్తాన్నా. నే బోతాండా. ఈ పొద్దు ఎమ్మార్వో రమ్మన్నాడు,'' అంటూ మళ్ళీ అతని వైపు చూడకుండా వెళ్ళిపోయాడు.

నారాయణ హతాశుడై ఒక చెట్టుకింద ముడుచుకుని కూర్చుండిపోయాడు. ఎదురెండకు కళ్ళు బైర్లు కమ్ముతున్నట్లనిపించి భుజం మీది పైగుడ్డ దులిపి నెత్తికి చుట్టుకున్నాడు. సూర్యకిరణాలు అప్పటికి అతన్ని వదలకపోవడంతో నుదుటి మీద అరచేతులు చేర్చుకుని కూర్చున్నాడు.

కాసేపటికి అతని వకీలు అటుగా వెళ్తుండడం కనిపించింది. గొల్లనారాయణ చెట్టుకింద నుంచి లేచి అతనివైపు పరిగెత్తాడు.

''సామీ!''

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆగి అతని వైపు తిరిగాడు.

గొల్లనారాయణ ఆయనకు రెండు చేతులూ జోడించాడు.

''దావా గెలుస్తామంటిరిగద సామీ! ఓడిపోతిమి.''

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఇబ్బందిగా మొహం పెట్టాడు. ఆయనకు బదులు ఆయన వెనకే దావా కట్టలు పట్టుకొస్తున్న వకీలు గుమాస్తా చంద్రాయుడు నోరు తెరిచాడు. ''సారుదేం తప్పులేదు నారాయణా! మనకేసు బలంగా వుండింది. ఆ మాల నాకొడుకులే జడ్జీకి లంచమిచ్చారు,'' అన్నాడు.

పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆ ట్రిక్కుతో కొంచెం తేరుకున్నాడు.

''అవునవును. చేసిందంతా వాళ్ళే. అందులోను ఆ జడ్జీ పరమనీచపు ముండాకొడుకు. అంచమిస్తే చాలు, లొంగిపోతాడు'' అన్నాడు

''ఆ మాలోల్ల కాలంచమిచ్చినంత లెక్క యాడిది సామీ? ఆదే వుంటేగిన ఉద్దరించే

భూమి కోసరం యెంపర్లాడతారా?'' ఆశ్చర్యం ప్రకటించాడు నారాయణ.

''వెర్రి గొల్లోనివి నీకేం తెలుసులే నారాయణా! వెనకటి కాలం కాదు. ఈ కాలం మాలోళ్ళకాడ ఎంత డబ్బుందో నీకేం తెలుసు. ఉద్యోగాలువాళ్ళవే. ఊళ్ళో భూములు వాళ్ళవే. అన్ని సదుపాయాలు వాళ్ళకే. అంత దూరం ఎందుకు, నీ భూమి కూడా వాళ్ళకే పోతోంది చూశావా! అడిగే నాథుడేడి? కోర్టులు కూడా వాళ్ళకు అనుకూలంగానే తీర్పులు చెబుతున్నాయి.'' తన ఆర్గుమెంటు వినిపించాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి.

''ఇప్పుడేం చేయాల సామీ?'' అడిగాడు నారాయణ.

''ఏం చేసేదేముంది? సబ్ కోర్టులో అపీలు చేసుకోవాలి,'' అన్నాడు చంద్రాయుడు.

''అలా చేస్తే నా భూమి నాకు తిరిగొస్తాదా సామీ?''

''ఎందుకు రాదు? మన కేసులో బలం వుందని చెప్తిని గదా.''

''అందుకెంతైతాది సామీ?'' పరబ్రహ్మేశ్వర శాస్త్రి వైపు తిరిగి అడిగాడు నారాయణ.

''ఆ విషయం చంద్రాయుడు చెప్తాడు నాకవతల ఇంకో కేసుంది'' అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి

నారాయణ చంద్రాయుడి వైపు చూశాడు.

''ముందో పది రూపాయలు ఇస్తే చెప్తాను'' అన్నాడు చంద్రాయుడు.

''ఇప్పుడు లేవు సామీ జేబులో లెక్క లేదు.''

అయితే సాయంత్రం ఆఫీసుకురా, ఆడచెప్తాను''అంటూ వెళ్ళిపోయాడు చంద్రాయుడు.

నారాయణ కాసేపు దిక్కుతోచని వాడిలా అక్కడేతచ్చాడి నెమ్మదిగా కోర్టు ఆవరణలోంచి బయటికొచ్చాడు.

''ఏం నారాయణా, యేమైంది కేసు?'' అడిగాడు రాముడు.

కోర్టు వెలుపల టీ బంకు అతనిదే అక్కడికి వచ్చినప్పుడల్లా నారాయణ రాముని టీయే తాగుతాడు.

''పోయిందన్నా, దావా కొట్టేసినారు'' దిగులుగా అన్నాడు నారాయణ.

రాముడు అతని మొహం చూసి ఆమాట ముందే గ్రహించాడు. ఏళ్ళ తరబడి కోర్టు ముందు టీ బంకు నడుపుతుండటం వల్ల ఎవరికేసు ఏమైందో మొహం చూసి చెప్పగల అనుభవం సంపాయించుకున్నాడతను. నారాయణ ఆమాట చెప్పగానే గమ్మున గ్లాసులో టీ పోసి అతని వైపు చాచాడు.

''ఇదో, టీ తాగు''

''వద్దులే,'' అన్నాడు నారాయణ.

''పరవాలేదు తీస్కోన్నా. కోర్టులో కేసు గెలవాల్నంటే అంత సులభంగా అయితాదా? అవసరమైతే హైకోర్టు క్కూడాపోవాల్సొస్తాది. ముందు టీ తాగు.''

నారాయణ టీ గ్లాసందుకున్నాడె అతనికి టీ తాగాలని లేదు. కడుపులో దహించుకు

పోతోంది. అయినా నెమ్మదిగా టీ చప్పరించడం మొదలెట్టాడు.

రాముడు పిస్టన్ కొట్టి కిరసనాయిలు స్టవ్ మంట ఎక్కువచేస్తున్నాడు బుస్సుని శబ్దం చేస్తూ మంట క్రమంగా పెరుగుతోంది. స్టౌమీదున్న పాత్రలో టీ మరింత వేగంగా మరగనారంభించింది.

నారాయణ ముభావంగా స్టౌమంటకేసి చూస్తూ కూర్చున్నాడు. తన పరిస్థితి ఆ స్టౌమీద మరుగుతున్న టీ పరిస్థితి ఒకటేననిపించిందతనికి. చూస్తూండగనే చేజారిపోతున్న తన నాలుగెకరాల భూమి గుర్తుకొచ్చింది. ఇక టీ తాగబుద్ధి కాలేదు. గ్లాసు పక్కనే బల్లమీద పెట్టేసి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

ఆ నాలుగెకరాల భూమినే నమ్ముకు బతుకుతున్న సన్నకారు రైతు అతను. వాన సరీగ్గా పడదు. చాలాకాలం క్రితం అతనికా భూమికి పంపుసెట్టు వేయించాలనే ఆలోచన వుండేది. తన భూమికి పక్కనే వున్న రామిరెడ్డి పంపుసెట్టు కోసం బ్యాంకు ఋణం ఇప్పిస్తానని కూడా చెప్పాడు.

అయితే ఋణం తీసుకుని పంపుసెట్టు వేయిస్తే ఏమవుతుందో నారాయణకు తెలుసు. రామిరెడ్డి ఆ వూళ్ళోకల్లా పెద్ద పాలెగాడు. ముప్పైఎకరాల ఆసామి తనపల్లెలో పెత్తనమంతా అతన్దే. అతని మాట విని తను పంపుసెట్టు వేయించుకుంటే ఋణం ఇప్పించిన నెపం మీద పంపు నీళ్ళు తన భూమిలోకి మళ్ళించమంటాడు. తన నాలుగెకరాల సంగతేమో కాని, అతని ముప్పై ఎకరాలకు నీళ్ళు సప్లై చేయడానికే తన జీవిత కాలం సరిపోతుంది. అ భయంతో పంపుసెట్టు గురించి ఆలోచన మానుకున్నాడు. నీళ్ళ సదుపాయం వుంటే వరి సైతం పండే పొలం అతన్ది. వేరుశెనగ, పొద్దుతిరుగుడు పూలు అలాంటి వ్యాపార పంటలతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. అంతలోనే పొలాన్నిన వదిలిపెట్టి పొమ్మని గవర్నమెంటు ఆర్డరు పిడుగులా వచ్చి పడింది.

ఫలానా సర్వే నంబరు ప్రకారం గవర్నమెంటు పోరంబోకుగా వుంటూవున్న భూమిని చట్టవ్యతిరేకంగా నువ్వు దురాక్రమణ చేసి సాగు చేస్తున్నట్టు మాకు తెలియవచ్చింది. కావున వెంటనే భూమిని వదిలిపెట్టి పోవలసింది. అట్లు కాని యెడల నీపై చట్టపరమైన చర్యలు తీసుకొనబడును- అదీ ఆర్డరు.

అలాంటి ఆర్డరు రావడంతో నారాయణకు మతి పోయినట్లయింది. ఇదేం న్యాయం! తను సాగుచేస్తున్న భూమి గవర్నమెంటు పోరంబోకు కాదు తాత తండ్రులనుంచి తనకు సంక్రమించింది. లబోదిబో మంటూ అతనా ఆర్డరు పట్టుకుని ఎమ్మార్వో ఆఫీసుకు వెళ్ళాడు. వాళ్ళకాళ్ళు పట్టుకుని వీళ్ళకాళ్ళు పట్టుకుని ఎలాగో తన భూమికి సంబంధించిన రికార్డులు బయటికి లాగించాడు.

రికార్డుల్లో ఆ భూమి గవర్నమెంటు పోరంబోకనే వుంది. కాబట్టి నువ్వా భూమి 'వదులుకోవలసిందే'' అన్నారు వాళ్ళు.

ఆ రికార్డులు పుట్టక ముందునుంచీ ఆ భూమిని వంశానుగతంగా తామే సాగుచేస్తూ వస్తున్నారు. అలాంటిది రికార్డుల్లోకి ఆ భూమి గవర్నమెంటు పోరంబోకని ఎందుకు ఎక్కిందో ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా అతనికి అర్థం కాలేదు.

''ఇదంతా కరణమయ్యా పనే అయ్యుండాల మీ నాయన బతికుండగా చానా పితలాటకం చేసిందా యప్పే కదా. ఇప్పుడంటే ఈ ఎమ్మార్వోలూ వీళ్లంతా వచ్చినారు. అప్పుడంతా కరణమయ్యే గదా. పోయి అడుగు'' అని సలహా ఇచ్చింది నారయణ భార్య.

లక్ష్మమ్మ చెప్పింది నిజమే. ఇది కరణమయ్య చేసిన పితలాటకమే అయ్యుండాలి. నారాయణ పెల్లప్పుడు నారాయణ తండ్రికి తీవ్రంగా జబ్బు చేసింది. దాంతో భూమి సాగుచేసే వాళ్ళెవరూ లేకపోయారు. అప్పుడు కరణమయ్యే ఒక ప్రతిపాదన తెచ్చాడు.

''చూడు శేషన్నా! ఈ పరిస్థితిలో భూమి నువ్వెలాగా సాగుచేసుకోలేవు. కాబట్టి నాకు గుత్తకిచ్చేయ్. వచ్చినపంటలో ఎంతోకొంత నీకిస్తాను. దాంతో నీకు దిగులుండదు,'' అన్నాడు.

నారాయణ తండ్రికి కూడా ఆ పరిస్థితిలో అంతకంటే చేయగలిగిందేం లేదనిపించింది. దాంతో కరణమయ్యకే ఆ పొలం గుత్తకిచ్చేశాడు. కరణమయ్య ఒక రెండేళ్ళు బాగానే వున్నాడు. ఆ తర్వాత మనిషే మారిపోయాడు. ఆ భూమి తనదేనని ప్రచారం చేసుకోవడం మొదలెట్టాడు. గుత్త ఎగ్గొట్టేశాడు.

అలా కొన్నేళ్ళు గడిచాయి. ఈలోగా నారాయణ తండ్రిజబ్బు నుంచి కోలుకున్నాడు కరణమయ్య సంగతి పదిమంది పెద్దల్లో పంచాయితికి పెట్టించాడు. ఆ భూమి తనదేనని కరణమయ్య మంకుపట్టుపట్టి కూర్చున్నాడు. ఒకసారి అది తన తాతల కాలం నాటిదని బుకాయిస్తాడు. ఒకసారి శేషన్నే అది తనకు అమ్మేశాడంటాడు.

ఆ సమయంలో ఆ ఊరి రెడ్డిగా వున్నా, భూమిరెడ్డి, శేషన్న పక్షాన నిలిచాడు. అంతకుముందు కొద్ది రోజులుగా కరణమయ్యకూ రెడ్డికీ ఏదో విషయమ్మై కీచులాట జరిగింది. అదే శేషన్నని రక్షించింది. లేకపోతే భూమి కరణమయ్యదేనని తీర్పు చెప్పేసేవాడు రెడ్డి. శేషన్న భూమి శేషన్నకు ఆవిధంగా తిరిగి ఇవ్వక తప్పలేదు కరణమయ్యకు. అప్పట్నుంచీ శేషన్న కుటుంబం మీద గుర్రుగానే వుంటూ వచ్చాడు. ఎలాటైనా ఆ భూమి కాజేయాలని పథకాలు వేస్తూనే వున్నాడు.

శేషన్న తదనంతరం ఆ భూమి నారాయణకు వచ్చింది. ఆ తర్వాత కరణమయ్య పరిస్థితి కూడా మారిపోయింది. ప్రభుత్వం రెడ్డి కరణం పోస్టులు రద్దుచేసి మండల కార్యాలయాలు తెరిచింది. కరణం తన కొడుక్కి విలేజ్ ఆఫీసర్ ఉద్యోగం తెచ్చుకోవాలని చాలా ప్రయత్నించి విఫలమయ్యాడు. ఆ తర్వాత ఆయనకు పక్షవాతం కూడా వచ్చింది. నాయాయణకు శ్రీముఖం చేతికొచ్చే సమయానికి కరణమయ్య మంచానపడున్నాడు. నారాయణ గవర్నమెంటు ఆర్డరు పట్టుకుని కరణమయ్య దగ్గరికి వెళ్ళాడు.

''చూడు కరణమయ్యా ఏందిది?'' అన్నాడు నారాయణ. కరణమయ్య పరిస్థితి దారుణంగా వుంది. కుడిచెయ్యి, కుడికాలు పడిపోయాయి. మూతికూడా వంకర తిరిగింది. అయినా మాట్లాడ గలిగే స్థితిలోనే వున్నాడు. నారాయణ పట్టుకొచ్చిన ఆర్డరు చూసి వంకర మూతిలో అసహ్యంగా నవ్వాడు.

''ఇలాంటిది ఏదో రోజున జరుగుతాదని నాకు తెలుసురా నేనే ఆపని చేసింది,'' అన్నాడు ఏమాత్రం సిగ్గుపడకుండా.

నారాయణ గుడ్లు మిటకరించి, ''ఏం చేసినావు కరణమయ్యా?'' అన్నాడు.

''మీ నాయన నాకు చేసిందానికి రెండింతలు చెయ్యాలనుకున్నా రికార్డుల్లో ఆ భూమి గవర్నమెంటు పోరంబోకని నేనే నాస్వహస్తాలతో రాసినా.''

'న్యాయంకోసం పోట్లాడ్డమే మా నాయనచేసిన నేరమా కరణమయ్యా?' అని నారాయణ అడగలేదు. ''నీ కోపం మా నాయునమిందైతే నేనేం జేసినా కరణమయ్యా? బీద నాకొడుకుని నన్నన్యాయం చేస్తివే!'' అన్నాడు గుండె బాదుకుంటూ.

''నువ్వు మాత్రం? మీ నాయన కొడుకువి కావేమిరా?'' అన్నాడు కరణమయ్య.

''ఎప్పటిదో పగ ఇప్పుడు నామీద ఎందుకు తీర్చుకుంటావు కరణమయ్యా ఈ కుడిసేత్తో ఎన్ని దొంగరాతలు రాసి ఎందరి కొంపలు ముంచినావో బగవంతుడా చెయ్యి పడిపోయినట్టు చేసి ఇంకనైనా కనికరించి ఈ భూమి గొల్ల నారాయణదని సాచ్చెం చెప్పూరా'' కడుపుమంట ఆపుకోలేక అనేశాడు నారాయణ.

కరణమయ్య తల అడ్డంగా వూపాడు. ''నువ్వన్నెట్టు ఎన్నో పాపాలు చేసిన చెయ్యి పడిపోనే పడిపోయింది. అయితే మాత్రం నీకు నేనెందుకు సాయం చెయ్యాల? నా చెయ్యి నాకు తిరిగొస్తాదా? ఇప్పుడీ భూమి నీదని సాక్ష్యం చెబితే దొంగ రికార్డులు రాసినందుకు నా గొంతుమీది కొస్తాది. పో, పోయి కోర్టులో కేసేసుకో'' అన్నాడు.

''అంతేనంటావా కరణమయ్యా?'' ఖిన్నుడై అడిగాడు నారాయణ.

''అంతే పో. నేనేం చేయలేను'' నారాయణ వకీల్ని చూడ్డానికి వెళ్ళాడు. ఈలోగా మరొకటి జరిగింది.

ముప్పై సంవత్సరాల క్రితం ఎప్పుడో కుందేరు పొంగి చుట్టుప్రక్కల పల్లెలు కొన్ని మునిగిపోయాయి. ఆ ముంపులో బాగా దెబ్బతిన్నవి హరిజన కుటుంబాలు. వాళ్ళంతా కూడ బలుక్కుని ఆ పల్లెలు వదిలేసి ఎగువ ప్రాంతాలకు వలస వచ్చారు. వాళ్ళంతా నారాయణ వుండే-వూరు చివర కొట్టాలు వేసుకున్నారు. అప్పట్లో వాళ్ళని కొట్టాలు వేసుకో నిచ్చింది ప్రస్తుతం నారాయణ భూమికి పొరుగువాడైన రామిరెడ్డి తాతగానే. అప్పట్లో ఆయన పంచాయతీ బోర్డు ప్రెసిడెంటుగా వుండేవాడు. ఆవూరి రెడ్డి అయిన భూమిరెడ్డి మంచి తీవ్రమైన పోటీ ఎదుర్కొంటున్నాడాయన.

''మరేం పర్వాలేదు. ఇవన్నీ మన స్థలాలే. మీరంతా కొట్టాలు బేస్కోండి. మీ పేర్లు ఓటర్ల జాబితాలో ఎక్కిస్తాను. ఓట్లు నాకు బేయండి,'' అన్నాడు రామిరెడ్డి తాత.

హరిజనులు సరేనన్నారు.

రామిరెడ్డి తాతగారి రాజకీయాస్త్రం బ్రహ్మాండంగా పనిచేసింది. కొత్తగా తెచ్చుకోగలిగిన ఓట్లతో పంచాయితీ బోర్డు ఎన్నికల్లో ఆయన భూమిరెడ్డిని చిత్తుగా ఓడించాడు. అప్పట్నుంచీ హరిజనులు అక్కడే వుంటున్నారు. వాళ్ళ ఓట్లన్నీ ఎప్పుడూ రామిరెడ్డి తాతకే పడేవి. దాంతో ఆయన జీవితకాలంలో రాజకీయ పలుకుబడికి తిరుగులేకపోయింది.

ఆయన తదనంతరం రామిరెడ్డి హయాం వచ్చింది. అతనూ పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు కావాలని ఆశపడ్డాడు. అయితే చాలాకాలం పాటు ప్రభుత్వం ఎన్నికలు

జరపనేలేదు ఇప్పుడు మళ్ళీ ఎన్నికలు జరుగుతాయనే అలికిడి వినిపించసాగింది.

ఈసారి ఎన్నికల్లో హరిజనుల ఓట్లు రామిరెడ్డికి పడవనే విషయం ముందే తేలిపోయింది. రామిరెడ్డి హరిజనుల్ని ఎప్పుడూ మనుషులుగా చూసినవాడు కాదు మాలనా కొడుకులు అనే పదం తప్ప వాళ్ళను గురించి అతని నోటివెంట మరోమాట దొర్లిపడదు. దానికి తోడు అతని మనుషులు కూడా హరిజనులపట్ల నీచంగా ప్రవర్తించడం మొదలెట్టారు. హరిజనుల ఆడవాళ్ళు కనిపిస్తే ఏడిపించడం, ఒంటరిగా దొరికితే పైట లాగడం వంటివి నిత్యకృత్యాలయినాయి. దాంతో హరిజనులు ఈసారి ఎన్నికల్లో రామిరెడ్డికి బాగా బుద్ధి చెప్పాలనే కృత నిశ్చయంతో వున్నారు

రామిరెడ్డితో ఎవరు పోటీ చేస్తారో ఇంకా తేలలేదు. అతని తాతగారి కాలంలో గట్టిపోటీ ఇస్తూ వచ్చిన భూమిరెడ్డి ఇప్పుడు లేదు. అతను బతికుండగ తనకుటుంబం నుంచి ఎవర్నో ఒకర్ని పోటీగా నిలబెట్టేవాడు. వాళ్ళలోనే ఎవరైనా పోటీకి నిలబడవచ్చు. అదే జరిగితే ఈసారి ఎన్నికల్లో హరిజనుల ఓట్లు అవతలకి పోవడం ఖాయం. రామిరెడ్డి ఓడిపోవడమూ ఖాయమే.

దాంతో హరిజనుల్ని స్థలాలు ఖాళీచేయమని పట్టుబట్టారు రామిరెడ్డి. ''మాయబ్బ ఉద్ధర కిచ్చిన స్థలాలు. ఎల్లకాలం ఆడనే వుంటారేమిరా మాలనా కొడుకుల్లారా? ఖాళీ చేయండి'' అంటూ తాఖీదు ఇచ్చాడు.

ఆ తర్వాత చాలా కథ జరిగింది. విషయం కలెక్టరు దాకా వెళ్ళింది. ఎప్పుడో ముప్పై సంవత్సరాల క్రితం ఆక్రమించుకున్న స్థలాలు ఇప్పుడు హరిజనులు వదలడమేమిటని కలెక్టరు అడగలేదు. అలా అడగటానికి బదులు ఒక నిర్ణయం చేశాడు. హరిజనులకు వేరేచోట స్థలాలు చూపిస్తానన్నాడు. వాళ్ళూ అందుకు ఒప్పుకున్నారు.

ఇక వాళ్ళకు వేరే స్థలం చూపించే విషయం వచ్చే సరికి ఎమ్మార్వోగారికి గబుక్కున దొరికింది. నారాయణ సాగుచేస్తున్న భూమే. దాన్ని హరిజనులకు అలాట్ చేస్తూ ఆర్డర్లు కూడా జారీ అయిపోయాయి.

నారాయణ దాంతో మరీ బెంబేలెత్తిపోయాడు.

వకీలు పరబ్రహ్మేశ్వర శాస్త్రి నారాయణకు అభయం ఇచ్చేశాడు. ''మరేం పరావాలేదు. నీ భూమి ఎక్కడికీ పోదు. టైటిల్ డిక్లరేషన్‌కి సూటు పడేద్దాం. దాంతో అటు గవర్నమెంటువాళ్ళూ ఇటు మావాళ్ళూ ఇద్దరూ అణిగిపోతారు. నీ భూమి నీ కొస్తుంది'' అన్నాడు.

నారాయణ సరేనన్నాడు.

కోర్టులో దావా మూడున్నర సంవత్సరాలు నడిచింది. నారాయణ ఓడిపోయాడు. తనకళ్ళ ముందే తన భూమి అన్యాక్రాంతమైపోయే పరిస్థితి దాపురించింది.

''ఏమన్నా, ఇంకో టీ ఇమ్మంటావా?'' అన్నాడు రాముడు.

స్టేమంటకేసి చూస్తూ కూర్చున్న నారాయణ సిట్టూర్పుతో లేచి నిలబడ్డాడు. ''వద్దులే'' అక్కడ్నించి అతను తన వూరికి వెళ్ళేదు అపూట భోజనం కూడా చేయలేదు. భోం

చేయడానికి ఆకలిగా కూడా అనిపించలేదు.

సాయంకాలందాకా పిచ్చివాడిలా అటూ ఇటూ తిరిగి పరబ్రహ్మేశ్వర శాస్త్రి ఆఫీసుకు వెళ్ళాడు.

''రారా, కూర్చో,'' అన్నాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి.

''అపీలుకెంతైతాది సామీ?'' అడిగాడు నారాయణ.

''ఎంతవుతుంది, సూటుకెంతైతాండో దాదాపు అంతే అవుతుంది,'' అన్నాడు పరబ్రహ్మేశ్వర శాస్త్రి.

నారాయణ గుండె గుభేల్మంది.

''అంతనా?'' అన్నాడు నోరు తెరచుకుని.

''అంతేమరి, కోర్టా మజాకా!'' అన్నాడు పరబ్రహ్మేశ్వరా శాస్త్రి.

నారాయణ మొహం వేలాడేసుకుని తన వూరు తిరిగొచ్చాడు.

వస్తూనే అతను నేరుగా తన ఇంటికి పోలేదు. కరణమయ్య ఇంటికి వెళ్ళాడు.

ఈ మూడునాలుగేళ్ళలోనూ కరణమయ్య పరిస్థితి మరింత క్షీణించింది. ఇది వరకు మాట్లాడగలిగేవాడు. ఇప్పుడదీలేదు. అతనికి అన్నీమంచం మీదనే జరుగుతున్నాయి.

నారాయణ వెళ్ళేసమయానికి కరణమయ్య మంచం దగ్గర ఎవరూ లేరు. నారాయణ తిన్నగా వెళ్ళి ఆ మంచం పక్కనే నేలమీద కూర్చున్నాడు.

''నీ పగతీరినాది కరణమయ్యా! కోర్టుకూడా నువ్వు రాసిన దొంగలెక్కే ఒప్పుకున్నాది. ఒంక మాలోల్లు నా భూమి ఇగ్గుకుంటా'' అన్నాడు.

కరణమయ్య కదల్లేదు. గాజు కళ్ళతో నారాయణకేసి చూస్తున్నాడు. ''మీరంతా ఒకటే కరణమయ్యా. రెడ్డికూడా యాపొద్దూ నాకాడ పన్ను తీసుకున్నాక రసీదు యియల్యా. ఒక పనికిమాలిన నోటు పుస్తకంలో రాసిస్తావున్నాడు. ఆ రెడ్డే వచ్చినాడు. ఇంకనువ్వు వస్తావ్.'' కసిగా అన్నాడు నారాయణ.

కరణమయ్య గాజుకళ్ళతో ఇంకా చూస్తూనే వున్నాడు.

''ఎర్రిగొల్లోన్ని చేసి ఈ భూమ్మీద నాకింత, అన్యాయం చేస్తే భగవంతుడు మాత్రం మిమ్మల్ని చమిస్తాడా కరణమయ్యా? మిరంతా సక్కంగా నరకానికి పోతారు.''

నారాయణ గొంతులో క్రమంగా దుఃఖం చోటు చేసుకోసాగింది.

''నా భూమి నాక్కాకుండా చేస్తావా కరణమయ్యా, భూమిపోయినాక కూలిపన్జేసి నా బిడ్డల్ని సాక్కుంటా. కానీ నాకింత చేసినావు నీ బిడ్డలు మాత్తరం అడక్కదిండారు. చేతిలో చిప్పపట్టుకోని ఇంత ముద్ద కోసరం ఇల్లిల్లా తిరిగేరోజు నీ పిల్లలకి వచ్చితీర్తాది కరణమయ్యా! నా ఉసురు నీ పిల్లలకి తగుల్తాది'' నారాయణ గుండె దబదబా బాదుకున్నాడు. ''నా ఉసురు తగుల్తాది కరణమయ్యా! ఇంకా తగుల్తాది. ఇంకా తగుల్తాది.''

అతని మంచందగ్గర్నించి దగ్గనలేచి పోతూ మళ్ళీ ఆగాడు వెనక్కొచ్చాడు. కరణమయ్య మొహంలో మొహం పెట్టి చూశాడు.

''ఇప్పుడు నీ మంచం కాదయెవులూ లేరు కరణమయ్యా! ఇప్పుడు నీ గొంతు పిసికి సంపినా నాకడ్డమోచ్చేటోల్లు ఎవులూలేరు,'' రెండుచేతులూ కరణమయ్య గొంతు దగ్గరికి తీసుకెళ్ళాడు.

కరణమయ్యలో మొదటిసారిగా కొంత చలనం కనిపించింది. ఎడంచెయ్యి ఎడం కాలు ఆడించడానికి ప్రయత్నిస్తూ గొంతులోంచి కీచుమనే శబ్దం మాత్రం తేగలుగుతున్నాడు.

నారాయణ అతని గొంతు దగ్గరగా పోనిచ్చినవాడల్లా వుళ్ళా చేతులు వెనక్కి తీసుకున్నాడు.

''ఛీ'' అంటూ ముప్పావు వంతు నిర్జీవంగా వున్న ఆ మొహం కేసి అసహ్యంగా చూసి చరచరా అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

ఇంటికెళ్ళాక భార్యాబిడ్డల్ని దగ్గరికి తీసుకుని ఏడ్చాడు నారాయణ. ''ఉండే ఆధారం పాయ. ఇంగ మనం ఎవల్దగ్గర్నో కూలిచేసి బతాకాల'' అంటూ బావురుమన్నాడు.

అతని భార్య అతనంత బేలకాదు.

''ఛా వూర్కో! పిల్లలు బెదిరిపోయి సూస్తుండారు. మిందికోరటుకు దావా తీస్కెల్లాలని వకీలు చెప్పినాడంటివి గదా! మన భూమి యాడికి పోదులే'' అని ధైర్యం చెప్పింది.

ఆమె ప్రోద్బలం మీదనే ఆ మర్నాడు నారాయణ మళ్ళీ టౌనుకు వెళ్ళి కాపీ స్టాంపులు పడేయించి వచ్చాడు.

అతన్లో ఇప్పుడే మాత్రం ఉత్సాహం లేదు. అపీల్లో కూడా తను గెలుస్తాడని నమ్మకం కుదరడం లేదు. దేవుడే తననింక రక్షించాలి.

ఇంట్లోంచి బయటికి రావడం కూడా అతను మానేశాడు.

అతని భార్య అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించి ప్రయత్నించి విఫలమై ఇక తన చేతకాదని వూరుకుండిపోయింది.

ఒక వారం రోజులు గడిచాయి.

నారాయణ ఇంట్లో మంచం మీద పడుకొని పైకప్పు కేసి చూస్తూ భూమి తన చెయి దాటిపోయాక ఏంచేయాలని ఎడతెగని ఆలోచనల్లో మునిగిపోయివున్నాడు.

అదే సమయంలో బయట్నించి ఒక పిలుపు వినిపించింది.

''నారాయణా''

నారాయణ లేచి కూర్చున్నాడు.

''ఎవరు?''

''నేను రామిరెడ్డిని.''

ఆ పేరు వింటూనే నారాయణలో బద్ధకం వదిలిపోయింది గబగబా బయటికి

పరిగెత్తాడు

''నువ్వా అన్నా! రా, లోపలికి రా'' అన్నాడు కంగారు కంగారుగా.

''ఏంలేదు, నీతో మాట్లాడేదుంది'' అన్నాడు రామిరెడ్డి.

''రాన్నా, లోపలికిరా'' అంటూ లోపలికి దారితీశాడు నారాయణ.

చెట్టంత మనిషి రామిరెడ్డి ఎత్తుకు తగ్గలావు నారాయణ ఇంటి పొట్టి గుమ్మంలోంచి బాగా వంగి లోపలి కొచ్చాడు.

నారాయణ నులకమంచం మీద దుప్పటి పరిచాడు.

''కూకోన్నా!''

రామిరెడ్డి హుందాగా కూర్చున్నాడు.

మంచం కీళ్ళు కరకరమన్నాయి.

నారాయణ అతని ఎదురుగా నేలమీద కూర్చున్నాడు.

''మరేం లేదు నారాయణా, నీ భూమి నాకమ్ముతావేమోనని వచ్చినా'' రామిరెడ్డి మాట్లాడుతుంటే గొంతు ఖణేల్ ఖణేల్ మంటుంది.

నారాయణ తన చెవుల్ని తానే నమ్మలేక నోరు తెరిచేశాడు రామిరెడ్డి నుంచి ఇలాంటి ప్రస్తావన వస్తుందని అతను కల్లోకూడా అనుకోలేదు.

''అది కాదన్నా...'' అంటూ ఏదో చెప్పబోయాడు.

రామిరెడ్డి అతన్ని మాట్లాడనివ్వకుండా చెయ్యి అడ్డు పెట్టాడు. ''నువ్వేసిన దావా కొట్టేసినారు నాకు తెల్సు. అందుకే నేనొచ్చిన నారాయణా! ఆ భూమి నువ్వు నిలుపుకోలేవు. నువ్విస్తానంటే ఎకరా పదివేలకు నేను రాపిచ్చుకుంటా ఏమంటావు?''

నారాయణకు వెంటనే నోటివెంట మాట వూడిపడలేదు. బుర్రగోక్కుంటా వుండిపోయాడు.

''నాకు తెల్సు నారాయణా!'' మళ్ళీ చెప్పనారంభించాడు రామిరెడ్డి. ''నీ భూమి ఎకరా పద్దైదు వేలు పలుకుతాది. పదివేలు ధర అగ్గువే. కానీ, దావాలో ఇరుక్కోనిపోయిన భూమికి పదిరూపాయలు పెట్టైనా ఎవురు కొంటారు? నా మాటిని ఒప్పుకో, ఆ లెక్కతో ఇంగోచోట యాడైనా భూమి కొనుక్కో నాకు మాత్రం ఈ నాలుగెకరాలు ఇచ్చేయి. నీ మంచికోరే చెప్తాండా.''

''అది కాదన్నా...'' మళ్ళీ బుర్రగోక్కున్నాడు నారాయణ.

''నాకు తెల్సులే నువ్వేందనాలను కుంటాండావో! చెప్తా యిను. నీ భూమి పక్కనే నా భూమి వుండాది. నీ భూమి కొంటే నా భూమి ఇంగా పెరుగుతాది. అవునా? అందుకే నీ భూమి కొందామనుకుంటాండా''

కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

''అసలు కారణం ఇంగోటుండాదిలే నారాయణా! సరే, అది సుద్దా చెప్తా యిను. నీ

భూమి గవర్నమెంటోల్లకు బోతే ఒల్లు మాలోల్లకిస్తారు. ఇంతకాలం ఈ మాల నాకొడుకుల్ని ఊరవతల బరిస్తావస్తిమి. ఇప్పుడు నా భూమి పక్కనే నస్తానంటాండారు కొడుకులు. సూడు నారాయణా! నువ్వు గొల్లోనివి, నేను రెడ్డిని ఉంటే ఈ భూమి మనమద్దెనే వుండాల. మద్దెన ఈ మాల నాకొడుకులెవరంట? ఈల్లకు మల్లా ఓట్లు? వాల్లు నా పక్కకు రానీక లేదు. నేను రానివ్వను ఇంక కోర్టు అంటావా? కోర్టంటే నాకేం భయంలేదు. కావాల్నంటే మండలాఫీసులో రికార్డులే తిరగరాపిస్తా. అదంతా నీకు తెల్వదులే. చెప్పుమరి, భూమి నాకమ్ముతావా? ఎప్పుడో ఎల్లునొచ్చి, ఈ వూరి మీంచొచ్చి పడితే ఈ మాల నాకొడుకులందర్కీ మా యబ్బ కొట్టాలేపిచ్చుకో నిచ్చినాడు. అయ్యో బట్కేని ఇప్పుడాల్లు నామింద ఎగర్లాడతాండారు. నువ్వు గిన భూమి నాకమ్మితే మల్లీ ఎల్లువొచ్చి యీల్లంతా పూర్వం పల్లెల్నొదేసి లేచినారో అట్టే మల్లా లేపిస్తా. ఎకరాకి పదివేలు ఇస్తానంటుండా, చెప్పు న్యాయమైన మాటేనా?''

నారాయణ ఏదో అనడానికి మళ్ళీ నోరు తెరిచాడు.

అప్పటికే పెరట్లో వున్న అతని భార్య తలుపుచాటుకొచ్చి ఆ సంభాషణంతా వింటోంది. మొగుడు నోరు తెరుస్తూనే ఏం అనేస్తాడోనని.. గబగబా ఆమె వాళ్ళ ముందుకొచ్చేసింది.

''అన్నా! రామిరెడ్డన్నా! ఆ దేవుడే మిమ్మల్ని మాకాడికి పంపినాడు. నా మొగానికి ఒకటంటే ఒకటి తెల్వదు. అట్నే తీస్కోన్నా. ఎకరా పదివేల కిచ్చేస్తాం'' అంది.

రామిరెడ్డి ఇంకేమనడానికి నారాయణకు అవకాశం ఇవ్వలేదు.

''అది మాట, నీకంటే మీ ఇంటిదానికి తెలివి జాస్తిగా వుండాది. యాడున్నా బతికి పోతావుపో. ఇంకేమనకు, ఎకరా పదివేలు. రేపే రిజిస్టరు చేయించుకుంటా అగ్రిమెంటూ గిగ్రిమెంటూ యేమొద్దు. ఈ అడ్వాన్సు నీ కాడుంచు'' అంటూ జేబులోంచి పదివేల రూపాయల కట్టలు రెండు తీసి నారాయణ చేతిలో వుంచేశాడు.

నారాయణ వెర్రివాడిలా ఆ కట్టలవంక చూస్తుండగా, ఎలా వంగి లోపలికొచ్చాడో అలాగే వంగి గుమ్మంలోంచి బయటికి వెళ్ళిపోయాడు రామిరెడ్డి.

ఆ రాత్రి నారాయణకు కలొచ్చింది.

కల్లో పెన్నానది పొంగింది. తను ఊళ్ళోకి ఎల్లువొచ్చింది. ఆ ముంపులో మాలా హరిజనులూ కొట్టుకుపోతున్నారు.

ఈరిగాడు గూడ తన పక్కనే కొట్టుకుపోతుండడం నారాయణకు స్పష్టంగా గుర్తు!

# పురుగు

[illegible]

పొలం గట్టున నిల్చున్న పైడితల్లి ప్రాణమున్న దిష్టిబొమ్మలా [illegible] సూరీడు నిప్పుల కుంపటిలా ఉన్నాడు.

కుడిచేత్తో పొన్నుకర్ర పట్టుకుని, ఎడంచేతిని ఎండకు అడ్డం పెట్టుకొని [illegible] కలయజూశాడు పైడితల్లి.

ఎండనక....వాననక

పగలనక....రాత్రనక

తిండెరుగక....నిద్రెరుగక

దుక్కిదున్ని....దమ్ముచేసి

పట్టిగొట్టి....పదునుపెట్టి

నారునాటి....నీరుపెట్టి

గొప్పుతవ్వి....గట్టుకట్టి

ఎరువువేసి... ఏపుచేసి

ఎదురుగా చూసిన పైడితల్లి యిన్నాళ్లకు. పదిమంది [illegible] పరచుకుని, కంటికెదురుగా.... సరదాగా కనిపించేసరికి [illegible] కన్నతల్లి వందిలా.... పొడుగు పొడి, [illegible] యెదలా....పరవశించింది.

ఏపుగా పెరిగిన వంగ...బెండ.... ఉల్లి....మిరపమొక్క [illegible] చేస్తుంటే.... పడ్డ కష్టానికి ఫలితం దక్కబోతున్న [illegible] కదలాడింది. తృప్తిగా గుండెల్నిండా గాలి పీల్చుకుని, [illegible] ముఖానికి పట్టిన చెమట తుడుచుకోబోతున్న పైడితల్లికి [illegible]

ముఖానికి మరింత చెమటలు పట్టేసినయ్

ఎదురుగా.... ఎగువ మడిలో పచ్చని మిరప మొక్కకి [illegible]

అగ్గితెగులు!

ఆరోగ్యంగా ఉన్న ఊపిరితిత్తులకు అకస్మాత్తుగా [illegible]

పాలుగారే పసిపాప పసిడి ముఖాన పొడసూపిన మహమ్మారి మశూచి మచ్చల్లా....

గుండెల్నెవరో పట్టి పిండినట్టు వూపిరాడక ఉక్కిరిబిక్కిరయ్యాడు పైడితల్లి.

సురోవారం పది రోజుల్లో చేతికి రాబోతుందనుకున్న పంట, చేజారిపోతుందేమోనన్న బెంగతో బెంబేలు పడిపోయాడు

అంతే! అంతలోనే ఏదో గుర్తొచ్చినట్టు పరుగు లంకించుకున్నాడు, తన పెద్ద దిక్కు పెదనాయుడు ఇంటికేసి.

''దండాలు బాబయ్యా....దండాలు....

మిరపతోటకి 'అగ్గితెగులం'టుకుందయ్యా.... అవుసరంగా, 'అరిజెంటు'గా పురుగుమందు కావాల.... బాకీ కింద రాసుకోండి... కొత్తవానకి సెల్లుబాటు సేసేత్తాను....''

అరుగుమీద, పడక కుర్చీలో పడుకున్న పెదనాయుడు. నిద్రాభంగానికి పడగ విప్పిన పాములా బుస్సుమన్నాడు. తోకతొక్కిన తాచులా కస్సుమన్నాడు.

వాకిట్లో నిల్చున్న పైడితల్లికేసి కొరకొరా చూశాడు.

పాత బాకీలు తిరగవేశాడు....

ప్రామిసరీ నోట్లు గుర్తు చేశాడు...

ఇవ్వాల్సిన అసలు యింతన్నాడు....

అసలును మించిన వడ్డీ అంతన్నాడు....

ఎంతన్నా. .. ఏవన్నా పైడితల్లి పాడేపాట ఒకటే...

''దయుంచండి బాబయ్యా.... పేదోణ్ని... పిల్లలుగలోణ్ని.... ఈసారి పంటనమ్మిన సొమ్ములోంచి, కుసింత జమ సేత్తాను... పెద్దలు దయతల్చాల...''

అర్జించడం పేదవాడి నైజం....

గర్జించడం పెద్దవాడి భేషజం...

అర్థింపులు.... గర్జింపుల అనంతరం, ఆనవాయితీగా పైడితల్లికి అప్పు పుట్టింది. అయితే ఆ అప్పుకు, రెండింతల అసలుతో మరో కొత్త ప్రామిసరీనోటు పైడితల్లి పాతనోట్లకు జతయింది.

సింహం గుహలోకి కుందేలు వెళ్ళినా...

కుందేటి గూటికి సింహమొచ్చినా....

పర్యవసానం ఒకటే!

మందు చల్లిన రెండు మూడు రోజుల్లో మంత్రం వేసినట్టు పూర్తిగా మాయమైపోయింది 'అగ్గితెగులు!'

మళ్లీ ఎప్పటిలా పంటంతా పచ్చగా కళకళ్లాడుతూ కనిపించేసరికి నిశ్చింతగా గుండెల్నిండా గాలి పీల్చుకున్నాడు పైడితల్లి..

''మరో వారం రోజులు ... పంట చేతికి రావడానికి అనుకున్నాడు. మనసులో అప్పుడే మరొకటి కూడా అనుకున్నాడు....

''ఛీకొట్టినా... చీదరించుకున్నా పెదనాయుడు బాబు నిజంగా తన పాలిట పెద్దదిక్కే''నని.

ఆ రాత్రి పైడితల్లి కంటికి కునుకులేదు. ఉన్నా ఆ కలతకునుకులో మిణుగురుల్లా ఏవేవో కలలూ... కోరికల కలగలుపులు....

పలసాయన్నాన్ని బస్తాల్లో నింపి, బండికెక్కించి, గిత్తల్ని అదిలిస్తూ బస్తీకి తోలుకెళ్తున్నట్టూ....

ఈ సారి ధర మొన్న మొన్నటి తుఫాను కారణంగా మునుపటికంటే మూడింతలు ఎక్కువ పలికినట్టూ.....

ఎప్పుడో మూడేళ్ళనుండీ పెళ్లానికి కొనిపెట్టాలనుకుని, కొనలేకపోతున్న చిలకాకుపచ్చ కల్నేత చీర ఈసారి కొన్నట్టూ....

తొలుచూరి పురుడికి పుట్టింటికొచ్చిన పెద్దకూతుర్ని అత్తవారింటికి పంపడానికి 'వరవాడ' సంతలో పూతరేకుల చుట్టలు... పంచదార చిలకలూ కొన్నట్టూ....

సమర్తాడి ఏడాదైన మూడోకూతురికి 'సబ్బవరం' సంతలో చింతపూల వోణీ... సిల్కు పరికిణీ కొన్నట్టూ...

ముగ్గురాడబొట్ల తర్వాత మురిపెంగా పుట్టిన కడగొట్టు కొడుకుని పట్నంలో యింగ్లీషు కాన్వెంటులో చేర్పించినట్టూ.... వాడప్పుడే తెల్లటి కమీజుతో, ఆకుపచ్చని పేంటుతో, మెళ్లో ఆకుపచ్చ 'టై' కట్టుకుని ముచ్చటగా ముద్దుముద్దుగా ''మమ్మీ....డాడీ...'' అని పిలుస్తున్నట్టూ....

కళ్ళుల్లో పువ్వులేసి, కాళ్లు కదుపలేని ముసలితల్లికి 'అనపర్తి'లో కంటాపరీషను చేయించినట్టూ....

కొత్తబట్టలు కట్టుకుని, గిత్తలమండేసుకుని వూరవతల ''కనకమాలక్ష్మి టూరింగు టాకీసు'లో తల్లీ పెళ్లాం పిల్లల్తో ''పాతాళభైరవి'' రెండో ఆట సినిమా చూసినట్టూ.....

అలా అతడి ఎన్నో ఎన్నెన్నో కలల....కోరికల 'కల్నేత' అల్లిక పూర్తికాకుండానే ఎక్కడో తొలికోడి కూసది 'కొక్కొరకో' అంటూ

ఆ ప్రొద్దున్న...

'ఏరువాక' నాటి వేకువన.... తెలుగు పల్లెలా.. . పెదపండుగ రోజులా.... ఎంతో సందడిగా హడావుడిగా ఉంది పైడితల్లి గుడిసె.

ఆ రోజే పంట దించేరోజు!

ఫలసాయాన్ని బస్తాల్లో నింపి బండికెక్కించి బస్తీకి తీసుకెళ్లి అమ్మేరోజు!

పడిన కాయకష్టానికి ఫలితం దక్కేరోజు!

కన్నకలలు, కొంతలో కొంత నిజమయ్యే రోజు!

ఆ ఆనందంలో పెళ్లాం పెట్టిన 'చోడి అంబలి' ఎక్కలేదు పైడితల్లికి.

ఆదరాబాదరా బండికి గిత్తల్నిపూన్చి, పొలానికి బయల్దేరుతూ పెళ్లాన్ని ఎదురు రమ్మన్నాడు.

అయితే, పైడితల్లి పెళ్లాంకంటే ముందు పెదనాయుడు పెదపాలేరు రొప్పుతూ ఎదురొచ్చి చెప్పాడు.

ఉన్న పళంగా పెదనాయుడుబాబు రమ్మంటున్నారని!

పైడితల్లి హుషారు, ఉత్సాహం ఒక్కసారిగా నీరుకారిపోయాయి.

పైడితల్లికి తెలుసు.... పెదనాయుడు ఎందుకు రమ్మంటున్నాడో....

ముప్ఫయేళ్ళ క్రితం తన తండ్రి చేసినవీ, మూడేళ్ళ నుండి తను చేస్తున్న బాకీలను మూడింతలు చేసి, ఆ మూడింతలకి మొన్నగాక మొన్నచేసిన పురుగుమందు బాకీ అదనంగా జతచేసి మొత్తం బాకీ అసలు వడ్డీతో సహా గుర్తుచేస్తాడని.

తనకది మామూలే!

నాయుడుబాబు బాకీ గుర్తుచెయ్యడం...

తను అప్పటికేదో సర్దిచెప్పడమూను

అయినా-ఈసారి తను ఎలాగూ పంటనమ్మిన సొమ్ములోంచి ఎంతోకొంత జమచేద్దామను కుంటున్నాడు కూడాను. ఆ ధీమాతోనే బండి తోలుకుంటూ సరాసరి పెదనాయుడు యింటికి వెళ్ళాడు పైడితల్లి.

పెదనాయుడు ఇంటివాకిట్లో బండాపి దిగేసరికి ఎదురుగా ఎత్తరుగు మీద పడక్కుర్చీలో కూర్చుని ఆరోజు పేపర్ని కూడబలుక్కుంటూ చదువుకుంటున్నాడు పెదనాయుడు. నాయుడుగారి పఠనానికి అంతరాయం కలక్కుండా మెతమత్తంగా అతి మెళకువగా అతడి తలను మర్దనా చేస్తున్నాడు మంగలి అప్పన్న. పెదనాయుడికి కాసింత దూరంలో ముందు కాళ్ళలోకి ముఖం దూర్చి పడుకున్న పెంపుడుకుక్క ముందున్న కంచుగిన్నెలో మరిగించిన పాలను పోస్తున్నాడు పాలేరు పోలిపల్లి.

గిత్తల మెళ్లోని చిరుగంటలచప్పుడికి పేపర్లోంచే పైడితల్లి రాకను పసిగట్టిన పెదనాయుడు, తల పైకెత్తి....

"ఏరా.... పైడితల్లి.... ఈసారి కాపు మా గొప్పగా కాసిందటగా ... మొత్తానికి నువ్వు మహా గట్టోడివిరా.... సరేగానీ యింతకీ నిన్ను పిలిపించింది ఎందుకో తెల్సా... మరేంలేదు.... అప్పుడెప్పుడో నీ బాబు చేసిన బాకీకి... యింతవరకూ నీ పెద్దకూతురు పెళ్ళికీ, పురుడుకీ, నీయిత్తనాలకీ, ఎరువులకీ, పురుగులమందుకీ నువ్వు తీసుకున్న బాకీ

తలిసి తడిపి మోపిడైె సొమ్ము చెల్లుబాటు చెయ్యలేక నువ్వు పడుతున్న ...
తెలీంది కాదు.... అందుకనీ... నీ మేలు కోరి. .. నీ మంచికోసం ...
మరేంలేదు... తిన్నగా పొలానికెళ్ళి కాపంతా జాగర్తగా బండి కెక్కించి ...
పట్టుకొచ్చీ.... యేంటి....యింటున్నావా? యింతకీ అసలు ...
రేపొద్దున్న మినిస్టరు రెడ్డినాయుడి గారింట్లో పెళ్ళోటుంది ...
వంటవే చూడాల....యేంటి....యింటున్నావా రేప్పొద్దునా ...
పన్లుంటాయ్....యేటి.... అర్ధవయిందా....'' అన్నాడు ఆత్మీయంగా ...
అప్యాయంగా.

పాపం పైడితల్లికి గుటక పడ్లేదు....

పెదనాయుడు పైకం గుర్తు చేస్తాడనుకున్నాడుగానీ, ...
చేద్దామనుకుంటున్నాడనుకోలేదు. పైడితల్లి ప్రాణాలు పెదనాయుడి ...
రెపరెపలాడాయి.

ఈ రోజుకోసం తను ఎంత శ్రమపడ్డాడనీ.... ఎన్ని ఆశలు పెంచుకున్నా...

తనలాంటి బడుగుజీవులపాలిట గొడుగులాంటి పెదనాయుడు ...
పడగవిప్పితే ఎలా? పెద్దపులిలా పంజా విసిరితే ఎలా?

పైరుకు పురుగు పడితే ఏ మందో మాకో చల్లి ...
దక్కించుకోడమైతే తమకు చేతనవునుగానీ, యిలా చేతికొచ్చిన ...
చేసే.... తమ శ్రమని సమూలంగా దోపిడీ చేసే... తమ ఆట్లు ...
ఎదురయ్యే ఆనందాల్ని అంతం చేసే.... తమని ...
కన్నవాళ్ళతో...కడకు కట్టుకున్న ఆలితో తమనుకున్న ...
సైతం నిర్దాక్షిణ్యంగా ధ్వంసం చేసే ఈ పెదనాయుడు లాంటి ...
అంతం చేయాలో ఆ బక్కరైతు మేథకు అందలేదు.

ఇక అర్థింపూ గత్యంతరం అనుకున్నాడు.

పెదనాయుడు కేసి రెండు చేతులూ జోడించి అన్నాడు...

''దయతల్చండి బాబయ్యా... ఈసారికి, నాకు శానా కష్టాలున్నాయి ...
మా యమ్మికి కంటాపరీసను చేయించాల యిమ్మన్నీ ...
యింతకాలం ఆగారు. ఈ ఒక్కపాలికి దయతల్చండి బాబయ్యా ...
పంటనమ్మిన సొమ్ములోంచి ఎంతో కొంత జమ చేస్తా ...
చేయండయ్యా... మీ మేలు మర్చిపోను....''

ఈ సారి పెదనాయుడు పెద్దపులిలా గాండ్రించలేదు

తోకతొక్కిన తాచులా కస్సుమననూ లేదు .

నిదానంగా పైడితల్లికేసి తేరిపారచూసి...

''చూడ్రా పైడితల్లీ.. నీ మంచికోసమే యింతా చెప్తుంటే ...

పీకల్దాక అప్పుల్లో మునిగిపోయావు మరా అప్పుల్లో కొంతలో కొంతన్నా తీరాలంటే... తీర్చాలంటే నీకింతకన్నా మంచి అవకాశం రాదని నాకూ తెలుసు. . నీకూ తెలుసు... అంచేత బుర్రలో మరే ఎర్రాలోచన్లు పెట్టుకోక. .. ముందు నేను చెప్పినట్టు చెయ్యి.... నువు చెయ్యలేదనుకో.... నీకు తెలుసు మన పాలేళ్ళగాళ్ళు చేసేస్తారని అర్థవయిందా... అంచేత... యెల్లు.... యెల్లి ముందాపన్జూడు. అయినా నీ యెర్రికాకపోతే రేపో మాపో సచ్చే ఆ ముసల్దానికి యింతకాలం యింత ముద్ద పెడుతున్నావంటే అర్థవుంది. అంతేగానీ అంత డబ్బు తగ లేసి కంటాపరీసను చేయిస్తానంట్రా వేట్రా ఎర్రినాకొడుకా.... కాటికి పోయే దానికి కళ్ళెందుకురా.... ఈ పేఁవలూ... దోఁవలూ నీక్కూడెట్టవుగానీ, నేన్చెప్పినట్టు చెయ్యి.... అర్థఁవయిందా?' అన్నాడు చాలా మామూలుగా.

పైడితల్లికి భయం వేసింది.

పెదనాయుడు అంత నెమ్మదిగా మాట్లాడాడంటే జరిగే పర్యవసానం అతడికి తెలియంది కాదు.

తుపాను ముందరి ప్రశాంతత అది.

శ్మశానంలోని నిశ్శబ్దత అది.

అందుకే పైడితల్లికి భయం వేసింది.

ఆ క్షణం అతడికి తన పరిస్థితిమీద తనకే జాలివేసింది.

తన పేదరికంపైన తనకే అసహ్యమేసింది.

పేదవాడు మనిషి కాడా?

పేదవాడి శరీరం మాంసం కాదా?

ఆ మాంసపు ముద్దలో ప్రవహించేది నెత్తురు గాదా?

ఆ నెత్తురుకి ప్రేమలూ.... పాశాలూ.... ఉండవా?

పైడితల్లికి తన తల్లి గొర్తొచ్చింది;

తన పెళ్ళాం గుర్తొచ్చింది;

తన పిల్లలు గుర్తొచ్చారు;

తవు బంధాలు గుర్తొచ్చాయి.... తన బాధ్యత గుర్తొచ్చింది. ఈ ఒక్క సారికి నాయుడుగార్ని ఎలాగైనా ఒప్పించాలి. మనసులో మినుగురులా మళ్ళీ ఏమూలో చావని ఆశ... ఏది కాకపోయినా కనీసం తల్లి కంటాపరేషను చేయించాలి.

పైడితల్లి కళ్ళల్లోకి కన్నీళ్ళుబికాయి

మసకబారిన కళ్ళలోంచి పెద్దరుగుమీది పెదనాయుడి పాదాలే తనకి పెద్ద దిక్కన్నట్లు కనిపించాయి.

పైడితల్లి పాదాలు కదిలాయి.

అప్పుడు జరిగిందా సంఘటన.. ..

అంతవరకూ అరుగుమీద తల్లి పక్కలో పడుకుని పాలు కుడుస్తున్న నాలుగు కుక్కపిల్లల్లోని నల్లమచ్చల పిల్ల ఉన్నట్టుండి 'కుయ్‌కుయ్' లాడుతూ మెల్లిగా పడుతూ లేస్తూ నడుచుకుంటూ వచ్చి పెదనాయుడి పాదాలు నాకసాగింది. పైడితల్లి విషయంలో చిర్రుబుర్రులాడుతున్న పెదనాయుడు దాని తడినాలుక పాదాలకు తగిలేసరికి చిరాకుపడి ''చెయ్. నీయమ్మ....'' అంటూ ఒక్కసారిగా కాలు విదిలించేడు. పాపం, దాంతో అది పట్టుతప్పి అంత ఎత్తరుగుమీదనుంచి డబ్బున కిందపడి 'కుయ్యోం కుయ్యోం. .' అంటూ మూలగడం మొదలెట్టింది.

అంతే! అంతవరకూ పిల్లలు తన చనుమొనలు చప్పరిస్తూ పాలుకుడుస్తుంటే తన పొడవాటి నాలుకతో ప్రేమతో వాటి వీపుల్ని నాకుతున్న పెదనాయుడి పెంపుడుకుక్క ఆ దృశ్యం చూసి ఒక్కసారిగా భౌమంటూ నోరు తెరిచి చిరుతలా అమాంతం పెదనాయుడి మీదికి దూకింది. ఈ హఠాత్సంఘటనకి అదిరిపడ్డ పెదనాయుడు పడక కుర్చీలోంచి ఎగిరి అరుగుమీద వెల్లకిలా పడ్డాడు. నడుస్తున్న పైడితల్లి టక్కున ఆగిపోయాడు.

ఆ చిన్న సంఘటన, పైడితల్లి కంటిముందు మెరుపు మెరిపించినట్టూ.... అతడి వొంటిపై కొరడా ఝుళిపించినట్టూ అనిపించింది. నరనరాల్లో విద్యుత్ ప్రవహించినట్టయి బండబారిన మెదడును పదును పెట్టి నట్టయింది.

విశ్వాసానికి మారుపేరై పట్టెడు మెతుకులు పడేస్తే జీవితాంతం యజమాని కాళ్ళ దగ్గర తోకాడిస్తూ బానిసలా పడుండే కుక్క కూడా తన సంతానానికి హాని కలిగించాడనే కసితో.... అక్కసుతో పెద్దనాయుడ్ని సైతం పెద్దపులిలా ఎదిరించడానికి సిద్ధపడిందే....! మరి.... జీవపరిణామంలో కుక్క కన్నా ఎన్నో రెట్లు ఆకారంలోనూ.... ఆలోచనల్లోనూ అధికుడైన తను సాటిమనిషి తనను.... తన శ్రమ శక్తినీ దోపిడీ చేస్తుంటే.... తన కలల్నీ.... కోరికల్నీ కూలదోస్తుంటే.... తనవాళ్ళ భవిష్యత్తును కాలరాస్తూ, తన ఆత్మాభిమానాన్ని దెబ్బతీస్తుంటే.... ప్రేరణ, ప్రతీకారం లేని, జడుడిలా నీరుగారిపోవడం ఎంత సిగ్గుచేటు!

కొమ్మల్ని మోయాల్సిన మానూ.... కప్పును నిలపాల్సిన నిట్రాడు.... నిటారుగా, కరకుగా, కాఠిన్యంగా ఉండకపోతే ఎలా?

ఒక కుటుంబాన్ని నడిపించాల్సిన వ్యక్తిగా మరి తనెంత నిబ్బరంగా ఉండాలి!

పైడితల్లి కళ్ళల్లో యిపుడు తడిలేదు.

అతడి చెవుల్లో హోరుపెడుతూ, వేనవేల అజ్ఞాతగొంతుల ఆర్తనాదాలూ... హాహాకారాలూ.... వాటికి అభయమిస్తున్నట్టు కొండకోనల్లో మారుమ్రోగే అజ్ఞాతవీరుల తుపాకీ మోతలూ...

అతని కనులముందు ఏవేవో దృశ్యాలు....

మట్టి పొరలను పెళ్ళగిస్తూ.....

పంటచేలను చీల్చుకుంటూ.. .

విచ్చుకత్తుల్లా....

పొడుచుకొస్తూ... మొలుచుకొస్తూ కనిపిస్తున్నాయి ..

బిగించిన పిడికిళ్ళు...

పదును పెట్టిన కొడవళ్ళు ...

ఎరుపెక్కిన సూరీళ్ళు....

గుండెల్నిండా ఒక్కసారి గాలి పీల్చి బోరవిరిచి తలెత్తిన పైడితల్లి కళ్ళకి పెద్దరుగుపైన పడక్కుర్చీలో కూర్చున్న పెదనాయుడు. యిపుడు బురద నేలలో పొర్లాడే ఓ పేడ పురుగులా కనిపిస్తున్నాడు.

# అంటు

## సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి

ఉత్తరంలోని విషయాల్ని మరోసారి మననం చేసుకొన్న కొండన్నకు ఆనందంతో బాటు ఆత్రుత కూడా ఎక్కువైంది. చేని దగ్గర్నుంచి ఎప్పుడెప్పుడు ఇంటికి చేరుకుందామా అని ఆరాటంగా ఉంది.

గగనం దిక్కు చూశాడు.

మబ్బుల చాటున పొద్దు వసకేసి ఉంది. మధ్యాహ్నానికో, సాయంత్రానికి వాన వంగేట్టుంది. దేవమూల అప్పుడప్పుడూ ఉరుముతూ ఉంది.

ఉత్తరలో ఉరిమితే ఖచ్చితంగా వానొస్తుందట!

అందులోనూ ఇది రైతుల కార్తె.

కొండన్న గుండెల్లో సన్నని జలదరింపు మొదలైంది.

ఈ కూలీల్తో సాయంత్రం దాకా సంతనగా పన్జేయించుకొంటేగావా చేనంతా పత్తి విరవటం అయిపోదు. మధ్యలో వానొస్తే పత్తి అంతా మట్టిపాలు.

నిండు రోహిణి కార్తెలో ఈ పైరు మొలిపించుకొనేందుకు తానెంత అగచాట్లు బడింది కళ్ళముందు కదిలింది.

సర్కారోళ్ళు ఏడెకరాలు పట్టా ఇచ్చి ఉచిత బోరుబావి తవ్వించారు గాబట్టి పత్తిపైరు పెట్టడం సాధ్యమైంది. లేకుంటే తామెక్కడ? ఈ ఎండాకాలం పైరెక్కడ?

ఈ భూమి, బోరుబావి తను పొందటంలో స్టీఫెన్ సహాయం కూడా కొంత ఉంది.

దళితుల సహాయార్థం అతను ఎంతో పాటుబడుతున్నాడట.

పక్క తాలుకా లోనే ఏదో; ఊర్లో అగ్రవర్ణాల వారికి చెందిన మంచినీటి కుంటలో హరిజనులు కూడా గొంతు తడుపుకొనేందుకు ఎదురైన ఆటంకాల్ని తొలగించేందుకు కలెక్టరు తోటి వస్తున్నాడట.

ఆ సందర్భంగా తన్ను కలుసుకొనేందుకు ఈ రోజు వస్తానని రాశాడు.

పాలెమంతా తిరిగితిరిగి రంగనిదగ్గర పెద్ద కోడిపుంజు నొకదాన్ని నూర్రూపాయలకు బేరమాడి పట్టుకొచ్చి ఇంట్లో గంప కింద వేశొచ్చాడు కొండప్ప.

స్టోరు బియ్యం బావుండవని శేరు పద్దైదు రూపాయలొంతున మొలగోలుకు బియ్యం

కొనుక్కొచ్చి ఉంచాడు

రాక రాక వచ్చే చుట్టం.

దాదాపు ముప్పయేళ్ళయింది ఊరొదలి.

సింగరయ్యగా ఊరొదలిన వాడు స్టీఫెన్‌గ మారాడు

పదిమందికి బతుకుదెరువిచ్చేంత పైస్థాయికి ఎదిగాడు.

కొండన్నో! గంప దీసకరా వొడి నిండింది.'' కేకేసింది ఒక కూలి.

ఆలోచనల్నుంచి తేరుకొని గంప అందుకొన్నాడు కొండన్న. తన పంచెలోని పత్తిని గంపలోవేసి అందరి వద్దకు తిరిగాడు. రెండు గంపలైంది.

''నీల్లు తప్పి కెయితండా యన్నో!'' కేకేసింది మరో కూలి.

''అంయుగోవమ్మా. బిందెనిండా...వంకలో నీల్లు బురదని, బోరింగుకాడ పట్టుకొచ్చినా.''చెప్పాడు.

''బిందె మీదేనా?'' అనుమానంగా చూసింది.

''కాదమ్మా! మా రైతు నారాయన్రెడ్డిది.''

''తెచ్చింది నువ్వేగాదూ?'' ఆమె నొసలు ముడి ఇంకా విడివడలేదు.

''నేను గాక!....నాకు రైతులు కూలికొస్తరా తల్లీ?''

నీళ్ళ కోసం బిందె వద్ద కొస్తున్న వాళ్ళు కాస్త ఆగిపోయారు. ఒకరి కేసి మరొకరు చూసుకొని, గుసగుసలాడుకొని, ''వంకలో నీళ్ళే తాగొస్పంలే''అంటూ వెనుదిరిగారు.

ఉస్సురుమన్నాడు కొండన్న.

పక్లికిలిస్తూ పరాచికాలాడుకొంటూ, హంస గమనాల్తో వాళ్ళు వంకలోకి వెళ్ళొచ్చేసరికి ఎంతలేదన్నా పదినిమిషాల సమయం అర్ధగంట అవుతుంది.

మబ్బెక్కి వచ్చే ఆకాశంకేసి దిగాలుగా చూసి పత్తివిరవటాన్ని కొనసాగించాడు.

కూలీలంతా తిరిగొచ్చారు.

కళ్ళు మిరుమిట్లు గొలిపే పసుపుపచ్చని తంగేడుపూలు తలలో తురుముకుంటూ తన మునంలో వంగబోతూ అడిగింది మరో కూలి ''సంగటి రైతు లింధ్లల్లో సేయిస్పాండవా, లేదా?'' అని.

రైతులింధ్లల్లోనే సేయిస్పాండలే తల్లీ!''

''మీరు తగిలేరు...వాళ్ల సేతనే తెచ్చి పెట్టీయండి'' చెప్పింది.

''ఆ. ..ఆ...'' ఒప్పుకోలుగా ఊకొట్టాడు కొండన్న.

ఈ కూలీలు తమ చేతి నీళ్లు తాగరు. తమ కుండలోని పిడచ తినరు. ఎందుకంటే, వాళ్ళు మాదిగలు, తాము మాలలు కాబట్టి.

* * *

నునంలోంచి తలెత్తి ఊరికేసి చూసేసరికి, చేలగెట్లెంట రవరవ [illegible] భార్య కనిపించింది కొండన్నకు.

ఆమె నడకే అంత

ఎప్పుడూ ఉరుకుల పరుగుల మీదుంటుంది. కనుదెరిపింది [illegible] ఒకటే తొందర. క్షణం తీరికుండదు. నిమిషం ఊరకుండదు. [illegible] వేసినా తన కోపుకూడా ఆమె ఈడ్చుకుపోతుంది.

ఇంత చేసినా బండి సరిగ్గానడవదు. ఎప్పుడూ కందెన తక్కువై [illegible] అరవటమే.

''అబ్బోవ్! ఓ మొగోడా!....యాం దీమాసి పలకడూ? సిన్నో. .'' [illegible] లోపలే ఆరాటపడుతూ వచ్చింది. ''టీపెనన్న వచ్చిండంట. .'' [illegible] లోపలే చెప్పింది.

''నాకయితే వొల్లు తత్తరబుడ్తా ఉంది. ఏం జేసి పెట్టాలబ్బా! [illegible] దింటడో... బలకొట్టకుండా మూగెద్దాల ఉంటవే?...ఏంజేస్తవో సుప్పో [illegible] తేరుకోబోయే లోపలే లొడలొడమనసాగింది.

ఒక్కసారిగా స్టీఫెన్ దగ్గరకు ఎగిరిపోదామనిపిస్తోంది కొండన్నకు. [illegible] ఉన్నవాడు తనకోసం, తన ఇంటికిరావటం కొండన్న గుండెల్లో [illegible] బెడుతోంది.

అతనికి ఎలా మర్యాదలు చేయాలో తనకు బాగా తెలుసు.

అతని నాలుక ఏఏ రుచుల కోసం సవ్వబడిపోయిందో తనకు ఎరుకే. [illegible] వెళ్లినపుడంతా రాత్రిళ్ళు నిద్రబోనిచ్చేవాడు కాదు. చేయి చంకలోతున [illegible] పట్టుకొచ్చిన ఎండ్రకాయల చారును గూర్చి పలవరించేవాడు.

పందివార్ల వేపుడు స్మృతుల్ని కెలికేవాడు.

సొద్దసొత్తేలు, చేపల పులుసులో కలుపుకుతింటూ చూరునీళ్ళ [illegible] చూడాలని తపనపడేవాడు.

ఉసుర్లు వేయించి ఉలవ గుగ్గిళ్ళలో కలుపుకొని, జేబునిండా [illegible] వదలి వీధి వీధి తిరగాలనే ఉబలాటం అతనికి.

ఉలవ గుగ్గిళ్ళకు బెల్లం కలిపి రోట పోసి, తొక్కేసుక్క చేసి [illegible] అద్దుకు తినటమన్నా, బరిగె కూటిలో పెరుగు కలుపుకొని ఉల్లి [illegible] జొన్నరొట్టెను అప్పుడే పిండుకొచ్చిన జుంటితేనెలో [illegible] కొర్రకూటిలాగా కలమాగిన దోసకాయను [illegible] ఉడకేసిన ఆనపకాయల బుట్టను ముందేసుకక్కోవటమన్నా [illegible]

పల్లె రుచుల్నీ, సావాసాల్నీ ఇంకా మరవకుండా ఉన్న [illegible] సోయేవాడు తను.

అతను కోరికల్ని వీలున్నంతవరకు తను తీర్చేందుకు ప్రయత్నించాలి. తక్షణమే ఇంటికి పరువెత్తాలనిపిస్తోంది కొండన్నకు.

వెంకటమ్మ ఏదేదో చెబుతుంది

ఇంటి వద్ద తన కోసం నులక మంచమ్మీద నిరీక్షిస్తున్నాడు కాబోలు. చుట్టుముట్టిన ముసలీ ముతకల ప్రశ్నలకు సమాధానాలు తడువుకొంటుంటాడు బహుశా.

''మంచినీళ్ళన్నా యిచ్చొచ్చినవా?''అప్పుడు ప్రశ్నించాడు భార్యను.

గడ్డం కింద చెయ్యి ఆన్చి ''యాాందీవమాసీ!'' అంటూ ఆశ్చర్యపోయింది ఆమె. ''ఆయాల్నుంచి సెబుతాంటే నీకు సెవి ఎచబన్నెట్టేలేదే. ఇట్టయితే ఎట్టబ్బా?... మనింటికాడికి రాలే. రెడ్డోరింటికాన్నే ఉండాడంట...'' చెప్పింది.

''రెడ్డోరింటికాన్నా?...''

''ఆ... ఆ నీల్ల పంచాయితీ కాడికి రెడ్డోరు గూడా పొయ్యిన్నెడంట. టీపెన్నను గుర్తుబట్టి ఇంటికి తోడుకొచ్చుకొన్నెడంట...

కొద్దిసేపుమౌనంగా ఉండిపోయాడు కొండన్న.

ఎవ్వరూ లేని తనింటి వద్దకొచ్చి బిక్కుబిక్కుమనేకన్నా కొంతసేపు రెడ్డోరింటికాడ ఉండటమే మేలనుకున్నాడు.

పెద్దరెడ్డి వద్ద గౌరవం పొందేంత స్థాయికి తన సావాసగాడు ఎదగడం పట్ల గర్వం కూడా కలిగింది.

అనతి ఆలోచనల్ని భగ్నం జేస్తూ వెంకటమ్మ అంది ''రైతులెవురికీ తీరికె లేదంటండ్రే...ఎట్ట జెయ్యాలబ్బా?'' అని.

క్షణ కాలం పాటు అయోమయంగా చూశాడు ఆమె కేసి.

''అందర్నీ బంగపొయ్యినా...మారుపనులుండాయంటే నాకు తీరికె లేదంటే...యమ్మ యమ్మ..ఊరికే సంగటి గెలికియ్య వంటాండవా? అడంగాలకు బియ్యమిచ్చిమి...కూరగాయలిచ్చిమి....ఎప్పుడన్నా పనికి పలుకుతాంటిమి.''

రైతులెవ్వరూ చెయ్యందియ్యక పోవటం వల్ల ఆశ్చర్యంగా ఉంది కొండన్నకు.

''అయ్యోరు యింట్లోనన్నా అడగ్గూడ్దా!''

''యాం దీమాసీ! ఆ యమ్మకేం నాలుగు సేతులుండయా? నిన్న ప్రెకాశానికి జెయిసే. మొన్న రవనమ్మకు వొండిచ్చె. రోజా ఎవరికొకరికి కుండ గాలుస్నానే ఉండి పాయనే...''

''మనకూ ఒకరోజు గెలికియ్యమని కాల్లో కడుపు పట్టుకుపోయేం తిక్కదానా!'' ఉపదేశించాడు.

''ఏమోబ్బా! నాకు నమ్మకంలే...'' అంటూ వెనుదిరిగింది ఆమె.

కొండన్నకెందుకో కొంత ఆశగా ఉంది.

సంకటి సమస్య ఒక వైపుకు ఒత్తిగిల్లినట్లే అనిపించింది.

మనస్సు స్టీఫెన్ వద్దకెళ్ళాలని ఉబలాటపడసాగింది.

కూలీల్ని వదలి వెళ్లేందుకు మబ్బులు భయపెడుతున్నాయి. ఇన్నేళ్ళూ తను వెళ్ళటమే గాని ఎప్పుడూ ఇక్కడకు రాని స్టీఫెన్....తనంటే ప్రాణాలిచ్చే స్టీఫెన్....

తన ప్రాణం లాంటి కొడుక్కి చదువు చెప్పించే స్టీఫెన్....

అతనొచ్చినాడని తెలిసీ తన్నిక్కడుండేటట్లు చేసిన పరిస్థితుల పట్ల ఆక్రోశం కలిగింది కొండన్నకు.

కూలీలు తమ సంకటి తింటే ఈ అగచాట్లు ఉండేవి కావు. తమ చేతినీళ్ళు కూడా తాగరు.

మాల - మాదిగల మధ్య అనాది నుంచీ ఇంతే.

తనకు ఆశ్చర్యం కలుగుతుంది....అందరి చేతా హీనంగా చూడబడే ఈ కులాలు రెండూ; ఒకర్నొకరు నీచంగా చూసుకోవటం ఏమిటా అని - అగ్రకులాల వాళ్లు తమ బావుల్లో నీళ్ళు వీళ్ళను తెచ్చుకోనివ్వరు. వీళ్ళు ఒకరి బావి నీళ్ళు మరొకరు అంటరు.

హిందూమతంలో తమను తక్కువ జేస్తున్నారని క్రిస్టియన్ మతంలో చేరినవాళ్లలో కూడా ఈ భేదభావాలు ఏ మాత్రం చావలేదు.

మాదిగలు వెళ్లిన చర్చికి మాలలు వెళ్లరు. మాలలు చేరిన శాఖలో మాదిగలు చేరరు. ఒకరు ఆర్.సి.యం. అయితే మరొకరు ఎస్.పి.జి. ఒకరు ఎ.బి.ఎం అయితే మరొకరు సి.బి.ఎం. ఒకరు సి.ఎస్.ఐ అయితే మరొకరు పెంథకోస్టు....

అక్కడ కూడా క్రిస్టియన్‌రెడ్ల క్రిస్టియన్ నాయుళ్ళ...క్రిస్టియన్ అగ్రవర్ణాల గుత్తాధిపత్యం కింద వీళ్ళు నలిగిపోవటమే!''

మతం మారమని చాలా కాలం నుంచీ తనతో చెబుతున్నాడు స్టీఫెన్.

తన ప్రమేయం లేకుండానే ఇంజనీరింగు చదువుతోపాటు తన కొడుక్కి మతం మార్పించాడు.

ఎప్పుడో తెల్లదొరల కాలంలో పెద్ద కులాల తోటి సమాన గౌరవం కోసం; దొరల మతం పుచ్చుకోవటమనేది నిమ్నకులాలకు ఒక మార్గమయితే కావచ్చు గాని, ఇప్పుడది ఏ మాత్రం సత్ఫలితాలనిస్తుందని!

మతమార్పిడి వల్ల ఈ పల్లెలో అగ్రవర్ణాల వాళ్లు తమతో సమానంగా ఈ మాలమాదిగల్ని చూస్తారా? - పెద్ద ఉద్యోగం వల్ల మంచి హోదాలో ఉండటమో, బాగా డబ్బు సంపాదించటమో చేస్తే తప్ప....

* * *

''ఎట్ట జెయ్యాల్యబ్బా?'' అంటూ ఆదరాబాదరా వచ్చింది వెంకటమ్మ.

పరిస్థితి అర్థమైంది కొండన్నకు. గుండెలు లబలబలాడాయి.

''ఆయమ్మ ఈ పూట ఎవురికీ సంగటి జేసి పెట్టలే.. .సెయ్యనంటాంది. ఎర్రోల్ల పిచ్చిదీ, బరుగౌడ్లోల్ల పాసిదీ, సుంకన్న పెండ్లామూ నాయాల్నే ఊరంతా పరవేసకొన్నెరు. ఎందుకోమల్ల.. రైతులెవురూ పలకలేదబ్బా!'' చెప్పింది.

పొద్దు కనపళ్ళేదు గాని పైటేల అయింది. ఉబ్బురపు ఎండగాసుంటే ఇప్పటికే సంకటి కోసం ఎగమల్లి ఉండేవాళ్లు.

ఏం జెయ్యాలో అర్థం గాకుండా ఉంది కొండన్నకు.

సరుకులిచ్చి వాళ్లనే వొండుకోమన్నా, కుండా చట్టీ కావాలి గదా! తమని వీళ్లు తగలరు.

రైతులు వీళ్లను తగలనివ్వరు.

జడలు విరబోసుకొని మెల్లిగా నడిచొచ్చే భూతమైంది సంకటి సమస్య కొండన్నకు. నెత్తికి చుట్టకొనేట్టే ఉంది.

విషయం సగవర్ధమై కాక వెంకటమ్మను అడిగింది ఒక కూలిమనిషి ''ఊరంతా లొడబెట్టినా ఒక్క తల్లికీ కనికరం పుట్టలే...మీ కియ్యాల సంగటి లే, సారక లే...'' మునంలో వొంగుతూ చెప్పింది వెంకటమ్మ.

''లేకుంటేనే? పైటేల్లకై రోజు కూలిస్తవ్ ఇంటికి బొయ్యి తింటం.''

''ఒక్కొంతుకు రొండొంతుల కూలెందుకిస్పం?''

''అయితే పచ్చు పస్తెట్టజెయ్యాల? సంగటి బెట్టుమరి - మాపిటేల్దాకా సేస్పం.''

''బో సంబడమబ్బా మీది! మా సంగటి తింటే మీదేం తరుగుబోద్ది? ఇద్దరం తగుజాతోల్లమే గదూ! మా ఎక్కువేంది? మా తక్కువేంది?'' చేతులు తిప్పుతూ చెప్పింది వెంకటమ్మ.

దాంతో అక్కడి వాతావరణం లోని ప్రశాంతత మారిపోయింది.

''ఏం నేర్చుకొన్నెవమ్మా నువ్వు! మాలోల్లను మాట్లాడక ముందే కొట్టాలని రైతులంటరు; ఇందుకేనేమో? నీకు పనిబడి నీ ఇంటి పిడ్చను తినమంటివే..మాలకాకిని గూడా మా ఇండ్లలేకి రానియ్యం. మాలోల్ల కుండల్లో నోరు బెడ్తమా? బూమిని సంపాయిచ్చుకొని దున్నుకున్నెంత మాత్తరాన పెద్దకులపోల్లుగారు.''రోషంగా చెప్పింది ఒక కూలి.

''ముందు మా ఇండ్లల్లో కొచ్చి మాకుండలో పిడ్చ ఇంత సేతల్లో యేయించుకొని తినండి. ఇయ్యన్నిమల్ల మాట్లాడ్డం.'' ఒడిలో పత్తిని గంపలోకి వదల్తూ విసురుగా అంది ఇంకొక మనిషి.

సంకటి లేకుండా తాము పన్జేసేది లేదనీ, కూలీడబ్బు వెంటనే చెల్లిస్తే తమ ఇళ్ళకెళ్లి ముద్ద మింగుతామనీ అన్నారు వాళ్లు. పత్తి విసరటం చాలించి గంపలవద్ద కొచ్చారు.

వర్షం వచ్చి దూకేట్టుంది.

తెల్లగా మంచు ముద్దల్లా వున్న పత్తి రాలి మట్టి గొట్టుకుపోతుంది. ఆ నష్టానికి తోడు

ఒక్కొంతుకే రెండొంతుల కూలి

''యమ్మా యమ్మా! మా బాసేలికి బుద్దుండో బుద్ధిలేకో కూసింది. నేను బొయ్యి సంగటి దెస్పుతల్లీ! నానొస్సే నాశనమయితమ్మా! పత్తి ఇరుస్పాం రండి తల్లీ!''....కొండన్న బతిమాలాడు.

''ఇప్పుడు బొయ్యినువ్వు సంగటి సేయిన్నకొచ్చెదెన్నడు?''

''బువ్వ జెయిస్పానమ్మా....!'' అంటూ వాళ్ల మాటకు ఎదురుచూడకుండా ఊర్లోకి కదిలాడు.

రెడ్డోరి పంచలోకి తన తల కనబడకుండా ఊరంతా తిరిగాడు కొండన్న. తనున్న పరిస్థితుల్లో స్టీఫెన్ కళ్లబడాలంటే మనస్కరించట్లేదు. రెడ్ల చేత చేయించుకొనే అతని వద్దకు, రెడ్ల దయాదాక్షిణ్యాల కోసం అంగలార్చే తాను వెళ్లటం ఎబ్బెట్టుగా అనిపించింది.

ఊర్లో ఒక్క రైతు కూడా తనకు ఆసరానివ్వకపోవడం ఆశ్చర్యంగా ఉంది అతనికి.

''ఒకరి సంగటి జేసి పెట్టడం.. ఇంగొకరి సేతమాటబడ్డం...ఎందుకొచ్చిన తంటా నాయనా!''అయ్యోరి భార్య అంది.

తంటా వచ్చేది ఎవరితోనో కొండన్నకు అర్థం కాలేదు.

కొండంత దిగులుతో నీరసంగా అడుగులేస్తూ కల్రోలు దగ్గరకొచ్చేసరికి ఆగిపోయాడు.. రెడ్డోరి ఇంట్లో అడిగితే?

స్టీఫెన్ కళ్లబడకుండా దొడ్డిదారి గుండావెళ్తే సరి....బహుశా సుభద్రమ్మ కాదనదు. వంటమనిషి కూడా ఉంది గదా!

ఒక్క క్షణం ఆశ మొలిచింది. తప్పని పరిస్థితి మరి.

సందులోంచి తొంగి చూశాడు.

రెడ్డోరి పంచ కన్పిస్తోంది.

పట్టెమంచమ్మీద ఆసీనుడై ఉన్నాడు పెద్దరెడ్డి. పక్కనే ఈజీచేర్ మీద వాలి ఉన్నాడు స్టీఫెన్. ఇద్దరూ సిగరెట్లు పీలుస్తున్నారు.

నేల మీద తమ పాళెం వాళ్లే కొంతమంది మాలలు కూచుని ఉన్నారు.

కొత్తగా వచ్చి చేరే వాళ్లు పెద్దరెడ్డి తోటి స్టీఫెన్‌కు చేతులు జోడించి, అక్కడే నేలమీద కూలబడటం కొండన్నకు ఆశ్చర్యమనిపించింది.

తమ కులం వాడు, తమ పాళెం వాడు, తమ వాడయిన స్టీఫెన్‌కు తమ వాళ్లంతా నమస్కరించటం వింతగా ఉంది అతనికి.

'తనక్కడికి వెళ్లినా వాళ్ళతోటే....'

భరించలేకపోయాడు.

రేపు తన కొడుకు ఇంజనీరై మంచి హోదాలో ఇక్కడకొస్తే పెద్దరెడ్డి ఇలాగే గౌరవిస్తాడు

కాబోలు.

అతని హృదయంలో ఎక్కడో ఆనందపు జలదరింపు.

అంతలోనే అతనికో అనుమానం.

తనకొడుకు పెద్దిరెడ్డి తోటి సమాన హోదాలో ఆసీనుడైనా, తను మాత్రం రెండు చేతులు జోడించి నేల మీద కూచోక తప్పదేమో!

* * *

ఒంటరిగా వస్తోన్న కొండన్నను చూసి దూరాన్నించే పరిస్థితి అంచనా వేశారు కూలీలు. ఒళ్ళో పత్తి గంపల్లో పడేసి, కడుపులోంచి ఎగదన్నుకొచ్చే ఆకలిని ఆలుమొగుళ్ళ మీద కక్కారు.

'ఒక్కరైతుగ్గూడ మంచి గుండని మీదెంబతు'కన్నారు.

'అడుగు కదపకుండా, కూలిదుడ్లురాల్చ'మన్నారు.

'వంతుకూలి ఇస్తా'నంది వెంకటమ్మ.

'రోజు కూలి కట్టంది కుదర'దన్నారు వాళ్లు.

అక్కడ కొంతసేపు అరుపులు, తిట్లు చెలరేగాయి.

ఇరుగు పొరుగు చేలవాళ్లు ఎగమల్లివచ్చారు.

మాలలు కొండన్నకే వత్తాసిచ్చారు.

పనిబాటల వాళ్ళకాడ ఏం మాట్లాడినా ఇబ్బందేనని రైతులు మెల్లిగా జారుకున్నారు.

కొంతసేపు తిట్లాట అనంతరం "నువ్వు రోజు కూలి ఎట్టేయ్యవో మేమూాజూస్పం." అంటూ పచ్చని చేల మీద బండ బూతులు దొర్లించుకుంటూ వెళ్లారు మాదిగ స్త్రీలంతా.

తలపట్టుకూర్చుండిపోయాడు కొండన్న.

మాదిగలను కూలికి పిల్చుకొంటే ఇట్లాంటి అగచాట్లు తప్పవు.

తమకు వాళ్ళు తప్ప మరో కులం వాళ్లు కూలికి రారు మరి!

సంకటి పెట్టలేని ఇంకో ముగ్గురి చేల వద్ద ఇలాగే జరిగిందట.

ఇప్పుడు ఇంటికెళ్లి సంగటి గెలుక్కొని ఆకలి బూడ్చుకోవడం వాళ్లకు సాధ్యమయ్యే పనిగాదు.

తమగుండా వాళ్లీపూట పస్తులున్నట్టే.

సమస్యను మరింత జటిలం చేస్తారు వాళ్లు.

ఎట్లా బైటపడాలో దిక్కుతోచకుండా ఉంది కొండన్నకు.

తనకు తోడు ఇంకొందరున్నారనే విషయం అతనికి కొంత ఊరట నిచ్చింది.

వాన వచ్చి దూకేట్టుంది.

పత్తి గంపలు ఇళ్ళకు మోయాలి.

పని జరిగుంటే కూలోళ్లే తలొక గంప మోసుకెళ్లి ఉండేవాళ్లు.

అతనిలోని అన్ని సమస్యల్ని ఈ ఆత్రుత ముంచేసింది.

గబగబ రెండు గంపలెత్తుకొని కదిలారు ఆలుమగలిద్దరూ.

ఇంటికెళ్లేసరికి వాళ్లకోసం ఒక వార్త కాచుకొని వుంది.

సాయంత్రం నాలుగ్గంటలకీ స్టీఫెన్ తమ ఇంటికి వస్తాడట.

పత్తి గంపలు మోస్తునే స్టీఫెన్ తోటి తిరగాల్సిన తావుల్నీ, కలవాల్సిన మనుషుల్నీ ఒకసారి మననం చేసుకొన్నాడు కొండన్న. తను హైదరాబాద్ వెళ్లినపుడంతా ఇక్కడి పరిసరాల్ని గురించి స్టీఫెన్ పలవరించేదంతా జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు.

ప్రసంగాల ద్వారా, పేపరు స్టేట్‌మెంట్ల ద్వారా, రచనల ద్వారా; పెద్దకులాల కర్రపెత్తనం మీద అతను చేసే తిరుగుబాటును తల్చుకున్నప్పుడంతా కొండన్న ఆశ్చర్యపోతూనే ఉంటాడు.

ఎక్కడ దళితుల మీద అగ్రవర్ణాల వాళ్లు దాడిచేస్తారో అక్కడంతా ప్రత్యక్షమవుతాడు స్టీఫెన్. న్యాయం కోసం పోరాడుతాడట.

అంటరానితనం నేరమంటాడు. అందరూ సమానం కావాలంటాడు.

అతని ధాటికి జడిసి పెద్దకులాల వాళ్లే అతనితో ఎక్కువగా స్నేహం చేస్తుంటారు. కులమతాల్ని పట్టించుకోకుండా తమ ఇళ్లకు సైతం తీసుకెళ్తుంటారు.

సహాయం కోసం వచ్చిన వాళ్లకు చెయ్యందించకుండా ఉండలేడుట. తనతోబాటు ఈ పాలెంలో మరో నలుగురు ప్రభుత్వం సహాయం పొందేందుకు అతనెంతో కృషి జేశాడు.

స్వతహాగా తెలివిమంతుడైన తన కొడుక్కి కోచింగ్ ఇప్పించి ఇంజనీరింగు సీటు తెప్పించాడు. వాణ్ణి అతడే చదివిస్తున్నాడు. అమ్మానాన్నల్ని కూడా మరిచేంత ప్రేమను చూపిస్తున్నాడు. తోటి మాలలంతా అతని కోసం వెళ్తోంటే అతను తమ్ము చూట్టానికి రావటం...!

కొండన్నకు ఏనుగెక్కినంత సంబరం కలిగింది.

పత్తిగంపలు మోసిం తర్వాత పటపటకట్టె పేళ్ళు చీల్చాడు. అంగడి కెళ్లి గోధుమపిండి కొనుక్కొద్దామని మళ్లీ చాలించుకొన్నాడు. స్టీఫెనుకు పల్చగా కాల్చిన జొన్నరొట్టెలంటే మహాప్రీతి!

నాల్గగంటల టిఫెన్‌కు అవే వడ్డిద్దామనుకొన్నాడు.

''యాం దీమాసీ - యింగా ఎర్రిసూపులు సూస్సాండడూ! కోన్ని కోసేదిలే...? దడెం సియ్యలు బడే కోడిపుంజు దెస్చిని. ఇప్పుడు కోస్సెగాదూ. అయిపోయ్యేది?''

వెంకటమ్మ మాటల్తో లేచాడు.

చూరుకత్తినూరి గంపకింది కోణ్ణి పట్టుకొనేసరికి; ఊర్లోంచి ఇళ్లకొస్తూ అతని వద్ద ఆగాడు ఓబన్న. ''మాపిటేలగాని స్టీఫెనయ్య యీడికి రాలేడంట. నీకు జెప్పమన్నడు.'' చెప్పాడు.

ప్రశ్నార్థకంగా అతని కేసి చూశాడు కొండన్న. ''రేత్తిరిగ్గూడా యీడి కేమొస్పడోబ్బా!''నొసలు ముడేశాడు కొండన్న.

''రొండు కోళ్ల గోసిండు పెద్దరెడ్డి. బ్రాందిగ్గూడా మనసుల్ని పంపించ్చిండు'' అసలు విషయం బైటేశాడు.

మనసారా స్టీఫెన్ ఇక్కడకు రావాలనుకొంటే అవేమీ పెద్ద అడ్డంకులుగా తోచలేదు కొండన్నకు.

రొట్టె కాల్చేందుకు జొన్నపిండి కలుపుతోన్న భార్య వద్దకు నడిచాడు. ఆమెతో విషయం చెప్పి కోణ్ణి గంపకింద మూశాడు.

''పొద్దుగల్లవస్చే - పిల్లోని మంచీ చెడ్డా అడుగుదామనుకొంటి. రేత్తిరి ఏ జాంకొస్తాడో?'' విచారంగా అంది.

''పొద్దున అడగొచ్చులే.''

''సీకట్లో దోవబడ్తే ఎట్టజెయ్యాల?''

''మనకాడ ఒక్క పూటన్నా ఉండకుండా పోడులే'' చెబుతూ బైటకు నడిచాడు. ఉరుముల మెరుపుల్తో కారుమేఘాలు కమ్ముకొస్తున్నాయి.

నోటికాడి కొచ్చిన పంట వానపాలయేట్టుంది. ''వానొచ్చేలోపల బుట్టెడు పత్తి యేరకొచ్చినా మేలే గదా!'' అనిపించింది. వీధిలోకొచ్చి పైకెగజూసి పెదవి విరుస్తూ సపారం కింద మంచం మీద వాలాడు.

మొదటి రొట్టె కాల్చి వెంకటమ్మ అతనికి అందించేసరికి, వచ్చిపడింది వాన. రొట్టె తినేంత సేపు జమాయించి కురిసింది.

జరుపవలసిన నష్టాన్ని జరిపి మెల్లగా పాటులోకి దిగింది.

కొండన్నకెందుకో మనస్సులో ఏదో వెలితిగా ఉంది. స్టీఫెన్ వచ్చివుంటే ఎట్లా ఉండేది!

ఇక్కడ సరైన వసతి లేకపోవచ్చు. కాని...తన లేమిడితనంలోకి అతను జొరబడి వచ్చి కూరుకుపోయి గుండెల్ని కలియబెట్టి ఉంటే ఎంత బావుండేది! పెద్దరెడ్డి లాగా తనను విందు భోజనాలు పెట్టలేకపోవచ్చు. అతను పలవరించే అద్భుతమైన బీదవిందు తనందివ్వగలడు గదా!

ఇక్కడ సపారం కింద మంచంలో కూచుని , పళ్లెంలోని కోడిపులుసు అద్దుకొంటూ, జొన్నరొట్టె కొరుక్కు తింటూ; జడివానను చూస్తూ- గడపటం ఎంత ఆనందమో - స్టీఫెన్‌కు మాత్రం తెలీదా?

మరెందుకు అక్కణ్నించి వూడబీక్కుని రాలేకున్నాడు?...

ఇప్పుడనిపిస్తూ ఉంది - బ్రాందీ కూడా తెప్పించారంటే రాత్రంతా అక్కణ్నించి కదలటం స్టీఫెన్‌కు సాధ్యం కాకపోవచ్చు.

తను ఎదురుచూడటం కూడా దండుగేనేమో!

శరీరమంతా నిస్సత్తువ ఆవరించింది కొండన్నకు.

అంతలో తోపేల ప్రకాశం వచ్చాడు.

ఊర్లోకి మాదిగలు వచ్చారట.

బాగా తాగి వున్నారట.

తమ కులాన్ని భ్రష్టు పట్టించాలనుకొన్న మాలల్ని బండబూతులు తిడుతున్నారట.

పెద్దరెడ్డి జోక్యం వల్ల కొంత సద్దుమణిగిందట.

ఆయన మాలపాలేనికి మనిషిని పంపేడుట - రైతులుగా మారిన తమ కోసం. తనకు తలనొప్పిగా ఉందంటూ మిగతా వాళ్లను పంపాడు కొండన్న - 'మీ నిర్ణయమే నా నిర్ణయ'మంటూ.

స్టీఫెన్ ముందుకు పంచాయితీకి వెళ్లటం అతనికిష్టంగా లేదు.

గంటకంతా తిరిగొచ్చారు వాళ్లు.

పంచాయితీ సారాంశం విని ఆశ్చర్యపడ్డాడు కొండన్న.

''మీరు కూలికెళ్లారు కాబట్టి వాళ్ల సంకటి తినటంలో తప్పులేదు. అంతేకాకుండా, ఈ మాలలు మీసంకటి కోసం రెడ్ల చేతికిచ్చే గింజలూ, ఉప్పూ, పప్పూ; అన్నీ వీళ్ల కుండల్లోటివే కాబట్టిట వీళ్ల ఇళ్లలో చేసిన సంకటి తినేందుకు మీరు సంకోచించాల్సిన పన్లేదు.'' అని వాదించాడుట స్టీఫెన్.

''మాలోళ్ల సంగటి మేందింటమా? వాళ్లకు కూలికి రాడమే బుద్ధి తక్కువైతే...'' అన్నారుట మాదిగలు.

గబుక్కున పెద్దరెడ్డి అందుకొని ''అయితే పోగాకండ్రా! వాళ్ల సంగటి తినని నా కొడుకులు:వాళ్లకు కూలి కెట్టా బోతారు?'' అన్నాడట.

వంతుపనే చేశారు కాబట్టి సగం కూలి ఇవ్వటమే న్యాయంగా తీర్మానించారుట.

కొండన్న ఆలోచనలో పడ్డాడు.

స్టీఫెన్‌తో కలిసి రెడ్డి ఇచ్చిన తీర్పు వెనుక ఆంతర్యం అర్థమవుతూ ఉంది. తనకు తెలీకుండానే స్టీఫెన్‌రెడ్డికి సహాయపడినట్టుంది.

మాదిగల్ని ఇంకా రెచ్చగొట్టాడు రెడ్డి. మాలోళ్లకు మరెప్పుడూ కూలికెళ్లకుండా చేశాడు.

ఊరంతా తిరిగినా ఒక్క రైతు కూడా సంగటి గెలిపించక పోవటానికి వెనకున్న కారణం

ఇప్పుడు తెలిసివస్తోంది.

తమకు సంకటి గెలికిపెడితే తంటా వస్తుందని అయ్యవారి పెండ్లాం అన్నమాటల్లో, తంటా ఎవరి ద్వారా వస్తుందో అర్థమవుతూ ఉంది.

భూవముల్లేని మాలలు అప్పోసప్పో మెడకు తగులుకొని రెడ్ల చేతుల్లో ఇరుక్కుపోయారు...మరి కొందరు తోటి మాలోనికి కూలికెళ్లేందుకు అభిమానపడుతున్నారు. అభిమానం అనేకన్నా అసూయ అంటేనే బావుంటుందేమో!

ఈ మాదిగలు కూడా రూపాయి పెంచేసరికి వచ్చారు.

రైతులకు అది కన్నెర్ర అయిండవచ్చు.

కూలి,నాలి, చేసికోకుండా వ్యవసాయం లోకి దిగటం తాము చేసిన ఒక మోస్తర తప్పయితే, రైతులకు వెళ్లే కూలీల్లో తామూ కొంత వాటా పంచుకోవడం క్షమించరాని నేరమైనట్టుంది.

తామెట్లా వ్యవసాయం చేయాలో తెలీకుండా వుంది.

కూలీలుగా బతికే కులం రైతులుగా తయారుకావటం ఎంత కష్టమో, ఎంతమందికి కంటగింపో ఇప్పుడర్థమవుతూ వుంది.

గవర్నమెంటు ఇచ్చిన మోటార్లనీ, పైపుల్నీ, ఎద్దుల్నీ, బండ్లనీ అమ్ముకుని ; ప్రభుత్వ పథకాల్ని మాలమాదిగలు ఎందుకు దుర్వినియోగం చేస్తున్నారో ఇప్పుడు బాగా అవగాహనకొచ్చింది.

తనకూ అందరిలా అంతో ఇంతో తాగుడూ పెట్టుబడికి సావుకార్ల వద్ద వంగే బీదరికమూ వుంటే రేపు సీజనుకే బండెద్దులు, బోరుబావులూ అమ్మకతప్పదు గదా!

పంచాయితీని గురించి ఆలోచించే కొద్దీ స్టీఫెన్ ప్రవర్తన వింతగా తోచింది కొండన్నకు.

కులప్రసక్తి లేని కూలిపంచాయితీ చేసుండొచ్చు కదా! వాళ్లను రెచ్చగొట్టటమేమిటి? తన కులం వాళ్లకి సహాయం చేద్దామనుకున్నాడు కాబోలు.

ఇది సహాయమెట్లా అవుతుంది?

పంచాయితీలో మాదిగలకు అన్యాయం జరిగింది.

దానిప్రతిఫలం ఖచ్చితంగా మాలల మీద పడుతుంది. పక్క తాలుకా లోని నీళ్ల పంచాయితీలో కూడా విఫలమై వచ్చాడుట స్టీఫెన్. తమకు చెందిన మంచినీళ్ల గుంటలో మాలలు నీళ్లు తెచ్చుకునేందుకు రైతులు ఓ మెలిక పెట్టారుట. మాదిగవాడలో కూడా, ఉన్న ఒక్క బోరు బావీ చెడిపోయే దశలో ఉంది. కాబట్టి మాలమాదిగలిద్దరూ ఒకే రేవులో దిగి నీళ్లు ముంచుకెళ్తే తమకు అభ్యంతరం లేదన్నారుట.

ఈ ప్రతిపాదనకు కలెక్టరు కూడా సమ్మతించాడుట.

రెండుమైళ్ళు దూరంలోని చెలమనీరు తెచ్చుకోవటమే తమకు సమ్మతంగా వెనుదిరిగి పోయారట మాలలు.

తమకు తక్కువగా చూసే అగ్రవర్ణాల మీద దళితుల పక్షాన తిరుగుబాటు జెండా ఎగరేస్తున్న ఈ స్టీఫెన్ దళితుల్ని ఏకం చేయకుండా ఎట్లా యుద్ధం చేయాలనుకొన్నాడు? ప్రత్యర్థిని ఎదుర్కొనే ముందు తమలో తాము వైషమ్యాల్ని చంపుకోవాలి గదా!

పల్లెలంతా జటిలంగా ఈ సమస్య నగర దళితుల మధ్య లేకపోవచ్చు. కానీ దళితులంతా ఒక్కటే గదా!

ప్రస్తుతం నగరాల్లో దళిత ఉద్యమం మంచి ఊపుమీదుంది గానీ - అందులో కూడా అపశ్రుతి జీర స్పష్టమవుతోంది. తమను చూసి అగ్రవర్ణాల వాళ్లు నవ్వుకొనేలా కులాల పేరిట అనైక్యతా వేదికలు, అస్పృష్టశంఖారావాలు పెచ్చు మీరుతున్నాయి. ఈ వివక్ష అనువంశిక లక్షణాలు విద్యావంతుల్లో సైతం చావకుండా ఉండటం విచిత్రంగా ఉంది.

పల్లెనుంచి పైకెదిగి మంచి హోదాలో ఉన్న ప్రతి హరిజనుడూ తన పల్లెను మరుస్తున్నాడు. తల్లి మట్టిని విస్మరిస్తున్నాడు. తన వాళ్లను పైకి తెచ్చేందుకు ప్రయత్నించడం లేదు - అగ్రవర్ణాల వాళ్లలా!

పల్లెకొస్తే అక్కడి పెద్దకులాల వాళ్లు అతన్నింకా తక్కువ కులం వాడిగా చూస్తారని అనుమానం. ఫలానా వృత్తిపనివాడి కొడుకుగా వేలెత్తి చూపుతారేమోనని ఆత్మన్యూనతా భావం.

స్టీఫెన్‌కు కూడా అలాంటి భావమే ఉందేమో!

తన ఇంటికొచ్చేందుకు ఆ భావమే అడ్డుపడిందేమో!

తనెరిగిన స్టీఫెన్‌కు అలాంటి భావం లేదనుకున్నా, పెద్దరెడ్డి వలలో పడింతర్వాత ఖచ్చితంగా వచ్చి దొందుకుని ఉంటుంది.

రేపు తన కొడుకు కూడా ఇట్లాగే ప్రవర్తించవచ్చు బహుశా.

ఇప్పటికే -సంవత్సరానికి ఒక్కసారికూడా ఇక్కడకు రావటం లేదు. వచ్చినా నాల్రోజులు కూడా ఉండటం లేదు.

ఉన్న రోజుల్లో కూడా ఎవరితో కలవడు. ఏకాంతంగా చేలెంట, చెట్లెంట తిరగటం తప్ప.

వాడికీ, తమకూ మధ్య ఏదో పెరిగిపోతున్నట్లుగా అన్పిస్తుంది.

చిన్నప్పటినుంచీ వాడు మంచి మేధావే.

వాడి తెలివి చూసే స్టీఫెన్ చేరదీసినట్లుంది.

వాడికి పెద్ద హోదా కల్పించి రేపు అల్లునిగా కూడా చేసుకోవచ్చు. ఈ విషయంలో తమ సహకారం స్టీఫెన్‌కు పెద్దగా అవసరం లేకపోవచ్చు

ఎంతగా మారిపోయాడు?

హైదరాబాద్ వెళ్లినప్పుడంతా పల్లె మనుష్లిగురించీ, సావాసగాళ్లగురించీ పలవరించేవాడంతా. పెద్దరెడ్డి సరసన కూచోగానే మాసిపోయినట్లుంది.

దళితుల పక్షాన పోరాడే వాడు దళితుల్ని మరవటం వింతగా ఉంది.

పెద్దరెడ్డి విసిరిన వల బాగా కన్పిస్తూ ఉంది గదా!

ఆయన హోదా ముందు తమ పాలేనికి వచ్చేందుకు నామోషీ పడ్డాడేమో!

తోటి మాలలంతా వచ్చి పెద్దరెడ్డితో సమానంగా తన్నూ గౌరవించేసరికి - రెడ్లు నీచంగా చూసే ఇళ్లకు తాను అతిథిగా వెళ్లేందుకు సిగ్గుపడ్డాడు కాబోలు. రెడ్డి ముందు చులకన అవుతాననుకున్నాడేమో!

రెడ్డికీ, స్టీఫెన్‌కూ పెద్ద తేడా ఏమీ కన్పించలేదు కొండన్నకు.

తరతరాలుగా రెడ్లు దళితుల శ్రమను దోపిడీ చేస్తున్నారు. స్టీఫెన్ లాంటి వాళ్లు దళిత వనంలో వికసించిన మేధావి పూలను తుంచుకుపోతున్నారు. పల్లె దళితుల్ని మోడు పైరుగానే ఉండేటట్టు చూస్తున్నారు.

రాత్రంతా ఆలోచిస్తూనే ఉన్నాడు కొండన్న.

* * *

మాదిగలకు న్యాయమైన కూలి ఇచ్చేందుకే నిర్ణయించుకున్నాడు కొండన్న. తన తోటివాళ్లతో కలిసి చర్చించాడు కూడా.

ఉదయం వంతు పనెక్కువ జరుగుతుంది. కాబట్టి సగం కంటే కొంత ఎక్కువ కూలి ఇస్తూ సంకటి ఖర్చు కట్టించాలనుకున్నాడు.

''టీపెనన్న వూరికి పోతాండడంట. నీతో ఏదో మట్లాడాల్నంట. అడ్డరోడ్డు కాడికి రమ్మన్నెడు. పొయ్యిరాపో!'' వెంకటమ్మ చెప్పింది.

''నువ్వేపో...'' సమాధానమిచ్చాడు కొండన్న.

''యాం దీమాసీ....'' అంటూ ఆశ్చర్యపోయింది ఆమె.

డబ్బు జేబులో దురుముకొని, కోడిపుంజును చంకన పెట్టుకుని మాదిగిండ్లకేసి సాగే మొగున్ని చూసి విస్తుబోయింది.

రాత్రి స్టీఫెన్ బొజ్జకు కాకుండా, ఇప్పుడు మాదిగల కోసం ఈ కోడిపుంజు వినియోగ పడుతున్నందుకు కొండన్నకు కొండంత ఆనందంగా ఉంది.

# శ్రీరామచంద్రమూర్తి

## (ఒక హరిజనుడు)

దొండపాటి దేవదాస్

పదేళ్లలో ధర్మపురం ఆర్థిక విద్యా వైజ్ఞానిక రంగాలలో సాధించిన అభివృద్ధికంటే సాంఘిక పరిస్థితుల దృష్ట్యా అది సాధించిన ప్రగతి ప్రధానమైనదీ ప్రశంసించదగ్గదీను.

ఆ వూరికి రెండు మైళ్ల దూరంలో ఉండేది హరిజనవాడ. ఆ జిల్లా మొత్తంమీద హరిజనవాడల్లో ఇదే పెద్దది. దీంతో పోల్చి చెప్పవలసివస్తే జనాభా దృష్ట్యా ఆ వూళ్లో అగ్రవర్ణాలవారే మైనారిటీలని చెప్పాలి. అగ్రవర్ణాల వారన్న ఆధిక్యతే వాళ్లని గ్రామాధిపత్యాన్ని వహించేట్లు చేసింది.

వూరి గుడిసెల్లో దుర్గంధపూరిత వాతావరణంలో పశువులకంటే హీనంగా బతుకుతున్న ఆ వూరి హరిజనవాడ ప్రజానీకం వూరికి అంటిపెట్టుకుని వుంది. విశాలమైన ఆ ఖాళీ స్థలంలో వారికి చక్కని కాలనీ నిర్మించి అలా వాళ్లని వూరికి దగ్గరగా చేర్చుకోవడం జరిగింది.

దానికి చేరువగా ఆధునిక సౌకర్యాలతో చక్కని భవనాన్ని నిర్మించి అంతకుముందు పాకల్లో కనబడే హైస్కూల్‌ని ఇందులోకి మార్చారు. దానికి కొంచెం దూరంగా హరిజన బాలుర హాస్టల్, ఇంకో ఫర్లాంగు ఎడంగా బాలికల హాస్టలూ వెలిశాయి. ప్రైమరీ హెల్తు సెంటరు కూడా ఆ చుట్టుపక్కలే అనువైన ప్రదేశంగా ఎంచబడి ఏర్పాటుచేయడం జరిగింది. పట్టణాలకు వెళ్లడానికి ప్రయాణ సౌకర్యాలు లేక అనేక బాధలకు గురవుతున్న ఆ వూరి ప్రజానీకానికి ఆర్.టి.సి బస్సు రూటు కూడా మంజూరు కావడంతో మహత్తర విజయాన్ని సాధించినట్లయింది. కరెంట్ సౌకర్యం కూడా ఏర్పడటంతో ఆ వూరి ప్రజల ఆనందోత్సాహాలకి పట్టపగ్గాల్లేకుండా పోయాయి.

పదేళ్లలో ఇంతటి గొప్ప మార్పులు సంభవించాయి అంటే అందుక్కారకుడు శ్రీరామచంద్రమూర్తి. అతని నిరంతర కృషి వల్లనే!

ఆరోజు ఉదయం పదిగంటలకల్లా మున్సబ్ అర్జున్ రెడ్డితో చర్చలు ముగించుకుని హైస్కూల్ రోడ్డువెంటే నడుస్తూ ప్రైమరీ హెల్తు సెంటర్‌ని సమీపించాడు మూర్తి. డాక్టర్ మధు మూర్తిని చూసి గబగబ అతనికి చేరువగా వెళ్లి ''నమస్కారం డాక్టరుగారూ! కులాసాయేనా?'' అంటూ ఎంతో ఆప్యాయంగా పలకరించాడు.

''థాంక్యూసర్! అన్నాడు. డాక్టరు ప్రతి నమస్కారం చేసి -

''మూర్తిగారూ! మీరేమనుకున్నాసరే! నా మనసులోని మాట చెప్పలేకుండా వుండలేక పోతున్నాను'' హఠాత్తుగా చెప్పడం ఆపి మూర్తి మొహంలోకి చూశాడు.

''నిర్భయంగా చెప్పండి డాక్టర్!'' ప్రోత్సహిస్తూ అన్నాడు మూర్తి.

''సాంఘిక సేవనీ, ఈవూరివాడిననీ మీరీ పల్లెటూళ్లో ఈ మూర్ఖుల మధ్య గడపడం నాకేమీ నచ్చలేదండీ! 'తివిరి ఇసుమున తైలంబు దీయవచ్చు' పద్యం మీకొచ్చుగా! వస్తాను సార్'' అంటూ స్టెతస్కోపు సవరించుకుని వేగంగా అడుగులు వేస్తూ ఆసుపత్రి దిశగా వెళ్లిపోయాడు.

ఒకప్పుడయితే ఇలా ఎవరయినా అంటే మూర్తి చాలా ఆగ్రహంతో మండిపోయేవాడు. కానీ ఇప్పుడు డాక్టరన్న మాటలకి నవ్వుకున్నాడు. ఈ డాక్టరు మాటలూ వైఖరీ ముమ్మూర్తులా రవిని పోలివుంటాయి. హఠాత్తుగా మూర్తికిప్పుడు రవి మాటలు ఆ సన్నివేశం గుర్తుకొచ్చాయి.

తను ఎమ్మెస్సీ చదువుతుండగా ప్రభాకరం వాళ్ల చెల్లి వివాహమైతే వాళ్ల వూరు వెళ్లాడు. తను వచ్చినందుకు ప్రభాకరం అతని తమ్ముడు రవీ ఎంతో ఆనందపడ్డారు. ముహూర్తం తెల్లవారుజామున ఏర్పాటుచేయడంవల్ల ఇంకా అడపా దడపా బంధుమిత్రులు వస్తూనే వున్నారు.

బంధుమిత్రులతో మేళతాళాలతో పెళ్లిపందిరి కళకళలాడుతూ కోలాహలంగా ఉంది. భోజనాల వడ్డన కార్యక్రమం ముమ్మరంగా ప్రారంభమైంది. ఇంతలో ఆడా మగా పిల్లలూ అంతా పెద్ద పటాలంలా జనం వచ్చారు. రవి గబగబ దగ్గరికి వెళ్ళి ''ఒరేయ్! ఎక్కడికిరా యిలా తోసుకువస్తున్నారు? ఏకంగా ఇంట్లోకే దూరతారా ఏంకి పోండి అవతలకి మీకు చావిట్లో వడ్డిస్తారు'' అన్నాడు కోపంగా చీదరింపుగా.

''చిత్తం బాబుగారూ'' అంటూ ఆ జనం చావిడివేపు? నడిచిపోయారు.

రవి గబగబ పందిట్లో ఓ మూలగా కూర్చునివున్న తనని సమీపించి ఎంతో ఆదరంగా ''మూర్తిగారూ! లేవండి మీకు లోపల వడ్డిస్తున్నారు పదండి త్వరగా'' అన్నాడు.

''ఇప్పుడు మీరా చావిట్లోకి వెళ్లమన్న జనం ఎవరు? పందిర్లో చాలా ఖాళీ వుందిగా? వాళ్లకీ ఇక్కడే వడ్డించక పోయారా?'' అన్నాడు తను ఎంతో అమాయకంగా.

''వాళ్లా! వాళ్లు మాలమాదిగలండీ! అంచేతనే చావిట్లోకి వెళ్లమన్నాను. వాళ్లకెంతసేపూ తిండిరంధే గదండీ! పెళ్లి భోజనాలు, ఎన్నికలు ఇవంటే పడి ఛస్తారు. ఎన్నికలంటే గుర్తొచ్చింది. ఆ మధ్య మావూరి పంచాయితీ ఎన్నికలు జరిగాయి. వెంకట్రాయుడికీ, రామచౌదరికీ మధ్య తీవ్రమైన పోటీ జరిగింది. వెంకట్రాముడు మాలవాళ్లని నాల్రోజులు ముందుగానే తీసుకెళ్లి తన చావిట్లో బంధిస్తే రాముచౌదరి మాదిగవాళ్లని బంధించాడు. ఇక చూడండి నాసామిరంగా ఆ నాల్రోజులు షడ్రసోపేతమయిన భోజనాలతో కల్లు సారాయిల ఆనంద కోలాహలంలో మునిగి తేలారనుకోండీ! ఆ ఎన్నికలయిపోయాయి ఇప్పుడు మనింట్లో పెళ్లి. పెద్దా చిన్నా, పిల్లా మేకా అంతా ఓ పెద్ద పటాలంలా వచ్చిపడ్డారు. సరే వాళ్ల గొడవ మనకెందుకు మీరు లేవండి సార్!'' అన్నాడు.

స్వాతంత్ర్యం వచ్చి 30 ఏళ్లు గడిచినా ఇంకా పల్లెటూళ్లలో పంచాయతీ ఎన్నికల్లో హరిజనుల్ని గొడ్ల చావిళ్లలో బంధించి ఓట్లు వేయించుకునే పద్ధతి సాగుతున్న వైనాన్ని తొలిసారిగా గ్రహించిన తను ఎంత ఆశ్చర్యం చెందాడో అంతగా ఆవేదన పొందాడు.

''ఏమిటిసార్! ఆలోచిస్తున్నారు? లేవండి త్వరగా'' అన్నాడు రవి.

''రవిగారూ! నాకూ ఆ చావిట్లోనే వడ్డించండి''

''భలే జోకేశారండీ! ఇంకానయం వాళ్ల సరసన కూర్చుని భోంచేస్తానన్నారు కాదు. ఏమయినా చూస్తూ చూస్తూ వాళ్ల పక్కన కూర్చుని ఎలా భోంచేయగలం చెప్పండి మీ బస్తీల్లో కాస్మోపాలిటిక్ వ్యవహారం గనుక కొట్టుకుపోతుంది. పల్లెటూళ్లల్లో అదేం కుదరదండోయ్! ముందు లేవండి మీరు?''

''నేను మాల మాదిగవాణ్ణే! అందుకే వాళ్లతో కలిసి వడ్డించమంటున్నాను''

''అబ్బ! మీ జోకుల్తో ఛస్తున్నానండీ! వాటికింకా టైముందిగానీ దయచేసి లేవండి''

''నిజం చెప్పాను. నామాట నమ్మండి. నేను చెప్పినట్లు చేయండి'' సీరియస్‌గా అన్నాడు తను.

''ఎలా నమ్మమంటారుసార్! ఆంధ్ర సారస్వత లోకంలో ప్రముఖ అగ్రస్థానాన్ని ఆక్రమించి గొప్ప ప్రజ్ఞ ఉపజ్ఞత కలిగి, ప్రముఖ కవిగా రాణిస్తున్న మీరు, పండితుల్ని సహితం తప్పులు పట్టగలిగిన మీరు, వేషంలో రూపంలో అన్ని విషయాల్లో ఉన్నతంగా అగుపించే మీరు హరిజనులా! అసంభవం! అయ్యా! కాస్త తీరుబడిగా హాస్యం ఆడుకుందాం! ముందు భోజనానికి లేవండి!'' అన్నాడు.

''మిస్టర్ రవీ! నేను ముమ్మాటికీ మాలమాదిగవాణ్ణే! మీరు చెప్పిన ప్రత్యేకతలు వాళ్లకి ఉండవని భావించేవాళ్లు సంస్కార హీనులవుతారు. మీ దయవల్ల నా ప్రజానీకం సమాజంలో ఎలాంటి గౌరవ సత్కారాలు పొందుతున్నారో ఇప్పుడు కళ్లారా చూశాను. మీద్వారా చెవులారావిన్నాను, నేనిహ ఒక్క క్షణంకూడా ఇక్కడుండలేను. మీ ప్రభాకరంతో చెప్పండి మరి వస్తా'' అంతే సరాసరి స్టేషన్‌కి వెళ్లి రాత్రి బండిలో పొద్దుపోయి ఇల్లు చేరాడు తను...

''నమస్కారంసార్!'' ఎదురుగా ఎవరో సైకిల్ దిగినట్లుంటే ఆలోచనల్లు చెదరి ఆయనకేసి చూశాడు యాంత్రికంగా చేతులు జోడించి. ఆయన లెక్కల మాష్టారు. ఆయన్తో ఇటీవలే మూర్తికి బాగా పరిచయమయ్యింది.

''రేపేగదండీ మీరు వైజాగ్ వెడుతున్నది? మా తమ్ముడు బి.ఎ పాస్ సర్టిఫికెట్ కాస్త త్వరగా పంపేట్లు చూడండి సార్'' అన్నాడాయన.

''తప్పకుండా? సమయానికి బాగా గుర్తుచేశారు. సరేగాని మాష్టారూ మీనుండి కొన్ని ఖచ్చితమయిన సమాధానాలు కావాలి, మీరు అన్యథా భావించకపోతే అడగమంటారా?''

''తప్పకుండా!''

''శతాబ్దాల తరబడి అంటరానివాళ్లుగా, అనాగరికులుగా, నీచంగా చూడబడుతూ వూరికి దూరంగా కుక్కలకంటే హీనంగా బతుకుతున్నవాళ్లు ఈ దేశంలో కేవలం హరిజనులే కదండి?''

ఆ మాష్టారు పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్లు ఏం చెప్పేందుకు తెగ ఇబ్బంది

పడిపోయాడు.

''ఏమండీ! నిజం చెప్పండి? ఇక్కడ మిమ్మల్ని శిక్షించే వాళ్లెవరూ లేరు?''

''అవును మీరు చెప్పినట్లు హరిజనులేనండీ''

''గర్భ దారిద్ర్యంతో మగ్గిపోతూ అవసరాలకు సరిపడ ఆదాయం లేక, అప్పులు పుట్టక, అదునులో ఆదరించేవాళ్లులేక, ఆకలి కోసం కక్కుర్తిపడి చేసే చిన్న నేరాలకు మగాళ్లనయితే చెట్టుకికట్టి గొడ్డుని బాదినట్లు బాదటం, ఆడవాళ్ల నయితే అతి చులకనగా మానభంగాలు చేసి నడిరోడ్డుమీద నగ్నంగావూరేగించడం, అన్యాయాల్ని, అక్రమాల్ని హరిజన యువకుల్ని చిత్రవధ చేసి ధనంతో పలుకుబడితో న్యాయం నోరునొక్కివేయడం లాంటి అమానుష కార్యాల్ని దారుణంగా అనుభవించే జాతి ఈ దేశంలో ముఖ్యంగా హరిజనులే కదండి!''

''అవునండి!''

''స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్లు గడిచినా! ఇప్పటికి సంసారాన్నంతా ఓ గోనెసంచిలో ఇముడుచుకుని ఆడవాళ్లు మగవాళ్లు పిల్లలూ కొంపగోడూ వదలి నాట్లప్పుడు వరికోతలు సమయంలో కూలి కోసం కూటి కోసం పట్టణాల్లో వీధుల్లో జీవచ్ఛవాల్లాగా ఆడమగా ప్రతినిధుల్లా సంచరించడం మీరు చూశారా? వాళ్లంతా ఎవరు? అక్షరాలా హరిజనులే గదండీ''

''అవునండి!''

''హరిజనోద్ధరణకార్యక్రమం ప్రారంభించబడి ఎన్నాళ్లయ్యింది? ఆంధ్రదేశంలో రిజర్వేషన్ కారణంగా పోటీచేసి ఎన్నికయిన జిల్లాపరిషత్ చైర్మన్‌కి హరిజనుడంటూ ఒక్కరయినా ఉన్నారా? ఉన్నారని మీ రనగలరా''

''క్షమించాలి. నాకు స్కూల్ టైమైంది వెళ్లొస్తా?'' అంటూ లెక్కల మాష్టారు సైకిలెక్కి బతుకుజీవుడాని ఒలింపిక్ పందాల్లో పాల్గొన్నంత వేగంగా ముందుకు దూసుకుపోయాడు.

మాష్టార్ని ఇబ్బంది పెట్టిన తన ఆవేశానికి సిగ్గుపడిపోయాడు శ్రీరామచంద్రమూర్తి.

నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ పక్కనే వున్న ఇసుకతిన్నె మీద నిల్చున్నాడు.

మళ్లీ ఆలోచన్లు ముసురుకున్నాయి.

సమాజ వ్యవస్థే పూర్తిగా మారిపోవలసిన రోజులొస్తే నాన్నలాంటివాళ్లు ఏవో సాకులు హితబోధలు చెప్తారు. తమపొరపాట్లను సమర్థించుకోవాలంటారేగాని సంస్కరించాలనుకోరు. ఒకసారి ఆరోజు తనకి నాన్నకీ జరిగిన వివాదం కళ్లముందు కదలాడింది.

రవివాళ్ల వూరునుండి వచ్చిన మర్నాడుదయం -

''నాన్నా! త్వరలో మనం మన స్వగ్రామానికి వెళ్లిపోదాం! నీకేమయినా అభ్యంతరమా?'' అన్నాడతను.

పడక్కుర్చీకి చేరగిలబడి పేపరు చూస్తున్న నాన్న హఠాత్తుగా పులిని చూసి బెదిరినట్లుగా తక్కున కుర్చీలోంచి లేచి కొంచెం ముందుకు వంగి ''మన స్వగ్రామానికా! వెళ్లిపోవడమా? మనమా'' ఆశ్చర్యాందోళనలు మిళితమై ధ్వనించా యాయన కంఠంలో

''అవును. నువ్వు రిటైరయ్యాకకూడా ఇక్కడెందుకు? మన స్వంతవూళ్లో వుండటానికి వెళదాం!''

''ఒద్దురాబాబూ! ఆవూళ్లో ఆ వాతావరణంలో మనం వుండలేం? నీ భవిష్యత్తును కోరే నిన్నీ వాతావరణంలో పెంచాను, ఇక్కడే స్థిరపడ్డాను. మరెప్పుడూ ఇలా మాట్లాడకు. నీకు తగిన అనుభవం లేదు''

''అక్కడే పొరబడుతున్నావ్ నాన్నా! రిజర్వేషన్ సౌకర్యంతో చదువుకుని పైకొచ్చి ఆఫీసర్లయిన నీలాంటి వాళ్లంతా పూర్వపు పరిస్థితులన్నీ మర్చిపోయి పైగా ఆ వాతావరణాన్ని ఏవగించుకోవడం క్షమించరాని విషయం. వాళ్లకి దూరంగా బతకాలని కోరుకోవడం పరమ దారుణం. అందుకే నేను వాళ్లలోకి వెళ్లాలి. వాళ్లతో కలిసి జీవించాలి. వాళ్ల అభివృద్ధికి నా చేతనయిన సాయం చేస్తాను''

''ఒరేబాబూ! నీవిలా ఎందుకు మారుతున్నావో నాకర్థం కావడంలేదు. నీ అభిప్రాయాలు సరైనవి కావు. ఆఫీసర్లయిన నాలాంటి వాళ్లందరికీ దారిద్ర్య రేఖకి దిగువనున్న వారందరికీ ఎంతో సాయపడాలని ఉంటుంది. కానీ మా నిర్ణయాలు పథకాలు అమలు జరక్కుండా అనేక రూపాల్లో మహాశక్తులు అడ్డుకుంటాయి. వాటి నెదిరించి నిలువగల స్థితి సామాన్యమయింది కాదు. సమాజంలో నేటికీ మన పరిస్థితి అరిటాకు ముల్లు లాంటిదే! ఏం చేసినా ప్రభుత్వం చెయ్యాలిగానీ నీలాంటివాళ్ల వల్ల అసలు జరగదు''

''జరగనీ జరక్కపోనీ! నేను నా ప్రజలకి సేవ చేయాలి. వాళ్లనీ వాళ్ల పరిస్థితుల్ని సంస్కరిస్తాను. చట్టప్రకారం వాళ్లకి చెందవలసిన సౌకర్యాలు గురించి బోధిస్తాను. వాళ్లలో చైతన్యాన్ని రగిలిస్తాను. వాళ్లతో కలిసి కోర్కెల సాధన కోసం ఉద్యమం సాగిస్తాను?''

''ఒరేయ్ బాబూ! తల్లిలేనివాడివి, చిన్నప్పట్నించీ కంటికి రెప్పలా కాపాడి, పెంచి పెద్దచేసి చదువులు చెప్పించాను. హాయిగా ఉద్యోగం చేసుకుంటూ ఓ ఇంటివాడవై పిల్లాపాపల్తో నాకళ్లముందు తిరగాలని కోరుకుంటున్నాను. ఇలాంటి ఆలోచన్లు పెట్టుకోకు. వద్దు నువ్వెక్కడికీ వెళ్లవద్దు నా మాట విను!''

''క్షమించు నాన్నా! నా నిర్ణయం మారదు. ఇంట గెల్చి రచ్చ గెల్వమన్నారు. ముందు నా కృషిని మన వూళ్లోనే ప్రారంభిస్తాను, నా గురించి నువ్వు బెంగ పెట్టుకోవద్దు. నన్ను ఆపేందుకు ఎలాంటి ప్రయత్నమూ చేయవద్దు''

అంతే నాన్న మళ్లీ మాట్లాడలేదు. కళ్లు తుడుచుకుంటూ మవునంగా నిల్చుండి పోయాడు. ఆ మర్నాడే ధర్మాపురం వచ్చేశాడు తను . దగ్గర్లో కారు హారన్ విన్పించడంతో ఉలిక్కిపడి పక్కకి తిరిగి చూశాడు మూర్తి.

పట్నంనుంచి వస్తున్న బస్సునిండా జనం ఉన్నారు. అది వూళ్లోకి వెళ్లేదాకా దానివేపే చూశాడు. తరువాత అతని దృష్టి కిందికి వాలింది. దైవదర్శనం చేసుకుని సంతృప్తితో ఇంటికివెడుతున్న కొందరు హరిజనులు కనిపించారు. మరి కొంచెం ఇవతలిగా హడావిడిగా విద్యార్థులు హైస్కూలుకి వస్తున్నారు. ఆసుపత్రి వరండాలో బారులుతీరి వున్న రోగులు మందులు తీసుకు వెడుతున్నారు. ఎంతలో ఎంత మార్పు! తన కృషి వృథా కాలేదు. నాన్న దగ్గరికి స్వయంగా వెళ్లి తన వూరికి రమ్మని ఆహ్వానించాలి. అప్పుడాయన

అభిప్రాయాలు వినాలి. ఈ ఆలోచనలతో ఎక్కడలేని సంతోషం కలిగింది. ఉత్సాహంగా ఇసుకదిబ్బనుండి కిందికి దిగి హుషారుగా నడుస్తూ ఇంటిదారి పట్టాడు మూర్తి.

* * *

ధర్మపురం పలుకుబడి నలుగురు చేతుల్లో వుంది. వాళ్లు చెప్పేది వేదం, చేసేది న్యాయం దానికి తిరుగులేదు ఆ ఏలికలు గ్రామ కరణం శ్రీరామశర్మ, పంచాయితీ ప్రెసిడెంట్ వీర్రాజు, ఎం.ఎల్.ఏ రంగయ్యగుప్త, మున్సబ్ కోటిరెడ్డి.

వాళ్లలో కొందరు చదువుకున్నారు, కొందరు చదువుకోలేదు. చదువున్నా లేకపోయినా బంగారంలాంటి ఏలిక పదవి వాళ్ల లక్ష్యమైపోయింది. చిన్నతనంలో వాళ్ళు ప్రాణ స్నేహితులు. లక్ష్యం ఒక్కటే కావడంవల్ల పోటీపడ్డారు. తద్వారా గర్భశత్రువులైపోయారు.

సరిగ్గా ఇలాంటి పరిస్థితుల్లో శ్రీరామచంద్రమూర్తి ధర్మపుర ప్రవేశం చేశాడు.

అతని సంస్కారం, చొరవ రాష్ట్రస్థాయిలో అతని పలుకుబడీ, ప్రముఖ వక్తగా అతన్ని గురించి ఈ నలుగురూ తెలుసుకున్నారు. ముందు పాచిక విసరినవాడు కరణం.

మూర్తి వాళ్ల నలుగురికీ ఉపయోగపడ్డాడు. ఆ నలుగురూ ఊరికి ఉపయోగపడేట్టు చేశాడు.

కరణం మూర్తి కలిసి తమ ఊరికి ఆర్.టి.సి బస్సు రూటు మంజూరు చేయించారు. ప్రజలు ఆహా! ఓహో! అన్నారు.

మున్సబ్ గుండె జారిపోయినట్లయ్యింది. అదే మూర్తిని ఆశ్రయించాడు. మూర్తి మున్సబ్‌లు ప్రైమరీ హెల్తు సెంటర్‌ని ఆ వూళ్లో ఏర్పాటుచేయించుకున్నారు.

అప్పుడు కూడా జనం ఆహా! ఓహో! అన్నారు. ఎం.ఎల్.ఏ రంగయ్యగుప్త ఏమంత చదువుకున్నవాడు కాదు. తనకి ఉపన్యాసాలు రాసిపెట్టడం, తన కార్యకలాపాల్లో ఎక్కువ పాలుపంచుకోవడం వల్ల గుప్తాగారికి మూర్తి చాలా సన్నిహితుడు. అంచేతనే అతనిద్వారా ఎమ్మెల్యేని మధ్యని ఇరికించి మూర్తి ఆ మధ్యన హైస్కూల్ భవన నిర్మాణం గావించి తనకు తానే సాటి అనిపించుకున్నాడు. అప్పుడు కూడా జనం ఆహా! ఓహో! అన్నారు.

ఇహ ప్రస్తుత ప్రెసిడెంట్ వీర్రాజుకి గుండెలు దడదడలాడి పంచాయితీ ఎన్నికలు సమీపంలోకొచ్చి తాను అశ్రద్ధ చేస్తే తన ఓటమి కనుచూపుమేరలో కనిపించినట్లు కలవరపడిపోయి మూర్తితో మంతనాలు సాగించాడు.

తత్ఫలితంగా హరిజనులకు చక్కని కాలనీ నిర్మాణం జరిగేలా చేసి, కరెంటు సౌకర్యం కూడా ఏర్పడేలా చేసి సమర్థుడైన సర్పంచ్‌గా ప్రజలముందు ఫోజు పెట్టాడు.

వాళ్లు నలుగురూ తనని బాగా ఉపయోగించుకున్నారని మూర్తికి తెలుసు. అయినా వాళ్ల ద్వారా తనఆశయాలు నెరవేరడం తన ఏకైకలక్ష్యం గనుక ఆ నలుగురికీ ఉపయోగపడ్డాడు.

ధర్మపురం పంచాయతీ ఎన్నికలు సమీపించాయి. ఈసారి ప్రెసిడెంటుగా శ్రీరామచంద్రమూర్తి పోటీచేస్తాడన్న వార్త వూరంతటికీ పాకిపోయింది. ప్రజలంతా అతనా పదవికి తగినవాడనీ తమ తమ హర్షామోదాలు ప్రకటించారు. ఎవరినోట విన్నా

శ్రీరామచంద్రమూర్తి గెలుపు తిరుగులేనిదనే.

ధర్మపురాన్ని ఏలుతున్న నలుగురు ప్రధాన ఏలికలకు మాత్రం యీ వార్తతో తమమీద బాంబుల వర్షం కురుస్తున్నట్లు హడలిపోయారు.

ఎన్నికలు సమీపించాయి. శ్రీరామచంద్రమూర్తి అభ్యర్థిత్వం పట్ల ప్రజల్లో అనుకూలత విశేషంగా పెరిగిపోతోంది.

గర్భశత్రువులైన నలుగురు ఏలికలూ ఆరోజు అర్ధరాత్రి సగం సైజు అష్టగ్రహ కూటమిలా వూరి వెలుపల ఓ రహస్య సమావేశమయ్యారు. చాలా పొద్దుపోయేవరకు చర్చలు జరిపి చివరికి ప్రాణస్నేహితుల్లా పరస్పరం చిరునవ్వులతో కరచాలనం చేసుకుని సంతృప్తిగా విడిపోయారు.

* * *

ఎన్నికల ఫలితాలు తెలిశాయి. తన వార్డులోనే శ్రీరామచంద్రమూర్తి చిత్తుచిత్తుగా ఓడిపోయాడు.

దిగ్భ్రాంతి చెందిన అతని స్నేహితులు, శ్రేయోభిలాషులు గుంపులు గుంపులుగా మూర్తి నివాసానికి తరలివచ్చారు.

శ్రీరామచంద్రమూర్తి ఎప్పటిలా చిరునవ్వుతో వాకిట్లో నిల్చుని అందరికీ అభివాదం చెయ్యడం ఆ వచ్చినవాళ్లలో చాలామందికి అమితాశ్చర్యాన్ని కలిగించింది.

''పెద్ద కులపోళ్ల కుట్రవల్లే మీరోడిపోయారు?'' అన్నాడొకతను.

''కాదు కాదు డబ్బు సంచులు గుమ్మరించడంవల్ల'' అన్నాడు మరొకాయన.

''నాయాల్ది సారా ఏరులై పారటం మూలాన'' అన్నాడు ఇంకొక అతను.

''మూర్తిగారూ! వీళ్లు చెప్పేవి అభూత కల్పనలని కొట్టిపారేసేందుకు వీల్లేదు. ఏమయినా మీ ఓటమి మీ అభిమానులైన మా అందర్నీ తీవ్ర మనస్తాపానికి గురిచేసింది సారీ... వెరీ సారీ... అన్నారొక మాష్టారు.

శ్రీరామచంద్రమూర్తి రెండడుగులు ముందుకు వేసి అక్కడ గుమికూడిన ప్రజలందర్నీ ఓమాటు కలియజూసి 'గెలిస్తే అందరూ నాకు ఓట్లు వేసినట్లు ఓడిపోతే అందరూ నన్ను మోసగించినట్లు భావించడం లేదు నేను. అయితే నా ఓటమికి స్పష్టమైన కారణాలేమిటో తెలుసుకునేందుకు లోటుపాట్లేవో గ్రహించి సరిదిద్దుకోవడానికి ప్రయత్నం చేస్తాను. ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడంలో మరింతగా కృషి చేస్తాను. ప్రజాసేవలో ప్రజల మనిషిగా వుండిపోవాలని ఆకాంక్షిస్తున్నాను. ఇందుకు మీ అందరి సహకారం, ప్రోత్సాహాన్ని మనసారా కోరుకుంటున్నాను'' ప్రశాంత గంభీర స్వరంతో అని రెండు చేతులు జోడించాడు శ్రీరామచంద్రమూర్తి. అక్కడనుండి జనం క్రమంగా తమ నివాసాలకి తరలివెళ్లడం సాగించారు.

భారత మిత్రం వారపత్రిక ***20-8-78***

# గోర్ల

బి. దామోదర్‌రావు

''నర్సింలు మల్ల మంత్రయిండట'' వెంకటిగాడు సంబరంగా చెప్పిండు తనోల్లతో, తాను పేనుకుంట

''గట్లనా మల్ల మంత్రయినాడు, పదేల్ల మంత్రి అయ్యి ఏం ఎలగబెట్టిండో మనకు'' చీదరించుకుంట అనవట్టె చంద్రిగాడు.

నర్సింలు, ఆ ఊల్లే బాగ సదువుకున్నోడు కాదు. చిన్నప్పటి నుండి, 'పార్టీ పార్టీ' అని పార్టీలల్ల తిరిగిండు. పైలా పచ్చీసుగా తిరిగినోడు, ఆడి తండ్రి మల్లయ్య మేనతు చేసి సంపాదించింది ఏం లేదు. తాగుబోతోడు. అయితే, నర్సింలు మంత్రి ఎట్లయిండు. రాఘవరెడ్డి పటేలు, అన్ని ఓట్లప్పుడు చేరదీసిండు. అప్పటికి నర్సింలు, జైలు నుండి బయంటికొచ్చిండు; షాహుకారు చంద్రయ్య సెల్లెల్ని సెరిచిండని అని మదీ కేసు; గౌండ్లరామిని గుంజిండని, అనిమీద కేసు; సుతారి ముత్తన్నీ, మాలమైనన్ని ఈదుల్ల కల్లుముంతలకాడ వచ్చిన కొట్లాటలో దెబ్బలు కొట్టిండని కేసు, గిట్ల చిన్న కేసుల్నుండి పెద్దకేసులదాక, సాన ఉన్నయి.

గప్పటిదాక, పెద్దదొరలకు, పటేళ్లకే, పోటీ సేసే హక్కున్న జరుపుడుపల్లిల ఈ సారి హరిజనులే పోటీసేయాలని సర్కారోల్లు అనుకుంటున్నారు అని తెల్సింది; అది నిజమే అయింది. ఇగ గిదె మోఖా, తనొన్ని నిలబెట్టాలో అనుకున్నడు రాఘవరెడ్డి పటేలు.

'నర్సింలు, ఓట్లల్లో గెల్సిండు. గెల్వంగనే పట్నంల మొఖాం పెట్టిండు.

నర్సింలు రాఘవరెడ్డిని, 'అన్న' అంటడు. గాని దగ్గరికి ఎవల్లు పోయిన, అన్ననడిగి అచ్చినవ అంటడు. అన్న ఎంత సెప్తెగంత; పెద్దోల్లతో తిర్గ వట్టిండు. దావతులల్ల కల్వవట్టిండు. పైసలున్న పెద్దింటి పోరిని, కూడిండని జనం గామద్దె చెప్పుకోవట్రి. అది నిజమైంది; గాళ్లు లగ్గం సేసుకున్నారని అగ్బార్లో చదివినోల్లు సెప్పిన్రు.

ఓసారి, చంద్రిగాడు, తనపొలానికి, నీల్లుపెట్టుకుంటుండు; తన పొలం పారినంకనే, చిన్నదొర వెంకట్రావు పొలానికి నీల్లు పెట్టుకోవాలె గదంత గిప్పుడు లేదంటడు, ఆ దొర పాలేరు. చెర్లనీల్లు అయిపోవట్టే, రెండు తడ్లన్నపారాలే, అని తాను అన్నాయినిపించుకోలె; దొర కొడుకు వచ్చిండు పోలం కాడికి.

నీల్లు పెట్టుకుంటున్న చంద్రిగాన్ని సూసిండు. అగ్గయిండు. ''అరె లంబ్డికె, నా పొలం పారనీ, గటెనుక, నువ్వు పెట్కోవాలె, గిదేందిరో; మీ మాళోడు మంత్రయిండనా, ఎందీ, గిట్ల, సేయ్య వట్టిరి'' అన్నడు.

''గదేందీ దొర- మునుపటి లెక్కనే, పెట్టుకోవట్టి'' అన్నడు చంద్రయ్య.

''అది మీ అయ్యా జమానల. గిప్పడు ఊర్లె సర్పంచిని, నేను చెప్పినట్లె చెయ్యి'' అని దగ్గరికొచ్చి నూకేసిండు.

గీ లడాయి పెద్దదయింది. పెద్దోల్లకు, పేదోల్లకు పడ్తలేదు దసరా నాడు జంబికాడ, లొల్లి అయింది; గాడ, రాఘవరెడ్డి కొడుకు, మల్లారెడ్డిని, చంద్రయ్య కొడుకు, ఏసుపాదం, కొట్టిండు; గంతే. కర్రలు లేచినయి. నెత్తురు పారింది. దీంతో ఊరు రెండు వక్కలైంది.

గదైయినంక, నెల తిరక్కుండానే, ఏసుపాదాన్ని సంపిన్రుగావాలెవల్లో తెల్వలె. పోలీసుకేసయింది. శానమందిని పోలీసోళ్లు పట్టుకపాయిన్రు. గీలొల్లి సంగతి నర్సింలు సెప్పి, తమ కులపోల్లను యిడుపించుకోవాలనుకున్నడు.

ఆ ఊర్లో, కొంచెం చదువుకున్న యాదగిరి, నర్సింలు దూరం సుట్టం పట్నం పాయిండు అప్పటికే రాఘవరెడ్డి పటేలు; వెంకట్రావు దొర పట్నంల ఉన్నరు.

ఈ కేసులో, వాళ్లకు జైలైతదని తెల్సు. గందుకే మంత్రికాడికి వచ్చిన్రు.

నర్సింహులుకు, ఏదో చెప్పిన్రు. కొత్తబంగ్లా కట్టిత్తమన్నరు. మల్ల ఓట్లల్ల గెలిపిత్తమన్నరు. గంతే, గాడు కుషీ అయిండు.

''మీకెందుకయ్య నేనుసూసుకుంట'' అని తమ జిల్లా పోలీసోల్లకు ఫోను కొట్టిండు. రాత్రికే దావతయింది.

అప్పటికే, రెండు రోజులుగా, నర్సింలు కోసం యాదగిరి, తిరుగుతున్నడు. ఆడున్నోల్లతోని, తాను మంత్రిదూరం సుట్టాన్నని తమ కులపోడే మంత్రని చెప్పిండు; గని, గీసంగతి తెల్సె. నర్సింలు, తన కోసం ఎవర్లన్న అడిగితే, గిప్పుడు కలుసుడు కుదరదని సెప్పుమన్నడు.

ఇగ గిల్లగాదని, ఆడి ఇంటి ముందేకూకున్నడు యాదగిరి.

అక్బారోల్లు అచ్చిన్రు. లొల్లికావట్టె, ఏందని నర్సింలుగాన్ని సూసిండు. ''ఎప్పుడొచ్చినవ్'' అని అడిగిండు.

గానికి, నేను సముచాయిత్త అని చెప్పిండు. ఆడు తనూరుడే, అని సంబరంగా అన్నడు. లోపలికి తీసుకపాయిండు. 'ఛాయ' పాయ్‌పించిండు. ''ఇగ గిప్పుడు సెప్పు, ఏందని'' అడిగిండు. ఊల్లె, జరిగిందంతా చెప్పిండు యాదగిరి మన కులపోల్లు, సావదెబ్బలు తింటున్నరు; అన్నాయంగ, 'ఏసుపాదం'ను ఎవర్లో సంపిన్రు, జర నువ్వు కలుగసేసుకో నర్సింలన్నా'' అన్నడు.

అది గాదుర యాదగిరి గా పెద్దోల్లతోని మనకెందుకురా; సచ్చినోడు మల్లగొడ్తా; గాని తండ్రికి రెండుఎకరాల సేలుకి ఇప్పిత్త, ఎవుసయం సేసుకోనీకి, పైసలిప్పిత్త, నువ్వు గమ్మున ఊరుకో, నీకు, 'వాచ్‌మెన్' ఉద్యోగమిత్త'' అన్నడు యాదగిరికి మండుకొచ్చింది గదేందే, గల్లంటుప్పు ఓట్లప్పుడు మీకేం గావాలంటే, గది సేత్తనంటివి గదే, గంతే నాకి, నేను

మీ వోన్ని, మీకోసం పానాలు ఇత్తనంటివి గదనే వంగపల్లి మీటింగులో. గదంత మర్చిపోయినావె'' అన్నడు యాదగిరి. నర్సింలు మండిపడ్డడు ''ఓట్లప్పుడు గట్లనే అనమన్నడు, రెడ్డన్న'' అని నాలుక్కరుచుకున్నడు. ''గదికాదురా యాదగిరి నువ్వు ఊర్లెకుపో, మనోల్లకు సముజాయించు; లేకుంటే, పరేషాన్ అయితరని సెప్పు'' అని కసురుకున్నాడు.

''అది గాదే, మనోల్లు...'' అనపాయిండు యాదగిరి.

''చన్, మనోల్లు, మనోల్లు. గిప్పుడు,నాకు అందరు గంతే, పో,పో'' అని లేచిపోయిండు.

యాదగిరి గుడ్లల్ల నీల్లు తెచ్చుకున్నడు, తెచ్చుకున్న పైసలు అయిపోయినయి. ఊరికి వచ్చిండు. ఈ కేసుల సుట్టు తిరుగలేక, వకీల్లకు పైసలు పెట్టి, పైసలు తెర్లయిపోయి, కొందరు పొలాలమ్ముకున్నరు, కొందరు బొంబాయి బతుకపోయిన్రు.

.... ...... .....

మల్ల ఓట్లచ్చినయ్. నర్సింలు పచారానికి అచ్చిండు.

యాదగిరి సెప్పిండు. ఊరూరు తిరిగిండు, నర్సింలు, మంచోడు కాడన్నడు. మన కులంలో మంచోన్ని ఎన్నుకోమన్నడు.

నర్సింలుకు ఊర్లె సభ పెట్టిన్రు. సుట్టు ముప్పై ఊర్ల జనం అచ్చిన్రు. సభలో రాఘవరెడ్డి పటేలు, వెంకట్రావుదొర శాలువలు కప్పిస్తు దండలు ఏసిన్రు.

'ఏసుపాదం' విగ్రహానికి ప్రారంభోత్సవం చేయించిన్రు.

నర్సింలు సుట్టాలు, మిత్రులు, డప్పులు కొట్టుకుంట ఈలలు కొట్టుకుంట ఎగిరిన్రు. రాత్రికి, ఊల్లే దావతుకు, అందరు పాయిన్రు; నర్సింలుకు ఓట్లెత్తమని అన్నరు.

నర్సింలు గెల్సిండు.

జనం దిక్కు సూసి నవ్వ పట్టిండు.

# త్రికాలవాంఛ

## కె.కె. మీనన్

**భా**రతదేశ చరిత్రలో ఏ చరిత్రకారుడూ ఆ వూరికి పెద్దపీట వేయకపోవచ్చును. కాని రాజకీయంగా మాత్రం ఆ వూరికి అవసరానికి మించిన ప్రాముఖ్యం ఉంది. యంత్రానికి ఇంధనం ఎంత అవసరమో, ఎలక్షన్లకి డబ్బు అంత అవసరం. అది ఆ వూళ్ళో పుష్కలంగా వుంది కాబట్టి రాజకీయులందరికీ ఆ వూరంటే తగని అభిమానం ఆ ఊరిని నమ్ముకున్న ఏ రాజకీయుడు ఇంత వరకూ ఓడిపోలేదు కాబట్టి అక్కడ దరిద్రం కూడా బోలెడు వుండని అనుకోవాలి. అందుకు నిదర్శనగా ఊరికి చివర పేట అనే పేరుతో దరిద్రం అన్ని హంగులతో విలసిల్లుతోంది. అయిదేళ్ళకోసారి ఆ దరిద్రం ధనలక్ష్మిలా సాక్షాత్కరించి అన్ని పార్టీలకీ ఆశల పల్లకీ అవుతుంది.

ఆ వూళ్ళో దేవుళ్లకీ దేవాలయాలకీ కూడా ఏమాత్రం లోటులేదు. ధనవంతులకీ దరిద్రులకీ ఒకే మాదిరి దైవభక్తి వుంటుందని ఎవరో మహానుభావుడన్నాడు. అందుకు ఆయన చెప్పిన కారణాలు కూడా ఆసక్తికరంగానే వుంటాయి. అనుకోని విధంగా ఐశ్వర్యం కలిసొచ్చినందుకు (లేదా తాము బంగారు చెంచా చేత్తో పుచ్చుకుని పుట్టినందుకు) ధనవంతులకీ, తమకు లేని ఆ ధనం లేదా తమ గుడిసెలు మేడలై. ఆ మేడల్లోకి ధనలక్ష్మి ఘల్లు ఘల్లున నాట్యం చేస్తూ ఎప్పటికైనా రాదా? అని పేదవాడికీ దైవభక్తి వుంటుందని ఆయన థియరీ. అవునన్నట్లు ఆ వూరికి ఒక పక్క రంగనాథస్వామి ఆలయమూ, మరోపక్క ఆంజనేయస్వామి ఆలయమూ, చిన్న తరహా వేంకటేశ్వర స్వామి ఆలయం ఇంకో పక్కా ఆ ఐశ్వర్యం చెక్కు చెదరకుండా కాపలా కాస్తున్నాయి.

దరిద్రం మాతృస్వామికమో ఏమో పేటలో అందరూ దేవతలేగాని దేవుళ్లు లేరు. అందుల్లోనూ క్షుద్ర దేవతలు నూకాలమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మ, వగైరా, వగైరా వారికి ఓ చిన్న దేవాలయం. దేవాలయంముందు పెద్ద వేప చెట్టు తప్ప మరే హంగులూ ఉండవు.

ఊళ్ళోని దేవుళ్లకి నిత్య దీపారాధన జరగుతూ వుంటే ఊరి చివరి అమ్మ మాత్రం ఎప్పుడో జాతర సమయాల్లో తప్ప వెలుగు చూడదు. అలాంటిది ఆరోజున ఓ అమ్మవారి ఆలయం ముందు, వేపచెట్టు కింది, సిమెంటు గట్టు మీద ఎందుకో రెండు పెట్రోమాక్సు లైట్లు వెలుగుతున్నాయి.

ఊరు సద్దు మణగుతోంది. పేట మాత్రం అప్పుడప్పుడే సందడి పుంజుకుంటోంది. కూలికి వెళ్లిన జనం ఇళ్లకి తిరిగి వస్తున్నారు. ఆడవాళ్ల తలల మీద చిన్న చిన్న కట్టెల మోపులూ, మరికొంతమంది తలలమీద బరువుతోబాటు చంకన చంటిపిల్లలూ వున్నారు. మగాళ్ల భుజాల మీద పారలూ గునపాలూ వున్నాయి. రోజంతా పడిన శ్రమను

మర్చిపోడానికా అన్నట్లు ఏవో లల్లాయి పదాలు పాడుకుంటూ ఇంటిదారి పట్టేరు. దారిలో ఒక వ్యక్తి ఎదురయ్యేడు.

''ఏరాయెంకటసామీ. ఎక్కడికిరా మళ్లీ యెల్తన్నావు?'' అనడిగేడు రంగనాయకులు.

''మీ దగ్గరికే' చెప్పేడు ఎంకటసామి

''మేం ఒత్తానే ఉన్నాంగా, ఎందుకంత ఉరుకూ పరుగూ''

''మీరు ఇంటికొచ్చేటప్పటికి అలిస్యమౌతాదేమోననీ....'

''ఎందుకంట?''

''అమ్మోరి గుడిదగ్గిరికి ఎవురో సాములోరొచ్చారు. ఆయన మా మంచి సంగతులు సెప్తన్నారంట. మీరందరూ తొందరగా ఇళ్లకెల్లి బేగి తెమిలి గుడిదగ్గిరికి రండి''

''సాములు పేటల్లోకి కూడా ఒత్తారేంటి?''

'' ఈ సాములోరు పేటల్లోనే ఉంటారంట. పేదోళ్ల గురించే చెవుతారంట'' అని చెప్పేడు వెంకటస్వామి.

''అలాగా.... అయితే యెల్దాం పదండి'' అని అందర్నీ తొందర చేసేడు రంగనాయకులు.

వాళ్ల గురించి ఎవరూ చెప్పరు. చెప్పే కమ్యూనిస్టులు ఎప్పుడో చెప్పటం మానుకున్నారు. ఇప్పుడు వాళ్ల గురించి చెప్పేవాడొకడు పేటలోకి వచ్చాడనేప్పటికి వాళ్లకి ఆసక్తి పెరిగింది.

అందుకే తొందరగా పేటవైపు సాగిపోయేరు.

సాధ్యమైనంత తొందరగా వంటా వార్పు తెముల్చుకుని, పేట జనం అమ్మవారి గుడిదగ్గరి వేపచెట్టు కింద చేరి స్వాముల వారి చుట్టూ కూర్చొన్నారు. స్వాముల వారంటే గుబురు గెడ్డం, జడలు కట్టిన తలవెంట్రుకలు, ఒంటిమీద కాషాయి వస్త్రాలు చేతిలో కమండలం; ఇలా ఊహించుకున్నారు వాళ్లు. కాని, ఈ స్వాముల వారు అందుకు పూర్తిగా విరుద్ధంగా వున్నాడు. కొద్దిగా ఎదిగిన గెడ్డమూ, మీసాలు, గిరజాల జుట్టు, ఎర్రటి పైజామా, లాల్చీ, నిరంతరం నవ్వులు చిందించే ముఖం - జనాన్ని ఇట్టే ఆకట్టుకునే వర్చస్సు స్వాముల వారిది.

. ఉదయం నుంచీ పడిన శ్రమనంతా ఆయన మాటల్తో మర్చిపోవాలనీ దగాపడిన తమ జీవితాలకు ఓదార్పు లభించాలనీ వారు అభిలషిస్తున్నారు.

ఆయనదైన ఒక ధోరణిలో ప్రారంభించేడు స్వాముల వారు. ''మిమ్మల్ని ఉద్ధరించాలని నా ఉద్దేశం కాదు'' అంటూ మొదలెట్టేడు. అక్కడ చేరిన వారంతా ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు! మరేవిటి ఈయన మనకు ఒరగ బెట్టేది?' అన్నట్టుగా వుంది అందులోని భావం.

''ఎవర్నీ ఎవరూ ఉద్ధరించరు. ఎవర్ని వారే ఉద్ధరించుకోవాలి. అంచేత మిమ్మల్ని మీరే ఉద్ధరించుకునే మార్గాలు చెబుతాను

మీరంటే, కేవలం మీరేకాదు. నేనూ మీలో ఒకడినే. అంచేత మన కుత్తుకల్ని కత్తిరిస్తున్న వాడెవడో ముందుగా మనం తెల్సుకోవాలి''

అంతలేసి పెద్ద మాటలు వాళ్లకి అర్థం కాకపోయినా, వాటి భావం సులభంగానే తెల్సింది వాళ్లకు.

''ఎలాగ సామీ?'' అనడిగేడు ఒక వృద్ధశ్రామికుడు.

''మీకు జరిగే అన్యాయాల్ని మౌనంగా భరించకూడదు. ఎదిరించాలి. పోరాడాలి. అప్పుడుగానీ యీ నిలువు దోపిడీ ఆగదు. మీ రక్తమాంసాలని జుర్రుకు తింటోన్న వాళ్ల ఆగడాలు ఆగవు. అసలు మిమ్మల్ని దోచుకుంటోన్న వాళ్లెవరో మీరెరుగుదురా?''

''ఇంకెవరూ? మా ఆసాములే''

''కొంతవరకూ, కాని, పూర్తిగా మాత్రం కాదు. ఈ ప్రభుత్వ యంత్రాంగం చక్రాలు తిప్పేవాళ్ల చేతుల్లో పనిముట్లు వీళ్ళు, మీ రక్తమాంసాలు భక్షిస్తున్న అసలు రాక్షసులు వాళ్లు. మీరు కండలు కరిగించి రూపాయి సంపాయిస్తే, అందులో తొంభై పైసలు మాత్రమే పెడుతున్నారు. మీ శ్రమ విలువ అంతే అని మీరు మురిసిపోతున్నారు''

''మురిసి పోక ఏంజెయ్యమంటారు సామీ. ఈ బతుకులు ఈ నాటివా? మా తాతల నాటి నుంచీ ఇలాగే వున్నాయి.''

''అంతకు ముందునుంచీ ఇలాగే వున్నాయి. మీబతుకులు మీకు తెలీదుగానీ, మనుషుల్ని తినే వీళ్ల కోరిక ఈనాటిది కాదు. మూడు కాలాల నాటిది. ఆ కథ చెబుతాను శ్రద్ధగా వినండి'' అని మొదలెట్టేడు స్వాములవారు. కథ అనగానే వాళ్లకూ ఆసక్తి పెరిగింది.

''....బతికి వున్న మనుషుల్ని తినాలన్న వీళ్ల కోరిక మూడు కాలాల నాటిదని కదూ అన్నాను. అంటే త్రేతాయుగం, ద్వాపరయాగం, కలియుగం. త్రేతాయుగంలో పుట్టిన ఈ కోరిక కలియుగంలోగాని నెరవేరలేదు''.

''....త్రేతాయుగం అనగానే మనకు గుర్తుకు వచ్చేది రామాయణమూ, శ్రీరామచంద్రుడూను. రామరావణ యుద్ధం లేకుంటే అసలు శ్రీరామచంద్రుడి ఉనికికే అర్థం లేదు. అంచేత అక్కడి నుంచే మన కథ ప్రారంభిద్దాం.''

''...రామరావణ యుద్ధం ముగిసింది... యుద్ధమున్న తర్వాత ఇరుపక్షాలకీ నష్టం తప్పదుకదా? రాక్షసులతో పాటు వానర వీరులూ ఎందరో మరణించేరు. వానర రాజు సుగ్రీవుడికి ఇది పరమ దుఃఖ కారణం అయింది. శ్రీరామ చంద్రుడు సర్వ శక్తి సంపన్నుడే గాక, పరమ మహిమాన్వితుడని సుగ్రీవుడు ఎరుగును. శ్రీని వేడుకుని మృత వీరులనందర్నీ ఏదో విధంగా బతికించుకోవాలని అతడు అనుకున్నాడు. అనుకున్న తడవునే ఆ విషయం శ్రీరామ చంద్రునితో విన్నవించుకొన్నాడు. శ్రీరాముడి మనసులో కూడా ఈ ఉద్దేశం వుంది. అయితే ఈ కార్యసాధన ఏరూపంలో జరగాలా? అని మార్గాల కోసం అన్వేషిస్తున్నాడు.వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు సకల దేవ గణమూ శ్రీరాముడి విజయం సందర్భంగా ఆశీర్వదించలా స్వర్గాన్నుంచి దిగివచ్చేరు. ఇంద్రుడితో సహా అందరూ అతన్ని ఆశీర్వదించి అభినందించేరు. తండ్రి దశరథుడు కూడా ఈ పనిమీదే

స్వర్గాన్నుంచి ప్రత్యేకంగా వచ్చేడు. తండ్రి ఆశీస్సులు స్వీకరించిన పిమ్మట ఇంద్రుని ముందు చేతులుకట్టుకు నిలబడ్డాడు శ్రీరామచంద్రుడు. అతని వినయానికి సంతుష్టుడై ఇంద్రుడు-

''రామా! నీ దర్శనం మాకు అమోఘమూ ప్రీతి కరమూ అయింది. నీ మనసులో ఉన్న కోరిక ఏమిటో చెప్పుకో'' అని అడిగేడు.

''సకల దేవాధిపతీ, మీ అభిమానానికి కృతజ్ఞుడను. నేను అడిగిన వరం ఇవ్వగలరా?''

''నీకా అనుమానం ఎందుకు? తప్పక ఇస్తాను అడుగు శ్రీరామా''

''నాకోసం అతి పరాక్రమంతో రాక్షసులతో పోరాడి స్వర్గానికెళ్లిన వానర వీరులందరికీ ప్రాణదానం చెయ్యండి'' అనడిగేడు.

ఇంద్రుడు ప్రసన్నుడయేడు.

''రాక్షసుల చేతుల్లో వీర మరణం పొందిన వానరులంతా నిద్రలేచినట్లు లేతురుగాక'' అన్నాడు ఇంద్రుడు.

అలా అన్న తడవుగానే మృతులైన వానర వీరులంతా కళ్లు నులుముకుంటూ లేచి నిలబడ్డారు.

అది కళ్లారా చూసిన రాక్షసులకి కూడా ప్రలోభం పుట్టింది.

విభీషణుడి అనుచరులంతా అతని చెవిలో వూదేరు.

ఈ యుద్ధంలో రాక్షస సైన్యంచేసిన సేవ మాత్రం తక్కువదా? రాక్షసులే లేకపోతే లంక గుట్టు ఈ వానరులకు ఎలా తెలిసేది. పైగా మమ్మల్నే నమ్ముకుని వున్న మీ అన్నగార్ని మోసం చేసి మీతో వచ్చాం, మా సోదరులతోనే మేం యుద్ధం చేయాల్సి వచ్చింది. ఇదేం తక్కువదా? కాబట్టి మాలో వీర మరణం పొందిన వారిని కూడా బతికించమనండి.

నిజమే అనిపించింది విభీషణుడికి. కానీ ఆ విషయం రాముడితో చెప్పి ఇంద్రునికి సిఫార్సు చెయ్యమని చెప్పే ధైర్యం లేదు విభీషణుడికి.

అది గ్రహించేడు రాముడు.

''మిత్రమా! విభీషణా!! నీ మనసులో ఏదో కోరిక వున్నట్లూ, అది అడగటానికి సందేహిస్తున్నట్లూ అనిపిస్తోంది నాకు. అదేమిటో చెప్పు'' అన్నాడు.

''అలాగే అడుగుతాను విభీషణా! దీనికే అంత మొగమాటమెందుకు''

రాక్షసుల కోర్కెను ఇంద్రుడికి తెలియచేసేడు శ్రీరాముడు.

'అలాగే దానికేముంది?

ఆ వరం కూడా ప్రసాదించేడు ఇంద్రుడు.

రావణ సైన్యంతో విడిపడి విభీషణుడితో తరలివచ్చి, వీరమరణం పొందిన రాక్షస సైన్యం అంతా ప్రాణాలతో లేచి నిలబడ్డారు

రాక్షసులంతా మహా సంబరపడిపోయేరు. ఆ ఆనందంలో [illegible] చేయాలనే తీవ్రమైన కోరిక కలిగింది వారి విషయం విభీషణ చెవిన వేశారు.

శ్రీరామచంద్రుడు పుష్పక విమానాన్ని అధిరోహించాడు. అతనితో పాటు [illegible] వానర సైన్యమూ అందులో వుంది. విభీషణుడు కూడా రామునితో పాటు [illegible] చేసే ఏర్పాటు కూడా జరిగింది. బయలుదేరేముందే విభీషణుడి మనసులో [illegible] తీరని కోరిక వున్నట్లు గ్రహించాడు శ్రీరాముడు.

''విభీషణా! ఇంకా ఏదో తీవ్రమైన కోరిక నీలో వున్నట్టుగా నీ ముఖ [illegible] అర్థమౌతోంది. అదేవిటి మిత్రమా?'' అనడిగాడు.

''ఎంతమాట ప్రభూ!తమర్ని అడగటానికి సందేహమా? కాని అది [illegible] ప్రభూ! అది నా కోరిక కూడా కాదు''

'మరెవరిది?'

అదుగో కింద నిలబడ్డ మా రాక్షస గణానిది

విమానం దిగి కిందికి వచ్చేడు శ్రీరాముడు. అతని వెనకే విభీషణుడు [illegible] దిగివచ్చేడు.

శ్రీరాముడు కిందికి రాగానే రాక్షసులంతా అతని చుట్టూ చేరి [illegible] కానీ ఒక్కడూ తమ కోర్కెను శ్రీరామునికి విన్నపించుకోలేదు.

''కాలయాపన చేయక అడగండి మిత్రులారా! నేను త్వరగా [illegible] తమ్ముళ్లనూ ఇతర బంధుమిత్రులనూ చూడాలి'' అని తొందరపెట్టేడు శ్రీ[illegible]

కాస్సేపు తటపటాయించి వారిలో ఒకడు చెప్పేడు.

''శ్రీరామచంద్రా మా రాక్షస నైజం మీరు ఎరగనిది కాదు. [illegible] అత్యంత ప్రీతికరం. కానీ మీ మైత్రితో మాకు అది [illegible] ప్రసాదించండి ప్రభూ''

శ్రీరాముడు క్షణకాలం ఆలోచించి, వారి కోరికను మన్నించి [illegible] అభయమిచ్చాడు.

రాక్షసులంతా ఆనందంతో.

''ధన్యులం ప్రభూ ధన్యులం'' అంటూ కేరింతలు కొట్టారు [illegible] పలికారు. అయితే శ్రీరాముడు చిన్న మెలిక పెట్టేడు

''మీ కోరిక తప్పక తీరుస్తాను. కానీ ఇప్పుడు కాదు'' అన్నాడు

రాక్షసులంతా నిర్విణ్ణులై ''మరెప్పుడు ప్రభూ'' అని అడిగారు

''నేను ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడిగా అవతరిస్తాను [illegible] జరుగుతుంది. ఆ యుద్ధంలో ఎందరో వీరులు [illegible] నక్కలు, రాబందులుగా జన్మించి కావల్సినంత [illegible]

ఒక యుగ కాలం నిరీక్షించటమా? ఆ విషయమే అడగాలనుకున్నారు రాక్షసులు. కానీ అప్పటికే శ్రీరామచంద్రుడు పుష్పక విమానాన్ని అధిరోహించి సీతమ్మవారిని కూర్చోబెట్టుకున్నాడు...

అని చెప్పి కాస్సేపు ఆగేడు స్వాముల వారు.

కథ మంచి రసపట్టులో వుంది. అందరూ ఆసక్తిగా వింటున్నారు. ' ఏవిటి కాకమ్మ కథలు చెబుతున్నాడు' అనుకున్నవారు కూడా అందులో లేకపోలేదు. అయితే పైకి మాత్రం ఎవరూ ఏమీ అనలేదు.

ఒక అమాయకుడు లేచి ''మాకో సందేహం సామీ'' అనడిగేడు.

''ఏవిటి?''

ఈ రాచ్చసులంతా నక్కలూ రాబందులుగా పుట్టారంటారా?''

''ఆఁ... వస్తున్నా... ఆ కథ కూడా చెబుతున్నా...'' అంటూ స్వాములవారు కథ మొదలెట్టే సమయానికే పెట్రోమాక్సు లైటు కొడిగట్టటం మొదలెట్టింది. స్వాములవారు లేచి వెళ్లి లైటుకి గాలికొట్టి, గేస్ కొంచెం వెనక్కీ ముందుకీ తిప్పి బాగా కాంతి వచ్చేక మళ్లీ వచ్చి కూర్చొన్నాడు.

''ఆఁ....అదికదా మీ సందేహం? రాక్షసులు నక్కలూ రాబందులుగానూ పుట్టేరు. శ్రీరాముడు కృష్ణావతారమూ ఎత్తేడు. ఎత్తి కౌరవులకీ పాండవులకీ మధ్య ఘోరమైన యుద్ధం జరిపించేడు. అదెంతటి ఘోర యుద్ధం అంటే; యుద్ధం ముగిసేప్పటికి రణభూమిలో గొడుగులు చీలికలై పడి ఉన్నాయి. జెండా కొయ్యలు విరిగి చెల్లాచెదురుగా పడివున్నాయి. జెండాలు చినిగిపోయేయి. డాల్లు విరిగి పడి ఉన్నాయి. పదాతులు పచ్చడి పచ్చడై పోయేరు. రథాలు పిండి పిండయినాయి. గుర్రాలూ సారథులూ కుప్పగా ఒరిగి పడివున్నారు. రౌతులూ మావటీళ్లూ అసలు పోలికలే పోగొట్టుకున్నారు. ఏనుగులూ గుర్రాలూ, పీనుగుల పెంటగా పడివున్నాయి. పేగులు పాగులుగా, కండలు కొండలుగా, మెదళ్లు, రక్తమూ మడుగులు మడుగులుగా- మహా బీభత్సంగా ఉంది.

రాజులు బతికి ఉన్నట్టే చచ్చిపడి ఉన్నారు. వారి గుండెల మీద రత్నహారాలు మెరుస్తున్నాయి. భుజకీర్తుల ఇంద్ర నీల మణులు జిగేలుమంటున్నాయి. కిరీటాలలోని మణులు తళతళలాడుతున్నాయి. వాళ్లంతా తలలు తెగీ చేతులు తెగీ రక్తం మడుగుల్లో మునిగి వున్నారు.

....నరమాంస భక్షకులకు ఆ దృశ్యం కనుల పండువుగా ఉంది. మెడలోతు రక్తంలో దోసిళ్లతో రక్తం తీసుకుని తాగి తేనుస్తున్నారు రాక్షసులు. నక్కలూ, రాబందులూ, గెద్దలూ, తోడేళ్లూ పేగులు లాక్కు తింటున్నాయి. గుండెకాయలు కబళిస్తున్నాయి. కొవ్వు ఊడదీసి చప్పరిస్తున్నాయి. అయితే అందులో కొన్ని మాత్రం ఏమీ తినకుండా అలాగే నిలబడి ఉన్నాయి. వాటిని చూసి ఆశ్చర్యపోయేడు శ్రీకృష్ణుడు పూర్వ జన్మ పరిజ్ఞానంతో పరికించి చూసేడు. చూసి విషయం గ్రహించేడు అంతఃపుర స్త్రీలూ రాజబంధువులూ రణభూమి దర్శించి నిష్క్రమించేక మెల్లగా వాటి చెంతకు వెళ్లేడు శ్రీకృష్ణుడు. అతను

వెళ్లగానే అతని చుట్టూ చేరేయి ఆ నక్కలూ రాబందులూను.

అతని ముఖంలోకి చూస్తూ నిలబడ్డారు. ''ఎందుకలా చూస్తారు? మీ కోరిక ప్రకారమే కదా ఈ వరం ప్రసాదించేను'' అనడిగేడు శ్రీకృష్ణుడు.

''అవును ప్రభూ''

''మరెందుకు తినరు? మీకు కావల్సినంత నరమాంసం ఉంది కదా?''

''ఇలాంటి నరమాంసమూ ప్రభూ మేం కోరుకున్నది? తలలు తెగీ, చేతులు విరిగీ, కండలు పిండై ఉన్నారు వీరంతా. వీళ్లనా మేం భోంచేసేది?''

''అయితే మీరు కోరేది ఏమిటి?''

''మేం కోరుకున్నది వేడివేడి రక్తం బతికి ఉన్న మనుషుల కండలు.''

''అది ఈ యుగంలో సాధ్యంకాదు'' అని కచ్చితంగా చెప్పేసేడు శ్రీకృష్ణుడు.

''మరెప్పుడు ప్రభూ?''

అది కలియుగంలో మాత్రమే సాధ్యమౌతుంది. అంచేత వచ్చే జన్మలో మీరు రాజకీయ నాయకులై పుట్టేట్టు వరమిస్తున్నాను. పుట్టి అధికార పార్టీలో చేరండి'' అని చెప్పేడు శ్రీకృష్ణుడు.

''మీ వరానికి కృతజ్ఞులం ప్రభూ! కాని, మాదో సందేహం?''

''ఏవిటది?''

''ఎప్పుడూ ఒకే పార్టీ అధికారంలో ఉండదు కదా ప్రభూ?''

''మీ మందబుద్ధిని మరోసారి రుజావు చేసుకున్నారు. రాజకీయ నాయకులైనాక ఒకే పార్టీని అంటిపెట్టుకుని వుంటారా? ఏ పార్టీ అధికారంలో వేంటే ఆ పార్టీలో దూరండి. అందిన అలగాజనం రక్తాన్ని జలగల్లా పీల్చుకుతాగండి. బతికివుండగానే వాళ్ళ కండలు పీక్కుతినండి...పొండి...'' అని చెప్పేసి పాండవ శిబిరం వైపు వెళ్ళిపోయాడు శ్రీకృష్ణుడు. ''అదుగో... వాళ్ళే వీళ్ళు...''

అని కథ ముగించేడు స్వాములవారు.

''అయితే ఆళ్లేనంటారా సామీ యీాళ్ళు?''

''అది కథ. వాస్తవాన్ని గుర్తింపచేయటం కోసం మీకా కథ చెప్పేను''

''అయితే ఏంజేయాలంటారు. సామీ?''

''ప్రతిఘటించాలి. పోరాడాలి. మీరు కష్టపడి సృష్టించిన ఉత్పత్తిలో న్యాయంగా మీకు రావాల్సిన వాటాను మీరు రాబట్టుకోవాలి. అవసరం అయితే అందుకు ప్రాణాలు ఇవ్వటానికైనా సిద్ధంగా ఉండాలి ఉంటారా?''

''అలాగే... లేకపోతే ఎన్నాళ్ళు సామీ యీ ఎదవ బతుకులు?'' అన్నారందరూ ఒకేసారి.

ఇంతలో వెనకనుంచి కలకలం వినిపించింది.

''అదుగో వస్తున్నారు. ఆ రాక్షసుల ప్రతినిధులే ఇటు వస్తున్నారు చూడండి''

టార్చిలైట్ల కాంతులు కన్పించేయి.

బూట్ల శబ్దాలు విన్పించేయి.

''వాళ్ళ చేతుల్లో మారణాయుధాలున్నాయి. కానీ వాళ్ళు చంపదల్చుకున్నది ప్రస్తుతం నన్ను. మిమ్మల్ని రెచ్చగొడుతున్నానంటారు. మీరు బతికివుండగానే మీ రక్తమాంసాలు భక్షించకుండా నేనం అడ్డుపడుతున్నానని వాళ్లు సృష్టించుకొన్న చట్టాన్ని నావైపు ఎక్కుపెడతారు....''

''... పారిపొండి. ఇక్కడినుంచి వెళ్ళిపొండి'' అని హెచ్చరించేడు స్వాములవారు.

ప్రజలు భయపడలేదు. ఆయన చుట్టూ చేరి మానవదుర్గాన్ని నిర్మించేరు.

''వెళ్లండి''

''మేం వెళ్ళం. మిమ్మల్ని కాపాడుకుంటాం. మీరిచ్చిన సందేశాన్ని ఆచరణలో పెడతాం''

''మా తిరుగుబాటుకు ఇదే ఆరంభం సామీ'' అని ముందుకు ఉరికాడో యువకుడు.

అందరూ అతని వెంట పరుగెత్తేరు.

# ఊడలమర్రి

చిలుకూరి దేవపుత్ర

ఆ మరుసటి రోజు జరగనున్న పంచాయితీ ఎలక్షన్‌కు గానూ ఆ సాయంత్రానికల్లా వీరాపురం చేరుకున్నాం. జనరల్ ఎలక్షన్ కయితే తక్కువ సిబ్బందే వుండేది. అదసలే పంచాయితీ ఎలక్షన్ అయినందువల్ల మా ఎలక్షన్ సిబ్బందే ఓ చిన్న సైజు బెటాలియనంత ఉంది. అంటే లెక్కప్రకారం ముప్ఫయి మందన్నమాట! పోలింగు కేంద్రమైన ఎలిమెంటరీ స్కూలుముందు ఓ బోరింగు ఉండటంతో అందరం ఒక్కసారి దాని మీదకు దాడి జరిపాం. ముఖ ప్రక్షాళన కోసం. ఓ అరగంటకి అందరి ముఖాలు శుభ్రమయి కాంతివంతంగా కనబడసాగాయి.

అప్పటికే పొద్దు కుంకింది. మెలమెల్లగా చీకట్లు ఆ పల్లెనంతటినీ ఆక్రమించుకోవడం ప్రారంభించాయి. మా పోలింగు కేంద్రానికి కరెంటు లేదు. ఊళ్ళో నించి రెండు పెట్రోమాక్స్ లైట్లను మోసుకొని వచ్చారు తలార్లు. ఆ రెండింటిలోను మిరుమిట్లు గొలుపే కాంతి ఒక్కదానికీ లేదు. ఒకటి ఉదయించే సూర్యుడిలా ఉంటే మరొకటి అస్తమించబోతున్న సూర్యుడిలా ఉంది.

''మనందరికీ భీమప్ప గారింట్లో భోజనాలు అరేంజీ చేశారట''కాసేపటికీ అందరం వెళ్లి భోజనాలు చేసి వద్దాం!'' అంటూ అందర్నీ ఉద్దేశించి చెప్పాడు ఎలక్షన్ ఆఫీసరు.

''ఓకే అలాగే సార్!'' అన్నారెవరో మహా ఉత్సాహంగా.

''భోజనానికి వెళ్లేవరకయినా వర్కు చేసుకుంటాం సార్!'' అన్నారు మరెవరో.

''అలాగే సార్! కవర్ల మీద పంచాయితీ పేరు రాయడం బ్యాలెట్ పేపర్ల వెనుక సీలు కొట్టడం, అవీ పూర్తి చేసుకుంటే భోంచేసి వచ్చాక తక్కిన పనులు చేసుకోవచ్చు!'' అన్నాను నేను.

''ఇప్పటికే నీరసంగా ఉంది. భోంచేశాకే ఏ పనీ అయినా మొదలు పెట్టగలం!'' అన్నాడు నీరసంగా మా హనుమంతరాయుడు. ఆయనా నేను సహోపాధ్యాయులం. నేను తెలుగుటీచర్ని. ఆయన హిందీ టీచరు. నా మూల వేతనం ఆయన మూలవేతనం కంటే తక్కువ కావటంతో ఆయన్ని పోలింగు ఆఫీసరుగానూ, నన్ను అసిస్టెంటు పోలింగు ఆఫీసరుగానూ వేశారు.

మా హనుమంతరాయుడు అన్నది ఎలక్షన్ ఆఫీసరు విన్నారేమో అందుకే --''భోంచేసుకుని వచ్చాకే పని మొదలుపెట్టవచ్చులెండి...ఎంత సేపూ...అనంటూనే కొద్ది దూరంలోనిలుచుని ఏదో బాతాఖాని కొడుతున్న కానిస్టేబుల్స్‌ని ఉద్దేశించి - ''ఏమండీ

కానిస్టేబుల్స్! వేం ఒక అరగంటలో భోజనాలు పూర్తి చేసుకుని వచ్చేస్తాం.మీరిక్కడే ఉండండి - జాగ్రత్త ఎవర్నీ రానీయకండీ! మీకు భోజనాలని తలారీతో ఇక్కడికి పంపే ఏర్పాటు చేస్తాం సరేనా!'' అన్నాడు ఎలక్షన్ ఆఫీసరు. వాళ్లు 'ఊ' అన్నారో, ''ఊహూ'' అన్నారో కూడా చూడకుండా ''ఊ అందరం పోదాం పదండీ సార్!'' అంటూనే గబగబా అడుగులు వేయసాగాడు. అందరం ఉత్సాహంగా ఆయన్ని అనుసరించాం.

* * *

రెండు పంక్తులు తీరి అందరం ఆవురావురుమంటూ భోంచేస్తున్నాం. మాకు కొద్ది దూరంలో ఘనమైన చెక్క కుర్చీలో హుందాగా కూచుని ఉన్నాడో భీమప్ప.

''సర్పంచ్ పదవికి ముప్పయి అయిదేళ్ళ నించీ నేనే పోటీ చేస్తూ పెద్ద మెజారిటీతో గెలుస్తూ వచ్చినాను సార్!గవర్నమెంటోళ్లు ఈసారి మా ఊరి సీటుని షెడ్యూల్డు కులాల వాళ్లకి రిజర్వు చేసింది కదా...అందుకే పోటీ చేయడం లేదు'' అన్నాడు భీమప్ప. అంతవరకూ మాట్లాడుతున్న వాడల్లా ఆపి భోజనాలు చేస్తోన్న మా వంక ఓసారి చూశాడు.

భీమప్ప పేరులోనే కాదు ఆకారంలోకూడా భీముడి లాగానే ఉన్నాడు. మనిషిలోరాజసం ఉట్టిపడుతోంది నిడుపాటి విగ్రహం, బుర్రమీసాలు, రోల్డుగోల్డు ఫ్రేమ్ ఉన్న కళ్లజోడూ, అతని హుందాతనాన్ని రెట్టింపు చేస్తున్నాయి. మెర్క్యురీ లైట్ వెలుతుర్లో అతని పంచె, చొక్కా మరింత తెల్లగా మెరిసిపోతున్నాయి.

''ఇంతకీ మీ క్యాండిడేట్‌ని చూపనే లేదు!'' అడిగాడు ఎలక్షన్ ఆఫీసరు.

పెళ్లికి వెళ్లి పెళ్లికొడుకును చూడకుండా ఎవరైనా ఉంటారా? మా ఎలక్షనాఫీసరుకు ఉన్న కుతూహలమే నాకు ఉందాయె మరీ!

''భోజనం అద్భుతంగా ఉంది!'' అన్నాడు మా హనుమంతరాయుడు.

నిజానికి భోజనం అతి మాములుగా ఉంది. కాకపోతే మాకున్న ఆకలీ, . అక్కడి కొత్త పరిసరాలూ మా నాలుకలికి గొప్ప రుచుల్ని కలిగిస్తున్నాయి.

''అయితే , కాబోయే సర్పంచుని చూడాలని ముచ్చట పడుతున్నారా? ముందు భోజనాలు కానీయండి! నిదానంగా చూద్దురుగానీ! అన్నాడు భీమప్ప తాపీగా.

అందరం భోజనాలు చేసేసి వరండాలో వేసి ఉన్న నల్లకంబళి మీద వచ్చి కూచున్నాం.

వరండా ముందున్న గాటి పట్లకు నాలుగు జతల దేశపు ఎద్దుల్ని కట్టేసి ఉన్నాయి. ట్యూబ్‌లైట్ల వెలుతుర్లో వాటి కొమ్ములు నిగనిగలాడుతున్నాయి. మమ్మల్ని వింతగా చూస్తూ ఉన్నాయి ఎద్దులు.

పెద్దస్టీలు కంచంలో తాంబూలం ఉంచారు మా ముందర. ఇష్టమున్నవాళ్లు తాంబూలం వేసుకుంటున్నారు. మరికొందరు సిగరెట్లు వెలిగించారు. నేను రెంటినీ సేవించడానికి ఉపక్రమించాను.

అందరితోపాటూ భీమప్ప అక్కడ కూచోలేదు అటూ ఇటూ పచార్లు చేస్తూ ఉన్నాడు.

ఎద్దులకి శెనగపొట్టు వేస్తున్నాడు ఓ జీతగాడు.

''ఏంసార్! ఎలక్షన్ ఆఫీసరుగారూ! మాకాండేట్ చూడల్లంటిరే! చూడండి మల్ల....అగ్గో వాడే! పేరు ఓబులుగాడు'' అన్నాడు భీమప్ప - ఎద్దులకు పొట్టు వేస్తున్న జీతగాడిని చూపిస్తూ.

అందరం ఒక్కసారి జీతగాడి వైపు చూపులు సారించాము. పాతకాలపు సల్లాడం (నిక్కరుకీ, డ్రాయరుకీ మధస్తంది) చిరిగిన గుడ్డ బనియనూ, చింపిరినెత్తికి మాసిపోయి ఉన్న ఎరుపుగళ్ల తువ్వాలు చుట్టి ఉన్నాడు. వయసు ఏభై లోపు ఉండవచ్చు. లేనితనం వల్లనేమో అతని శరీరం శుష్కించి నల్లగా కమిలి పోయినట్టుంది.

''మీరంతా ఆశ్చర్యపోతున్నారు. అవునా? ఈ గుడ్డి గవర్నమెంటు రిజర్వేషన్ పెట్టిందే! ఏం జేసేదిమల్ల...ఎవరో మాలా మాదిగ నాయాండ్ల? ఓట్లేపిచ్చి గెలిపిస్తే కొవ్వుమ్మలు మెయిలుసుకొచ్చి మనల్నే కుమ్మతారని నాకు బాగా తెలుసు సార్! అందుకే మా జీతగానితోనే నామినేషన్ ఏపించినా ఎట్లా ఈనా కొడుకు మాల నాయాలే! ఈడయితే మనం యాడుండమంటే ఆడపడి వుంటాడు.చెప్పులిడిసే జాగాలో కుచ్చోమంటే గమ్మున కుచ్చుంటాడు...'' అంటూ భీమప్ప చెప్పుకు పోతున్నాడు. మా వాళ్లందరూ నోళ్ళు వెళ్లబెట్టి వింటున్నారు.

ఓబులేసు తన పనిలో నిమగ్నమయి ఉన్నాడు. భీమప్ప మాటలు కానీ, మా చూపుల్ని కానీ పట్టించుకునే స్థితిలోలేడు. అతనిలో తర్వాత రోజు జరగబోతున్న ఎలక్షన్ టెన్షన్ గానీ, గెలుస్తానా, లేదా అన్న ఆందోళన గానీ ఆదుర్దా గానీ నామమాత్రంగానైనా లేవు.

భీమప్ప దగ్గర్నించి సెలవు తీసుకుని మళ్లీ పోలింగు కేంద్రానికి చేరుకున్నాం.

నా మనసులో మాత్రం భీమప్ప అన్న మాటలు - ''ఎవరో మాలా మాదిగనాయండ్లకు ఓట్లేపించి గెలిపిస్తే కొవ్వుమ్మలు మెయిలుసుకొచ్చి గింగురుమంటున్నాయి. పట్టణ వాతావరణంలోనే పుట్టిపెరిగిన నాకు కులాల అంతరాలు గురించి తెలిసింది తక్కువేనేమో అనిపించింది.

''మొత్తానికి భీమప్ప అసాధ్యుడప్పా! ఈ ఊర్లో ఆయప్పకి మాంచి పలుకుబడి ఉంది. అవతల పోటీ చేసే అభ్యర్థికి డిపాజిట్లు గల్లంతయినా ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు'' అన్నాడు మా హనుమంతరాయుడు.

నిజానికి మా హనుమంతరాయుడు పొరపాటున టీచరు అయినాడు గానీ.... ఆయనసలు ఏ ఇంటిలిజెన్స్ డిపార్టుమెంటులోనో ఉండాల్సినవాడు.

''అప్పుడే ఎంక్వయిరీ చెసినావా? అసాధ్యుడప్పా! నువ్వూ!'' అన్నాను.

పోలింగు ఆఫీసర్లూ, పోలింగు క్లర్కులూ ఎలక్షన్ మెటీరియల్ని గోనెసంచుల నుంచి బయటికి తీసి బ్యాలెట్ పత్రాల వెనక సంతకాలు చేయడంలోనూ, కవర్ల మీద ఎలక్షన్ వివరాలు రాయడం లోనూ ఉండిపోయారు. మెల్లగా నేనూ కవర్లు తీసుకున్నాను రాసేందుకు.

* * *

పోలింగు ఉదయం ఎనిమిది గంటలకి ప్రారంభమయి ఒంటిగంటతో ముగిసింది. దాదాపు 90 శాతం ఓట్లు పోలయినాయి. మధ్యాహ్నం భోజనం అక్కడికే పంపించినాడు భీమప్ప. త్వరగా భోజనాలు చేసేశాం. 2 గంటల నుంచీ ఓట్ల లెక్కింపుమొదలయింది.

సాయంత్రం నాలుగున్నర అవుతున్నట్లే ఊరు ఊరంతా మా స్కూలు ముందర నిలబడింది. ఎలక్షన్ ఫలితాల కోసం.

ఇసుక వేస్తే రాలనంత జనం!

జాతర కొచ్చినంత జనం!!

చెట్ల కొమ్మల మీద జనం!!

చుట్టూ ఉన్న మిద్దెల మీద జనం!!

ఎక్కడ చూసినా జనం - జనం జనం!!!

ఒకటే జనం!!!

ఆడా, మగా, ముసలీ, ముతకా, పిల్లా, పెద్దా, అందరూ కలగాపులగంగా అందరి మొహాల్లోనూ ఫలితాలు తెలుసుకోవాలనే ఆత్రం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

అయిదు గంటలు అవుతున్నట్టే ఎన్నికల ఫలితాలు ప్రకటించారు మా ఎలక్షన్ ఆఫీసరు. ''ఓబులేసు 800 ఓట్ల మెజారిటీతో గెలిచాడు!'' అంటూ

జనంలో గొప్ప కోలాహలం చెలరేగింది.

విజిల్స్ చప్పట్లు - వెర్రికేకలు - రెచ్చగొట్టే నినాదాలు మొదలయినాయి! ఏం చేయాలో తోచని జనం భీమప్పకి 'జై' కొడుతున్నారు!

అంతమంది హర్షధ్వానాలు, కేరింతలు మిన్నుముట్టుతున్నా అక్కడ ఎక్కడా ఓబులేసు జాడ లేదు - అదే నాకు ఆశ్చర్యం కలిగిస్తోన్న విషయం.

''ఎక్కడండీ? గెలిచిన అభ్యర్థి? రమ్మనండి...మాకు టైమయిపోతుంది భీమప్ప గారూ! అతను తొందరగా వస్తే సర్పంచుగా ప్రమాణ స్వీకారం చేయించేస్తే అక్కడితో మా పని పూర్తి అయిపోతుంది! అంటూ ఎలక్షన్ ఆఫీసరు భీమప్పతో అంటున్నాడు.

''వస్తాడులెండిసార్ !'' అన్నాడు భీమప్ప అతని మొహంలో తన ప్రత్యర్థి రామానాయుడి క్యాండేట్‌ని దెబ్బతీసిన ఆనందం తొణికిసలాడుతోంది.

ఎక్కడినించో రానే వచ్చాడు ఓబులేసు. రాత్రి అతన్నిఎట్లా చూశానో అచ్చం అట్లానే ఉన్నాడు. కాకపోతే తలకు కొంచెం చమురు రాసి దువ్వుకొని, తువ్వాల్ని భుజాన వేసుకొని ఉన్నాడు. సల్లాడంలోనూ, బట్టబనియన్‌లోనూ పెద్ద మార్పేమీ లేదు.

ప్రమాణ స్వీకారం ఎలా ఉంటుందోనని చూడ్డానికే నేనాగదిలో కాచుకొని ఉన్నాను.

''రండి ఓబులేసుగారూ! లోపలికి!'' అంటున్నాడు ఎలక్షను ఆఫీసరు.

అతను గదిలోకి అడుగుపెట్టడంలేదూ, సిగ్గుబడటం లేదు, అలాగని భయపడుతున్నాడని చెప్పడానికీ వీలులేదు. అది తరతరాలుగా అంటరానితనంలో దాగిన పిరికితనమేమో

అనిపించింది నాకు

''నేను బళ్ళోకి రాగూడదు సారూ! అదీగాక అక్కడ మా అయ్య ఉండాడు ఎట్లసారూ! అడిగొచ్చేది! మీరంతా పెద్దోళ్ళు గాబట్టి ఆడ ఉండచ్చు.... నేను మాత్తరం ఆడికి రాలేను సామీ! నన్ను ఈడనే ఉణ్ణీయండ్రి!'' అన్నాడు ఓబులేసు.

''చూడండి ఓబులేసుగారూ! మనది ప్రజాస్వామ్య దేశం! కులాలకీ, మతాలకీ అతీతంగా ఇమడే లౌకిక రాజ్యం. ఇక్కడ పెద్దోళ్ళూ చిన్నోళ్ళూ అన్న తేడాలు ఉండనేకూడదు. అందరూ సమానం ఇక్కడ. తక్కువ కులాల్ని పైకి తేవాలనే ప్రభుత్వం ఇలా రిజర్వేషన్లని పెట్టింది. కాబట్టే మీరు ఎన్నికయినారు. నా మాట విని రండి ఓబులేసుగారూ!'' అంటూ ఎలక్షన్ ఆఫీసరు ఓ మినీ లెక్చరిచ్చాడు. చివరి వాక్యం తప్ప ఆ ఓబులేసుకు ఒక్క ముక్క కూడా అర్థమయి ఉండదనిపించింది నాకు.

అతందుకే మౌనంగా బిక్కు బిక్కు మంటూ చూస్తూ ఉన్నాడు ఓబులేసు.

''సర్పంచుగా గెలిచాక ప్రమాణ స్వీకారం చేయకతప్పదు పదండీ!'' అంటూ అక్కడ ఉన్న పోలింగ్ ఆఫీసర్లంతా చెప్పే టప్పటికి -

''మా అయ్య ఎదురుంగ నేను కూసో వల్లా? నా వల్ల గాదు సామీ! నన్నిడిసి పెట్టండ్రి! నన్నిట్ల బలవంతంజేస్తే ఎట్ట? అంటూ ఏడుపుమొహం పెట్టాడు ఓబులేసు.''

''మీరయినా చెప్పండి భీమప్పగారూ! ఆయన్ని లోపలికి రమ్మని!'' ఎలక్షను ఆఫీసరు నిస్పృహాయంగా చూస్తూ అన్నాడు

''నేనేంది చెప్పేది! వాన్ని పట్టుకోని అండీ, గుండీ, గారు, గీరూ అంటే మాటింటాడా ఆ మాల నాకొడుకు. నేను పిలుస్తాను సూడండి ఒరేయ్! ఓబుళుగా! రావోయ్! నీయమ్మ లోపలికి రా!''

భీమప్ప పలుకు వినబడేసరికి ఠక్కున లోపలికి వచ్చేశాడు ఓబులేసు.

''ఏమండీ, ఎలక్షను ఆఫీసరుగారూ! నాదొక్కమా....'' ఈ గది పెద్దదేకదా, ఇంకా చాపలూ, కంబళ్ళూ తెప్పిస్తానూ. కింది కూచుని ప్రమాణ స్వీకారం చేయించండి! సరిపోతుంది. అందరికీ సరిపోయేటన్ని కుర్చీలు లేవు కదా!'' అన్నాడు భీమప్ప.

ఓబులేసు తనకు ఎదురుగా కుర్చీలో కూచోవడం భీమప్ప సహించలేడని మాకందరికీ అర్థమయిపోయింది.

''సారీ అండీ, భీమప్పగారూ! ప్రమాణ స్వీకారం చేయి నేలమీద వీలుకాదు, అది సాంప్రదాయం కూడా కాదు. మీరు ఏమనుకోకుండా ప్రేక్షకుల్లో కూచోండి!'' అంటూ భీమప్పకి చాప చూపించాడు ఎలక్షను ఆఫీసరు.

కళ్ళల్లో నిప్పులు కురవడం ఎలాగో అప్పుడు చూశాను భీమప్ప కళ్ళల్లో.....

మింగలేక, కక్కలేక గొంతులో ఏదో అడ్డుపడ్డట్టు గుడ్లు మిటకరిస్తూ ప్రేక్షకుల్లో మాముందు కూలబడ్డాడు భీమప్ప.

ప్రమాణ స్వీకారం పూర్తయింది.

ఉపసర్పంచి ఎన్నిక కూడా పూర్తయింది.

జనం అంతా ఎక్కడివాళ్ళు అక్కడే వెళ్ళిపోయారు.

ఇక జరగాల్సిందల్లా ఓట్లు పెట్టెల్నీ, ఎలక్షన్ మెటీరియల్నీ తిరిగి అంతా లారీకి ఎక్కించి మేము బయల్దేరడమే.

అయితే - అక్కడే వచ్చింది చిక్కు!

చావు కబురు చల్లగా చెప్పాడు మాలారీడ్రైవరు. 'లారీ చెడిపోయింద'ంటూ.

అప్పటికి ఏడున్నర అవుతోంది.

చీకటి ముసురుకుంది.

మధ్యాహ్నం తిన్న అన్నం ఎప్పుడో అరిగిపోయింది.

ఇప్పుడు కడుపులో ఆకలి కేకలు మొదలవుతున్నాయి.

మరె లారీ తేవడానికి పట్నానికి వెళ్ళాలన్నా కూడా సాయంత్రం అయిదు గంటల తర్వాత ఆ ఊరికి బస్సులేదాయె!

ఆరాత్రి భీమప్ప మమ్మల్ని ఎవర్నీ భోజనానికి ఆహ్వానించలేదు.

రాత్రి పదిగంటలయింది.

ఆకలితో నిద్రరావడంలేదు. ఊరికే అట్లా కళ్ళు మూసుకుని పడుకున్నాం అంతా!

ఏదో మాటలు వినబడితే లేచి చూశాను.

తలారి చుట్టూ గుమిగూడారు మా వాళ్ళు.

''భలే తన్నిరిలే సారూ! తన్నాటకం అంటే అట్లా ఇట్లా తన్నాటకం గాదులే! వానికి అట్లనే జరగాల్సింది!'' అంటున్నాడు తలారిరాముడు.

''ఎందుకు తన్నడం?'' అన్నాను నేను.

''ఏందిసార్ అట్లాంటావు? భీమప్ప అయ్యంటే ఏందనుకుంటివి ఈ సుట్టు పక్కల పల్లెల్లో ఆయనంటే ఎంతపేరూ ఏంకతా? అట్లా అయ్యముందర కుర్చీలో కుచ్చుంటాడా వాడు? ఆయన పానం ఓర్సుగుంటుందా! అందుకే చెలుకోలు తీసుకోని వాయించి పారేసినాడు అట్ల గొట్టకపోతే ఈడి కళ్లు నెత్తిమీదికి రావు. మీరు ఏందో చెప్పినారే అనుకోండి. ఆనా కొడుక్కన్నా బుద్దుండమన్లేదా?'' అంటూ సాధారణమైన విషయంగా చెబుతున్నాడు తలారి.

నా మనసు చివుక్కుమంది.

ఎన్ని రిజర్వేషన్లు కల్పించినా దశదిశలూ వ్యాపించిన ఈ వ్యవస్థ ఊడలమర్రి కింద మొక్కయినా బతుకుతుందా అనిపించింది - ఆ క్షణంలో.

# పెద్దోళ్ళు

బొడ్డు కూర్మారావు

కిష్టయ్యకి రెండు కళ్ళూ చాలటం లేదు, మతిపోతోంది. ఆశ్చర్యం, ఆనందం ఒకేసారి నిండుకున్నాయి. అంత అలసటలో కూడా ఇంద్ర భవనంలా మెరిసిపోతున్న ఆ భవనాన్ని ఆ వైభవాన్నీ కన్నుల నిండా చూస్తున్నాడు.

ఎంత సందడి!.... ఎంత సంబరం!....

బంగ్లా దేదీప్యమానంగా వెలిగిపోతోంది. రంగు రంగుల దీపాలు ఆరీ వెలుగుతుంటే నక్షత్రాలు దిగి వచ్చినట్టుగా వుంది ఆ ప్రాంతంలో అలాంటి పెళ్ళి ఎప్పుడూ జరగలేదు.

అక్కడ కారులు బారులు తీరి వున్నాయి. స్కూటర్లు చీమల్లా చిక్కగా వరుస కట్టేనాయి. ఎక్కడ చూసినా పంచెటు, కళ్ళీ లాల్చీలే కనిపిస్తున్నాయి. మడతలు నలగని పట్టు వోణీలు, ఖద్దరు బట్టలే సాక్షాత్కరిస్తున్నాయి.

నేల ఈనినట్లు జనం. రావలసినవాళ్ళు ఇంకా చాలా మందున్నారు. వచ్చేవాళ్ళు మధ్యాహ్నం రెండు గంటలనుంచే ప్రారంభమైనారు.

కిష్టయ్యా ఆ జనాన్ని చూస్తున్న సందడిలో తన కష్టాన్నే మర్చిపోయాడు....

ఎం.ఎల్.ఏ. గారు పెళ్ళికి పిలిచారని క్రితం రోజు పెదనాయుడు చెప్పగానే చాలా అనందించాడు కృష్ణయ్య. 'లొండాడు' కూడా వస్తున్నాడంటే మరీ ఆనందించాడు. ఎందుకంటే, వాళ్ళిద్దరూ రామరాజపురంలో మంచి నేస్తాలు.

రామరాజపురం నుండి లొండె లక్ష్మయ్య, పెదనాయుడు, కిష్టయ్య బయల్దేరారు.

పెళ్ళి రోజు ఉదయానికే ఎం.ఎల్.ఏ ఇంటిదగ్గర వుండాలని లక్ష్మయ్యనీ, కిష్టయ్యనీ ఉత్సాహపరచి వాళ్ళ పంచాయతీ తరపున రెండు బస్తాల బియ్యం, ఓ వెయ్యిన్నూట పదహార్లూ వసూలు చేసి కోడి కూయకముందే ప్రయాణం కట్టించాడు పెదనాయుడు.

పెళ్ళి బాధ్యతంతా పెదనాయుడు పైనే వేశానన్నారు. ఎం. ఎల్. ఏ. ఒక్కగా నొక్క కూతురు పెళ్ళి పట్నంలో అతి వైభవంగా చేద్దామనుకున్నారు. కానీ వాళ్ళ ముసలమ్మ స్వస్థలంలో సొంత ఇంటిలోనే చెయ్యమని పట్టు పట్టింది. కూతురు పెళ్ళి సొంత వూర్లోనే చేయక తప్పింది కాదు ఎం ఎల్.ఏ పరుశురాం గారికి.

ఎం.ఎల్.ఏ. పరుశురాం గారికి పెదనాయుడు కుడి భుజం. పెళ్ళి బాధ్యతలు నిర్వర్తించడానికి వారం రోజులు నుంచి నిద్రాహారాలు మానేసి అన్నీ సమకూర్చుతున్నాడు పెదనాయుడు.

పెదనాయుడు వూరికి ఎం ఎల్. ఏ పరుశురాంగారి వూరికి ఐదు కిలో మీటర్ల దూరం వుంటుంది. ఈ దూరమంతా నాటు దారినే రావాలి. రామరాజపురంలో వసూలు చేసిన రెండు బస్తాల బియ్యం, నాలుగు మూటలు చేసి 'లొండాడు,' కిష్టయ్య రెండు కావిళ్ళెత్తుకున్నారు.

''....అయితే నాను బండి మీదెళ్ళి అక్కయ్యపల్లి సెంటర్లో వుంతాను. మీరు బేగెలిపి రాయండి'' అని పెదనాయుడు చలాగ్గా లునా ఎక్కేసాడు.

ఎం. ఎల్. ఏ. అంతటోడు పెళ్ళికి పిలిచినాడనే ఉత్సాహంతో 'లొండాడూ', కిష్టయ్య కావిళ్ళు మోస్తున్నారు. అక్కడక్కడా ఆగ సుట్టలు కాల్చుకొని అంచలంచెలుగా కావిళ్ళు భుజాలు మారుస్తున్నారు. మధ్యలో తెలిసినోళ్ళు ఎవరైరా ' ఎక్కడికని' అడిగితే ఎం. ఎల్. ఏ. ఇంటి పెళ్ళికని గర్వంగా చెపుతూ వెళ్తున్నారు. 'లొండా లక్ష్మయ్య'కి పెద్ద వాళ్ళ పెళ్ళి కార్యానికి వెళ్ళటం ఇదే మొదటిసారి. అందునా ప్రెసిడెంట్ అయినాక కూడా రాజకీయ నాయకుల పెళ్ళికి వెళ్ళటం కూడా ఇదే ప్రథమం.

జంక్షన్‌లో పెదనాయుడ్ని చూసి ఆనందంతో వాళ్ళ కళ్ళు మెరిసాయి. కావిళ్ళు దించి గట్టిగా వూపిరి పీల్చుకున్నాడు తలపాగాలు తీసి ముఖాలు తుడుచుకున్నారు.

''వచ్చీనారా.... మరింకెంతో నేదు. అల్లదిగో కనిపిస్తుంది. అదే, అక్కయ్యపల్లి, బేగెలిపిరాయండి ఇల్లీ కంకరరోడ్డంట తిన్నగా ఒకటే తోవ'' అని వాళ్ళకి డైరెక్షన్ ఇచ్చి అక్కయ్యపల్లికేసి బండి పోనిచ్చాడు నాయుడు.

ఏళ్ళు కావిళ్ళు వూపుకుంటూ ఎం. ఎల్. ఏ. వూరు కాని నడుస్తున్నారు.

అక్కయ్యపల్లి చిన్న పల్లెటూరు. అదిగో అన్నట్టు కనబడుతోంది గానీ డొంకల్లోంచి అదీ ఓ కిలోమీటరుంటుంది. ఊర్లో ఒక్క పరుశురాం గారి బంగ్లా తప్పితే మిగిలినవన్నీ పూరిపాకలు, రెండే పెంకుటిళ్ళు.

ఈ వూరంతా నాదేనని చాటుతున్నట్టు వూరికి మొదట్లోనే పరుశురాంగారి బంగ్లా.బంగ్లాకి పెద్ద వరండా, వరండాకానుకొని అడ్డంగా మూడు గదులు. ఆ గదులమీద డాబా గదులు. గదులు తరువాత మధ్యన లోగిలి. లోగిలి తరువాత మళ్ళీ మూడు పెద్ద గదులు వాటి నానుకొని కొన్ని చిన్న గదులు. ఆ తరువాత మైదానంలాంటి పెద్ద పెరడు, పెరట్లో ఈశాన్యం మూలను బోరింగ్. దాని ప్రక్కనే పశువులశాల. గడ్డివాములు.

ఆ భవనం పరుశురాం తాతగారి హయ్యాంలో కట్టింది. అప్పట్లో వాళ్ళకి సంబంధించిన పనులు చేసేందుకు కొన్ని కుటుంబాలు అక్కడ నివాసానికొచ్చేశాయి. వాళ్ళంతా ఇప్పుడు యాభై అరవై కుటుంబాలుగా పెరిగిపోయి చిన్న పల్లెటూరై పోయింది.

జమిందారీలు పోయిన తరువాత ప్రజాస్వామ్య పాలన ప్రవేశించాక పరుశురాంగారి నాన్నగారు ఆ ప్రాంతానికి ప్రాతినిధ్యం వహించే ఎం.పి. అయ్యాడు.

రాజు కొడుకు రాజైనట్టు ఆ ప్రాంతం ఆధిపత్యం నాడూ నేడూ వాళ్ళ చేతులు విడిపోలేదు. ఈ రెండు తరాలూ పదవుల్లో వుండడంతో వాళ్ళ కుటుంబాలు తరచూ పొన్లోనో, రాజధానుల్లోనో వుండేవి.

పెళ్ళి స్వగృహంలో చెయ్యటానికి వాళ్ళంతా వచ్చారు. ఇక్కడున్నన్నాళ్ళు పట్నంలో వున్న సదుపాయాలన్నీ అమర్చాలని పెదనాయుడి దాపత్రయం. చాలామంది ప్రముఖులు వస్తారని వాళ్ళకు బసలు వాళ్ళకు తగ్గట్టుగద ఏర్పాటు చేస్తున్నారు.

పెదనాయుడు బండి దిగేసరికి పరుశురాంగారు బ్రష్ చేస్తూ కనిపించారు. అప్పుడప్పుడే సూర్యుడు పైకొస్తున్నాడు. ద్వారాలకు తోరణాలు కడుతున్నారు.

పాత భవనం కొత్త అలంకారాలతో కళకళలాడుతూ ముసలి ముత్తైదువలా వుంది.

''ఏమయ్యా! రాత్రికే వచ్చేస్తానన్నావు?'' పలకరించారు పరుశురాం.

''అన్నీ సజ్జులేసి బయల్దేరతైటికి ఇయ్యాలయ్యింది'' అంటూ చెప్పులు వరండా వెలుపల విడిచి లోనకు వెళ్ళాడు పెదనాయుడు.

వరండాలో వరుసగా ఓ యాభై అరవై కుర్చీలు వేసున్నాయి. రెండు సోఫా సెట్లున్నాయి. సింహాసనం లాంటి ఓ ఆసనం వరండా మధ్యనుంది. ఆ ఆసనంలో కూర్చుంటే మిగిలిన కుర్చీలన్నీ స్పష్టంగా కనిపిస్తాయి. మొత్తం వరండా రాజదర్బారులా వుంది.

వచ్చిన దగ్గర దగ్గర చుట్టాలు బంధువులతో అప్పుడే ఇల్లు పూర్ణ గర్భిణీలా వుంది.

లారీ వచ్చిందని ఎవరో పైనుండి కేకలేశారు.

ఇద్దరు ముగ్గుర్ని కూడగట్టుకొని లారీ దగ్గరకొచ్చాడు పెదనాయుడు. లారీలోని షామియానాలు, వంటసామాన్లు, కుర్చీలు వగైరా వస్తువులు దింపించాడు.

సామాన్లు దింపి లారీ వెళ్ళేసరికి బస్తాలు మోస్తూ 'లొండాడు', కిష్టయ్య వచ్చారు.

''రాయండి.. రాయండి'' అంటూ ఎదురెళ్ళాడు పెదనాయుడు.

పరుశురాంగారు ఎవర్తోనో మాట్లాడుతున్నారు. కొంతమంది షామియానాను మేడపైకి తీసుకెళ్తున్నారు. కొందరు కుర్చీలు సర్దుతున్నారు.

ఎండలో 'లొండాడు', కిష్టయ్య చమట్లు కక్కుకొని కావిడి దించారు. వీళ్ళను చూసిన పరుశురాం వీళ్ళవైపుగా రాలేదు. కానీ వీళ్ళు మాత్రం తలపాగాలు తీసి దూరం నుంచే అతి వినయంగా రెండు చేతులూ జోడించి నమస్కరించారు ఎం. ఎల్. ఏ. గారికి.

పరుశురాం తల పంకించి పంకించకుండానే చిరునవ్వు నవ్వారు. పరుశురాం నవ్వగానే లొండాడు, కిష్టయ్య ఉబ్బితబ్బిబ్బై పోయారు.

''అరేయ్.... మీరు కావిళ్ళు అల్లా మూలెట్టి ఇక్కడ కూకోండి. టీనీలు పంపిస్తాను. తరువాత యేటి సెయ్యాలో సెప్పుతాను'' అని పెదనాయుడు చెప్పాడు.

వీధి వాకిట్లో వచ్చీ పోయేవాళ్ళను చూస్తూ కారే చెమటను తుడుచుకుంటూ 'లొండాడు', కిష్టయ్య కూర్చున్నారు.

షామియానా వాకిట్లో ఎత్తుతున్నారు

''ఇల్లీ తాడు అందడం లేదు, పీరందుకోమండి'' అని లక్ష్మయ్యను ఒకతను పిలిచాడు.

''లక్ష్మయ్య'' మంచి పొడుగైన మనిషి. మంచి బలమైన మనిషి కూడా. సదా పంచె

కట్టడు. బనియను కూడా వెయ్యడు. పెళ్ళికి రావడంతో పంచె కట్టాడు. కొత్త బనియను వేసుకొచ్చాడు. అక్కడక్కడా ఒకటి రెండు తల వెంట్రుకలు నెరసినట్టు కనిపిస్తుంటాయి.

''పొద్దుగైతే ఇదే నాభం'' అని షామియానాను 'లొండాడే' కట్టాడు.

వాకిట్లో షామియానా లేచేసరికి పెళ్ళి గడపకొచ్చినట్టుగా వుంది. తెచ్చిన కుర్చీలన్నీ చకచకా షామియానా క్రిందను సర్దేశారు.

గాబరా గాబరాగా తిరుగుతూ ''మీకు టీ వచ్చిందా'' అని మళ్ళీ పెదనాయుడు కనిపించాడు.

'లక్ష్మయ్యా', కిష్టయ్య తెల్లమొగాలేశారు.

''సరి సరే....రాయండి, ఇల్లీ పక్కనుండి పెరటికి పొర్రాయండి'' అని పెరట వైపుకు వెళ్ళే సందు చూపించి తను ఇంట్లోంచి పెరటకు వెళ్ళాడు. వీళ్ళిద్దరూ నాయుడు చూపించిన సందులోంచి పెరట వైపుకు వెళ్ళారు. అక్కడ మరిగి మరిగి ఏదో వాసన వేస్తున్న టీ రెండు సిలవరి గళాసుల్లో ఇచ్చారు.

వాళ్ళిచ్చిన టీనీళ్ళు, తాగుతూ చుట్టూ చూస్తున్నారు.

విశాలమైన పెరట్లో ఒక మూలకు ఆరడుగుల పొడవున జోలి పొయ్య తీసుకున్నారు దానిమీద ఒకేసారి పెద్ద పెద్ద పాత్రలతో ఎన్నైనా వంటలు చేసుకోవచ్చును. పొయి తవ్వుతున్న వాళ్ళంతా అక్కయ్యపల్లె గ్రామస్తులే. వంట బ్రాహ్మలు వాళ్ళకు సూచనలిస్తున్నారు పొయ్యికి అల్లంత దూరంలో ఓ పెద్ద గూన వుంది. ఆ గూనలో ఓ యాభై అరవై కావుళ్ళ నీరు పడుతుంది. భోజనాలైనాక చేతులు కడుక్కోటానికి ఆ గూన దగ్గర ఏర్పాటు చేశారు.

''అరేయ్....'లొండా'! ఎలగ మనం కావిళ్ళు తెచ్చున్నాము కదా! ఇంకో మనిషికిస్తాను. మొత్తం మీ ముగ్గురు కలిసి ఆ గూన నింపేయండి, మరో జట్టు తాగడానికి నీరు తెస్తారు.''

''...నూతి దగ్గరకు మీరెవళూ యెళ్ళకండి. అక్కడో ముగ్గుర్ని వుంచున్నాము. ఆళే తోడుతారు. మీ వొంతంతా నీళ్ళు మోసీడమే!'' అదేం పెద్దశ్రమ కానట్టు తేల్చేస్తూ బిందెలు అప్పజెప్పి రంగడ్ని తోడిచ్చాడు పెదనాయుడు.

రంగడు మంచి చురుకైన కుర్రోడులా కనిపించాడు 'లక్ష్మయ్యకి'.

అన్నీ వున్నాయి కానీ అల్లుడి నోటిలో శనుందన్నట్టు ఆ వూరికి హంగులన్నీ వున్న నీరు మాత్రం కరవు. పరుశురాం గారింట్లో బోరింగు వుంది కానీ పాడైపోయింది. మరి బాగుచెయ్యలేదు. బాగు చేసేంత అవసరం వాళ్ళకి రాలేదు. రావటానికి వాళ్ళెప్పుడు ఆ వూళ్ళో వున్నారనీ పైగా' అది పని చేస్తే వూరంతా వాళ్ళ పెరట్లోనే వుంటారు. చెత్త చెత్త చేసేస్తారా. లోగిలి. అదొక పెద్ద తల నొప్పి. అందుకోసం బోరింగు బాగు చేసే ప్రయత్నం చెయ్యలేదు.

ఆరుగురు ఆరుగుర్ని రెండు గ్రూపులుగా విడదీసి, ఒక గ్రూపు తాగడానికి వంటకీ నీరు సప్లై చేస్తే, రెండో గ్రూపు చేతులు కడుక్కోటానికి నీళ్ళు తెచ్చేటు పెదనాయుడు తెలివిగా

ఏర్పాటు చేశాడు.

నీళ్ళు మోసేందుకు గ్రూపులు తయారైనాయి. కావుళ్ళు పట్టుకొని సందడిగా బయల్దేరారు. నుయ్యి ఒక ఫర్లాంగు దూరంలో ఆ వూరు శివ కోవిల ఎదురుగా వుంది. కోవిలకి వూరికి మధ్యన కొబ్బరితోట. అదంతా ఇసుక దారి.

రాత్రిపడ్డ మంచుకు తడితడిగా వుంది తోవ సూర్యరశ్మి తగిలి నెమ్మదిగా పొడి పొడి అవుతోంది. కాళ్ళకు అంటీ అంటనట్టుంది మట్టి.

'సిద్ధాంతి' ఎప్పుడు పెట్టిందీ ఏయే బంధువులు ఎప్పుడొచ్చిందీ, కట్నాలు, కానుకలు, పెళ్ళి మేనేజిమెంటు ఎవరెవరు చేస్తున్నదీ వగైరా విషయాలన్నీ బాగా తెలిసినోళ్ళు చెపుతుంటే 'లక్ష్మయ్య', కిష్టయ్య వింటున్నారు.

''ఈలకి కులం పట్టింపులు నేవుగావల్ల- అందరినీ పిలిసేస్తున్నారు'' అని కిష్టయ్య సందేహం వ్యక్తం చేశాడు.

''ఇప్పుడందరూ అందరినీ పిలిసేస్తున్నారు. కులం పట్టొగ్గేసింది. కులం పట్టుకొని యవులు కూకోయున్నారు?'' అని రంగడంటే దానికి లక్ష్మయ్య 'అవునౌ'నన్నాడు.

పెదనాయుడు మేనేజీమెంటు కోసం చాలా చెప్పుకున్నారు. రామరాజపురం ప్రెసిడెంట్ పెద్ద నాయుడుదే ఈ పెళ్ళి బాధ్యతంతాని చెపుతుంటే....

''రామరాజపురంకి రిజర్వుడు ప్రెసిడెంటు గావాల?'' అని మరొకరు అనుమానం వ్యక్తంచేశారు.

''ఆ వున్నాడు హరిజనుడు. కానీ ఏటి లాభం? పెదనాయుడు 'ఉ' అంటే .... 'ఆ' అంటే 'ఆ' పెదనాయుడు మాజీ ప్రెసిడెంటు, ఆ వూరి మోతుబరి. ఆయనగారి మాట కాదని ఆడేటి సేసుకోగలడు? పేరుకే రిజర్వు ప్రెసిడెంటు - పెత్తనమంతా పెదనాయుడుదే... అన్న మాటలకు 'లక్ష్మయ్య' మౌనంగా వుండిపోయాడు.

కిష్టయ్య ఏదో అనబోయాడు కానీ లక్ష్మయ్య కళ్ళలోకి చూసి ఏమీ అనలేదు.

మాటల్లో పడి దూరం మర్చిపోయి నుయ్యి దగ్గరకొచ్చారు. నూతి దగ్గర చాలా జనమున్నారు. నుయ్యి విశాలంగా వుంది. నూతి కెదురుగా కోవిల తలుపులు తెరచున్నాయి. లోపల శివలింగం కనిపిస్తోంది. లింగానికి ఏడు పడగల పంచ లోహాల పాము గొడుగులా కాసుంది.

'లక్ష్మయ్య' కావిడిదించి రెండు చేతులు జోడించి దండంపెట్టాడు మిగిలినవాళ్ళు కూడా దండాలు పెట్టుకున్నారు.

'పెళ్ళోళ్ళకి ముందర తోవియ్యండి' అని ఎవరో అనడంతో అంత వరకూ నీరు తోడుకుంటున్నోళ్ళు తప్పుకున్నారు.

ఒక్కసారి నూతిలోకి చూశాడు 'లక్ష్మయ్య'- కళ్ళు గిర్రున తిరిగినట్టు అయినాయి. నీరు ఎక్కడుందో ఓ క్షణం కనిపించలేదు. బాగా చూసేసరికి పిడతా నీళ్ళు కనిపించాయి. నీళ్ళు చూసి నుయ్యిని తాకకుండా బైటకొచ్చేశాడు 'లక్ష్మయ్య'

తోడేవాళ్ళు నీళ్ళు తోడేశారు బిందెలన్నీ నిండేసరికి అరగంట పట్టింది. బరువుతో ఇసుక దారిన నడుస్తుంటే నడవటం కొంచెం కష్టంగా వుంది. పాదాలు ఇసుకలో దిగిపోతున్నాయి. అయినా కష్టంగానే మోశారు.

నాలుగు సార్లు తిరిగేసరికి ముందుగా లక్ష్మయ్య ప్రాణం చాలొచ్చింది ఆ తరువాత ఇంకో రెండుమార్లుకు కిష్టయ్య కూడా డీలా పడిపోయాడు.

''ఇదేటయ్యోయ్....'' అని రంగడు ఎగతాళి చెయ్యబోయాడు; అప్పుడు కిష్టయ్య చెప్పాడు:

''పెళ్ళికి పిలిసి సాయం సెయ్యమన్నారని సేస్తున్నాముగానీ ఈ సాకిరీ యెవులు సేస్తారు? పొద్దుట్నుండీ ఒక్కలాగ భుజం కాలీనేదు. మావూరు నుండి ఒకొక్కలం బస్తాడేసి బియ్యం మోసిమోసి అలిసొచ్చినాం. కాసిన్ని మంచినీలు కూడా మరియాద సెయ్యనేదు సరికదా, పెదవి యిప్పి ఒక మంచి మాటైనా అనలేరీ పెద్ద బాపులు. మరికన సెయ్యలేము బాబూ.... ఆయన మీద ఇది కొలదీ సేసినాం. సేసింది సేనా అయిపోనాది, పేనాలు పొలొచ్చాయి'' అంటూ కావిడి దించేసేడు కిష్టయ్య.

రంగడికి నిజంగానే జాలేసింది. 'పోన్లే, తిన్నాక మోతురు' అని చెప్పాడు.

''తిన్నాక మోస్తామో లేదో గానీ ఇల్లీ బిందెలు సూసుకో.... మావుం అలాగ యెళ్ళొస్తాము'' అంటూ లొండా లక్ష్మయ్య బిందెలు రంగడికి అప్పజెప్పి వీధిలోకి వచ్చేశాడు.

ముఖం తుడుచుకుంటూ కిష్టయ్య కూడా లక్ష్మయ్యను అనుసరించాడు.

తెల్లారి 'చకాలి' తిండం అలవాటున్నోళ్ళు కావడంతో ఆకలి భరించలేకపోయారు. ఏదైనా తింటే బాగుంటుందని అనుకొని వూరు చివర్లో టిఫిన్ కొట్టుకెళ్ళాలని బయల్దేరారు. పెళ్ళికొచ్చి కొట్టులో తింటే, పెళ్ళి వాళ్ళకి అమర్యాదగా వుంటుందని వెళ్ళి నోళ్ళంతా తిరిగి వచ్చేశారు.

పెళ్ళి లోగిల్లో చాలా మార్పులు జరిగిపోయాయి. మైకులు బిగించడం, షామియానాలు మేడపైనా వాకిట్లోనూ కట్టడం, జోలిపొయ్య వెలిగి వంటలు వార్చటం జరిగిపోయాయి.

ఎంత తీవ్రత ఎక్కువైంది. పెదనాయుడు హడావిడిగా జోరుగా తిరుగుతున్నాడం. 'ప్రధానం' బండి వచ్చింది. సందడి పెరిగింది.

రాత్రి ఒకటి గంటకి లగ్నం కావడంతో అందరికి 'డిన్నర్' కే చెప్పారు. వచ్చిపోయే వాళ్ళు అల్పాహార విందు స్వీకరించి వెళ్తున్నారు. ముందుగా వచ్చేసి వున్న బంధువులకూ, పనిచేస్తున్న వాళ్ళకూ మధ్యాహ్న భోజనాలు ఏర్పాటు చేశారు.

పన్నెండున్నరయింది. 'లక్ష్మయ్య' ముఖం వాడిపోయింది. ఎంత ఉత్సాహంతో బయల్దేరాడో కానీ ఆ ఉత్సాహమంతా నీరు కారిపోతోంది. పరశురాం గోరు కనీసం ఒక్క ముక్క మాటైనా అనకపోయేసరికి మరింత వుత్సాహం పడిపోయింది.

మధ్యాహ్న భోజనాలు గదుల్లో ఏర్పాటుచేశారు. భోజనాలు కాని వాళ్ళందరినీ పిలిచారు.

అందరితోపాటుగా 'లక్ష్మయ్య' కూడా గదిలోకి వెళ్ళాడు.

'లక్ష్మయ్య'ను గదిలో చూసిన పెదనాయుడు కళ్ళు ఎర్రబడ్డాయి. గదిలోకి అడుగు పెట్టాడో లేదో....

''అరేయ్ 'లొండా'! కసింత ఇలగ రమ్మీ! నీవు తరవాత తిందువు గాని'' అని ఏదో పని చెప్పాడు పెదనాయుడు.

లక్ష్మయ్యకు ఆకలి వేస్తోన్నా పరుశురాంగారు ప్రక్కనుండటంతో పెదనాయుడుకి ఎదురు చెప్పలేక చెప్పిన పని చేశాడు.

పని పూర్తి చేసిన తరువాత భోజనానికి వెళ్ళాడు.

గదుల్లో భోజనాలు పూర్తిచేసేశారు. గదుల్లో తిన్న వాళ్ళందరకూ టేబుల్స్ వేసి భోజనాలు పెట్టారు. 'లొండాడు' వెళ్ళేసరికి నేలపైన పది ఆకులున్నాయి. పదింటి ముందు పదిమంది పనివాళ్ళున్నారు. ఒక ఆకు వేరే వేసుంది. 'లక్ష్మయ్య'ను దాని ముందు కూర్చోమన్నారు.

'లక్ష్మయ్య' తప్పనిసరై భోజనం ముద్ద కలిపాడు.

పరుశురాంగారు అటుగా వచ్చారు. వడ్డనల్లో తేడాలు గమనించి కూడా ఏమీ అనలేదు.

యమ్మెల్యేగారు చూసి కూడా ఏమీ అనలేదని మరి కొంచెం బాధ పడ్డాడు. పెద్దోళ్ళ మాటలకి, చేతలకీ ఎంత తేడా వుందో కళ్ళకు కనిపించింది 'లక్ష్మయ్య'కి. ముద్ద నోట్లో పెడుతుంటే ఏడాది క్రితం పరుశురాంగారు రామరాజపురం వచ్చిన రోజు గుర్తొచ్చింది.

ఆ రోజు పరుశురాంగారూ ఇంకో పెద్ద లీడరూ కలిసి ప్రత్యేకంగా పెట్టారు. భోజనాలు హరిజనవాడలోనే చేస్తామన్నారు. 'మాకు వీళ్ళూ వాళ్ళూ అని భేదం లేదు. ప్రజల మనుషులమని' చెప్పారు. అలాగే హరిజన వాడలో భోజనాలు చేశారు.

అప్పుడు 'లొండాడు' ఎంతో ఆనందపడ్డాడు. అప్పుడు పరుశురాం గారంటే అభిమానం పెరిగింది.

వాళ్ళ మాటల్లో చెప్పాలంటే ''ఆలకి అన్నమొండి యెట్టడానికి మాము అదొక రకమై పోనాము. మా దగ్గిరేటుంటాది సోడంబలి తప్ప. ఆల దగ్గిర తిని బతికినోళుం. మాకాడ కొచ్చి తింటామంటే మాము ఇబ్బంది పడ్నాము'' అంటూనే తిండి పెట్టారు.

'లొండాడు' ప్రక్కనే పరుశురాం కూర్చొని తిన్నారు. రెండే రెండు ముద్దలు తిని కడుపులో బాగులేదని లేచిపోయారు. ఊరిలోని నాయుళ్ళు ఎవరూ రాలేదు. కూరలు పెదనాయుడు, పచ్చుళ్ళు సింహాద్రి నాయుడు పంపించారు.

భోజనాలు అయిన తరువాత చాలా విషయాలు చెప్పారు.

''మీ పంచాయతీ ప్రెసిడెంటు పదవి హరిజనులకు ప్రభుత్వం కేటాయించింది. మీలో ఎవరో ఒకరు ప్రెసిడెంటుగా వుండాలి'' అని అడిగారు.

తరువాత ఇంకొకరు మాట్లాడి, మీలోని వాడు ప్రెసిడెంటు అయితే మీకే మేలు

జరుగుతుందని, అట్టడుగువర్గాలలో వున్నోళ్ళని పైకి తేవాలనే ఈ రిజర్వేషన్లు ఇచ్చారు కాబట్టి దాన్ని మీరంతా వినియోగించుకోవాలని చెప్పారు.

ప్రెసిడెంటు కోసం ఎవరు నిల్చొంటారో చెప్పండని అడిగితే తడుముకోకుండా పెదనాయుడు చెప్పేశాడు- వెనకటికి వాళ్ళ కింది పాలేరుగా చేసిన 'లొండ లక్ష్మయ్యే' అన్ని విధాలా తగునని.

అందరూ పెదనాయుడు అభిప్రాయంతో ఏకీభవించారు. ఆ విధంగా 'లక్ష్మయ్య'ను రామరాజపురం ప్రెసిడెంటును చేశారు.

పంచాయతీ ప్రెసిడెంటునైనా ఇక్కడ ఈ పంచన తినే గతి తప్ప లేదని గట్టిగా ముద్దైనా పెట్టకుండానే లేచిపోయాడు 'లక్ష్మయ్య'. తన విస్తరి తనే ఎత్తుకొని దూరంగా పెరటి పెంటలో విసిరేశాడు. మౌనంగా తలవంచుకు వచ్చేశాడు.

'లక్ష్మయ్య' తలలో ఎన్నో ఆలోచనలు తిరుగుతున్నాయి.

''కులం పట్టింపులున్నోడు ఎందుకు పిలవాలి? పిలవకపోతే మేము రాకపోయుంటెమి కదా: నేనేమైనా పిలవమని చెప్పానా? పరుశురాం కనీసం పెదవి విప్పి మాట్లాలేదు. అంతే- ఎలాగైనా పెద్దోళ్ళు పెద్దోళ్ళు ఒకటే!''

''పదవులిచ్చి పెద్దోళ్ని చేద్దామనుకున్నా పేదోళ్ళు పెద్దోళ్ళు కాలే. పేదోళ్ళు పేదోళ్ళే అని సెప్పడానికి సేనామంది వున్నారు.''

''ఇక్కడ మర్యాదివ్వనేదనే కాదు. నాకు పదవొచ్చి ఏడాది గడిసినా నేనేటి సేసుకున్నాను? పేట జనం కోరికపైన కాలనీకి వూరు పక్కనే స్థలం ఇమ్మని నేనడిగితే అది జిరాయితీ భూమిని వూరికి దూరంగా కాలనీ కట్టారు అక్కడ మరి ప్రజల మాటా నెగ్గలేదు. ప్రెసిడెంటైనా నా మాటా నెగ్గలేదు. పరపతి, డబ్బు నెగ్గేసింది. పెదనాయుడు చెప్పినట్లే కాలనీ కట్టారు.''

ఏ పనీ 'లొండ లక్ష్మయ్య' చెప్పినట్టు వాళ్ళ పంచాయతీకి జరుగలేదు. పంచాయతీకి సంబంధించి ఒక అధికారి వచ్చినా ముందుగా పెదనాయుడు ఇంటి దగ్గరికే వెళ్తారు.'లక్ష్మయ్య'ను అక్కడికి పిలిపించుకుంటారు. కొన్నిసార్లు పిలవనూ పిలవరు. పెదనాయుడే అన్నీ చక్క పెట్టేసి తరువాత ఎప్పుడో సంతకాలు పెట్టించుకుంటారు. అడగటానికి వీలు కాదు. డబ్బు, దర్పం అన్నింటా నెగ్గేస్తాయి.

''ఏటి సేస్తున్నావ్....'' అన్న పెదనాయుడు కేకతో వర్తమానానికి వచ్చాడు లక్ష్మయ్య.

''నీలు కెళ్ళండ్రా....'' అన్నాడు.

'ఆ' అని అన్నాడే కానీ 'లొండా'డికి వెళ్ళబుద్ధి కాలేదు. నీరసంగా వుంది. ఆకలిగా వుంది. హృదయం కుతకుతా వుడుకుతోంది. ఆలోచిస్తూనే వీధిలోకి వెళ్ళాడు.

అతిధులు వచ్చి పోతున్నారు. పెళ్ళి వరకూ వుండాల్సిన వారు వరండాలోనో, షామియానా క్రిందనో బాతాఖానీ కొడుతున్నారు. జనం బాగా నిండిపోయారు.

''మల్లా నీలు కెల్లన్నాము'' అని కిష్ట వొచ్చాడు.

''నాను మొయ్యను'' అన్నాడు లక్ష్మయ్య.

''పోల్లే....మాము మరో రెండుసార్లు మోసేస్తాము'' అని కిష్టయ్య వెళ్ళిపోయాడు కావిడి వూపుకుంటూ.

సూర్యుడు వాలిపోతున్నాడు. లైట్లు వెలిగించారు. దీపాలు కళ్ళు మిరమిట్లు గొల్పుతున్నాయి. ఎక్కడెక్కడున్నుండి వూరిపోతున్నారో జనాలు - తెగ వచ్చేస్తున్నారు 'లక్ష్మయ్య' అంతా చూస్తూ వుండి పోయాడు.

ఐదారు కార్లు, రెండు మూడు జీపులూ ఒక్కసారి దూసుకు వచ్చాయి. మినిస్టరు గారు, కలెక్టరు గారు, ఇంకా కొంతమంది పెద్ద రాజకీయ నాయకులూ వచ్చారు. వాళ్ళు రావడంతో గొడవ ఎక్కువైంది. చాలామంది వాళ్ళను చూసేందుకు పనులు మానేసి వెళ్ళారు.

పరుశురాంగారు హృదయపూర్వకంగా వాళ్ళని ఆహ్వానించారు. పెళ్ళిపందిర్నీ, పెళ్ళి కొడుకూ, పెళ్ళి కూతుర్నీ చూపించారు. పెళ్ళి పీటల పైన కూర్చుండ పెట్టకుండానే పెళ్ళి పిల్లల్ని ఒక్క దగ్గర పెట్టి మంత్రిగారు మిగిలిన వి. ఐ.పి.లు అక్షింతలు వేశారు.

వాళ్ళంతా వెంటనే వెళ్ళిపోవాలట. అందుకు ముర్తాలు ఏమీ లేకుండానే దీవించేశారు బిజీ మనుషులు. ఒక్కసారి లోగిలంతా తిరిగేసి కాఫీలుతీసుకొని పావుగంటలో వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిన తరువాత వానకురిసి వెలసినట్టయింది. అక్కడ మిగిలి వున్నోళ్ళంతా కుర్చీల్లో కూర్చొన్నారు. వివిధ రంగాలపైన, రాజకీయాలపైన చర్చలు సాగుతున్నాయి. ప్రెసిడెంట్లు, ఎమ్మెల్లేలు, జిల్లా నాయకులు వున్నారు.

'లక్ష్మయ్య' ఇటూ, అటూ చూస్తూ ఆలోచిస్తున్నాడు.

'ఎంత తేడా! మినిష్టరిదీ నా కులమే కానీ ఆయనకిచ్చిన మర్యాదల్లో ఒకటో వంతైనా నా కిచ్చిరా! ఎంతైనా డబ్బు, పరపతే మనిషి మర్యాదను నిర్ణయిస్తాయి గావాలి! నేను పేద ప్రెసిడెంటుని, అందుకని పలకరింపుకు కూడా నోచుకోలేదు' అని అనుకుంటున్నాడు.

'లక్ష్మయ్య'కు అందరిలో కూర్చోవాలనుంది. అందరితో పెళ్ళి పందిరి దగ్గరకు వెళ్ళాలనుంది కానీ పెదనాయుడు ఏమంటాడోననే భయం మనసులో పీకుతోంది.

''లక్ష్మయ్యా!....రారా....'' అని ఓ ప్రెసిడెంటు పిలుపు విని అటుగా వెళ్ళాడు. వాళ్ళంతా వరండాలో కూర్చొని వున్నారు. వరండాలోనికి వెళ్ళడానికి ధైర్యం చాలడం లేదు. వెళ్తే పెదనాయుడు ఏమంటాడోనని అనుకుంటూనే మళ్ళీ ధైర్యం తెచ్చుకుని 'నేనూ ప్రెసిడెంటునే కదా!' అనుకొని వెళ్ళాడు.

వరండాలోకి వణుకుతూనే అడుగేశాడు. తువ్వాలు మడిచి భుజం పైన వేశాడు. మొళ్ళో దోపుకున్న పంచె కాళ్ళ వరకూ లాగాడు కొంత మంది ఏమీ పట్టించుకోలేదు. కానీ, మరి కొంతమంది మాత్రం లక్ష్మయ్య వంక చురచురా చూశారు.

ఆహ్వానించి నాయన కుర్చీ చూపించాడు. 'లొండాడు' వినయంగా కూర్చున్నాడు. కుర్చీలో కూర్చోగానే కొంత హోదా వచ్చినట్టు అయింది లక్ష్మయ్యకు. ఇప్పటి వరకూ రగిలిన మనసులోని బాధ కొంత సర్దు మణుగుతూ వుంది.

ఇంతలో పెదనాయుడు అక్కడ కొచ్చాడు. పెదనాయుడు వచ్చినా కుర్చీనుంచి లేవలేదు 'లక్ష్మయ్య'.

''అరె లొండా!'' నీవిక్కడున్నావా?.... నీళ్ళు మొయ్యనేదా?'' అడిగాడు కొంచెం తీవ్రస్థాయిలో.

లక్ష్మయ్య జవాబివ్వలేదు. పెదనాయుడు అక్కడున్న వాళ్ళందరినీ ఓ మారు చూసి ఏమీ అనలేక వూరుకుండిపోయాడు.

'వరండాలోనికొచ్చి కుర్చీమీద కూకున్నం. తోడివైపోనావురా మా- కొడక' అనుకున్నాడు నాయుడు.

అతడా మాటలు బయటకు అనకపోయినా చూపుల్లోనే చదువుకున్నాడు 'లక్ష్మయ్య'.

అప్పుడే సద్దుమణిగి అణిగిపోతున్న బాధ నాయుడు చూపుతో పాము పడగలా విప్పుకుంది లక్ష్మయ్య మనసులో....

'నేదు బాబూ.... నేదు - మామెక్కడ పెద్దోళమైనాము? పెద్దోళమయితే, నీ నోటి మాటలాగే నీ చూపు కూడా నీలోనే మాసిపోదా?!' అనుకున్నాడు లక్ష్మయ్య.

# సెగమంటలు

దాదా హయత్

వూరాల ఓబులేసు నీరసంగా రిక్షా తోసుకుంటూ వచ్చి తన ఇంటి ముందాపాడు. ఇల్లంటే ఇల్లు కాదది. బోద వసారా. పేరుకు మాత్రం చుట్టూ నాలుగు మట్టిగోడలుంటాయి. ఆ నాలుగు గోడలు కూడబలుక్కొని కూడా ఆ ఇంకో మంచి కొట్టం రూపైనా ఇవ్వలేక పోతున్నాయి.

ఓబులేసు ఇంటికాడ రిక్షా ఆపుతూనే బిల బిల మంటూ అతని ఆరుగురు సంతానం వచ్చి చుట్టేశారు.

''నాయన! నాయన!''

''య్యా! యేందే సీదర! పొండి'' కసిరాడు ఓబులేసు.

అతని భార్య లక్ష్మి ముసి ముసిగా నవ్వుకుంటూ కొట్టం లోంచి బయటి కొచ్చింది. ''మాపిటాలైతే నువ్వు మనిసివి కావా యేందీ? పిల్లోళ్లు యాల సీకాడి కొచ్చినారో గుడ్నా అడగవా?'' అందీ తెచ్చి పెట్టుకున్న కోపంతో.

''యేంది సంగతి?'' అన్నాడు ఓబులేసు రిక్షా చక్రంకాడ గోడవారగా కూలబడుతూ.

సాయంకాలం మసక చీకట్లు కమ్ముకుంటున్నాయి. లక్ష్మి కొట్టంలో కెళ్ళి దీపం తెచ్చి గుమ్మం దగ్గరుంచింది. ఏదో ఖాళీ మందుల సీసాలో గబ్బు నూనె పోసి అందులో పాత గుడ్డ పీలిక వేసి మూతకు రంధ్రం పెట్టి వెలిగించిన దీపము. భగభగాయ మానంగా వెలుగుతోంది.

''యేందో సెప్పవ్?'' అన్నాడు ఓబులేసు.

లక్ష్మిచేతులు ముందుకు తెచ్చి మురిపెంగా అతనికి చూపించింది. ఆ చేతుల్నిండా కొత్త గాజులున్నాయ్.

''యాడియో చెప్పుకో.''

''యాడియి?'' అడిగాడు ఓబులేసు.

''మద్దేన్నం ఓట్లడుగుంటా సంగొరెడ్డోళ్లు వచ్చి పోయినారు. ఓటుకు ఇరవైరూపాయలిచ్చినారంటే! అందుకే పిల్లోళ్లు [illegible]'' చెప్పింది లక్ష్మి.

''ఓటుకు ఇరవై రూపాయలిచ్చి [illegible]

ఓబులేసు.

అతనింట్లో మొత్తం అయిదు ఓట్లున్నాయి. ఓబులేసు, లక్ష్మి, ఓబులేసు తల్లిదండ్రులు, ఓబులేసు పెద్దకూతురు వీరమ్మ ఆ పిల్లకు ఇంకా పదిహేనే సరిగ్గా నిండలేదు. అయినా పద్దెనిమిది నిండినట్లు రాయించారు. ఇక ఓబులేసు తల్లిదండ్రులు చనిపోయి చాలా కాలమైంది. అయినా ఓటర్ల లిస్టు నుంచి వాళ్ళ పేర్లు తొలగించడం జరగలేదు. ఈ తిరకాసులన్నీ ఓబులేసుకి తెలిసేపుండాల్సిన అవసరం లేదు. అన్నీ నాయకులే శ్రద్ధగా చూసుకుంటారు. ఎటొచ్చి ఆ ఓటు తమకు పడాలి అంతే. ఓటుకు ఇరవై రూపాయలంటే అయిదు ఓట్లకు నూర్రూపాయలు. ఓబులేసు అంత డబ్బు ఒకేసారి కళ్ళజూసి చాలా రోజులైంది.

లక్ష్మి అతన్ని లేవనియ్యకుండా వెనక్కి తోసింది.

''పోయి దొంగసారా తాగుతా? లెక్క నీకియ్యను.''

''నా కియ్యకపోతే ఎవరకిస్తావే? ఏ రెండో మొగుని కిస్తావా?'' కోపంగా అన్నాడు ఓబులేసు.

''అదో, అట్లాంటి మాటలంటేనే నాకు మండుతాది. నేనేం జేస్తా లెక్క? నీమాదిరిగా దొంగసారా తాగుతానా? ఏదో నేనింత తిని పిల్లోల్ల కింత పెడ్తా. అంత దానికి నాకు రెండో మొగుడుండాడంటావా?''

ఓబులేసు ఆ మాటతో కొంత తగ్గాడు. ''సర్లేయే? లెక్క యాడిబెట్టినావ్?'' అన్నాడు బతిమాలుకుంటూ.

''ఉండాదిలే పెట్టిన కాడ. అయినా ఇయ్యాల నీకు లెక్క పెట్టి దొంగసారా తాగాల్సిన కర్మేమి? మనకందరికి సారా సంగిరెడ్డోల్లే యేపిస్తుండారు.''

''నిజమా?'' అన్నాడు ఓబులేసు నోరు తెరిచేసి.

నిషేధం తర్వాత ఓబులేసుకి సారా దొరకడం లేదు. దొరకడం లేదంటే దొరుకుతుంది. వారుణ వాహినీ మయంగానే ఎంతకావాలంటే అంత దొరుకుతుంది. అయితే అందుకు డబ్బు చాలా అవుతుంది. అందుకే ఓబులేసు ఈమధ్య సాయంకాలమైతే సచ్చిన పాయలో అన్నట్టు నీరసంగా వుంటున్నాడు. ఉచితంగా ఆరోజు సారా వస్తుందంటే అప్పటికప్పుడే అతని నాలుక పీకనారంభించేసింది.

''నేను అపద్దం చెప్తానా యేంది? రేత్రికి సియ్యాలు గుడ్కా వుండియి,'' అంది లక్ష్మి వదలు బోతూ.

ఓబులేసు ఈసారి హుషారుగా లేవబోయాడు. అయితే అంతలోకే ఏదోగుర్తు కొచ్చి మళ్ళీ సాలోచనగా కూర్చుండిపోయాడు.

''ఏమాయె?'' అడిగింది లక్ష్మి.

''అదికాదు సంగిరెడ్డికాడ లెక్క దీసుకుంటే దస్తగిర్రెడ్డి ఏమనడా అని'' లక్ష్మికి అతని అనుమానం అర్థమైంది.

''దస్తగిర్రెడ్డి యాడుండాడులే రాముడుంటే దస్తగిర్రెడ్డిల్లేకుంటే లేదు. పోలీసోల్లు రామునితో పాటే దస్తగిర్రెడ్డి అల్లుణ్ని సుద్కా లోపలేసి నారంట, ఈసారి దొంగ ఓట్లు పడవంటనే? పోలీసోల్లు గట్టిగా వుంటారంట'' అంది.

''అంతేనంటావా? సరే, సూద్దాంలే,'' అంటూ లేచి నిలబడ్డాడు ఓబులేసు. సారామీద ఆశ అతన్ని అంత కంటే ఎక్కువ ఆలోచించనివ్వలేదు. ఇంట్లో కెళ్ళి తప్పెట చేతిలోకి తీసుకొని అది సరిగ్గా వుందో లేదో చూశాడు.

ఆ రాత్రి మాలవాడలో సెగమంటలు వేశారు. మగవాళ్ళంతా మంట చుట్టూ చేరి తప్పెట్టక సెగ చూపిస్తున్నారు. ఆడ వాళ్ళూ పిల్లలూ మరో వంక బారులు తీరి కూర్చున్నారు ప్లాస్టిక్ బకెట్లలో సారాసీసాలు సిద్దంగా వున్నాయి. ఇంకో వైపు నిప్పుల మీద మాంసం కడ్డీలు కాలుతున్నాయి. సారా తాగే వాళ్ళు తాగుతున్నారు. చియ్యలు తినేవాళ్లు తింటున్నారు.

''తాగండ్రా తాగండి. సియ్యలు బాగా బాగా తినండి. రూపు ఒక్కోడూ తక్కువంటే పదోట్లు బేసి రావాల. ఎంతకావాల్నో తాగండి,'' అంటున్నాడు అడ్డోడు. సంగిరెడ్డి తరపున అతనే అక్కడ కార్య నిర్వాహకుడు.

అంతవరకు తన తప్పెట్లో మోత ఎలా వస్తోందో పరీక్షించుకుంటున్న ఓబులేసు మెల్లగా అడ్డోని పక్కలో చేరాడు.

''అది కాదన్నా అడ్డోడన్నా! ఈసారి దొంగ ఓట్లు పడవంటనే?'' అన్నాడు.

''ఎందుకు పడవు లేరా. వూకే అంటుంటారు గానీ ఈ పోలీసోల్లు. అందుకే చెప్తాండా, రేపు ఒక్కోడూ పదోట్లన్నా బేసి రావాల'' అన్నాడు అడ్డోడు.

''సంగిరెడ్డికి ఓట్లేసి మండలాధ్యచ్చున్ని చేస్తే మాకు పక్కా ఇండ్లు కట్టిపిస్తాడా? బోద కొట్టాల్లోనచ్చాండా. ఎండకాలమొస్తే అగ్గంటుకుంటాదని గుండె సేతుల్లో పెట్టుకోని బతుకుతాండాం.''

''ఊ... అందులో నీకు అనుమానం యేమిటికి; సంగిరెడ్డి మీ అందరికీ పక్కా ఇండ్లు కట్టిపిస్తాడు. మరేం భయం లేదు పో, అందరూ వెచ్చంగా పక్కా ఇండ్లల్లో బాగుందురుగాని.''

''అది కాదన్నా! పోయినసారి దస్తగిర్రెడ్డి పక్కా ఇండ్లు కట్టిపిస్తానని చెప్పినాడు. ఏదీ, కట్టిపీల్యా.''

''దస్తగిర్రెడ్డికీ, సంగిరెడ్డికీ ఒకటే నేందిరా? ఇప్పుడా కాలం పోయిందిగా. మీకేం కావాల్నో నాకు చెప్పండి. సంగిరెడ్డికి చెప్పి నేను చేయిస్తా మీ పనులు. పక్కా ఇండ్లన్నా వస్తాయ్. అన్నీ వస్తాయ్ రూపు మీ ఓట్లు మాత్రం ఒక్కటి పోకుండా సంగిరెడ్డికే వేయండి ఒక్కోడూ పది ఓట్లు వేయండి''

ఆ మాటతో ఓబులేసుకు హుషారొచ్చేసింది బాగా తాగేసి తప్పెట వాయిస్తూ పాటందుకున్నాడు

''వచ్చెర వచ్చెర సంగిరెడ్డెన్న!
తెచ్చెర తెచ్చెర పక్కా ఇండ్లు!
వచ్చెర వచ్చెర. సంగిరెడ్డెన్న!
వచ్చెర వచ్చెర తెచ్చెర తెచ్చెర!''

ఓబులేసు పాటకు వంత పాడుతూ మిగతా వాళ్ళు కూడా తప్పెట్లు వాయించడం మొదలెట్టారు. ఆడవాళ్ళు నవ్వుతున్నారు. పిల్లలు కేరింతలు కొడుతూ సెగమంటల చుట్టూ వలయాలు కట్టి తిరుగుతున్నారు. వాతావరణం పండగలా వుంది. దేవరకో గానీ అలాంటి పండగ వుండదు. ఆ రాత్రంతా తప్పెట మోతలతో మాలవాడంతా మారుమోగి పోయింది.

తెల్లారింది.

ఎవరిళ్ళలో వాళ్ళు అంతా తాగి పడున్నారు.

అంటరానితనం తెలీని సూర్య కిరణాలు మిగతా లోకమంతటితో పాటు మాలవాడను కూడా ప్రేమగా స్పృశిస్తున్న సమయంలో అక్కడ ఒక్కసారిగా అలజడి చెలరేగింది.

ఎవరో వచ్చి ఓబులేసు కొట్టం తడుపు దబదబా బాదేస్తున్నారు.

''ఒరే, ఓబులేసూ! ఇంగా పండుకున్నావా! రాముడొచ్చేసినాడ్రా! రాముడొచ్చేసినాడ్రా!'' ఎవరిదో ఆక్రోశిస్తున్న ఆడ గొంతు.

ఓబులేసుకు మెలకువొచ్చింది. తల దిమ్ముగా వుంది. వెళ్ళి తలుపు తీశారు.

''ఎవరే?''

నాలుగిళ్ళ అవతలుండే వుుసల్దీ. తనని లేపినట్టే అందర్నీ తలుపులు బాది నిద్రలేపుతోంది. తన కొడుకుని రాముడు చెట్టుకు కట్టేసి కొడుతున్నాడని లబలబా మొత్తుకుంటోంది.

రాముడు వచ్చేశాడన్న మాట బుర్రలో ఇంకగానే ఓబులేసు మత్తంతా దిగిపోయింది.

''ఓట్లయి పోయినంత వరకు పోలీసోల్లు వదలమన్నారే! ఎట్లా వదిల్నారబ్బా?'' అని బిగ్గరగానే అనుకుంటూ ఆందోళనగా భార్యని సమీపించాడు.

అతనింకా లక్ష్మిని నిద్ర లేపనే లేదు.

ఎక్కడ్నించి వచ్చారో కొందరు మనుషులు ధనామంటూ తలుపు తోసుకుంటూ వచ్చి అతనింట్లో జొరబడ్డారు. అడ్డంగా నేల మీద పడుకున్న పిల్లల్ని కాళ్ళతో తన్నుకుంటూ వెళ్ళి ఓబులేసు వీపు మీద నాలుగు పిడిగుద్దులు వేశారు.

గుండె అదరినట్లనిపించి, ''అమ్మా'' అన్నాడు ఓబులేసు.

లక్ష్మి తత్తరపాటుతో లేచి కూర్చుంది.

పిల్లలు అప్పటికే పెద్దగా ఏడుస్తున్నారు.

వచ్చిన వాళ్ళు ఓబులేసుని వెక్కా పెట్టుకుని ఈడ్చుకుపో నారంభించారు.

''ఓర్నాయనో! నా మొగున్నిగ్గకుపోతాండా(రా!'' అని వె(రిగా అరుస్తూ లక్ష్మి ఆ వెనకాలే పరిగెత్తింది.

రాముడు ఒక చింత మానుకు మంచి వయసులో వున్న నలుగురు మాలకు(రాళ్ళని కట్టేసి క(రతో గొడ్లను బాదినట్టు బాదుతున్నాడు. అక్కడే వుండి అతన్ని ఎగదోస్తున్న దస్తగి(రెడ్డి అల్లుడు కుల్లాయిరెడ్డి శివమెత్తినట్లు మాలజాతి నంతటినీ బండబూతులు తిడుతున్నాడు.

కుల్లాయిరెడ్డి మనుషులు ఓబులేసుని ఈడ్చుకొచ్చి అతనిముందు పడేశారు. ఓబులేసు గబాల్న కుల్లాయిరెడ్డి కాళ్ళు పట్టుకున్నాడు.

''కొట్టాకన్నా! మమ్మల్ని కొట్టాకన్నా!''

కుల్లాయిరెడ్డి కాలు పైకెత్తి ఓబులేసు గుండె మీద తన్నాడు.

ఓబులేసు వెనక్కిపడ్డాడు. తల ధనామంటూ నేలకేసి కొట్టుకుంది.

''ఏమిరా! సంగిరెడ్డికాడ లెక్క తీసుకుంటారా?'' అన్నాడు కుల్లాయిరెడ్డి ఓబులేసు మొహం మీదికి వంగుతూ.

''లేదన్నా!'' ఏడుస్తూ అన్నాడు ఓబులేసు.

''నీ సంగతేంది? సంగిరెడ్డి మిందపాట గుడ్డా పాడ్నావంటనే!''

''లేదన్నా! లేదు.''

''అయితే పో. సంగిరెడ్డి లెక్క యెనక్కిచ్చేసిరా పో. మీకు లెక్క కావాల్నంటే దస్తగి(రెడ్డి ఈవన్నాడా? సారాయేంపిచ్చమంటే యేంపిచ్చానన్నాడా? ఓటుకు ఇరవై ఇస్తాన్నాడు కదా సంగిరెడ్డి? వోటుకు దస్తగి(రెడ్డి యాభై ఇస్తాడు పొండి. వోట్లు మాత్తరం దస్తగి(రెడ్డికే పడాల. పడకపోయినాయా, తోలొలిపిస్తా పో, లెక్క ఇచ్చేసి రా పో.''

ఆ రోజే మాలవాడ మాలవాడంతా కదిలి అడ్డోడి ఇంటికి వెళ్ళారు.

''ఏందిరా వచ్చినారు?'' అన్నాడు అడ్డోడు ఒక్కసారిగా అంత మందిని చూసి బెదిరిపోతూ.

ఓబులేసు ముందుకొచ్చాడు.

''అన్నా ఏమనుకోవాకు. [illegible] కుల్లాయిరెడ్డి [illegible], ఇడిసేసినారు. నీకు దండం పెడ్తాసామీ, [illegible] యేమనుకోవాకి [illegible] లెక్క.''

ఓబులేసుతో పాటు ఒక్కొక్కరిగా [illegible] అడ్డోడి ముందర పెట్టి [illegible]

అడ్డోడి ముందర [illegible]

ఆ [illegible]

[illegible]

వచ్చేశారు.

ఆ సమయంలో కుల్లాయరెడ్డి ఒకింట్లో ఓట్లు అంగడి పెట్టుక్కూర్చున్నాడు. రాముడు కూడా అక్కడే వున్నాడు. దొంగ ఓట్లేసి వచ్చిన వాళ్ళంతా అక్కడ సిరా గుర్తు తుడిపేసుకునే ప్రయత్నంలో వున్నారు. కొందరు కిరసనాయిల్తో, కొందరు స్పిరిట్తో, ఇంకొందరు అగ్గిపుల్లల్తో తంటాలు పడుతున్నారు.

''ఏమ్మే, ఓట్లు బేసొచ్చినారా?'' గద్దించాడు రాముడు.

ఆ హుంకారానికి బెదిరిపోతూ తల్లీ కూతుళ్ళిద్దరూ ఒక మూలకు ఒదికి పోయారు.

''లేదన్నా, మాయన్నీ దొంగ ఓట్లని ఆడ తరిమేస్తాండారు,'' దీనంగా అంది లక్ష్మి.

''వాల్లు తరిమినారా, మాకు ఓట్లు బేయాల్సి వస్తాదని మీరే ఎల్లబారొచ్చేసినారా?'' డ్రామాలేస్తాండావేమే?''

''లేదన్నా, సత్తెం చెప్తాండాం'' చేతులు నులువుకుంటూ అంది లక్ష్మి. ''నీ మొగుడెవరని అడుగుతాండారాన్నా ఆడ. నేను బద్రిగాడని చెప్పినా. వాల్లు నమ్మలా. 'నీ మొగుని పేను ఓబులేసుగదేమే. మాకు తెల్సులే. దొంగ ఓటు కోసం ఇంగెవర్నో మొగుడని చెప్పుకోను సిగ్గులేదేమే లంజల్లారా మీకు. అనీ కూడా తిట్టినారన్నా'' కన్నీరు పెట్టుకుంది.

కుల్లాయరెడ్డి ఓబులేసు వంక చూశాడు.

''రేయ్, ఇలారా.''

ఓబులేసు చేతులు కట్టుకుని ముందుకొచ్చాడు. కుల్లాయరెడ్డి ఓటరు చీటి ఒకటి అతని చేతిలో పెట్టి, ''ఈ ఓటు బేసిరాపో. బేయకుండా ఎనక్కొచ్చినావా, నీ పెండ్లాం నీది కాదు'' అన్నాడు.

ఓబులేసు వణికిపోతూ ఆ చీటీ పట్టుకుని బయల్దేరాడు.

పోలింగ్ బూతు దగ్గర క్యూలో అరగంట నిలబడ్డాక అతని వంతొచ్చింది.

''వరుస నెంబరు రెండొందాలా పది'' అరిచాడు పోలింగ్ అసిస్టెంటు.

ఇందాక లక్ష్మికి అబ్జెక్షన్ చెప్పిన సంగిరెడ్డితరపు పోలింగ్ ఏజెంటే ఓబులేసుని చూసి కనుక్కున్నాడు.

''ఏమిరా ఓబులేసూ! ఎంకటయ్య ఓటు బేసేదాని కొచ్చినావా? దొంగ నా కొడకా! ఇందాకనే నీ పెండ్లాం వచ్చిపాయెగదరా! ఇప్పుడు నువ్వొచ్చినావా? మీ కుటుంబం కుటుంబం అంతా దొంగ ఓటు బతుకేనేమిరా? పోరా, బయటికి పో''

ఓబులేసు కదల్లేదు.

''పొమ్మంటే పోవేమిరా?'' గర్జించాడు ఏజెంటు.

ఓబులేసు అప్పటికీ కదల్లేదు. తల వంచుకుని నిలబడ్డాడు.

డ్యూటీ కానిస్టేబుల్ అతను కదలక పోయేసరికి వచ్చి మెడ పట్టుకున్నాడు.

''కదులూ'' హాలు దద్దరిల్లి పోయేట్టు పెను కేకవేశాడు.

ఓబులేసుని కొంతదూరం వరకు కానిస్టేబుల్ ఈడ్చుకు పోగలిగాడు. అయితే గుమ్మం ఎటుందో అతనికి చూపించక వుందే ఓబులేసు ఆ పట్టులోంచి తప్పించుకుని పరిగెత్తుకుంటూ వచ్చి పోలింగ్ ఆఫీసరు ముందు మోకాళ్ళ మీద కూలబడ్డాడు.

''సామీ! మాల నాకొడుకుని సామీ! ఎవనిక్కోపం వచ్చినా కాలు ఎగ్గేసి, ఎగ్గిసి నన్నే తంతారు. ఈ ఓటు నన్ను బేయనీయండి సామీ! నిజమే సామీ, నాది దొంగ ఓటు బతుకే. సంగిరెడ్డి గెల్సినప్పుడూ దొంగ ఓటే బేసినా, దస్తగిర్రెడ్డిగెల్సినప్పుడూ దొంగ ఓటుబేసినా. ఇప్పుడూ దొంగ ఓటు బేయనీకేవచ్చినా. నా ఒక్కన్దే దొంగ ఓటేమీ సామీ! ఈడ పెట్టెలో పడ్తాండేయన్నీ మంచి ఓట్లేనా సామీ? ఎవనికి తెల్దు సామీ! దొంగవోటు బేయకుంటే మమ్మల్ని సంపుతారు సామీ! ఈ దొంగ ఓటు బేయకుంటే నా పెండ్లాం నాదికాదు సామీ! బేయనీయండి సామీ! ఈ దొంగ ఓటు బేయనీయండి సామీ!''

వోబులేసు ఆ మాటలంటున్నప్పుడు ఒక్కసారిగా వరదొచ్చినా పెన్నలా హోరుమన్నాడు. అనేశాక పెన్నలాగే చివర ఎండిపోయాడు. రెండు చేతులూ కడుపులో పెట్టుకున ఆఫీసరు కాళ్ళ దగ్గర ఉంగ చుట్టుకుని పడిపోయాడు.

ఒక్కసారిగా అక్కడ భయంకరమైన నిశ్శబ్దం అలుముకుంది.

వోబులేసు గుండెలో సెగ మంటలు రగుల్తున్నాయి.

# వేట

కొళ్ళిపాక శ్రీరామమూర్తి

''ఏరా సర్పంచూ, ఏట కెళ్లావా?'' అడిగాడు ధర్మభూషణం.

ఆ ఊరి సర్పంచ్ భీముడు తలూపాడు. అతను ధర్మభూషణం పాలేరుకూడా.

''ఎళ్లావండీ.''

''ఏటంటే మాటలు కాదురారోయ్... నే జెప్పిన కాయితాల మీద ఏలిముద్ర లేయటం కాదు.... నేను నమస్కారం చెయ్యమంటే చెయ్యటం కాదు.''

భీముడు నవ్వాడు, ధర్మభూషణం మాటల్లో పదిటన్నుల వ్యంగ్యం ఉన్నా అంత కంటే ఏం చెయ్యాలో తెలీక.

నిజానికి ఆయనకా ఇసుర్లు ఇసిరే అవకాశం ఇచ్చింది తనే. మొన్న మొన్నటి దాకా ధర్మభూషణం గ్రామ సర్పంచ్. అంతకు ముందు హన్మంతరావ్ ఉండేవాడు. ఆ పదవి అదేంటోగాని ఆళ్ళిద్దర్నీ తప్ప ఊళ్ళో ఎవర్నీ వరించి చావదు.

ఆ ఊరి పంచాయితీని ప్రభుత్వంవారు 'రిజర్వ్యుడ్'గా ప్రకటించగానే 'ఒరే, ఇది మనల్ని దువ్వటానికేరా... మనం ఎర్ర చొక్కాటోళ్ళతో, ఎర్రటోళ్ళతో తిరిగి మనుషులందరూ సమానమే, అందరి రక్తం ఎరుపే, కులాల పునాదుల్ని కూల్చాలనే ఏతువాదం మాటలు.... మిగులు భూముల్ని పంచాలి, పక్కా ఇళ్ళు కట్టించాలి, నీళ్ళూ, కరంటూ, బళ్ళూ కావాలి, కావాలనే సమానత్వం మాటలు గుండెలు ఆగే దాకా అరవకుండా మాట్టానికేనని పల్లెలో కుర్రాళ్ళు కొందరు విశ్లేషించారు. అదేం విచిత్రమోగాని ధర్మభూషణం, హన్మంతరావు ఎన్నెన్నో జన్మల అనుబంధం ఉన్నట్టు జమిలిగా తన దగ్గరకొచ్చి ప్రకటించారు. అది కూడా తన గుడిసె ముందున్న కుక్కి మంచం పట్టెమీద పదిలంగా కూచుని, చుట్టూ ఉన్న కల్మషాన్ని, కాలుష్యాన్ని పట్టించుకోకుండా.

''ఒరే భీముడూ..... ఇహ నువ్వే మనూరి సర్పంచ్‌వి....''

తనకసలు నోట మాట రాలేదు. చిన్నప్పుడు హరికథ చెప్పేవాడు అన్నట్టు కలయే, వైష్ణవమాయయో అనిపించింది.

''నేనేంటి, ఈ వూరికి ప్రెసిడెంటు నవడమేంటి?''

ఆళ్ళిద్దరూ హోరుగా, జోరుగా తుఫాను వానలాగా నవ్వారు.

''రోజులునీవి భీముడూ, నీవంటే నీలాంటోళ్ళవని . మీ పల్లోళ్ళవని అర్థం. ఆడెవడూ

అంబేద్కరంట. .. మీవాడే పాపం మీ కోసం చచ్చేదాకా తెగ కలవరించి పుస్తకాలు రాసేసి పోయాడంట. ఆడి వర్ధంతి ఈ మజ్జె జరిగింది. ఎవరో ఇంట్లో వాళ్ళు పెయినట్టు రేడియో, పేపరోళ్ళు తెగ గొడవ చేసేసారు. ఆడి ఆత్మశాంతికోసం కొన్ని గ్రామపంచాయితీల్ని ప్రభుత్వం రిజర్వుడుగా ప్రకటించేసింది.''

''అంటే ఆ గ్రామగ్రామాల్లో మీరు తప్ప మేం పోటీ చెయ్యకూడదు. చేస్తే బొక్కలో తోస్తారు....'' వివరించాడు హన్మంతరావు, 'మీరు' 'మేం' అనే మాటల్లో 'చాలా తక్కువ' 'మహా ఎక్కువ' అనే తేడా చూపిస్తూ.

''కాని నాకా రాజకీయాలు తెలవ్వండి.... ఆఫీసులు ఏడుంటాయో తెలీదు.... ఆఫీసర్లు ఎవరు. .. ఆళ్ళతో ఏం మాట్లాడాలో తెలీదు...''

''పిచ్చెదవా.... నీకు తెలీకపోతే ఏంరా? మాకు తెలుసు... ప్రభుత్వాఫీసుల్లో ఎవరెవరితో ఏం మాట్లాడాలో మాట్లాడతాం... ఎవరెవరికి ఎంతెంత ఇవ్వాలో, ఎక్కడెక్కడ ఎంతెంత రాబట్టాలో చూసుకుంటాం. నువ్వు మా పక్కనుండు. లేవమంటే లే, కూచోమంటే కూచో.... ఏలిముద్ర వెయ్యమన్న చోట ఏసెయ్.... హాయైన పనిరా, నీకు తెలీడం లేదుగాని....''

''ఓరే భీముడూ... ఢిల్లీ నించి పెద్ద పెద్ద ఆఫీసర్లు విదేశాలకి అప్పు కోసం ఎళ్తారు చూడూ... ఆళ్ళూ చేసేది ఇంతే... కాకపోతే ఆళ్ళు సంతకాలు చేస్తారు. అదే తేడా...'' అన్నాడు హన్మంతరావు పంచాయంతీ స్థాయి నించి కేంద్రం వరకు ఈ విషయంలో సమైక్యత ఉందని వివరిస్తూ.

''సరేనండి... మీ ఇష్టమే నా ఇష్టం....''

భీముడు ఆ ఊరి ప్రెసిడెంటు అయ్యాడు. ఎన్నో సంవత్సరాల తర్వాత అతని తల్లి నవ్వింది. భార్య మురిపెంగా చూసింది. పిల్లలు ఎందుకోగాని కాసేపు గంతు లేశారు.

తర్వాత అప్పుడెప్పుడో ఓ రోజు ధర్మభూషణం తన 'ఇంటికొచ్చి' అర్జెంటు వెంటనే రమ్మని ఊదరగొట్టి తనని తీసుకెళ్ళాడు.

ధర్మభూషణం ఇంటి పెరట్లో కూర్చుని ఉన్నాడు, ఎవరో ముదురు గోధుమ రంగు మనిషి, ఆడు నల్ల పాంటు మీద, తెల్ల చొక్కా లోపలికి ఏసుకున్నాడు. ఆడి మొహం నిండా నవ్వే.

''వీరు మన ఆర్డీవోగారు....''

తను భయం భయంగా నమస్కారం చేశాడు. ఆర్డీవో కూర్చోమన్నాడు. తను కింద కూర్చోబోయాడు.

''కుర్చీలో కూర్చో... [illegible]
పాలేరువి కాదు, ఈ ఊరి [illegible]

తనకి మహా [illegible]
పోతే ఆళ్ళకి కోపం [illegible]

వున్నాడు. ''భీముడో నువ్వు కుర్చీలో కూర్చోవచ్చు... నీకా హక్కుంది. మాతో పాటు తినొచ్చు. ఇందులో తప్పేం లేదు యూ నో, దీజ్ ఆర్ ది సిల్లీయెస్ట్ థింగ్స్ . కులం, మతం.. ఐ డోన్ట్ బిలీవ్ దెమ్. మనందరం మనుషులం ... వి ఆర్ ఆల్ వన్ అండ్ ఈక్వల్. . ఏమంటావు?''

తనకి ఆయన తెలుగు అర్థమైంది తప్ప ఆంగ్లం అంతు బట్టలేదు. సరేనని కుర్చీ అంచు మీద కూర్చున్నాడు.

''వీరు... మీ వాళ్ళకి ఇళ్ళ స్థలాలు ఇవ్వటానికి వచ్చారు.''

తను చాలా ఆనందించాడు, ఇలాంటి మంచి మాటలు విని చాలా కాలమైంది.

''నమస్కారం బాబయ్యా....'' అన్నాడు తను కృతజ్ఞత ఎలా తెలియచేయాలో తెలీక.

''ఈ తూర్పేపున ప్రభుత్వ భూమి ఉంది.. అందులో పదెకరాలు ఇస్తామంటున్నారు...''

ఆ భూమి గురించి తనకి బాగా తెలుసు. అదొట్టి బంజరు, అక్కడేవో పంటలు పండిద్దామని కొంతమంది రైతులు నరాలు తెంచుకుని మానేశారు నీటి వసతి లేక, నీళ్ళొచ్చే దారి లేక... పశ్చిమం వైపు అడవి... అటువైపు లాభం లేదు... ఉత్తరాన కొండ... అసలు లాభం లేదు.... దక్షిణం వైపు కాలవ ఉంది... దాని పక్క భూమి అయితే భేషు...

''ఆభూమిలో నీళ్ళుపడవు. గుడిసెలు ఏసుకుంటే మాకు, మా గొడ్లకి నీళ్ళట్టాగండీ..''

ఆర్డీవో చిరునవ్వు నవ్వాడు. ధర్మభూషణం తన ప్రత్యేక పద్ధతి ప్రకారం తుఫాను నవ్వు నవ్వాడు.

''అదేదో సామెజ్జెప్పినట్టుందిరా నీ ప్రశ్న... ఆ భూమి చదును చేసుకుని మీరు గుడిసె వేసీ వేసుకోంగానే... ఎంటనే ఎయ్యవూ... నీళ్ళ పంపులు... మనకి రచ్చిత మంచినీటి పథకం వస్తుంది.'' ''కాని... దక్షిణం వైపు కాలవ ఒడ్డున ఇప్పిస్తే బాగుంటుందండి...''

''కాలవొడ్డున ఎందుకురా, పురుగూ పుట్రా... భూమి గట్టిగా ఉండదు. గుడిసెలకి పెట్టుబడి ఎక్కువ పెట్టాలి... వర్షాకాలం గుడిసెల్లోకి నీళ్ళొస్తే తెల్లార్లూ రాం భజన చెయ్యాలి...''

''ఆడ మీరు పంపు చెయ్యకపోయినా, అప్పులిప్పిస్తే బోరింగులు ఏయించుకుంటామండీ..''

''అబ్బా..'' అన్నాడు ధర్మభూషణం, తన అజ్ఞానపు ఇనపతెర కరిగినందుకు కోపంగా... తను మళ్ళీ భయపడ్డాడు. ''ప్రభుత్వం ఏ కళనున్నదోగాని, ఒరే అబ్బాయిలూ, ఉచితంగా ఇళ్ళ స్థలాలిస్తాం... ఇళ్ళు కట్టుకోండ్రా అంది. నీళ్ళ పంపులు ఏయిస్తాంరా అంది. ఈ మురికి కూపంలో ఏడవ మాకండి కొంచెం సల్లటిగాలి పీల్చుకుని, సుఖంగా చావండ్రా అంది. ఇన్ని చెబుతుంటే ఏంట్రా, ఊరికే నట్లు కొడతావ్...''

''మంచిదేగానీండి... మా వోళ్ళు కాలవ వొడ్డునున్న భూమయితేనే ఇష్టపడతారండీ...''

''ఇష్ట పడతార్రా... ఎందుకు పడరూ. .. నాకూ ఉంది ఢిల్లీలో, ఏదో పెద్ద భవనంలో అరవై ఏడో అంతస్థులో ఉందామని, కుదురుతుందేంటి? మన ఊరు... భూమి... మన

గాలి...''

''బాగా చెప్పారు .. జననీ జన్మభూమిశ్చ... స్వర్గాదపి గరీయసి...'' అన్నాడు ఆర్డీవో, తనకి ఆంగ్లమే కాకుండా సంస్కృతం కూడా వచ్చునని చెప్పడానికి. ''కాని... మా వోళ్ళు... మాకు(రోళ్ళు)...'' అన్నారు తను చివరి ప్రయత్నంగా, వరద గోదారిలో కుక్క తోక పట్టుకున్న అనుభూతితో.

''ఆళ్ళ దేవుందిరా, సినిమాకి డబ్బు లిస్తే చాలు....''

వాళ్ళకివ్వలేదుగాని, తనకి మాత్రం వంద రూపాయలు ఇచ్చాడు; ఓ రోజు ఉలవచారు, రొయ్యల వేపుడుతో భోజనం పెట్టి... ప్రభుత్వం వారు ఆ బంజరు భూమే ఇచ్చారు. కొంత మంది అక్కడ గుడిసెలు వేసుకుని మళ్ళీ యధాస్థానానికి తిరిగి వచ్చారు. రక్షిత మంచి నీటి పథకం నీటి మూటగానే మిగిలిపోయింది.

తనకి తర్వాత తెలిసింది, ధర్మభూషణం, హన్మంతరావు కలసి పట్నంలో స్థిరపడి పోయిన ఒ మాజీ రైతు దగ్గర బినామీ పేర్లతో ఆ కాలవ ఒడ్డున భూమిని ప్రభుత్వ రేటు ప్రకారమే కొనుక్కున్నారని.

ఆ తర్వాత అక్కడో కోళ్ళఫారం, ఇటుకలబట్టీ వెలిశాయి. 'అవును, తనుకంటే ఇటుకలు తయారు చెయ్యడానికి, కోళ్ళు సుఖశాంతులతో బతకడానికి నీటి వసతి బాగా ఉండాలి కదా!' అనుకున్నాడు భీముడు కోపంగా....

''ఏరా సర్పంచా! అట్లా దేవుడల్లె నిలబడ్డావూ, మాటా పలుకూ లేకుండా...'' అన్నాడు ధర్మభూషణం.

దేవుడు ఉలిక్కిపడి బాధాకరమైన స్మృతినుంచి బైటికి వచ్చి ఆయన వైపు చూశాడు.

''చెప్పండి...''

''లోపలికెళ్ళి మన ఐదొందల ఎక్స్‌ప్రెస్ జోడుగుళ్ళ రైఫిల్ తీసుకురా... నూనె పెట్టి బాగా శుభ్రం చేద్దాం... మన తుపాకీ దెబ్బకి చిరతపులి ఛామ్మని చావాలి.. ''

భీముడు లోపలికి వెళ్ళాడు.

ధర్మభూషణం ఎప్పుడోగాని వేటకి వెళ్ళడు. అప్పుడెప్పుడో ఒకసారి ఓ జింకని, ఇంకోసారి కణితిని కొట్టుకొచ్చాడని జనం చెప్పుకుంటారు తప్ప, అమెరికా గూఢచారి ఉపగ్రహాన్ని అప్పుడు ఉపయోగించ లేదు. కాబట్టి ఆ రెండు సంఘటనలు నిజంగా నిజమో, కాదో ఎప్పటికీ తెలీదు.

మూడోసారి వీరావేశంతో వేటకి వెళ్ళి ఎలుగు బంటుపడితే పారిపోయొచ్చాడు జీపులో. అప్పటి నుంచి 'వన్యప్రాణుల మీద దయతో' వేటకి వెళ్ళడం మానేశాడు .

మళ్ళీ ఇన్నాళ్ళకి ధర్మభూషణానికి, ఆయన ఎక్స్‌ప్రెస్ జోడుగుళ్ళ రైఫిల్‌కి పని పడింది.

దానికో కారణం.

ఐదు రోజుల క్రితం [illegible]
దాంతో [illegible]

చూపించని కొందరు చెప్పారు ఊళ్ళోకి కూడా వచ్చింది మేం చూశాం, మేంచూశాం, మేమే చూశామని ఇంకొందరు చెప్పారు

తర్వాత ఆ చిరుత రాత్రి పూట రహస్యంగా వచ్చి సాంబయ్యగారి సోమయ్య ఆవుని లాక్కెళ్ళింది. మేకల వెంకన్న మేకల్ని తినేసింది ఓ కోడిని అమాంతం మింగేసింది. ఈ మూడు సంఘటనల్లో కూడా ప్రత్యక్ష సాక్షులున్నారు.

ఈ చిరత రోజూ పొలాలికి అడ్డం పడొచ్చి పంటని ధ్వంసం చేసింది. మానవుల ఆహారం మీద మమకారంతో ఊరిపై పడింది. భయపడ్డారు. ఆవులు, మేకలు, కోళ్ళు కంటె పంట ముఖ్యం కాబట్టి. పైగా ధర్మభూషణం పొలాల్లోంచే పరిగెత్తుకు వచ్చింది.

దాంతో కొందరు ఫారెస్టోళ్ళ దగ్గరకి వెళ్ళారు. కొందరు ఆర్డీవో దగ్గరకెళ్ళి మొర పెట్టుకున్నారు. 'చిరతపులి వీరవిహారం' 'ఈ చిరుతని చంపలేరా?' అనే శీర్షికలతో అచంతా దినపత్రికల్లోకూడా వచ్చింది. చిరుత వస్తే వచ్చిందిగాని తమ ఊరి పేరు పేపర్లో పడిందని గ్రామస్థులంతా ఆనందించారు.

చివరికి ఫారెస్టోళ్ళూ, ఆర్డీవో కూడా ఆ ప్రాంతంలో మేటి వేటగాడైన ధర్మభూషణంకి ఆ చిరుతని చంపే హక్కు ప్రసాదించారు. (పాపం ఫారెస్టోళ్ళకి పుల్లలేరుకునేవాళ్ళని, ఆర్డీవోకి చిదాబిక్కీ రైతుల్ని తప్ప క్రూరజంతువుల్ని చంపడం రాదుట.)

ఆ క్షణంలో ధర్మభూషణం 'సంభవామి యుగే యుగే' స్థాయిలో తెగ ఫీలైపోయాడు.

భీముడు లోపల్లోపల హాల్లో ఎప్పుడూ గోడకి తగిలించి ఉండే (అలా తగిలించి ఉంచితే బాగుంటుందని ధర్మభూషణం సినిమాల్లో చూసి నేర్చుకున్నాడు) రైఫిల్‌ని, రవ్వల తూటాల పెట్టెని తీసుకొచ్చి ఇచ్చి, మళ్ళీ లోపలికెళ్ళి పాతగుడ్డ, కిరసనాయిలు తెచ్చి అందించాడు.

ధర్మభూషణం ఆయుధాన్ని అందుకుని దానివైపు చాలా ఆప్యాయంగా చూశాడు. పసిపిల్లకి నీళ్ళు పోస్తున్న పద్ధతిలో ముందు దాన్ని పొడిగుడ్డతో తుడిచి, తర్వాత ఎందుకో మీసం సవరించి, ముసి ముసిగా నవ్వుకుని శుభ్రం చేయడం ప్రారంభించాడు. భీముడు ఆ రైఫిల్ వైపు కళ్ళార్పకుండా చూస్తూ నిలబడ్డాడు.

''ఇది వరకు ఎప్పుడన్నా వేటకెళ్ళావురా సర్పంచూ?''

''లేదండి''

''నువ్వు మరీ పిరిగ్గొడ్డువి. పులి గాండ్రింపు విని గుండె ఆగి చస్తావని నేనే తీసుకెళ్ళ లేదు. అప్పుడోసారి వేటకెళ్ళినప్పుడు ఎన్ని రోజులున్నానో తెలుసా అడవిలో?''

''తెలీదండి''

''రెండు వారాలు... అప్పుడు నీలా కుర్రాణ్ణి. నేను ఎన్నిరోజులకీ తిరిగి రాకపోయే సరికి, ఏ పెద్దపులో నమిలేసి ఉంటుందని మానాన్న భయపడి వచ్చేశాడు. లేకపోతే ఓ డజన్ పులుల్ని ఏసుకొచ్చేవాణ్ణే...''

భీముడు తలూపాడు.

''ఈ చుట్టుపక్కల మనంత మొనగాడు ఎవడూ లేడురా? అందుకే ఈ భారం నా మీద ఏసారు. చిరతని చంపితే ఈ జిల్లాలో మన పేరు మారుమోగి పోదూ''

''అవునండీ''

''అయినా ప్రజల కోసం మనం కూడా అప్పుడప్పుడూ మంచి పనులు చేస్తుండాల్రా. లేకపోతే ఊరా పేరా చెప్పూ? ఆవుల్ని, మేకల్ని, కోళ్ళని కూడా మింగేసే చిరతని చూస్తూ ఊరుకుంటే అది మనల్ని కూడా తినేస్తుంది ఏవంటావ్?''

''అవునండీ. దాన్ని ఏసెయ్యాల్సిందే... పైగా మీ పొలాలకి అడ్డం పడొచ్చింది కూడా.''

''అందుకని అసలు ఊరుకోకూడదు. ఇహ మన వేట పోగ్రాం చెబుతా విను... రేపు పొద్దున్నే వెళ్ళాలి మనం... పగలంతా అడవిలో తిరిగి, రాత్రికి మంచె పీది కెక్కి కూచుని అది ఎప్పుడు దొరికితే అప్పుడు ఏసెయ్యాలి...''

''పొద్దున్నే ఎందుకండీ...?''

''ఏదవ ప్రశ్నరా సర్వంచూ, ఎటూ ఛాన్సొచ్చింది కాబట్టి పనిలో పనిగా ఏదో ఒక జంతువుని ఏసుకొస్తే పోతుంది...''

''బానే ఉందండీ.''

''కానీ నీకు ఏట రూల్సు తెలియాల్రోయ్... లేకపోతే అడవిలో జంతువులకంటే నిన్నే ఎక్కువ కనిపెట్టాల్సొస్తుంది నేను..''

''ఏంటండీ ఆ రూల్సు...?''

''ఏంటంటేరా అడవిలో నిశ్శబ్దంగా నడవాలి.... గాలికి ఎదురు నడవాలి. సూర్యుడి కాంతి మన కళ్ళలో పడకూడదు. జంతువు మనల్ని చూసిందని అనుమానం వస్తే చాలు. శిలావిగ్రహంలాగా నిలబడి పోవాలి. జంతువు వెంటపడిందనుకో పారిపోకూడదు....''

భీముడికి ఎలుగు, అది వెంటబడగానే ధర్మభూషణం తుఫాను వేగంతో పారిపోయి రావడం సమయానికి గుర్తొచ్చాయి.

''చాలా రూల్సున్నాయండీ...''

''ఇంకా ఉన్నాయ్‌రా... మనం వేటాడ బోయేది వీధి కుక్కని కాదు.. చిరత... చిరతపులిని. అసలది మహా దుష్టజంతువు. . జిత్తులమారి.. చీకట్లో కూడా బాగా చూస్తుంది. వట్టి పుణ్యానికి సరదాకోసంకూడా చంపుతుంది.' అన్నాడు ధర్మభూషణం. అమెరికా ఖండం కనిపెట్టడం, ఎవరెస్టు ఎక్కడం చిరత పులిని సంహరించడంతో సమానమన్నట్టు.

''మంచి జిత్తులమారి.. [illegible] ఆలోచిస్తూ.

''అవున్రా. [illegible]

'అవును. [illegible]

జిత్తులమారితనం చూపించే ధర్మభూషణం తన రెండెకారల భూమిని లాక్కున్నాడు.

ఏడెనిమిదేళ్ళ క్రితం ప్రభుత్వం వారి మాటల్లో భీముడు చిన్నకారు రైతు అప్పుడతనికో రెండెకరాల భూమి ఉండేది తెలుగు రచయిత్రుల ఎక్స్‌ప్రెషన్ ప్రకారం అప్పుడు విధి అతని మీద క్రూర పరిహాసం ఆడుతుండేది అందులోనూ ఆ భూమి ధర్మభూషణం ఇరవై ఎకరాల పక్కనే (ఇది ధర్మభూషణం దక్షిణం పొలం మాత్రమే. పాపం మాత్రం ఇంతేనా అని పాఠకులు దిగులు పడకుందురు గాక) ఉండేది.

కాలవనీళ్ళు పంట కాలువద్వారా ముందు ధర్మభూషణం భూమిని అమాంతం ఆపాద మస్తకం తడిగమి తడిపేవి. వారి నారుమడి పెరిగాక మిగతా రైతులకి వెళ్ళేవి. భీముడిది ఆ చివరి భూమి కాబట్టి నారుమడి ఆలస్యం, పంట ఎదగడం, కోతలు, కుప్పలు; ధాన్యం ఇంటికి రావడం అన్నీ ఆలస్యమే

అలా ఆలస్యమయ్యే కొద్దీ పంట ఎదుగుదల దశల్లో వర్షాలొస్తే ధర్మభూషణానికి ఉత్సాహంగా ఉండేది, భీముడికి వర్షంలాంటి ఏడుపొచ్చేది.

అతనో రోజు ఈ దురన్యాయం గురించి ధర్మభూషణాన్ని అడిగాడు కూడా.

''నీపొలం ఎన్నెకరాల్రా?'' అడిగాడు ధర్మభూషణం మామూలుగానే తుఫాను గాలి నవ్వు నవ్వుతూ.

''రెండెకరాలు...''

''నా దక్షిణం పొలం ఎంతుందిరా?''

''ఇరవై ఎకరాలు''

''ఏది ఎక్కువ?''

''మీదే''

''కాబట్టి నా భూమికి నీళ్ళెక్కువ కావాలా? నీకా?''

''మీకే...?''

''అదీ సంగతి... నీ పొలం ఏవుందిరా నాలుగ్గంటల్లో తడుస్తుంది. నా భూమి తడవాలంటే నాలుగు రోజులు పడుతుంది. అందుకని నా గురించి నేను జాగ్రత్త పడాలి...''

''అది నిజమేగానీండి.. పంట కాలవలన్నింటికి గండ్లు కొట్టించి నీళ్ళన్ని మీ పొలాల్లోకి మళ్ళించుకుంటున్నారు. ఒక్కటి వదిలేస్తే నా భూమి కూడా టయానికి (టైముకి) తడుస్తుంది. మీ పేరు చెప్పుకుని దీపం పెట్టుకుంటాం....''

''అట్టా చెప్పుకోనూ వద్దు... దీపాలూ వద్దు నాకు.. ఓ పని చెయ్... నీ పొలాన్ని మన సోమయ్యగారి సాంబయ్యలేడూ.. ఆడికి కౌలుకిచ్చేయ్....''

''నేనివ్వను....''

''పిచ్చోడవా.. తెలివిఉండాల్రా మనిసన్నాక నీ రెండెకరాల్లో ధాన్యం ఎంత దిగుతుంది?''

''ఎంతండీ పాతిక బస్తాలు కూడా రాలడం లేదు ''

''ఆ పాతికా సాంబయ్య ఇస్తాడు. ఆడికిచ్చెయ్...''

భీముడు ఆశపడ్డాడు. కౌలుకిస్తే ఇక పొలానికి - తిరిగే పనుండదు.. నీళ్ళ బాధా ఉండదు. ఏమి చౌక బేరము...?

''సరేనండి.. కౌలుకిస్తాను... కరణంగారి దగ్గరకెళ్ళి కాయితాలు రాయించుకుందామని చెప్పండి...''

''బేష్... నీకూ మంచి తెలివుందిరా భీముడూ'' అన్నాడు భూషణం.

భీముడు ఆనందోత్సాహాలతో ఇంటికెళ్ళి తన 'తెలివి', ధర్మభూషణం 'అయిడియా' గురించి భార్యకి చెప్పాడు నవ్వుతూ.

''నువ్వీ జన్మకి బాగుపడవయ్యా'' అందావె. భీముడు మొహంలో నవ్వు ఆరిపోయింది.

''ఏందే... మనం ఆయిగా ఇంట్లో కూసున్నా పాతిక బస్తాల ధాన్యం వస్తాది.''

''అది వస్తాది, తింటే... ఇదంత ధర్మభూషణం కుట్ర....''

''ఆయనకేం ఒరుగుతాది?''

''చూస్తుండు.. నీకే తెలుస్తాది''

''నీదంతా వట్టి భ్రమ...'' అన్నాడు భీముడు. అతని భార్య చెప్పి చెప్పి విసుగుపుట్టి మానేసింది. 'ఆడాళ్ళకి అనుమానం జాస్తి ఏదీ సరిగ్గా ఆలోచించలేరు. అళ్ళకసలు మంచి ఐడియాలు రానేరావు' కాబట్టి భీముడు భార్య మాటలు వినలేదు.

ఏడాది గడిచింది. పాతిక బస్తాల ధాన్యం వచ్చింది. రెండో ఏడు ఇరవై, మూడో ఏడు పదిహేను.... ఇది శానా అన్యాయం అన్నాడు భీముడు... దేవుడే అన్యాయం చేసేడని సాంబయ్య మొత్తం 'వాడి' మీదికి నెట్టేశాడు. భీముడు మళ్ళీ ధర్మభూషణం దగ్గరకు వెళ్ళాడు.

''నేను పెద్ద తప్పు చేశాన్రా...'' అన్నాడు ధర్మభూషణం పశ్చాత్తాపంతో. భీముడు చాలా ముచ్చట పడ్డాడు ఆయన బాధచూసి.

''ఏంటండీ అది?''

''సాంబయ్యగాడు మంచి రైతు కాదురా. మన పొలం ఎంత బంగారమైనా మంచి రైతు చేతుల్లో పడాలి.. అప్పట్లో పదిహేను పుట్లు పండించావు?''

భీముడు ఏం అనకుండా మనసులో మహోత్సాహంగా ఆనందించాడు. ధర్మభూషణం 'తన కులపోణ్ణి' అనే తిట్టినందుకు

''ఓరే భీముడూ! మన మనసు ఏదున్నా ఉండనీకో. అది బాగా ఉండాలి''

''అంటే ఏంటండీ--?'' అడిగాడు భీముడు ఆ వేదాంతానికి ఆశ్చర్యపడి.

''మన దగ్గర డబ్బుందనుకో బాగా ఉండాలి. బంగారం ఉందనుకో బాగా ఉండాలి. పొలం ఉందనుకో బాగా ఉండాలి. లేకపోతే అసలేం ఉండకూడదు''

''అంటే?''

''నీకా రెండెకరాలున్నా ఒకటే, లేకపోయినా ఒకటేరా ఎర్రెదవా.... నాకమ్మెయ్...''

''నేనొప్పుకోను....''

''ఒరే పిచ్చెదవా ... నువ్వు నా దగ్గర పని చేస్తున్నావా లేదా?''

''చేస్తున్నానండీ....''

''నీకు తిండికీ, బట్టకీ ఏనాడన్నా లోటు చేశానా?''

''లేదండీ''

''మరి ఆ పొలం నా కమ్మేసి ఓ ఇల్లు కట్టుకున్నావనుకో, ఇహ నీకు దిగులే వుందీ? అయినా అక్కడెక్కడో మైళ్ళ దూరంలో పొలం ఉండటం కంటె మన నెత్తిన ఓ కప్పుండటం మంచిది. ఆలోచించు....''

''సరేనండి'' అన్నాడు భీముడు ఎక్కువ సేపు ఆలోచించకుండానే. తర్వాత అతనీ సంగతి భార్యకి చెప్పలేదు. 'ఆడాళ్ళకి అనుమానం జాస్తి, ఏదీ సరిగ్గా ఆలోచించరు, వాళ్ళ కసలు మంచి అయిడియాలు రానే రావు కాబట్టి'.

పొలం ధర్మభూషణం చేతుల్లోకెళ్ళి పోయాక ఆ సంగతి భీముడి భార్యకి తెలిసి అతని వంశంలో ఏడు తరాల వాళ్ళని తిట్టింది. భీముడికి కోపం వచ్చినా 'ఆడాళ్ళని కొట్టకూడదనే' రూలు ప్రకారం భార్యని కొట్టలేదు.

ధర్మభూషణం తన ఇటుకల బట్టీనించి ఇటుకలు, పట్నంలో సిమెంటు డీలరు దగ్గర సిమెంటు ఇప్పించాడు. తాపీ మేస్త్రీని మాట్లాడి పెట్టి రెండు గదులు ఇల్లు కట్టించాడు. భీముడు బోరింగ్ పంపు కూడా వేయించుకున్నాడు.

''ఒరే సర్పంచూ....'' కేకతో ఉలిక్కిపడి ధర్మభూషణం వైపు చూశాడు భీముడు.

''ఏంట్రా, వేట పేరు చెప్పగానే కలల్లో తేలుతున్నావ్?''

''అబ్బే లేదండి...''

''ముందు నువ్వు కూడు దినేసి మన షావుకారి కొట్టుకెళ్ళి ఆరు మాంఛి మొనగాడు బాటరీలు, రెండు సిగిరెట్ పెట్టెలు, నాలుగు అగ్గిపెట్టెలు తీసుకురా... అవి తెచ్చిచ్చి ఇంటికెళ్ళి తెల్లారుజాము వచ్చెయ్.''

భీముడు అయన చెప్పినట్టు చేసి ఇంటికెళ్ళాడు. ఆ రాత్రి ధర్మభూషణానికి సరిగా నిద్రపట్టక (చంపబోయేది చిరుతపులిని కాబట్టి) రాత్రి మూడు గంటలకే లేచాడు. కాలకృత్యాలు తీర్చుకున్నాక ఆయన భార్య పెద్ద గ్లాసుతో కాఫీ తెచ్చిచ్చి వెళ్ళిపోయింది. ఆవిడ 'మౌనం మింగి' చాలా కాలమైంది.

ధర్మభూషణం తన డబుల్ బారెల్‌గన్ కోసం ప్రత్యేకంగా 'గన్' ఆకారంలో ఓ చెక్క

కేసు తయారు చేయించాడు. అందులో ఒకపక్క తూటాల డబ్బా పెట్టే చోటు కూడా ఉంది.

ఆయన లేచి తన గన్ని, తూటాల్ని పరిశీలించి తృప్తిగా నవ్వుకుని కాళీమాతని తలుచుకున్నాడు. మదన తాపం వచ్చినప్పుడు కృష్ణుణ్ణి, రాత్రిపూట ఊరికి వెళ్ళాల్సి వస్తే ఆంజనేయుణ్ణి. పని మీద కెళ్ళేటప్పుడు వినాయకుణ్ణి... ఇలా ఒక్కో సందర్భంలో ఒక్కో దేవుణ్ణి ప్రార్థిస్తుంటాడు ధర్మభూషణం.

అంతలో భీముడు వచ్చేశాడు, మంచి పెళ పెళలాడుతున్న ఖద్దరు చొక్కా మోకాళ్ళ నించి పైకి అతుక్కు పోయినట్టున్న ధోవతితో.

''ఏరా సర్పంచూ, మనం ఎళ్ళేది పెళ్ళిగ్గాదు...'' అన్నాడు ధర్మభూషణం. భీముడు నవ్వి లోపలికి తుపాకీ కేసు, టార్చి లైటు, మధ్యాహ్నం, రాత్రి భోజనాలకి రెండు కారియర్లు, మంచినీళ్ళున్న తాబేటి కాయలు, రెండు కాఫీ ఫ్లాస్కులు తీసుకొచ్చి జీపులో పెట్టాడు.

''మనోళ్ళు మంచె కట్టడానికి ఎళ్ళారండి....''

''చెప్పావా, ఏటికి దగ్గర్లో మద్ది చెట్టు మీది కట్టమని...''

''చెప్పానండీ....''

''భేష్... జీపులో అన్నీ పెట్టినట్టేనా?''

''పెట్టినట్టే...''

''ఏం పెట్టినట్టు...? నీ మొహం... డీజిల్ డబ్బాలేవి? స్టెప్నీటైర్లేవి?''

''టైరు ఒక్కటే పెట్టానండి...''

''దొడ్లో ఇంకోటుంది. అది కూడా తెచ్చి పడెయ్... రెండు టైర్లలో ఒకేసారి గాలిపోయిందనుకో... చచ్చామే...''

భీముడు పెరట్లోకి వెళ్ళాడు, ధర్మభూషణం జీపుకి ఇవాళ అలా జరిగితే, టైర్లు మార్చేటప్పుడు చిరుతపులి ఒక్కసారిగా ఆయనమీద దూకితే ఎలా ఉంటుందో ఊహించి తెగ ఆనందించాడు భీముడు. స్టెపినీ తెచ్చి జీపులో వేశాడు. జీపు కదిలింది.

కొంచెం దూరం తార్రోడ్డు, కంకర రోడ్డు. తర్వాత జీపు ఎర్రమట్టి రోడ్డులో ప్రవేశించి ఉయ్యాల ఊగుతూ వెళ్ళసాగింది. ధర్మభూషణం రోడ్డుని, దూరంగా అడవిని చూస్తున్నాడు. అసలా చిరుత తనకి కనిపిస్తుందా, కనిపించదా? కనిపించినా తను బెదరకుండా, భయపడకుండా దాన్ని కొట్టగలడా? (ఇదివరకు చాలాసార్లు అలా బెదిరాడు, భయపడ్డాడు) దాన్ని చంపలేక వట్టి చేతులతో తిరిగొస్తే ఇక ఊళ్ళో నన్ను ఎవడూ లెక్కచెయ్యడు.

ధర్మభూషణం ఈసారి వినాయకుణ్ణి, కాళీమాతని ఒకేసారి తలుచుకున్నాడు. జీపు అడవిలో ప్రవేశించి కొంత దూరం వెళ్ళి ఆగిపోయింది. ధర్మభూషణం జీపుని రివర్సు చేసి దిగాడు.

''ఒరే సర్వంచూ.. నువ్వు సామాను తీసుకో -నేను తుపాకీకేసు పట్టుకుని నడుస్తాను..''

భీముడు మాట్లాడకుండా ఆయన చెప్పినట్టు చేశాడు. ఇద్దరూ అడవిలోపలికి నడిచారు.

సూర్యుడి కిరణాలకు చెట్ల కొమ్మలు, ఆకులు అడ్డం రావడంవల్ల అవి పడినంత మేర మచ్చలు మచ్చలుగా కనిపిస్తోంది నేల. ఎక్కడా అలికిడి లేదు. అడవిలోనూ, శ్మశానంలోనూ ఒక్కటే ఇబ్బంది, అది నిశ్శబ్దం..

ధర్మభూషణం ఆగాడు. దాంతో భీముడు కూడా.

''ఒరే సర్వంచూ... ముందు కాసిని మంచి నీళ్ళిచ్చి, ఓ కాఫీ చుక్క పొయ్. ఇంకా లోపలికెళ్దాం''

భీముడు ఇచ్చాడు, తనేం తాగకుండా. ఇద్దరూ మళ్ళీ నడవడం ప్రారంభించారు. అడవి రాను రానూ దట్టమైపోతోంది.

''అర్రెర్రో... ఒక్క జంతువూ కనిపించదేం? అడవిలో కర్ఫ్యూ పెట్టినట్టున్నారే...''

''జంతువులు తగ్గిపోయినైయండీ... అవి పాపం తుపాకీ గుళ్ళకి బలైపోతున్నాయి....''

''నిజమేరా.. ప్రతి ఎదవా ఓ తుపాకీ తీసుకొచ్చేది, అడవికొచ్చి కాల్చిపారేసేది.. ఇష్టా రాజ్యమైపోయింది.''

''బలమున్నోడిదే రాజ్జెమండీ.''

''నిజమే, నిజమే...'' అన్నాడు ధర్మభూషణం... వాళ్ళలా చాలా సేపు తిరిగి తిరిగి ఇక తిరగలేక అడవికి ఓ వైపున ఏటి దగ్గరకి వెళ్ళారు.

మద్ది చెట్టు మీద మంచె కడుతున్న వాళ్ళు వాళ్ళిద్దర్నీ చూశారు. ధర్మభూషణం చెట్టు చుట్టూ.తిరిగ, మంచెని చూసి సంతృప్తిగా తలూపి ఓ పక్క కూర్చున్నాడు.

భీముడు కారియర్, తాబేటికాయ ఆయన ముందు పెట్టాడు. ధర్మభూషణం కారయర్ విప్పి రెండు గిన్నెలు భీముడికిచ్చి తొడ మాంసం కోసిచ్చిన శిబిచక్రవర్తిలా ఫీలయ్యాడు.

భీముడికిచ్చిన ఓ గిన్నెలో నామ మాత్రంగా మాంసం కూర ఉంది. రెండో గిన్నెలో మజ్జిగన్నం.. ''ఛఛ.. ఇది మాంసం కూరా వట్టి ఎముకలు తప్ప ఏం లేవు.... తనకి మంచి కూరేస్తే ఈడి సొమ్మేం పోతుంది?'' అనుకున్నాడు భీముడు, ధర్మభూషణం తింటున్న గిన్నెల వైపు ఓరగా చూస్తూ.

వాళ్ళ భోజనం, మంచె కట్టడం ఒకే సారి పూర్తయ్యాయి. చెట్టెక్కిన ముగ్గురూ కిందికి దిగొచ్చారు.

''అమ్మగారినడిగి డబ్బులు తీసుకెళ్ళండి. చీకటి పడగానే ఊరి పొలిమేరల్లో వెగళ్ళుపెట్టి. మన కోళ్ళ ఫారం ఎనకాల కూర్చుని డప్పు కొట్టండి.... అసలు ఆపకూడదు...''

''సరేనండి'' అన్నారు వాళ్ళు; ధర్మభూషణం ఆ హెచ్చరికలు ఇప్పటికి పదహారుసార్లు చేశాడు కాబట్టి కొంచెం విసుగ్గా.

వాళ్ళు వెళ్ళాక ధర్మభూషణం జేబులోంచి వక్కపొడి తీసి వేసుకుని సిగరెట్టు ముట్టించి,

నేల వైపు నిశితంగా చూస్తూ ఏటిగట్టుకి వెళ్ళాడు.

అరగంట తర్వాత తిరిగొచ్చి మొహం మీద చెమటని కండువాతో తుడుచుకుని, పక్కనున్న రాయి మీద కూర్చుని మంచినీళ్ళు తాగాడు.

''ఛ.. ఛ.. మనోళ్ళు వట్టి ఎదవలు...''

''మంచె గట్టిగానే కట్టారండీ...''

''ఆళ్ళగురించి కాదురా నేననేది... అడవిలో తిరిగే వోళ్ళగురించి... ఎదవలు తెగతిరిగి జంతువుల అడుగు జాడలు కనపడకుండా చేశారు. కాని నేను పసిగట్టాను. ఒకచోట చిరత అడుగులు పడ్డాయ్...'' అన్నాడాయన తనని వెధవల జాబితా నుంచి మినహాయించుకుంటూ.

''కనబడ్డయ్యండీ...''

''ఆం.. అదం..'' అని ఆగి కొంచెం దూరంలో ఉన్న ఓ పొద వైపుచూసి ఒక్క గంతులో అక్కడికి వెళ్ళాడు. ఆ పొద చాటున పులి ఉందేమోనని భీముడు భయపడి చెట్టు చాటుకి వెళ్ళాడు. ధర్మభూషణం హోరున నవ్వి కుడిచేతి వేళ్ళ మధ్య పేడలాంటి పదార్థాన్ని వత్తుతూ అన్నాడు.

''పులొచ్చిందని గాభరా పడ్డావేరా? అదింకా మనుషుల్ని తినడానికి అలవాటు పడినట్టు లేదు. కాని ఇది చూశావా! ఏదో జంతువు లద్దె.. ఇంకా పచ్చిగానే ఉంది.''

''అంటే అది ఇక్కడెక్కడో ఉన్నట్టుందండీ...''

''రైట్.. రైట్.. నీకూ జ్ఞానం ఉందిరా...'' అన్నాడు ధర్మభూషణం తెగ ఆశ్చర్యపడుతూ. తర్వాత గిర్రున ఓ ప్రదక్షిణం చేసి గాలి ఎటువైపునించి వస్తోందో గ్రహించి, తుపాకీ గొట్టం కిందికి ఉండేటట్టు పట్టుకుని, దానికి ఎదురుగా నడవ సాగాడు. వెనకాలే భీముడు.

చెట్ల మధ్య నుంచి మెల్లిగా నడుస్తూ, నడుస్తూ టక్కున ఆగిపోయాడు. ఓ పొద చాటు నుంచి పొడదుప్పి సగం కనిపించింది. భీముడు 'ఫ్రీజ్' అయిపోయాడు. తుపాకీ 'ఢాం' అంది. దుప్పి ఎగిరి అల్లంత దూరాన పడింది. దాని నడుంలోంచి రక్తం ఉబికి ఉబికి వస్తోంది.

''దెబ్బతీశాను, చూశావా?'' అన్నాడు ధర్మభూషణం సినిమాల్లోలాగా తుపాకీని ముద్దుపెట్టుకుని.

దెబ్బతిన్న దుప్పి ఎక్కడలేని శక్తితో ఇష్టదిక్కుగా పరిగెత్తింది.

ధర్మభూషణం నవ్వుతూ ఉంటే భీముడన్నాడు

''దుప్పి పారిపోతోంది. పారిపోతోంది

''ఎక్కడికి పోతుందిరా... రక్తం పోయే దాకా పోయి ఎక్కడోచోట చస్తుంది...''

ధర్మభూషణం నిదానంగా నేలమీద అక్కడక్కడ ఉండిన రక్తం మరకల్ని చూస్తూ

నడిచాడు. వలబైగజాల అవతల దుప్పినేలమీద పడి మృత్యుకెరటంలా కదులుతోంది. ధర్మభూషణం దాని దగ్గరకు వెళ్ళాడు, విజయగర్వంతో, భీముడు దాని వైపు చూశాడు. నేల మీద దొర్లుతున్న దుప్పి ఆగిపోయింది.

''చచ్చిపోయిందండీ....''

''మరేం అనుకున్నావురా.... మన దెబ్బంటే...'' అన్నాడు ధర్మభూషణం. అవును, తుపాకీ దెబ్బతిన్న పొడ దుప్పి చచ్చిపోయింది. కాని మనిషి దెబ్బతిన్న తన కూతురు సామ్రాజ్యం మాత్రం సిగ్గుతో తలెత్తుకోలేక రోజూ చచ్చిపోతూనే ఉంది.

పొడదుప్పి బాధ, వేదన, నరకయాతన చూశాక భీముడి కెందుకో కళ్ళంట నీళ్ళు తిరిగాయి. అప్పుడు సామ్రాజ్యం కూడా ఇలాగే బాధపడి ఉంటుంది, ఆ కిరాతకుడు శక్తిప్రసాదు చేతుల్లో.

తన ఇల్లు కట్టే రోజుల్లో ధర్మభూషణం మేనల్లుడు శక్తిప్రసాద్ ట్రాక్టరు మీద ఇటుకలు, ఇసుక, సిమెంటు బస్తాలు వేసుకొచ్చేవాడు. ధర్మభూషణం లాంటోడు వళ్ళొంచలేడుగాని తనలాంటి వాళ్ళకే? కూలీ అయినా దక్కుతుందని ఇంట్లో అందరూ ఇంటి పనిలో మునిగి పోయారు.

ఆ శక్తిగాడు సామ్రాజ్యాన్ని ఎప్పుడు చూశాడో తెలీదు. దానికేం మాయ మాటలు చెప్పాడో తెలీదు. తను ఊళ్ళోలేనప్పుడు సగం తయారైన తనింట్లోనే జరిగిపోయింది మానభంగం. తనకి ఆ మర్నాడుగాని తెలీలేదు.

భార్య శోకాలు,సామ్రాజ్యం కళ్ళు మింగలేక కక్కుతున్న నీళ్ళు చూసి తను పంచాయితీ పెట్టించాడు.

శక్తి వచ్చాడు. అసలు సామ్రాజ్యందే తప్పంట. అది సినిమాలు చూసి చూసి చెడిపోయిందట. డబ్బున్నోడు ఎవడు దొరికినా శరీరం అప్పగించటానికి అది సిద్ధంగా ఉందట. అదే తనని రెచ్చగొట్టిందట.

సామ్రాజ్యం అరిచింది. కాదుకాదని... శక్తిప్రసాద్ ముందు తనని మాటల్లోకి దించాడట. ఓ రాత్రి వేళ వచ్చి జ్వరం, తలనొప్పనిచెపితే తను కొట్టుకెళ్ళి మాత్తర్లు, అమృతాంజనం తెచ్చి తలకి రాస్తుంటే... ఇక చెప్పలేక ఏడ్చింది.

తర్వాత చాలా రాద్ధాంతం జరిగింది. 'చీకటి తప్పు' కింద శక్తిప్రసాద్‌కి మూడొందలు జరిమానా... తను తీసుకున్నాడు. పల్లెలో కుర్రాళ్ళు వద్దు, వద్దు... పోలీసులకి ఫిర్యాదు చెయ్యమని. తను వినలేదు. సామెతలు, వేదాంతం చెప్పాడు. వాళ్ళు తిట్టారు. నువ్విట్లా డబ్బులు తీసుకుంటున్నంతకాలం వాళ్లట్లా చీకటి తప్పులు చేస్తూనే ఉంటారని.

వాళ్ళ మాటలు నిజం... సామ్రాజ్యాన్ని శక్తిప్రసాద్ కంటె తనే ఎక్కువ అవమానించాడు, దాని తరపున న్యాయంకోసం ప్రయత్నించకుండా.

''ఏరా ఏడుస్తున్నావేంటి?'' అడిగాడు ధర్మభూషణం. భీముడు సిగ్గుపడి కళ్ళు తుడుచుకున్నాడు.

''పాపం ఆ దుప్పి అన్యాయంగా చచ్చిపోయిందండీ...''

''ఇది అన్యాయం కాదు. ఆటరా... ఆట.. రాజకీయం ఓ ఆట... సినిమాల్దీయటం ఒకాట. గుర్రప్పందేలు ఓ ఆట... జూదాలన్నీ ఆటలే. ఉజ్జోగాలివ్వటం, ఇప్పించటం ఆట... పదవుల సంపాదన ఆట,. అణుబాంబులు తయారుచెయ్యటం ఓ ఆట... అయితే ఆటలో కొంతమంది నీలాంటోళ్ళు నష్టపోతారు. చస్తే చస్తారు.... దానికి మనవేం చేస్తాం?''

''అట్లాంటి ఆటలు తప్పుకదండీ....''

''తప్పేంట్రా... తప్పనుకుంటే ఆనందం, సరదా తగ్గిపోవూ? ఇదంతా ఇప్పుడెందుగ్గాని అడవిలో ఆ చివరి కెళ్ళి ఎవర్నన్నా పిలుచుకొచ్చి దుప్పిని జీపులో ఏయించు. పైన టార్పాలిన్ కప్పమను....''

భీముడు ఊరి వైపు నడిచి అడవి మొదట్లో పుల్లలు ఏరుకుంటున్న ఐదారుగుర్ని (ప్రభుత్వదృష్టిలో పర్యావరణానికి ముప్పుతెస్తున్న ప్రకృతి ద్రోహులు) తీసుకొచ్చి, ఆ దుప్పిని జీపులో వేయించి, ధర్మభూషణం ఇచ్చిన ఐదు రూపాయలు వాళ్ళకిచ్చాడు.

చీకటి పడింది.

ధర్మభూషణం భుజానున్న కండువా తీసి విదిలించి తలకి చుట్టుకున్నాడు. ఆయన ఆ క్షణంలో మహోత్సాహంగా ఉన్నాడు. పాడదుప్పిని ఒక్క దెబ్బతో ఆయన చంపడం శుభసూచకంగా, తను సాధించబోతున్న అత్యున్నత విజయానికి (చిరుతని చంపడం) నాందీ వాచకంలాగా అనిపించింది.

''ఒరే సర్పంచూ... చీకటి పడింది. ఇక జంతువులకి హుషారొస్తుంది. కాబట్టి మనం పెందలాడే అన్నం దినేసి మంచెమీదెక్కడం మంచిది.''

వాళ్ళ భోజనాలయ్యాయి. ఊళ్ళో డప్పులు మోగాయి.

''మనోళ్ళు చెప్పిన మాటవింటార్రా...'' అని డప్పులు మోగిస్తున్న వాళ్ళని మెచ్చుకుని ''నువ్వీ సామానంతా పైకి చేర్చు అన్నాడు ధర్మభూషణం. భీముడు మూడుసార్లు చెట్టెక్కి సామానంతా పైకి చేర్చాడు. ధర్మభూషణం మెల్లిగా శరీరాన్ని మంచె మీదికి మోసుకెళ్ళి కాసేపు ఆయాసం తీర్చుకుని అన్నాడు.

''నువ్వు పైకొమ్మ మీదికెళ్ళి హాయిగా కూర్చో. నేనిక్కడ అవస్థపడతా. కాని జాగర్త రారేయ్... కునుకు తీసి కిందపడ్డావంటే చిరతపులి నమిలేస్తుంది. అదసలే బేవార్సు జంతువు. ఇవ్వాల్టి మాంసాన్ని పదిరోజులు తర్వాతైనా తిని చస్తుంది.''

భీముడు పై కొమ్మ మీదికెక్కి చెట్టు మొదలుకి అభిముఖంగా తిరిగి కాళ్ళు అటూ ఇటూ వేసి కూర్చున్నాడు. కుడికాలుకి కింది కొమ్మ ఆనుతోంది. కునుకొచ్చినా తల చెట్టుకి తగులుతుంది. కాబట్టి మెలకువ వస్తుంది.

ధర్మభూషణం మంచె మీద అవస్థపడుతూ' చుట్టూ చూశాడు. 'పరవాలేదే, మనోళ్ళకీ జ్ఞానం ఉంది, మంచెకి ఆకులు, కొమ్మలు అడ్డురాకుండా తీసేశారు....? అనుకున్నాడు.

''ఆ చిరుత అసలు ఇటువైపు రాకపోతే ..'' అన్నాడు భీముడు అనుమానంగా....

''వస్తుందొస్తుంది. .''

''దీనికంటె ఒక మేకని ఈ చెట్టుకి దగ్గర్లో కట్టేసుంచితే పోతుందండి.''

''అది మంచి ఆలోచనేగాని.. ఆ మేక ఎక్కువ దూరం వెళ్ళకుండా తిరిగిన చోటే తిరుగుతుంటే చిరతకి అనుమానం వస్తుందని ఆగాను. అది మహా జిత్తులమారి. ఇక్కడేదో మోసం ఉందని గ్రహించిందంటే చచ్చినా దొరకదు.''

కాని తను మాత్రం గ్రహించలేకపోయాడు. తనకి జంతువుకున్నపాటి విచక్షణా జ్ఞానం లేకపోయింది. ఊరవతల ఎందుకూ పనికిరానిచోట ఇళ్ళస్థలాలిస్తే అనలేకపోయాడు. పొలం పోకుండా చూసుకోలేక పోయాడు, 'చీకటి తప్పు' చేసిన శక్తిని శిక్షించ లేకపోయాడు.

''రేయ్ ఇంద... ఓ దమ్ము కొట్టు... నిద్రొస్తే మన పని అవుటే..'' అన్నాడు ధర్మభూషణం సిగరెట్టు, అగ్గిపెట్టి అందిస్తూ. భీముడు ఆయన ఔదార్యానికి ఆశ్చర్యపడ్డాడు.

''మనం ఇట్టా మెదలకుండా కూర్చుంటే నిద్ర గ్యారంటీగా వస్తుందిగాని చిన్నప్పుడు మా నాయనమ్మ చెప్పిన కథలు చెబుతాను... విను''

''సరేనండి''

ధర్మభూషణం కాశీమజిలీ కథలు, అరేబియన్ నైట్స్ కథలతో మొదలు పెట్టి, స్వచ్ఛమైన బూతు కథల్లోకి వెళ్ళి, అక్కడనుంచి తన శృంగార సాహసగాథలు వినిపించ సాగాడు.

అంతలో వెన్నెల వచ్చింది అడవిలోకి. చుట్టూ చెట్లు. ఓ చెట్టు మీద తను, తన యజమాని. ఉండుండి జంతువుల అరుపులు... భీముడికి విచిత్రంగా అనిపించింది. తను అడవిలోకి ఇంత దూరం ఎప్పుడూ రాలేదు. వస్తే అడవి మొదట్లో నాలుగు పుల్లలు ఏరుకోవడం, వెళ్ళడం తప్ప అటవీ జీవితం తెలీదు.

''ఒరే సర్పంచూ.. నువ్వు చిన్నప్పుడు గోలీలాడావా?''

''ఆడానండి...'' అన్నాడు భీముడు. ధర్మభూషణం తన శృంగార సాహస గాథల్నించి గోలీలాట దగ్గరకి ఎందుకొచ్చాడో అర్థం కాలేదు.

''బాగా ఆడేవాడివా?''

''అవునండి... పల్లెలో నేనంటే కుర్రాళ్ళకి హడల్...''

''సెలకోలతో పిట్టల్ని కొట్టావా?''

''కొట్టానండీ.. కాని పాపం ఆటిని సంపటం పాపమనిపించి మానేశా.''

''భేష్... ఇప్పుడు నేను టార్చిలైట్ నేల మీదికి వేస్తా. ఆ వెలుతురు పడిన చోట కొట్టాలి. ఓ మంచి పుల్ల తీసుకో...''

ధర్మభూషణం టార్చి వేశాడు. భీముడు గురిచూసి పుల్ల విసిరాడు.

''సెభాష్... నీకిప్పుడు సింగిల్ షాట్ గన్ ఇస్తా..'' అన్నాడు ధర్మభూషణం నవ్వుతూ.

గన్ కేస్‌లోంచి ఓ తుపాకీ బైటికి తీశాడు. దాని గొట్టం వెన్నెల్లో తళుక్కుమంది.

''మీ దగ్గర ఒక్కగన్నే ఉందనుకున్నాను....''

''ఎందుకైనా మంచిదని రెండూ తెస్తాను... ఈ గన్ కేసుని అట్లా ప్రత్యేకంగా తయారుచేయించా, దగ్గర కూచుని.''

ధర్మభూషణం లేచి భీముడికి గన్ సేఫ్టీకాచ్ రిలీజ్ చేయడం చూపించి అతని చేత రెండుసార్లు చేయించాడు.

''ఒరే చిరత కనిపించగానే సేఫ్టీకాచ్ వదిలెయ్... తుపాకీని గట్టిగా పట్టుకో.. ట్రిగ్గర్ మీద వేలు రెడీగా ఉంచుకో. నా దెబ్బకే అది పడిపోతుంది నూటికి నూరు పాళ్ళూ... ఒక వేళ పడకపోలే నువ్వు దెబ్బదీసెయ్....''

''సరేనండీ...'' అన్నాడు భీముడు. తన చేతిలోని తుపాకీ వైపు అప్యాయంగా చూస్తూ దాన్ని నిమిరాడు. ఆయుధం అతనికి ఎంతో ధైర్యాన్ని, సంతృప్తిని ఇచ్చింది. అదే క్షణంలో తనకి అర్హతలేని వస్తువుని దగ్గరుంచుకున్నట్టు అపరాధభావంతో కూడిన భయం కూడా వేసింది.

ఇప్పుడు తను చిరుతని కాల్చిచంపబోతున్నాడు. ఎందుకని, అది ఊరి ప్రజలకి అన్యాయం చేస్తోంది కాబట్టి. దొంగతనంగా, జిత్తులమారి తనంతో నష్టం కలిగిస్తోంది కాబట్టి.

కాని ధర్మభూషణం కూడా తనకి, తనవాళ్ళకీ చాలా అన్యాయం చేశాడు. మరి వీణ్ణి చంపితే తప్పేం ఉంది?

తప్పుగదూ.. వాడు దొంగ వెధవ. అన్యాయం చేశాడని మనం కూడా అన్యాయానికి దిగితే ఇంకేం వుంది?

ఇట్టాంటి వాళ్ళని దేవుడే శిక్షిస్తాడు.

''ఒరేయ్...'' మెల్లిగా పిలిచాడు ధర్మభూషణం.... భీముడు ఆయనవైపు చూశాడు.

''చిరత... చిరతొస్తుంది చూడు...''

భీముడు శరీరంలో రక్తం ప్రసరణ కొద్ది క్షణాలు ఆగిపోయింది భయంతో, ఆదుర్దాతో. చిరుత మెల్లిగా చెట్ల పొదల మధ్య నుంచి వస్తోంది బుసకొడుతూ, ఏదో తిన్నట్టుంది, చాలా భరోసాగా ఉంది.

'వెన్నెల్లో చిరుత..' అనుకున్నాడు భీముడు దానివైపు భయం భయంగా చూస్తూ, వంటిమీద మచ్చలు, దానినడక, దర్పం చూసి అతను ముచ్చటపడ్డాడు కూడా.

చిరుత వాళ్ళు కూర్చున్న చెట్టు దగ్గరికి మెల్లిగా వస్తోంది. ధర్మభూషణం గన్ తీసి సరైన పొజిషన్ కోసం ఎదురు చూస్తున్నాడు. భీముడు సేఫ్టీకాచ్ రిలీజ్ చేసి, మడమని భుజానికి ఆనించుకుని ట్రిగ్గర్ మీద వేలు పెట్టాడు

చిరుత చెట్టు సమీపంలోకి వచ్చి ఎందుకో ఆగి బుసకొడుగూ కొంచెం తలెత్తి చూసింది. అది వాసన పసి కడుతోందని ధర్మభూషణం గ్రహించాడు వెంటనే ఆయన చేతిలోని గన్ రెండుసార్లు నిప్పులు కక్కింది. భీముడు కంగారుగా ట్రిగ్గర్ నొక్కేశాడు.

ఏదో అదృశ్య హస్తం లాగేసినట్టు చిరుత అమాంతం ఎగిరి అల్లంత దూరాన పడింది. రెండు క్షణాలు ప్రాణం కోసం పెనుగులాట... లేవడానికి ప్రయత్నం.. అంతే... అది ఇక కదలలేదు.

''ఒరేయ్ సర్పంచూ...'' గావు కేకపెట్టాడు ధర్మభూషణం ఆనందోత్సాహాలతో, భీముడు గాభరాపడి తుపాకీ వదిలేశాడు. దాని మడమవెళ్ళి సరిగ్గా ఆయన ఎడమ భుజం మీద పడింది.

ధర్మభూషణం మళ్ళీ గావుకేక పెట్టాడు.

''చంపేశావురోయ్... అమ్మో, అమ్మో...భుజం లేవడం లేదురోయ్...''

భీముడు మంచె మీదికి దిగి ఆయన భుజం మీద చెయ్యి వెయ్యబోయి ఆగాడు.

''చూడలేదండీ.. మీరట్లా అరిచేసరికి....''

''చిరుతని చంపేశానని... ఆ ఊపులో సంతోషం పట్టలేక అరిచాను.. అమ్మో... చొక్కా చినిగి పోయిందిరోయ్... ఇదేంటిరా ఇది రక్తం... అమ్మో. . ఎంత దెబ్బ తీశావురా...''

''మీరట్లా అరిచేసరికి... కంగారు పడ్డాను...''

''నోర్మూయ్...''

తుపాకీ మోతలువిని ఊరి జనం కాగడాలు, కర్రలు, టార్చిలైట్లు పట్టుకుని హోరున అరుస్తో బయలుదేరారు.

''ఒరే.. నువ్వు ముందు ఈ సామానంతా కిందికి చేర్చు. నా పాట్లు నేను పడతాను.''

భీముడు సామానంతా కిందికి చేర్చాక, ధర్మభూషణం ఎడమ చెయ్యి వదిలేసి కుడిచేతి పట్టుతో కిందికి జారాడు.

ఇద్దరూ చిరుతపులి దగ్గరకి వెళ్ళారు. దాని మొహం అంతా రక్తం.

''ఒరే.. నేను ధైర్యంగా చిరతని చంపాను. నువ్వేమో నన్ను చంపాలనుకుని ధైర్యం చాలక తుపాకీతో దెబ్బతీశావు....''

''నా పిల్లల మీద ఒట్టండీ.... ఆ కంగారులో వదిలేశానండీ...''

''ఛత్... నోర్మూయ్... భుజం పిరగ్గొట్టింది చాలక కబుర్లు చెబుతావ్.... నిజం చెప్పు... నన్ను చంపాలనుకున్నావా లేదా?''

''లేదండి...'' మెల్లిగా అన్నాడు భీముడు.

''నిజానికి నీకు తుపాకీ ఇవ్వడం నా కిష్టంలేదు. కాని చిరతని చంపకపోతే పరువు

పోతుందని ఇచ్చాను. నిజం చెప్పు.. నీ పిల్లల మీద ఒట్టేస్తున్నాను. చెప్పకపోతే వాళ్ళు చస్తారు. ఇరవైనాలుగ్గంటల్లో...''

భీముడు చాలా సేపు మాట్లాడలేదు. తర్వాత గుండెలో ఏ మారుమూల ఏం కదిలిందోగాని నిజాయితీగా అన్నాడు.

''మీరు తుపాకీ ఇవ్వగానే అనుకున్నానండీ.. నిజంగా మిమ్మల్ని చంపేద్దామని... మీరు నాకు చాలా అన్యాయం చేశారు... మిమ్మల్ని చంపితే తప్పేం లేదనిపించింది. కాని మళ్ళీ ఆలోచిస్తే చాలా తప్పనిపించింది. మనిషిని మనిషి చంపడం ఘోరమనిపించింది. ఎందుకంటేనండీ, మనిషికి కొన్ని నియమాలున్నాయ్... ఇలువలున్నయ్.. వాటిని దాట కూడదు. చంపాలనుకుంటే అప్పుడే చంపేవాణ్ణి. గుళ్ళు లేని తుపాకీ ఎందుకు వదిలేస్తాను...''

''అయితే మొత్తానికి ఆ దగుల్బాజీ ఆలోచన వచ్చిందన్నమాట...''

''వచ్చింది గాని...''

''సరే పద... ఇంటికెళ్దాం...''

ఆ మర్నాడు పోలీసులు భీముణ్ణి అరెస్టు చేశారు, ధర్మభూషణం మీద అడవిలో హత్యా ప్రయత్నం చేసినందుకు.

నిజమే! మనిషికి కొన్ని నియమాలున్నాయి. విలువలున్నాయి. కాని అవి పాటించలేని మనుషులపట్ల భీముడులాంటి వాళ్ళు వాటిని పాటించాలా, అక్కర్లేదా అనేదే అసలు ప్రశ్న????

# వేకువ

కల్లూరి ఆనందరావు

'నారాయణరాజుకు ప్రెసిడెంటు పదవి యియ్యల్ల', నాయుడు మళ్లీ చెప్పాడు. మీటింగు హాలంతా ఒక్క క్షణం మూగబోయింది. 'ఏందిన్నా, నువ్వు మాట్లాడేది. రాళ్ళు గొట్టేటోన్ని రాజును సెయ్యడమేంది? కూకునేకి రానోనికి కుర్చీ ఏస్తాననడం ఏం బాగలా' సామి తగులుక్కున్నాడు. 'ఔప్పా! సామి జెప్పింది కరక్టు. యాడుండాల్సినోన్ని ఆడే బెట్టల్ల. కోతికి కొబ్బరి కాయిస్తే తలకాయ బగలగొట్టుంది', నారాయణ స్థానాన్ని సామెతతో ధ్రువీకరిస్తూ అన్నాడు, దేవన్న.

ఇనప్పైరువంది బట్టే మీటింగు హాలది. నన్నూరువంది కూర్చోనున్నారు. ఒక కులమనిలా, ఒక మతమనిలా; ఉన్నోడనిలా, పేదోడనిలా; చదువుకున్నోడనిలా, రానోడనిలా; అందరూ కల్సుకొని పెట్టుకున్న ''బహుజన, బహుళాభ్యుదయ పార్టీ'' మీటింగుహాలది. అప్పటికి ఐదిన్నాల్సుండీ ఇదే తంతం. చర్చ, రభస. పార్టీకి కన్వీనరున్నాడు. సెక్రెటరీ ఉన్నాడు. జాయింటు సెక్రెటరీ ఉన్నాడు. ట్రెజరర్ ఉన్నాడు. గౌరవ సభ్యులూ, కార్యవర్గ సభ్యులూ చేంతాడంత. ప్రెసిడెంటే లేడు. లేడంటే ముందాయన టైంమయిపోయింది. కొత్తోణ్ణి ఎన్నుకోవల్ల. అందుకనే ఈ మీటింగు.

నాయుడు మంచోడు, వొగిసోడు, రాజకీయం తెలిసినోడని రాయలసీమంతా పేరుంది. అందుకే పార్టీలో అతనికి కన్వీనరు పదవుంది. వొంట్లో శక్తుంది. ఏం జేసినా నలుగుర్నీ మెప్పించే శక్తుంది. పవరున్న ఆ పార్టీకి, పస వున్న నాయకుడు నాయుడు. కానీ, ఈ రోజు నాయుడు మాటకు గౌరవ సభ్యుడు సామి, సెక్రెటరీ దేవన్న అడ్డం పడతానే ఉండారు. మొదటిసారి వాళ్ళ మాటకు మెంబర్లూ సై అంటాండారు. అట్లని నాయుడు తగ్గడంలా. 'నారాయణా! నారాయణా!' అంటూ ఒకటే పలవరింత.

నిజానికి నారాయణరాజు పార్టీలో సాధారణ మెంబరు. చదువురాదు. పగలంతా రాళ్లు కొడితేనే బతుకు గడుస్తుంది. నల్లటి వొళ్లు. పాలిష్ పట్టిన నాపరాయి లాగా చెమట్తో నిగనిగ మెరుస్తూ ఉంటుంది. ఉలిలాంటి చురుకైన కళ్లు. ఆముదం మత్తులో జోగాడే జుత్తు. నడిస్తే అడుగులు సుత్తి దెబ్బల్లాగా దభీ దభీమనిపడుతుంటాయి. మంచి మాటకారి. అందుకే పెండ్లాం 'మాలోనికి మాటలెక్కువ. కోడికి బొచ్చెక్కువ' అంటూ చతుర్లాడుతుంటుంది.

ఎవరేమన్నా నాయుడుకు రాజుమాట నచ్చింది. కూలీల్లో అతని బలం వచ్చింది. అంతే బలం ఎంగటేసుకూ ఉంది. నాయుడుకు నచ్చలా మాలోల్లకు, నారాయణ దేవుడైతే; మాదిగోళ్లకు ఎంగటేసు రాజు. సదువుకున్నాడు కూడా మాట్లాడితే తెగేసినట్లుంటాది.

